# శ్రీ పోతులూరి
# వీరబ్రహ్మంగారి
# జీవితచరిత్ర

శ్రీరస్తు



కాలజ్ఞాన సహిత శ్రీ పోతులూరి

# వీరబ్రహ్మంగారి

# జీవితచరిత్ర

(హఠయోగ సహితము)





ప్రకాశకులు:

[illegible]

63, కృష్ణప్పనాయకన్ అగ్రహారం,
తపాలు పెట్టె నెం 74. మదరాసు. 1.

 ※ [వెల 4—00

V

౬-వ కూర్పు,

ఫిబ్రవరి, 1962

7,000 కాపీలు

గ్రంథకర్త:

వడ్డాది వీర్రాజు సిద్ధాంతి

ఆనంద భారతి పవర్ ప్రెస్, మద్రాసు-1.

# తొలి పలుకు



శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి పేరు వినని వారుండరు. వీరు చెప్పిన కాలజ్ఞానము లోక ప్రసిద్ధమైనది. భవిష్యత్తులో ఏమిజరుగునో తెలుపునట్టిది కాలజ్ఞాన మనబడును. అట్టి కాలజ్ఞానమును శ్రీ వీరబ్రహ్మంగారు తత్వములరూపమున ప్రపంచమునకు వెల్లడిచేసిరి. వీరిచే చెప్పబడిన కాలజ్ఞాన తత్వములు నేటికిని ప్రతివారును తరచుగ పాడుచుందురు. భవిష్యత్తులో ప్రపంచమున ఏమిజరుగునో, యీ మహానుభావుడు తత్వముల రూపమున అజ్ఞానతిమిరమునబడి కొట్టుకొనుచున్న ప్రజలకు తేట తెల్లము గావించెను.

బ్రహ్మంగారు తమ కాలజ్ఞానములో ఏమిచెప్పిరో అదియే గనే నేడు ప్రపంచమున తూచ తప్పక జరుగుచుండుట గొప్ప ఆశ్చర్యము. అందువలననే వీరికిట్టి శాశ్వతకీర్తి లభించినది. శ్రీ బ్రహ్మంగారి వాక్యములు బ్రహ్మవాక్యములవలె జరుగుచున్నవి.

భూతభవిష్యద్వర్తమానములు కరతలామలకములైన యీ యోగిపుంగవుని జీవితము తెలుసుకొనదగినది. భవిష్యత్తును తెలుపుటయేగాక, భగవంతునియందు ప్రజలకు భక్తి విశ్వాసములు కలుగునట్లు, తనజీవితములో, నీ మహాపురుషుడు ప్రజలకు అనేక మహిమలు చూపించెను. ఈ మహాపురుషుని శక్తి సామర్థ్యములు వర్ణనాతీతములు.

ఈయన విశ్వబ్రాహ్మణ కులమునందు జన్మించెను. అందువలననే విశ్వబ్రాహ్మణులు వీరిని తమ పరమదైవముగ భావించి పూజించుచున్నారు. వీరిచరిత్ర చూచిన యెడల ఒక్క-

విశ్వబ్రాహ్మణులకే గాక సమస్తజనులకును పూజార్హుడనియే బోధపడును. కులములు వృత్తి సౌకర్యమునకై ఏర్పడిన మానవకల్పితములే గాని వేరుగాదు. ప్రపంచమునందలి ప్రాణి కోటి కంతటికిని భగవంతు డొక్కడే యని గ్రహించుట వివేక దాయకము, బ్రహ్మంగారి జీవితముచూచినచో వీరుసామాన్య మానవులు కారనియు, కేవలము భగవదంశ సంభూతులనియు తెల్లమగు చున్నది.

ప్రపంచమునందు అధర్మము పెచ్చుపెరిగి ప్రజలు ధర్మములను విడనాడి సంచరించు కాలములలో, ప్రతియుగము నందును భగవంతుడు అవతరించి దుష్టులను సంహరించి, శిష్టు లను రక్షించుచు, తిరిగి ధర్మమును సంస్థాపించుచుండునని ధర్మ శాస్త్రములు తెలుపుచున్నవి గదా!

ఆరీతిగనే, ప్రజలు ధర్మబాహ్యులై సంచరించుచుండుట వలనను భూభారము అధికమగుటవలనను గ్రహించి మరల భూమండలమున ధర్మమును సంస్థాపించు నిమిత్తమై శ్రీ మహా విష్ణువే యిూ ప్రపంచమున అవతరించెనని చెప్పుదురు.

శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు ఆరీతిగ భూమండల మున అవతరించి, అవినీతిపరులై యజ్ఞానాంధకూపంబునబడి, సదాచారములను విడనాడి, పాపకృత్యంబులం గావించుచు సంచరించుచున్న ప్రజలకు తన మహిమలు చూపించి, బ్రహ్మ జ్ఞానోపదేశము గావించి, పావనులుగ జేసి, స్థాపించెనని చెప్పు దురు.

వీరబ్రహ్మేంద్ర స్వాములవారు అవతరించిన కాలమున మన దేశమునందు మహమ్మదీయ పరిపాలన వ్యాపించి

యుండెను. అత్తరి ప్రజలు భగవంతుని మరచి నాస్తికులై దురాచార వర్తనులై, దురభ్యాసములకు లోనై సంచరించుచుండుటం గాంచి భగవంతుడే శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాముల రూపమున అవతరించి ప్రజలకు జ్ఞానోపదేశంబు గావించెనని చెప్పుదురు.

వీరబ్రహ్మంగారు నివసించెడి పర్ణకుటీరమందలి వేప చెట్టుయొక్క ఆకును నమిలిన మాధుర్యముగ నుండెడిదట. బ్రహ్మంగారు తమ కాలజ్ఞానతత్వములలో నేమిచెప్పిరో, అవి యన్నియు నేటికిని వేదవాక్యములై దృష్టాంతముగ కనపడుచున్నవి. వీరు నోట ఏ పలుకు పలికిన, నదియే వేదవాక్యము వలె జరుగునట! వీరి జీవసమాధిపై నీరు తైలముగ వెలిగెడిదట. అట్టి దివ్యపురుషుని చరిత్ర విశేషములు ప్రతివారును తెలుసుకొనదగినవి.

శ్రీ స్వాములవారి వంశపారంపర్యములోని వారే నేటికిని మఠాధిపత్యమును, ప్రతి సంవత్సరమును గొప్ప ఉత్సవములును, సమారాధనలును జరుపుచున్నారు. తనయందు భక్తివిశ్వాసములు కలిగి పూజించువారు సకల కష్టములు తొలగి, సకల సంపదలతో తులదూగుదురని కాలజ్ఞానములో శ్రీ స్వాములవారు తెలిపియుండిరి. వీరి మఠమునందు ప్రతి సంవత్సరము జరుగుచుండెడి యుత్సవాదులకు నన్ని మతముల వారును వచ్చి, ఉత్సవాదుల పాల్గొని జరిగించుచున్నారు.

గృహస్థాశ్రమ ధర్మమునందే యుండి, యోగనిష్ఠాగరిష్ఠులై, బ్రహ్మజ్ఞానము నుపదేశించిన యోగసిద్ధులీ స్వాములవారేయని మనము గ్రహింపవలసి యున్నది. వీరబ్రహ్మంగారు

మొదటనొక పల్లెటూర నద్రంగికి నుండి, ఆ యూరి రైతు లకు జ్ఞానోపదేశము చేయుటకు మొదలు పెట్టిరి. వద్రంగియగు బ్రహ్మాము! మనకు జ్ఞానోపదేశము చేయువది? అని మొదట వీరి ననేకరీతుల విమర్శించుచు, ప్రతిబంధకములను గావించెడి వారు. చివరకు వీరిమాహాత్మ్యమును తెలుసుకొని చాలమంది వీరికి శిష్యులై భక్తిశ్రద్ధలతో పూజింప దొడంగిరి. చివరకు ఆ కాలమునందలి మహమ్మదీయ ప్రభువులుకూడ వీరిమాహాత్మ్యములను తెలుసుకొని, బ్రహ్మంగారి యందుభక్తి శ్రద్ధలతో సంచరించు చుండెడివారు.

భక్తులైనవారందరును "మాఘకార్తీక వైశాఖ మాస ములయందు శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారిచే చెప్పబడిన కాలజ్ఞాన తత్వములను, నాయా మాసాంతరములవరకు పురా ణంబుల రీతిగ చదువు వారలకును, చెప్పుచుండు వారలకును, వినువారలకును తప్పక సాయుజ్యపదవి లభించు" నని స్వాముల వారి ఆజ్ఞ కనుక సర్వజనులును శ్రీస్వాముల వారి ఆజ్ఞకు బద్ధులై యాయామాసములలో కాలజ్ఞాన తత్వములను పఠిం చుచు సౌఖ్యముల బొందిరని విజ్ఞాపన.

శ్రీకృష్ణభగవానుడు ద్వాపరాంతమున ప్రజోత్పత్తి నామ సంవత్సర ఆశ్వయుజ బ॥ ౧౦ దినంబున నిర్యాణం బయ్యెను. ఆదినముననే కలియుగము ప్రవేశ మయ్యెను. కలియుగము పంచమహాపాతకయుగం బని చెప్పబడియున్నది. అట్టి యీ యుగములో ముందేమి జరుగునో, బ్రహ్మంగారు కాలజ్ఞాన తత్వములలో స్పష్టముగ చెప్పియున్నారు. కనుక ప్రతి వారును కాలజ్ఞానమును చదివి ప్రపంచముయొక్క ము ముందడలను తెలుసుకొందురని విజ్ఞాపన. నేను ప్రపం

వమున జరుగుచున్న విపరీతము లన్నియు, నీవిధముగ జరుగునని, బ్రహ్మంగారు ముందే తెలిపి యున్నారు. ఇట్టి దృష్టాంతములనుబట్టి యికముందుకూడ బ్రహ్మంగారు కాలజ్ఞానములో చెప్పినట్లే జరుగునని తోచుచున్నది.

అట్టి యీ మహాపురుషుని జీవితచరిత్రయు, ఆయన చూపించిన మహిమలు, జ్ఞానోపదేశములు, కాలజ్ఞానము మొదలగు సమస్త విషయములు నీ గ్రంధమున విపులముగ వ్రాయబడెను.

బ్రహ్మంగారు తనజీవిత మంతయు ప్రజలకు జ్ఞానోపదేశము గావించి, అంత్యమున జీవసమాధి నొందగా, అప్పటి ప్రజలు ఆయనకు ఒక మఠమును నిర్మించి, నిత్యమును పూజలు, సమారాధనలు వార్షికోత్సవములు మొదలగునవి జరుపుచుండిరి. ఆమఠమునకు నేటికిని వారి సంతతివారే అధిపత్యము వహించి నడుపుచున్నారు. ఆ మఠము కడపజిల్లాలో బద్వేలు తాలుకాలో బద్వేలుకు సుమారు పదునైదు మైళ్ళదూరము లోనున్న 'కందిమల్లయపల్లి' అను గ్రామమున నున్నది. భక్తులనేకులు ప్రతిదినము బ్రహ్మంగారి మఠమునకు వివిధప్రాంతముల నుండి యాత్రకరుదెంచు చుందురు ఆమఠములన్నియు నీ గ్రంథమున పొందు పరుపబడి యున్నవి.

ఇట్లు విధేయుడు,

వడ్డాది వీర్రాజు

# చిత్రపట సూచిక

చిత్రపట సూచిక

సమాప్తము.



# విషయసూచిక



## ద్వితీయ ప్రకరణము

వరుస సంఖ్య. పుట సంఖ్య.

వరుస సంఖ్య. ఫుట సంఖ్య.

## పంచమ ప్రకరణము.

వరుస సంఖ్య.                                                                      పుట సంఖ్య.



## షష్ట ప్రకరణము



## సప్తమ ప్రకరణము

## అష్టమ ప్రకరణము

వరుస సంఖ్య. పుట సంఖ్య.



## ఏకాదశ ప్రకరణము

## ద్వాదశ ప్రకరణము

విషయసూచిక

సమాప్తము



శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి వంశవృక్షము

శ్రీ వీరబ్రహ్మేంద్రులవారి భార్య గోవిందమ్మగారు

1. సిద్ధలింగయాచార్యస్వామి, 2. గోవిందయాచార్యస్వామి, 3. పోతులూరి ఆచార్యస్వామి,
4. శివలింగమూర్తి ఆచార్యస్వామి, 5. ఓంకార ఆచార్యస్వామి
ఈశ్వరమ్మ నీరనారాయణమ్మగారు-భర్త-తిరుమలాచార్యస్వామివారు

పెదగోవింద స్వాములవారు.

- గోవిందాచార్య స్వాములవారు
  - పోతులూరి ఆచార్యస్వాములవారు
- వెంకటాద్రి ఆచార్య స్వాములవారు
  - 1. వీరఆచార్యస్వామి, 2. నారయాచార్యస్వామి.
    - శ్రీ వెంకటేశ్వరస్వాములవారు
      - శ్రీ శ్రీ శ్రీ శ్రీనివాసస్వాములవారు

---

ప్రస్తుతము, శ్రీ జగద్గురు విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి మఠమునకు శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీనివాసస్వాములవారు ఆధిపత్యము వహించి, భక్తిశ్రద్ధలతో నడపుచున్నారు.

శ్రీరస్తు

# శ్రీ పోతులూరి

# వీరబ్రహ్మంగారి జీవిత చరిత్ర

## కాలజ్ఞాన సహితము

## ప్రథమ ప్రకరణము

### కథా ప్రారంభము

### సృష్టి విధానము

ఓం విశ్వకర్మా విశాం పతి స్సనః
పశూన్పాతు సోఽస్మాన్ పాతు తస్మైనమః

శ్లో॥ నభూమి ర్నజలం చైవ నతేజో నచ వాయవః
నచ విష్ణు ర్నచబ్రహ్మ నచ నక్షత్రతారకాః
సర్వంశూన్యంనిరాలంబం స్వయంభూ విశ్వకర్మణః॥

పంచభూతములగు భూమి, ఆకాశము, వాయువు, జలము, అగ్నియును; త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులును; ఇంద్రాది దేవతలును; రవ్యాది గ్రహములును; అశ్విన్యాది నక్షత్రంబులును లేని కాలమున విశ్వకర్మ 'స్వయంభూ' రూపంబును ధరించియుండిన వాడు, కృతయుగ ప్రారంభమున సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన యని పిలువంబడు పంచముఖంబులు కలిగి వెలసిల్లెను,

పంచముఖ వివరణ

శ్లో॥ మనుం పూర్వముఖం చైవ మయాఖ్యం దక్షిణం ముఖం
త్వష్టాఘోరముఖం చైవ ఏవం జన్మక్రమం క్రమాత్॥

పైన చెప్పబడిన యట్టి పంచముఖములలో పూర్వ ముఖంబైన సద్యోజాతంబున మనువు విశ్వకర్మయను ఈశ్వరుడు ఉద్భవించి, సృష్టికార్యంబులకు కర్తయై కైలాసంబున విలసిల్లుచుండెను. వామదేవంబైన దక్షిణముఖంబున మయ విశ్వబ్రహ్మయను విష్ణుమూర్తి ఉద్భవించి 'స్థితి' కృత్యంబు అవిరళంబుగ సాగించుచు, వైకుంఠంబున చెన్నొందుచుండు; పశ్చిమముననుండు అఘోరంబను ముఖంబున త్వష్టప్రజాపతియగు బ్రహ్మదేవుండు ఉద్భవించి 'లయ' కారకుండై సత్యలోకంబున నివాసంబు గావించుకొని యుండెను; ఉత్తర దిగ్భాగముగ నుండు తత్పురుషం బనంబరగు ముఖంబున 'శిల్పి బ్రహ్మ' యను ఇంద్రుండు ఉద్భవించి ఇంద్రలోకంబున నుండును; విశ్వజ్ఞబ్రహ్మ యనంబరగు సూర్యదేవుండు సూర్యలోకంబున నుండును. ఈరీతిగ పంచవిధ బ్రహ్మలును ఋగ్యజుస్సామాధర్వణ వేదంబులనెడి చతుర్వేదంబులను కల్పించుకొని, తదుక్తంబుగా చతుర్దశభువనంబులను పాలనంబు గావించుచున్నారు. ఆవిధంబుగ కృత, త్రేతా, ద్వాపరయుగంబులు క్రమంబున పాలనంబు గావించిరి. కలియుగంబు ప్రవేశమైనది. కలియుగంబున మానవులు దురాచార ప్రవర్తనులై మత్తుపదార్థముల సేవించుచు, మదోన్మత్తులై, వావివరుసలు దక్కి ప్రవర్తింపసాగిరి. భూలోకంబున ఆవిధముగ కలియుగము ప్రారంభించినది మొదలు

ధర్మము క్రమముగ నశింపసాగెను. ప్రజలు జ్ఞానశూన్యులై అజ్ఞానాంధ కారంబునం బడి సంచరించుచు, అనేక దుష్కార్యము లాచరించుచు, సాధుజనుల హింసింపసాగిరి.

అత్తరి సాధుజనులు ఆపాపాత్ములు పెట్టుచున్న బాధలను భరింపలేక "ఓనిర్హేతుకజాయమాన కరుణాకటాక్షా! ఆపద్బాంధవా! మ మ్మీకష్టముల బారినుండి రక్షింపవే" యని పరమేశ్వరుని తలంచుచు మొరలిడసాగిరి. ప్రపంచమున సత్యము నశించెను. ధనకాంక్ష మితిమీరినది. భగవన్నామ స్మరణ విషతుల్యంబయ్యె. పతివ్రతలు అరుదైరి. భూసురులు వేదబాహ్యులైరి. స్త్రీలు బాల్యముననే సంతానవతు లగుచుండిరి. పాపము అతిశయించెను.

## భూదేవి తనకష్టమును విష్ణుమూర్తితో మొరపెట్టుకొనుట

ప్రపంచమున ఆవిధముగ పాపాత్ము లధిక మగుటవలన భూభారం బధికం బయ్యెను. అంత భూదేవి పాపభారమును భరింపలేక దుఃఖించుచు వైకుంఠముననున్న విష్ణుమూర్తికడకు నేగి "సకల లోకరక్షకా! శిష్టజన పరిపాలా! భూలోకంబున ధర్మము నశించుచున్నది. పాపాత్ములు విజృంభించుచున్నారు. చతుస్సముద్రములును, కులపర్వతంబులు మొదలగునవి యెన్నియైనను భరించగలనుగాని, ఒక్క పాపాత్ముని భరించుట కష్టము నేనిక భూభారమును భరించ లేకున్నాను. రక్షింపవే" యని దీనాలాపంబు లాడుచున్న భూదేవింగాంచి, విష్ణుమూర్తి 'ఓభూదేవీ! నీవింతమాత్రముననకే విచారించుట శోచనీయము. ఇంకను కలియుగంబు ఆరంభమై ఎంతోకాలము

కాలేదుకదా! కలియుగమున ప్రథమ పాదమే కదా జరుగు చున్నది! ఇంకనుముందెన్నియో విపరీతంబులు జరుగనున్నవి, అప్పు డెట్లు భరింప గలవు. కృష్ణావతార సమాప్తముతో ద్వాపరయుగాంత్యము జరిగి ఎంతోకాలము కాలేదే!" అని పలుకుచున్న దేవాది దేవునిం గాంచి, భూమాత "ఆ ప్తబాంధవా! పంచపాండవుల పరిపాల నానంతరమున కలియుగ ప్రవేశమున పాండవ మధ్యముండైన అర్జునుని పుత్రుడగు పరీక్షిన్మహారాజు భూచక్రంబును! ధర్మము నాలుగుపాదముల నడిపి పరిపాలించెను. ఆయన కాలంబుననే యిక ప్రపంచమున అధర్మము వృద్ధిగాంచునని ధర్మదేవత గోరూపంబును దాల్చి యొకటిపాదములపై నిలువబడి కంటతడి పెటుచున్న సమయమున శూద్రరూపంబున కలిపురుషుండుగోమాతను కాలితో దన్నెను.

పరీక్షిన్మహారాజు ననంతరము అతని పుత్రుండు జన మేజయుండును, తరువాత వారిసంతతివారు కూడ ధర్మమును తప్పకయే పరిపాలనంబు గావించిరి. ఆరీతిగ కలియుగ ప్రవేశము లగాయితు 3000 సంవత్సరములు జరిగిన పిమ్మట విక్రమార్కుండు కూడ భూవలయంబును ధర్మము నాలుగు పాదములు నడచునట్లు పరిపాలించెను. శాలివాహన పరిపాలనంబు కూడ ధర్మముగనే జరిగెను. అనంతరము హరిహర రాయలు ఆనెగొందె సింహాసనము నధిష్టించి, తుంగభద్రా నదీతీరమున విజయనగరమును నిర్మించి, ఆనగరమును రాజధానిగ చేసుకొని మహావైభవముగ పరిపాలించెను.

అనంతరము రెండవ హరిహర రాయలును, అటుపై బుక్కరాయలును, పిమ్మట గండరాయలు, వీరరాయలు,

మల్లికార్జునరాయలు క్రమముగ పరిపాలనంబు సల్పిరి. పిదప పరిపాలన క్షత్రియుల హస్తగతమైనది. సాళువసింగరాయలు, నరసరాయలు, అచ్యుతరాయలు, తిమ్మరాజు, సదాశివ రాయలు, రామరాజు అనువారలు భూపతులై క్రమముగ పరిపాలనంబు సాగించిరి. వారికాలములో కూడ ధర్మము కొంతవరకు నడచెను, రామరాజుతో విజయనగరసామ్రాజ్యము అంతరించెను. పిమ్మట శ్రీరంగరాయలు 14 సం. లును, వేంకటపతిరాయలు 26 సం. లును, రామదేవరాయలు 15 సం. లును పరిపాలించిరి వీరికాలములో కూడ ప్రజలు ధర్మమార్గమును తప్పక సంచరించిరి. నేడు తురుష్క పరిపాలన వ్యాపించినది. నేనిక నీ పాపాత్ములను భరింపలేక పోవుచున్నాను. భక్తవరదా కావవే'' యని విచారించుచున్న భూదేవిని నూరడించి పంపివేసెను.

## పాపభూయిష్ఠంబగు కలియుగంబున మానవులుగ ఉద్భవించి ప్రజలకు జ్ఞానోపదేశము చేయుటకు పంచబ్రహ్మలు ఆలోచించుట

అనంతరము ఆదిమధ్యాంత రహితుండును, చతుర్దశ భువనాధిపుండును, సకల లోకారాధ్యుండును, పురాణపురుషుండును, వేదవేద్యుండును, దీనజనవత్సలుండును, అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుండునునగు విష్ణుమూర్తి తనమనంబున చతుర్బ్రహ్మలం దలంచినంత, వారలరుదెంచి, తమ్ము రావింప కతంబేమి యని యడుగ "ఓసుర పూజ్యులారా! భూలోకంబున జరుగుచున్న విశేషంబులు మీార లెరింగినవి

యేకదా! అజ్ఞానులై, అనాచార ప్రవర్తనులై యున్న మానవులకు జ్ఞానోపదేశంబుగావించి, ధర్మమును నిలకొల్పి, భూభారమును మాన్పవలసియున్నది. 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' అను న్యాయానుసారంబుగ దుష్ట సంహారంబును, శిష్టజన రక్షణంబును గావించుటకు ప్రతి యుగమునందును అవతరించవలసియే యున్నదికదా! ప్రస్తుతము భూలోకమున కలియుగంబు జరుగుచున్నది. ఇయ్యది పంచమహాపాతకయుగంబు గావున, మనము దేవరూపములతోగాక మనుష్యరూపంబులతో అవతరించవలసియున్నది. 'ఓ శంకరా! నీవు భూలోకంబున కాశీపురంబున విజయసింగను నొక క్షత్రియునికి 'ఆనందభైరవయోగి' అను నామంబున జన్మించి, జనకమహారాజువలె రాజయోగివై రాజ్యము పాలించుచుండుము. "ఓబ్రహ్మదేవా! నీవు విశ్వబ్రాహ్మణకులంబున విశ్వాత్మకుడు. మాయామేయి అను దంపతులకు జన్మించి 'బ్రహ్మానందుండు, అన్నాజయ్య' అను నామంబులు గలిగి పుణ్యక్షేత్రముల దిరుగుచు ప్రజలకు జ్ఞానోపదేశము గావించుచుండుము. నేను బ్రహ్మాండపురమున పరిపూర్ణ ఆచార్యులకును, ప్రకృతాంబకు జన్మించి 'వీరంభొట్లయ్య. వీరప్పయ్య. వీరబ్రహ్మం' అను నామత్రయంబుచే స్థానత్రయములయందుండి, ప్రజలకు జ్ఞానోపదేశంబు గావించుచు, కందిమల్లయపల్లె... హార పురమున ఆనందాశ్రమమును నిర్మించుకొని సూర్యోపాసనా పరుండనైయుండెద. ఇది మన కర్తవ్యము. ఇకమీదమీమీ నివాసంబులకుంజని కర్తవ్య మాలోచింపుడు. దురాచారుల పాలగుచున్న ప్రజలను రక్షించి, భూదేవియొక్క కోరికను మన్నింపవలసి యున్నది." అని వారలనెల్ల వీడ్కొ-

లిపి తాను నొంటరిగ గూర్చుండి భవిష్యత్కార్య క్రమమును గూర్చి ఆలోచింప దొడంగెను.

కాలమానంబును బట్టి పరిస్థితులు క్షణక్షణంబును మారుచుండును. లయకాలము లగ్నంబుల నెట్టుకొని, ప్రపంచమును పైకినెట్టుచు పరుగిడి వచ్చుచున్నది.

## నందికొండయను గ్రామమందలి పాపాఘ్ని మఠమునకు అధ్యక్షుడైన యనమదల వీరభోజ యాచార్యులు

సర్వసంపదల కాలవాలమై, సకలసస్యశ్యామలమై ఆంధ్ర దేశం బనంబరగు 'త్రిలింగ దేశంబున' పుణ్యభూమియై యలరారు గుంటూరు మండలమున 'నందికొండ'యను గ్రామంబు కలదు. ఆ గ్రామంబున 'పాపాఘ్నిమఠం' బను నొకమఠంబు విలసిల్లుచుండెను. ఆమఠంబునకు నిరంతర హరిచరణారవింద సేవాతత్పరుండు, సదాచార సంపన్నుండును, నిత్యసత్యవ్రతుండును, సకలసద్గుణ సంపన్నుండునునై విశ్వబ్రాహ్మణ కులము నందు జన్మించినట్టి 'యనమదల వీరభోజ యాచార్యులు' అను నొక పుణ్యపురుషుండు అధ్యక్షుండై ప్రజలకు నిరంతరము జ్ఞానోపదేశము గావించుచు, తాను తరించుటయేగాక ప్రజాకోటికి తరణోపాయమును బోధించుచు కాలము గడుపుచుండెను.

అట్టి సచ్చరితునకు, భూతదయాతత్పరునకు తనపుణ్యావశంబున సాధ్వీలలామయు, సీతారుంధతీసమాన మహాపతివ్రతయు, సదాచారసంపన్నురాలును, ధానధర్మ పరోప

కారాది సద్గుణ సంపన్నురాలును, నిరంతరముకుంద పాదార విందసేవితురాలును, భూతదయా తత్పరురాలును నైనట్టి 'వీరపాపమాంబ' యనునొక వనితా శిరోమణి వీరభోజ యాచార్యులకు ధర్మపత్నియై యొప్పుచుండెను. ఆపుణ్యదంపతు లిరువురును 'పాపాఘ్ని' మఠంబున నివసించుచు, నిహలోక సౌఖ్యములయందు తమ మనంబుల బోనీయక సర్వకాల సర్వావస్థలయందును ఈశ్వరధ్యాన తత్పరులై, తమ్ముజూడ వచ్చినవారికి జ్ఞానోపదేశంబు గావించుచు, భక్తులర్పించుకానుకలతో జీవితముల గడపుకొనుచుండిరి. కాని కారణంబెట్టిదో గాని వారికి సంతానము గలుగలేదు. సంతానములేదను విచారము వీరభోజ యాచార్యున కిసుమంత యైనను లేదు. వీరపాపమాంబకు మాత్రము తనకు పుత్రసంతానము కలుగలేదని విచారముగనే యుండెను. 'అపుత్రస్య గతిర్నాస్తి' అను విషయము ఆమె హృదయమును వేధించుచుండెను. తనకు పుత్రసంతానమును గలుగ జేయుమని భగవంతుని అనేక రీతుల బ్రార్థించుచు, పుత్రార్థియై ఎవ రేవ్రతములు జెప్పిన, వాని నన్నిటిని భక్తి శ్రద్ధలతో యథావిధి నాచరించుచుండెను.

## పాపాఘ్ని మఠమునకు ఒకసాధు పుంగవు డరుదెంచుట

ఇట్లుండ నొకదినమున వీరభోజయాచార్యులు మఠంబున లేని సమయంబున సాధువేషంబున దివ్యమంగళ విగ్రహుండగు మహాత్ముండొకడు మఠంబునకు నరుదెంచెను. ఆ మహాత్మునిగాంచి, సహజసద్గుణరాశి యగు నాపరమసాధ్వీలలామ సంతసించి, మునిపుంగవునకు నెదురేగి నమస్కా

రించి "మహాత్మా! మీరెవ్వరో నాకు తెలియదు గాని, మీ రూపవిశేషంబులంబట్టి, ఎవ్వరో మహాను భావులవలె గనిపించుచున్నారు. తమ దర్శన భాగ్యంబుచే నాజన్మ తరించెను. నేడు సుదినము" అని పలుకుచు, ఉచితాసనంబున గూర్చుండ నియోగించి, అర్ఘ్యపాద్యంబు లొసంగి "ముని పుంగవా! మార్గాయాసంబుచే బడలిక చెందినట్లు కనబడు చున్నారు. బీదరాలనైన నాచేనొసంగు ఆతిథ్యమును స్వీకరించి నన్నానందింప జేయువే" అని వేడగా, ఆ యోగిపుంగవుండును సంతసించి, దివ్యదృష్టిని చూచి "యో పుణ్యవతీ! నీవు మాయందు జూపిన గౌరవమునకు నెంతయు సంతోషము, కాని నాకొక వ్రతముగలదు. పుత్రసంతానము లేనివా రొసంగు నాతిథ్యమును స్వీకరింప రాదని మునిపుంగవులు చెప్పియున్నారు. చూడగా నీకు సంతానము లేనట్లు కనబడుచున్నది. కావున నీవొసంగు నాతిథ్యము స్వీకరింప వీలులేదు. నాదారిం బోయెద" నని చెప్పిన విని, వీరపాప మాంబ తన మనంబున విచారించి, మునిశ్రేష్ఠునకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి లేదినిలిచి "మహాత్మా! నాకు సంతానము లేనిమాట యథార్థమే పుత్రకామార్థమై అనేక వ్రతంబులాచరించితిని. ఎన్నినోములునోచినను ఈశ్వరునకు మాపై కరుణ కలుగలేదు. పుత్రసంతానము కలుగుటకు మాకేదేని తరణోపాయముం దెలిపి, మమ్ములను కృతార్థులను చేయుడు" అని దీనాలాపంబు లాడుచున్న పరమ సాధ్వియగు వీర పాపమాంబను గాంచి, మునిచంద్రుడు ఆలోచించి, తలయూచి "తల్లీ! మీకిక సంతానము కలుగు యోగము కాన్పించుట లేదు. కాని సర్వేశ్వరుని కటాక్షముచే నొకముని పుంగవుని

వలన నొక బాలుడు లభించును. ఆబాలకుండు సామాన్యుడు కాడు. కేవలము పరమేశ్వరావతారమని గ్రహింపవలయును. మీరు కొలది దినములలో తీర్థయాత్రకై పోవు యోగము కలదు. తీర్థయాత్రలు సాగించి తిరిగి యింటికి వచ్చునప్పుడు, మార్గమధ్యంబున సరస్వతీ నదీతీరమున మీ కొక మునీశ్వరుని యాశ్రమం బొకటి గాన్పించును. ఆ యాశ్రమును నందుగల మునివర్యుని వలన మీ కా బాలుడు లభించును. అందుచే నిక విచారమును వదలి సుఖం బుండు"డని చెప్పి, ఆశీర్వదించి తన దారిని వెడలిపోయెను. ఆమాటలు వినినదై వీరపాపమాంబ అపరిమితానంద భరితురాలై సంతోషించుచు, ఆమహాత్ము డెవ్వరో, తనకు పుత్రభిక్ష పెట్టవచ్చిన పరబ్రహ్మస్వరూపుడే యని తలంచుచుండెను.

అంతలో వీరభోజయాచార్యులు మఠంబున కరుదెంచుటను వీరపాపమాంబ చూచి హృదయయార్గత ఆనందంబు ముఖంబున తాండవింప పతికి నెదురేగి, లోనికిందీసుకొనివచ్చి సపర్యలుగావించి, మార్గాయాసంబు తగ్గినపిదప జరిగినయుదంతంబంతయు పూసగ్రుచ్చినట్లు భర్తకుం దెలిపెను.

వీరపాపమాంబ చెప్పినదంతయు సావధానంబుగ విని, వీరభోజ యాచార్యుండు "దేవీ! నీవింకను అజ్ఞానమునందే పడి కొట్టుకొనుచున్నట్లు కనబడుచున్నది. ఒక వేళ నా సాధు పుంగవుడు చెప్పినట్లు మన కొక బాలుడు లభించెనే యనుకొనుము. అందువలన మనకు మోక్షము లభించునా? ఆశయే అనేక కష్టములకు దారితీయునదని గ్రహింపుము. ఆశను వదలిన వారికి నెట్టి చింతయులేదు. సంతానముపై నీ కింత

ఆశ ఎందులకు? నీవట్టి ఆశను విడనాడినప్పుడే నీకు నిజమైన సౌఖ్యము కలదు. సంతానము కలుగువరకు కలుగలేదను విచారము; కలిగినపిదప ఆ సంతానముకు గురించి అనేక చింతలు నుద్భవిల్లును. కనుక యథార్థమును గ్రహించి.నీ వట్టి కోరికను విడనాడి సుఖంబుండు" మని చెప్పి, భార్యను మందలించి ఊరకుండెను. తీర్థయాత్రకు బయలుదేరి వెళ్లుద మని భార్య నిరంతరము తన్ను వేధించుచున్నను, వీరభోజయాచార్యుండు ఆమె మాటలు పెడచెవిని పెట్టుచుండెను. వీరపాపమాంబమాత్రము తనమనోభీష్టము నెరవేరక పోవుటం జేసి, విచారాయత్త చిత్తంబుతో పతినిజేరి "నాథా! ఆ సాధుపుంగవుడు చెప్పిన మాటలు అసత్యములు గావని నా మనంబునకు తోచుచున్నవి. ఆమహానీయు డరుదెంచిన నాట నుండియు నా వామనేత్రంబు అదరుచున్నది. శుభస్వప్నంబులెన్నియో కలుగుచున్నవి; శుభశకునంబు లెన్నియో గానంబడుచున్నవి. ఆ మహనీయుని మాటలు రిత్తయవునే? కాన వైళంబ బయలుదేరి మనము తీర్థయాత్రకు బోవుదము" అని తనపట్టు వదలక భర్తను ప్రతిమాలుచునే యుండెను.

ఇట్లుండ నొక నాటిరాత్రి పరమేశ్వరుడు వీరభోజయాచార్యునకు స్వప్నములో సాధురూపంబున గానంబడి "వత్సా! నీ ధర్మపత్ని మాటలు పెడచెవిని పెట్టకుము. తీర్థయాత్రలు సేవించుటకై వెంటనే బయలుదేరి వెళ్లుము. మార్గమధ్యంబున మీకొక యమూల్యంబైన రత్నంబు ప్రాప్తించును; అద్దానివలన మీ జన్మంబులు సార్థకంబు లగును. నీ పత్ని మహా పతివ్రత, ఆమె యీప్సితార్థంబు నెరవేర, కేవలము శ్రీమద్విరాడ్విశ్వకర్మయే ఆమెకు పుత్రుం డగుటకు

నిశ్చయించుకొనెను. నామాటలు అసత్యములుగావు, తెల్లవారు వేగమే ప్రయాణమై వెడలుము' అని చెప్పి అదృశ్యుండాయెను. వెంటనే వీరభోజయాచార్యుడు నిద్రనుండి మేలుకొని, భార్యయగు వీరపాపమాంబను నిద్రనుండి లేపి, స్వప్నవృత్తాంబును ఆమెకు నెరింగించి "దేవీ! నీవు ప్రతిదినము చెప్పుచున్నను ఏమో అనుకొంటిని. ఇందేదియో గొప్ప విశేషంబున్నట్లు తోచుచున్నది. ఇక మనము ఆలస్యము చేయదగదు. మన కొన్నదును నేటికిని అపచారము చేసినవారము కాముకదా! మనకెట్టి యక్కృతంబును జరుగదనియే తోచుచున్నది. మనలను రక్షించు భారము ఆపరమేశ్వరునిదే. సూర్యోదయమునకు పూర్వమే మనము బయలుదేరి తీర్థయాత్రలు సేవించుటకై పోదము, ఈవత్సరమంతయు భరతఖండమునగల తీర్థములను సేవించుచు, వత్సరాంతమునకు తిరిగి మఠంబునకు జేరుదము. మనము తిరిగివచ్చువరకు మనశిష్యులు ఈ మఠమును జూచుచుందు"రని చెప్పగా విని వీరపాపమాంబ నేటికి తన మనోభీష్టము నెరవేరినదిగదాయని ఆనందించుచు, ప్రక్కనుండిలేచి కాలకృత్యంబుల దీర్చుకొని ప్రయాణమునకు గావలసిన వస్తువుల నన్నిటిని మూటగట్టుకొని సిద్ధంబయ్యెను. ఆవిధముగ ఆపుణ్యదంపతులు ఉదుపురు కాశీ, రామేశ్వరాది సకల పుణ్యతీర్థములను సేవింపవలయునను కుతూహలముతో పయనంబై వెడలిరి.

## శ్రీ వీరబ్రహ్మంగారి జననము

సకలసంపదల కాలవాలమై, సాధు సజ్జన నివాసయోగ్యంబై యొప్పు బ్రహ్మాండపురం బను నొకపురవరంబు

గలదు. ఆపురంబున సకల పురాణేతిహాస పారంగతుండును, సకలవేదాంత వేదియు, పరిశుద్ధాత్ముండును, నిరాడంబర జీవితుండును, ఆశారహితుండును, సదాచార సంపన్నుండును, భూతదయా తత్పరుండునునై పరిపూర్ణాచార్య స్వాములనెడు నామంబుతో నొక యుత్తమ పురుషుడు విశ్వబ్రాహ్మణవంశ సంజాతుడై యొప్పారుచుండెను. లోకధర్మాను సారముగ పరిపూర్ణాచార్యుండు ప్రకృతాంబయను సాధ్వీలలామను వివాహంబాడి, తామరాకుపై నీటిబిందువువలె ప్రపంచ విష యములం దగులక జీవయాత్రను గడపుచుండెను. ఈ దంప తులకు గూడ సంతానంబు లేదయ్యె ప్రకృతాంబ తనకు సంతానము కలుగలేదని విచారించుచు కాశీవిశ్వేశ్వరుని బూజించిన సంతానప్రాప్తి కలుగునని పెద్దలవలన విని, భర్త యగు పరిపూర్ణాచార్య స్వాములకు నచ్చచెప్పి, యిక శుభ దినంబున భర్తతో గలసి బయలుదేరి మార్గమధ్యంబున గల పుణ్యక్షేత్రములను సేవించుచు, కతిపయ దినంబులకు కాశీ క్షేత్రంబును జేరెను,

ఆ విధంబుగ నాదంపతు లిరువురును కాశీక్షేత్రంబును జేరి గంగానదియందు స్నానం బాచరించి కాశీవిశ్వేశ్వరుని సందర్శించి "ఓ సర్వేశ్వరా! సకలలోకాధారా! సృష్టిస్థితిలయ కారకా! పాపనాశనా! భక్తాభీష్ట ప్రదాయకా! పురాణ పురుషా! భక్తవరదా! స్వామీ! మాప్రార్థన నాలింపుము. భక్తవత్సలా! పుత్రసంతానా పేక్షతో నీదరి జేరితిమి. మా మొర లాలకించి నీవే మాకు పుత్రుడుగ జన్మించి, మా కోరిక దీర్చి మమ్ముల నుద్ధరింపుమా" యని ప్రార్థించిరి. వారారీతిగ నిత్యము విశ్వేశ్వరునికి పూజలు గావించుచు "సంతానము

కలుగునందాక నీపాదపద్మములు వదలక కాశీపట్టణమందే మాజీవితవిశేషంబుల గడపుదుమని, స్థిరచిత్తులై యందే నివసించుచుండిరి.

ఆదంపతుల నిశ్చలభక్తికి పరమేశ్వరుడు మెచ్చి, ఒకనాటిరాత్రి ఆపతివ్రతాశిరోమణికి స్వప్నంబున గాన్పించి 'ఓ సాధ్వీ! మీభక్తికి మెచ్చితిని, మీసంకల్పంబు తప్పక నెరవేరును. నేనే నీగర్భంబున జన్మింతును. కాని నేను జన్మించిన వెంటనే నీభర్త యీప్రపంచమును వదలును. నీవందుకు విచారింపవలదు, ఇది కాలచక్రము. ప్రపంచమున ప్రాణులు పుట్టుచు జచ్చుచుండును. ఇది ప్రకృతి స్వభావము; పుట్టుట చచ్చుట యనునది దేహంబునకేగాని ప్రాణికి కాదు. నీవట్టి ప్రకృతి సంబంధమైన విషయంబులలోబడి విచారింప వలదు' అనిచెప్పి యదృశ్యుం డాయెను. అంత నామె నిద్రనుండి మేల్కాంచి తనగర్భమున పరమేశ్వరుడే జన్మింప నున్నందుకు నానందించి,భర్తృవియోగమునకు విచారించి, నిద్రించుచున్న భర్తనులేపి తన స్వప్నవృత్తాంతంబంతయు పూసగ్రుచ్చినట్లు పరిపూర్ణాచార్యునకు నెరిగించెను. అంత పరిపూర్ణాచార్యుడు "దేవీ! నేటికి పరమేశ్వరునకు మనపై కృపగలిగి నందుకు చాల సంతోషము. ఈప్సితార్థము నెరవేరినదిగదా! నాకదియే ఆనందము, నాకై విచారింప పనిలేదు. ప్రపంచమున జన్మించినపిదప నెప్పుడో యొకప్పుడు మరణము తప్పదు. ఇక నేను బ్రతికియు చేయవలసిన దేదియులేదు గదా! ఈప్రపంచమున నెంతకాలము జీవించినను, నెన్నికష్టముల ననుభవించుచున్నను నింకను బ్రతుకవలయు ననియే కోరుచుందురు. కాని నాకట్టి యభిలాష లేశమాత్రమైనను లేదు. పరమేశ్వర

సాన్నిధ్యమును బొందుటే నాలక్ష్యము. కనుక నీవు నాకై విచారింపక పరమేశ్వర ప్రసాదితంబైన పుత్రుని కాపాడుచు సుఖంబుగ నుండు" మని భార్య నోదార్చెను. వా రా విధముగ కాశీవిశ్వేశ్వరుని సేవించుకొనుచు కాశీపురమందే యుండిరి.

ఇట్లుండ నొకదినమున రాత్రి ప్రకృతాంబ భోజనము చేసి పరుండియుండ నాగదిలో నామెకు ఒకజ్యోతి కనబడజొచ్చెను. 'ఇది యేదియో వింతగా నున్నదే" యని ఆమె ఆశ్చర్యపడు చుండగా, ఆమెకు ఒకవిధమైన మైకము కల్గి పరుండెను. ఆజ్యోతి క్రమముగ ఆమెను సమీపించి ఆమెలో లీనమైపోయెను. తెల్లవారువరకు నామె యీవిధముగ తెలివి తప్పి నిద్రించి, ఉదయమున మేల్కాంచి ఆనందముతో భర్త కావిషయ మెరింగించెను.

తదుపరి ఆమె గర్భము దాల్చెను. నవమాసములునిండువరకు వారారీతిగనే కాశీపురమందే యుండిరి. అనంతరము తమస్వస్థలమైన బ్రహ్మాండపురమునకు బోవలయునను తలంపుతో నా దంపతు లటనుండి బయలుదేరి పోవుచుండగా, సరస్వతీ నదీ తీరమును చేరుసరికి, ప్రకృతాంబా మహాదేవికి ప్రసవ చిహ్నములు ప్రారంభమై, బాలార్కకోటి ప్రకాశవిలసితుండైన ఒకబాలుం డుద్భవించెను. ఆబాలుడే మన వీరబ్రహ్మము, జగదుద్ధారణకై యవతరించిన కేవల పరమేశ్వరావతారము.

ధర్మసంస్థాప నార్థమై యీ ప్రపంచమున భగవానుడైన శ్రీవీరబ్రహ్మేంద్రస్వామి జన్మించుటకు పూర్వముతూర్పు దిక్కున గొప్ప తేజోవంతమైన యొకనక్షత్రంబు పుట్టెను.

ఆనక్షత్రంబునుగాంచి జనులు ప్రపంచమున కేదోకీడు మూడ నున్నదని భయపడ సాగిరి. మహామును లానక్షత్రంబును గాంచి, ధర్మసంస్థాప నార్థమై భగవంతుడు భూమండలమున నవతరించె నని ఆనందింపసాగిరి. ప్రకృతాంబ ప్రసవించిన మరుచటి దినమే పరిపూర్ణాచార్యులవా రీప్రపంచమును వీడి శివ సాయుజ్యమును పొందిరి.

స్వప్నమున గాన్పించి పరమేశ్వరుడు చెప్పిన రీతిగనే తనభర్త యసువుల బాసెగదాయని, మహాక్లేశంబుచే కుం కుచు, భర్తలేని జీవనము నాకేటికని తలపోసి, తానునుభర్త ననుసరించి యీప్రకృతి ప్రపంచమును వదల నిశ్చయించుకొని "శోక శోక కలిగిన యీబిడ్డ నెవ్వరు కాపాడుదు రనిన దిగు లుచే నేమియుతోచక ఆశిశువును నొడిలో నిడుకొని, సరస్వతీ నదీతీరంబున నొక వృక్షచ్ఛాయను గూర్చొని విచారించు చుండెను.

అంతలో నాసమీపమున నాశ్రమమును గావించుకొని తపోనిష్ఠా గరిష్ఠుండై నేకాంతంబుగ కాలంబు గడుపుచున్న అత్రిమహాముని స్నానం బాచరింప సరస్వతీనదీ తీరంబునకు వచ్చి, తత్తీరంబున ప్రకృతాంబను గాంచి, అట్టి నిర్జన ప్రదే శంబున నాస్త్రీయుండుటకు కారణం బెట్టిదో యారయ నెంచి ఆమెంగాంచి "తల్లీ! నీవెవ్వతెవు? ఇట్లొంటరిగ నీ నదీ తీరమున గూర్చొని విచారించుటకు కారణమేమి? నీయొడిలో నున్న శిశువెవ్వడు? భయమునొందక నీయుదంతం బంతయు తెలుపుము. తప్పక నీకు కావలసిన సహాయంబు చేసెద" నని పలుకుచున్న మునివర్యుని పలుకు లాలకించి చెదరినహృద యంబును కట్టపరచుకొని, ప్రకృతాంబ ఆమునిశ్రేష్ఠునకు

దండప్రణామంబులాచరించి, "మునివర్యా! మీరు నన్ను రక్షింప వచ్చిన పరమేశ్వరునివలె కనబడుచున్నారు. నేనున్న స్థితి మాహాత్మ్య మధ్యంబున తమవంటి మహనీయుల దర్శన భాగ్య మెట్లు లభించును?" అని అనేకరీతుల స్తుతించి, తన చరిత్ర మామూలాగ్రముగ నామునివర్యున కెరిగించి "మహానుభావా! నేనీ ప్రపంచమును వదలిన నీ బాలుని కాపాడు వారెవ్వరా?" యని, విచారించుచుండగా నింతలో పరమేశ్వరుడు మిమ్ముల నిక్కడకు బంపెను. చూడగ నిదియంతయు నీశ్వర సంకల్పంబువలె కన్పడుచున్నది. ఇది యీపసికూనను రక్షించు భారము మీమీదనే పెట్టుచున్నాను, పతిలేని జీవనంబు నేనొల్లను, నేనును నాభర్తవలెనే పరమేశ్వర సాన్నిధ్యంబును చేరుదు"నని చెప్పుచు నిరుపమాన తేజోవిలాసంబులచే చెన్నొందు నబ్బాలకుని మునిచంద్రుని హస్తంబుల బెట్టి మారుమాటాడక పద్మాసనంబు వేసుకొని కూర్చుండి పవనంబును బంధించి షడాధారంబుల భేదించి ప్రాణవాయువును సహస్రారంబు నకుంజేర్చి శివజీవైక్యసంధానంబుం బొందెను.

అనంతర మాయత్రిమునీంద్రుడు అబ్బాలునిం గాంచి సకల సాముద్రిక లక్షణ లక్షితుండుగను యుండుట నారసి, యీతడెవ్వరో జగదుద్ధారణకై యవతరించిన దేవతా మూర్తియేగాని వేరుగాదని స్థిరపరచుకొని, తన కట్టి మహానుభావుని కాపాడు భాగ్యము లభించినందుల కెంతయు నానందించుచు, నెత్తుకొని తన ఆశ్రయంబునకు గొనివచ్చి, ఉద్యోగముల నేర్పరచి, యందుండి 'వీరంభొట్లయ్య' యని, నామకరణంబు జేసి పెంచుచుండెను.

## అత్రిమహాముని పరమేశ్వరాంశ సంభూతుండైన వీరం బొట్లయ్యను విరభోజయాచార్యులకును, వీరపాపమాంబకును పెంచుకొనుమని యొసంగుట

శ్రీవీరభోజయాచార్యుండు నిజసతియైన వీరపాపమాంబా సహితంబుగ తీర్థయాత్రలు సేయించుటకై యిల్లు బయలుదేరి పరమేశ్వరుని ధ్యానించుచు, భరతఖండంబునం గల పుణ్య క్షేత్రంబులెల్ల సేవించుచు, తిరిగితిరిగి ఎట్టకేలకు సరస్వతీ నదీ తీరంబునకు జేరిరి. వీరభోజ యాచార్యుండు దవ్వునంగల ఆశ్ర మంబుగాంచి, వీరపాపమాంబతో "దేవీ! చూడుము. అకన [illegible] నది యొక్క ఆశ్రమమువలె నున్నది. మనమక్కడకుం బోదము. అందెవ్వరైన నున్నచో నీ దినంబు నందేయుండి, మార్గాయాసంబు దీర్చుకొని, రేపు ఉదయమే బయలుదేర బోదము"యని చెప్పి, భార్యను వెంటబెట్టుకొని ఆ యాశ్రమ ముఖంబుం జనెను. అందెవ్వరో యొక మహానుభావుండు తన దృష్టిని నాసికాగ్రంబున నిల్పి, రేచక పూరకంబుల బంధించి ప్రాణాయామపరుండై తపోనిష్ఠ యందుండుట గానంబడియెను. వీర భోజాచార్యుండు [illegible] తపోభంగము చేయ రాదని తలంచి, ఆముని తపస్సు చాలించి తన్నుచూచువరకు నమస్కరించుచు నందే నిలువబడి యుండెను. కొంతతడవునకు నా మహాముని తపస్సు చాలించి తనయెదుటనున్న వీరభో జయాచార్యుని, వీరపాపమాంబను గాంచి "బిడ్డలారా! మీ రెవ్వరు? ఇట్టి విజన ప్రదేశంబులు ప్రవేశించు మాయాశ్ర మంబునకు రాకారణం బేమి? యనియడుగగ, వీరభోజయాచార్యుడు "స్వామీ! మేము నందికొండ గ్రామవాసులము. [illegible]

బునగల పాపాఘ్ని మఠమునందుండి పరమేశ్వరునకు పూజా దులు గావించుచు ఆ పరమేశ్వర సేవా తత్పరులమై కాలము గడపుచొనుచున్నారము. పరమేశ్వరానుగ్రహంబు లేమిం జేసి మాకు సంతానము కలుగలేదు. తీర్థయాత్రలు గావించిన సంతానము కలుగు నని, తమవంటి మహానుభావులు చెప్పిరి, దానం జేసి పుత్రసంతానార్థులమై యెచ్చటెచ్చట తీర్థ యాత్రలు గలవో, యవియన్నియు సేవించు నీ దేశం బును ఆ దేశంబును అనక తిరిగితిరిగి నేటికి నిక్కడకు చేరితిమి. మా పుణ్యవశంబుచే మాకు తమ దర్శనభాగ్యము లభించినది. నేడొక మహాసుదినము" అని, వినయ మొప్పి పడం బలుకుచున్న వీరభోజయాచార్యుల పలుకులు ముని శ్రేష్ఠుండు విని, శిరంబు పైకెత్తి ఆలోచించి, కలకముం కించి, పంకించి, చిరునవ్వు మొఖారవిందంబున తాండ వింప మునివరేణ్యుండు పాపాఘ్ని మఠాధిపతి గాంచి "ఆర్యా రోత్తమా! మీ చరితంబు వినిన మీరు పుణ్యశీలుర వలె గాన్పించుచున్నారు. మీయభీష్టంబు నెరవేర్చ దలచినయో కాబోలు పరమేశ్వరుండు మిమ్ములను మా యాశ్రమంబునకు గొని తెచ్చెను. మీ దంపతులు మా ఆశ్రమంబున రెండు మూడు దినంబులుండి పోవలసిన"దని చెప్పెను, వారును అందుల కియ్యకొని యాశ్రమమునందే యుండిరి. అప్పుడు అత్రిమహాముని తనయొద్దనున్న శిశువును పెంచుట కాదంప తులు తగినవారని తలంచి వారితో "ఓ సాధుశీలులారా! నాయొద్ద ఒక శిశువు కలదు. నేను సన్యాసిని కదా! అందువల్ల నా శిశువునకు తగిన యుపచారంబులు జరుగుట కష్టము. మీరు తమకు పుత్రసంతానము కావలయునని అభిలాష గొనియున్నారు,

కనుక మీరీ శిశువును, తీసుకొనిపోయి పెంచుకొనుడు" అని యిచ్చి, తన కాశిను బిడ్డ లభించిన విధమును తెలిపి. ఆశిశువు సామాన్యుడు గాడనియు, శిశువు యొక్క తేజోరూపాదుల బట్టి నాలోచింప లోకోద్ధరణకై యవతరించిన కేవల పరమేశ్వ రావతారమే యని తోచుచున్న దనియు, కనుక సుచితరీతిని పెంచుకొనుడనియు, తా నాశిశువునకు 'వీరబ్రహ్మ' మను పేరు పెట్టితి ననియు, మొదలగు విషయంబులన్నియు వారికి సవిస్తరంబుగ చెప్పి, వారిచేతులలో నాబిడ్డను పెట్టి, యాశీర్వదించి పంపెను.

## శ్రీ వీరబ్రహ్మంగారి బాల్యము

శ్రీ వీరభోజయాచార్య దంపతులును బాలార్కకోటి తేజోవిరాజితుండైనట్టి ఆబాలుని పరమేశ్వరానుగ్రహంబుచే లభించినందులకు నానందించుచు, పేదకు మహాభాగ్యంబు లభించిన చందంబున నమందానందంబు నొందుచు, శ్రద్ధాభక్తులుట్టిపడ ప్రేమతో పెంచుకొనుచుండిరి. ఆ బాలుండును శుక్లపక్ష చంద్రునివలె దినదినప్రవర్ధమానుండై పంచాబ్దంబుల వాడయ్యెను. అంత నాదంపతులు వీరబ్రహ్మమునకు అక్షరాభ్యాసము గావించిరి. ఆ బాలుండును పిన్న తనంబుననే సద్గురూపదేశము నొందినట్లుగ పద్మాసనము వేసికొని కూర్చొనుచు మౌనముగను యుండెడివాడు. వీరబ్రహ్మయ్య పదునాలుగు సంవత్సరముల ప్రాయము వచ్చుసరికి సకల శాస్త్రంబులు చదివిన వాడయ్యెను.

అంతలో వీరభోజయాచార్యుండు జీవబ్రహ్మైక్యసిద్ధినొందెను. వీరపాపమాంబయును భర్తృవియోగంబునకు విచారిం

చుచు, తానును భర్తను ననుసరించి యీలోకంబును వీడ వలయునని తలంచెను. కాని లేక లేక తనకులభించిన బాలుండు నిరాధారుండగునని తలంచి విచారముతో కాలము గడుపు చుండెను.

## వీరంబొట్లయ్య తన పెంపుడు తల్లికి జ్ఞానోపదేశము చేయుట

తన తండ్రి వియోగంబునకై రేయింబవళ్లు ఒకే విధం బుగ విచారించుచున్న తన తల్లియగు వీరపాపమాంబను గాంచి "తల్లీ! నీవిచారమును చూడగా నాకు ఆశ్చర్యము కలుగుచున్నది. జ్ఞానమార్గము నవలంబించి జీవించుచున్న నీవే, యీరీతిగ ప్రపంచవిషయములం దగిలి విచారించుట తగునా? అమ్మా! అజ్ఞానమును వదలి సుఖముగ నుండుము. మానవులకీజన్మములు తమపూర్వజన్మ పాపవశంబుచే కలుగుచుండును. ఋణానుబంధమునలన భార్య, పిల్లలు, బంధువులు నేర్పడుచుందురు. ఈశరీరములు అశాశ్వతంబు లని గ్రహింపుము. అజ్ఞానులైన మనుష్యులు శరీరము నిత్య మైనదనియు, సంసారము శాశ్వతమైనదనియు భావించుచు మాయలోబడి కొట్టుకొనుచుందురు. నీవిట్లు వగచుట న్యాయమా? నీవు, నేను అనుభ్రాంతిని విడనాడుము. ఈ జీవులన్నియు నెప్పుడో యొకప్పుడు పరమేశ్వరునియందు లీన ము గావలసినవే. మానవుడు తన్నుతానెరుంగక అజ్ఞాన మునకు లోనై భ్రాంతిచే శరీరమే తానని భావించును. జరా మరణంబులకు లోనై భవపాశములకు కట్టుబడి బాధపడు చుండును. శరీరము నరములు, కండరములు, రక్తము ఎము

కలు మొదలగు వానితో నేర్పడియున్నది. ఉదరమునందుం జెడి తిత్తులు మలమూత్రములతో నిండియుండి మిగుల హేయములై యుండును నేజెప్పెడిమాటలయందలి సారమును గ్రహించుము. నీవిక విచారమును వదలి హరినామ స్మరణ జేయుచు తరించు మార్గము నవలంబింపుము. నాకు దేశాటనంబు గావించుచు సకల పుణ్యక్షేత్రంబులు సేవించ వలయు నను సంకల్పంబు కలిగినది. నాకిక సెలవొసంగి ఆశీర్వదించి పంపు మని తెలిపిన వీరపాపమాంబ "బిడ్డా! నీతండ్రి గతించి నను నిన్ను జూచుచు నెట్లో దినములు గడుపుకొనుచున్నాను. గోరుచుట్టుపై రోకటిపో టన్నట్లు నీవు తీర్థయాత్ర కేగుదు నన్న, నాకిక యీజీవితమేల, యీమఠంబును జూచుకొనుచు నిందే యుండెద ననుకొంటి"నని మరింత విచారాంబుధిలో మునిఁగియున్న తల్లింగాంచి, వీరంభొట్లయ్య "తల్లీ! నేజెప్పబోవు పిండోత్పత్తి క్రమంబును వినుము.

## వీరంబొట్లయ్య తల్లికి పిండోత్పత్తి క్రమంబునుతెల్పుపుట

"శ్రుతిః - అన్నాన్మేదో జాయతే, మేదాన్మాంసః, మాంసాద్రక్తః, రక్తాద్రేతః, రేతసో మోహః శుక్లశోణితా దాసర్థతే గర్భః, స్త్రీరేతోతిరిక్తాత్ స్త్రీఃభవతి, పురుష రేతోతిరిక్తాత్పురుషోభవతి. ఉభయోర్బీజతుల్యాన్న పుంసకో భవతి, వ్యాకులిత మనసాః, ఖంజా, కుబ్జా వామనాది రూపా భవతి, ఏకరాత్రేణ స్థలిలంభవతి పంచరాత్రేణ బుద్బుదాం భవంతి, మాసేనశిరః, మాసద్వయేన కరపాదాదయః, షష్టా వంఘ్రయః స్కంధయ శ్చతుర్మాంసి, సప్తమే మాసి జీవోభవతి, నవమాష్టమయోర్జన్మాంతరస్మృతిర్భవతి. యది

యోన్యాం ప్రముచ్యేత తంప్రమద్యే మహేశ్వరం; యని యోన్యాం ప్రముచ్యేత యోగం, సాంఖ్యం సమాశ్రయే. నానా యోనిసహస్రాణి జాతాని వివిధానిచ, భుక్తాశ్చ వివిధాహారం పీతాశ్చ వివిధా స్తనాః. ఏకందుఃఖం సమాశ్లిష్టం వైష్ణవీ మాయయా అవిశేషభూ మహా పతతి.

"తల్లీ! మనము భుజించు నాహారము మూడుభాగములుగ నున్నది. కంటికి కనబడునది స్థూలమనియు, దాని యందిమిడి యుండు జిహ్వకు రుచిని కలిగించు రసము సూక్ష్మమనియు, నందుగల సత్తువ అణువనియు చెప్పబడుచుండును. మనము భుజించు నాహారము శరీరమునకు మదమును, బుద్ధికి నాలోచనాశక్తియు, శరీరమునకు చేష్టాశక్తియు, మనస్సునకు దార్ఢ్యమును కలుగజేయు చుండును. వీనియందు మదము అధికమైనప్పుడు పురుషునకు శుక్లమును, స్త్రీకి శోణితమును నేర్పడి, భార్యాభర్తలు ఋతుకాలములో సంపర్కము కలిగినసమయమందు శుక్లము అధికమైనప్పుడు పురుషుండును, శోణితము అధికముగనున్న స్త్రీయు, రెండును సమముగనున్న నపుంసకుండును కలుగును. ఒకపర్యాయము సంభోగించి, తృప్తిలేక మరల వెంటనే సంభోగము చేసినయెడల, శుక్లశోణితముల ఎక్కువ తక్కువల ననుసరించి ఒకపురుషుడు ఒక స్త్రీగాని, యిరువురు పురుషులుగాని లేక యిరువురు స్త్రీలుగాని కలుగుచుందురు. అదియునుగాక కొందరు స్త్రీలకు యోనికమలమునందు పొరలుండి, శుక్లమా పొరలయందు శోణితముతో గలసి కవలపిల్లలుగ కలుగు చుందురు. కుక్కలు, పిల్లులు, పందులు, మొదలగు జంతువు

లను యోనికమలములయందు పొరలుండుట వలననే మూడు లేక నాలుగు పిల్లలు కలుగుచుండును.

మరియు స్త్రీస్నానముచేసినది లగాయితు పదునారు దినములవరకు ఋతుకాల మనబడును. ఈ ఋతుకాలము నందలి మొదటిమూడు, నాలుగుదినములు సంభోగమునకు నిషేధములు. ఈనిషేధదినములలో నాల్గవ దినమున రతి సల్పిన పిచ్చివాండ్రును, అనాచారవంతులును కలుగుదురు. ఋతుకాలములో బేసి దినములయందు రతిసలిపిన పురుషుండు కలుగును. పగలు రతిసలిపిన యెడల బలహీనుండును, అనారోగ్యవంతుండును; అల్పాయుర్దాయము కలవాండును, దురాచారవంతుండును జన్మించును. సరిదినములయందు పిండోత్పత్తి కలిగిన స్త్రీ జన్మించును. రతిసలుపదలంచు రాత్రియందు బలమైనపదార్థములను భుజించి, శాస్త్రోక్తముగ రతిసలిపిన యెడల మంచి సంతానము కలుగును. స్త్రీయోనికమలములో శుక్లము జారిపడిన తరువాత అయిదు దినములవరకు నీటిపై బుగ్గవలె తేలియుండును. పదిదినములకు గట్టికోడిగ్రుడ్డు కంటె కొంచెము చిన్నదిగ నగును. ఒకనెలకు పిండము గట్టిపడి శిరస్సు ఏర్పడును. రెండవనెలలో అవయవములును, మూడవనెలలో కడుపును, నాల్గవనెలలో సిరచర్మములును అయిదవనెలలో పాదములును వ్రేళ్లును నేర్పడును. ఆరవనెలయందు ముక్కు, చెవులు, నేత్రములు మొదలగు జ్ఞానేంద్రియములు నేర్పడును. ఏడవమాసమున జీవుడు ప్రవేశించును. నాభిలగాయితు బ్రహ్మరంధ్రమువరకు వెనుక భాగమున నొకనాడి యుండును. ఎనిమిది, తొమ్మిదవనెలలలో పూర్వజన్మ జ్ఞానము కలిగి భూమిమీద పడువరకు

మలమూత్ర స్థానమైన గర్భమునందుండి "అయ్యో! పూర్వ జన్మమున కొంచెమైనను పుణ్యము చేసుకొనలేక పోయితిని గదా! యని విచారించుచుండును. అజ్ఞానముచే సంచరించి యెన్నియో దుష్కార్యములను చేసియున్నాను. ఇక నీనరక కూపమునుండి బయట పడినపిదప జ్ఞానమును తెచ్చుకొని, ప్రపంచవిషయములలో తగులక విష్ణుసాయుజ్యంబును బొందు గట్టి ప్రయత్నంబు గావింతునని తలంచుచుండును. పిదప పిండము అధోముఖమై తల్లికి ప్రసవవేదన గలిగించుచు, తల్లి యొక్క అపానవాయువు ప్రసారమువలనను, పిండముయొక్క ప్రాణవాయుప్రసరము వలనను బయటపడును. అప్పుడు శిశువు పూర్వజ్ఞానమును మరచి 'కావు' 'కావు'మని యేడ్వుచుండును.

అనంతర మాశిశువు పెరిగి, పెద్దదై ప్రపంచ విషయంబులందగిలి జీవించుచు, సంసారసాగరమునబడి యీదులాడును, ఈశ్వరధ్యానముగావించ లేకలేక, ద్రవ్యాపేక్షచే ననేక పాపకార్యంబు లాచరించుచు, కాలము గడుపుచుండు వృద్ధత్వంబావహించిన పిదప, పరిచర్యలు చేయువారలు గానంబడక విలపించుచు, చివరకు యమదూతలు వచ్చి, వారు పెట్టుబాధలను భరించలేక, జీవంబు దుఃఖపడుచుండును. కావున తల్లీ! నీవిట్టి అజ్ఞానాంబుధిని పడి నీదులాడక, పాంచభౌతికంబైన నీదేహంబుపై మమకారంబు బారద్రోలి, ముక్తిప్రదాయకుండగు ననంతుని సదా ధ్యానించుచుండుము" అని తేనె లొలుకునట్లుగ పలుకుచున్న తనయుని ప్రియభాషణంబులు విని అమందానందకందళిత హృదయారవిందయై ఆనంద మొప్పంగ వీరపాపమాంబ, "తనయా! నీనుడు

వులు నాకపరిమితానందమును కలిగించినవి. నాకు జ్ఞానోపదేశము గావించితివి. బాలుండవైన నీకిట్టి జ్ఞానంబు ఎట్లు కలిగెనో, నాకు బోధపడుచుండుటలేదు" అని పలుకుచున్న మాతృదేవతకు వీరంభొట్లయ్య మరియు, ఈ విధంబుగ చెప్పందొడంగెను.

## వీరంభొట్లయ్య తల్లికి తారకోపదేశము గావించుట

"తల్లీ! పాపఘ్ని మఠంబునకు మఠాధిపతియై శిష్యకోటికిని, ప్రజాకోటికిని జ్ఞానోపదేశంబు చేసెడి మాతండ్రియైన వీరభోజయాచార్యులకు ధర్మపత్ని వయ్యెను. నీవు ప్రపంచ బంధములందగిలి యింకను నజ్ఞానాంబుధి నోలలాడుచుండుట నాకెంతయు నాశ్చర్యము కలిగించుచున్నది. తక్కుంగల మానవకోటికి జ్ఞానోపదేశము చేయజాలు నీవే యిట్లు పరిపించుచుండ మిగిలిన ప్రజలమాట వేరు చెప్పనవసరము లేదుగదా! నన్ను మఠాధిపతిగా జేసి సంతోషింప దలంచుచున్నావు. ఈ కోరికలు ప్రపంచ సంబంధమైనవి. మానవులు మాయచేత కలువడి, తాము చూచుచుండగానే దారాపుత్రాదులు మరణించినను, తమకు మాత్రము భయములేదని తలంచుచు కాలమంతయు వ్యర్థముగ గడిపి, తుదకు యమునిపాల బడి, పాపాత్ములై పుట్టుచు జచ్చుచుందురు.

"తల్లీ! నీకు పరబ్రహ్మంబు నెరుంగుటకు అతిరహస్యంబైన యొక యోగమార్గంబును దెల్పెదను వినుము. స్థిరచిత్తంబుతో పద్మాసనంబు వేసుకొని కూర్చుండి, వాయువేగంబుకంటెను నతివేగంబుగ చలించెడి మనంబును కదలనీయక, కన్నులుమూసికొని, మనస్సును ఈశ్వరునియందు

లయంబు గావింపవలయును. ఆవిధంబుగ జేసిన నీవు చిన్మయ స్వరూపుండవు గానగుదు. అదియే అణువు. అట్టి అణువు నందే కోటిసూర్యప్రకాశంబగు జ్యోతి పుట్టును. సకలలోకం బును దానియందే పుట్టి దానియందే లయమగుచుండును. ఆ జ్యోతియే శుద్ధ స్ఫటిక పరిపూర్ణ పరమపద మనబడును. పిదప సజ్ఞానం బనబడు పువ్వులను పరమేశ్వర నామోచ్చా రణ యనంబడెడి కల్వంబునందువైచి మర్దనంబు గావించి, వాటినుండి జ్ఞానమనెడు నూనెనుదీసి, నేత్రంబు లనియెడు ప్రమి దలలో నాచమురునుబోసి, చిత్తభ్రాంతియను వత్తిని నా చమురునం దుంచి, నిర్వికారం బనునగ్నిహోత్రంబుచే నా వత్తిని వెలిగించి, కోటి సూర్యసమాన తేజో వంతంబైన ఆనిర్వికారమనెడి జ్యోతియందు మనస్సును లయంబుగావించి, స్థిరంబైన యానందాబ్ధిని మునింగి తరించుము. ఇంతకు మించిన తరణోపాయంబు వేరొకటి లే"దని పలుకుచున్న తనయుని మాటలువిని, ఆశ్చర్యపడుచుతనలో "ఈతడు నాకు పుత్రుండను భ్రమచే నుంటిని. ఆలోచింపగానిం దేదియోరహస్యంబున్నట్లు తోచుచున్నది. ఈబిడ్డను నాకొసంగి పెంచుకొనుమని యిచ్చి నప్పుడే యాతడు భగవదంశ సంభూతుడే కాని, సామా న్యుడు కాడని అత్రిమునీంద్రుడు పల్కెను. నాపూర్వ జన్మపుణ్య ఫలంబుచే నీ మహానుభావుడు నాకు తనయుడుగ నటించు చున్నాడు." అని వీర పాపమాంబ తనమనంబున నాలో చించి వీరంభొట్లయ్యతో "తనయా! నీపలుకులు నాకత్యా శ్చర్యమును కలిగించుచున్నవి, పుత్రభ్రాంతిలోపడి నిన్ను గ్రహించ లేక కాలమంతయు వృధాచేసుకొంటిని. నీనుడువు లాలకించినచో, నీవెవరివో ప్రపంచము నుద్ధరింప నవతరిం

చిన మహానుభావుండవుగాఁ గాన్పడుచున్నావు. నీవు మాతన యుడవైనందులకు నాజన్మము తరించెను. నీనిజవృత్తాంతంబు దెలిపి, నన్ను కృతార్థురాలిని జేయవే"యని యనేకభంగుల దీనాలాపంబులాడుచున్న తల్లిని గాంచి యిట్లనియె.

## వీరంభొట్లయ్య తల్లికి విశ్వరూప సందర్శనంబు గావించుట

"తల్లీ! త్రుప్పుపట్టినకత్తిని సానపెట్టినట్లుగ మనస్సును నెప్పటికప్పుడు నిర్మలంబుగా నుంచుకొనవలయును. మరియు నీకు పరబ్రహ్మబోధ గావించెద వినుము. నేత్రకవాటంబులను మూసుకొని, లక్ష్యంబును సాధించి, దీపమువలె కదలు చుండెడి మనస్సును చలించకుండునట్లు చేసి, సర్వావస్థల యందును సచ్చిదానంద స్వరూపుండు తప్ప వేరులేడని యను కొనుచు, బాహ్యప్రపంచంబును మాయగా భావించుచు, సర్వంబును పరబ్రహ్మస్వరూపంబని గ్రహించ వలయును. అవిఘ్నముగ పరబ్రహ్మస్వరూపమును గుర్తించగలిగిన వారే ముక్తిని పొందగలుగుదురు." అని చెప్పుచున్న తనయుని గాంచి వీరపాపమాంబ "తండ్రీ! అజ్ఞానంబుచే నింతవరకు నీవు సామాన్యుడవే యనుభ్రాంతితో నుంటిని. కటాక్షించి నన్ను నిభక్తురాలిగ కటాక్షింపవే"యని కన్నులు మూసుకొని ప్రస్తుతించుచున్న వీరపాపమాంబపై కరుణించి, వీరభొట్లయ్య తన నిజస్వరూపంబును జూపదలంచి, విశ్వరూపంబు దాల్చి వేయిశిరంబులును, వేయినాసికలును, వేయినేత్రంబులును, వేయి చెవులును, వేయి నాలుకలును, వేయిచేతులును, వేయి పాదంబులును కలిగి సమస్తలోకంబులు తానయై, పాతాళ లోకంబు పాదంబులుగను, సత్యలోకంబు మస్తకంబుగను,

మర్త్యలోకంబు శరీరంబుగను, సూర్యచంద్రులు నేత్రంబులుగను, దిక్కులు చెవులుగను, నాశికారంధ్రంబు సత్యలోక ద్వారంబుగను, వరుణదేవుండు నాలుకగను, చతుస్సముద్రంబులు ఉదరంబుగను, మహానదులు నాడులుగను, మహావృక్షములు రోమంబుగను, అస్థికలు పర్వతంబులుగను, కేశములు మేఘములుగను, వాయుదేవుండు ప్రాణంబుగను, ఇంద్రాది దేవతలు కరంబులుగను, బ్రహ్మ గుహ్యంబుగను, శుక్లము న్యాయముగను వీపు ధర్మసభామండపముగను, దంతములు యమధర్మరాజుగను, వాగింద్రియంబు నగ్నిదేవుండుగను, ఈ రీతిగ సకలంబును తానయై, యితరంబేమియు లేక సర్వ ప్రపూర్ణుండై నిబిడీకృతమై ఆ సాధ్వీలలామకు గానంబడియె.

ఆ పరమపావని ఆవిశ్వరూప సందర్శనంబుం జేసి వెరగుపడి, నేత్రంబులం దెరువజాలక "తండ్రీ! లోకరక్షకా! చతుర్దశభువనంబులు నీయందే యిమిడియున్నవి. అజ్ఞానాంధకారంబుచే నింతవరకు నిన్ను గ్రహించలేక పోయితిని. ఇక నీ విశ్వరూపంబు చాలించి నన్ను కటాక్షింపు"మని యనేక రీతుల బ్రస్తుతించుచున్న తల్లినిగాంచి, జాలినొంది, వీరంభొట్లయ్య విశ్వరూపంబు చాలించి, సామాన్యరూపముధరించి తల్లికన్నులను తనచేతులతో తుడిచి తల్లీ! ఇకనైనను నీ యజ్ఞానాంధకారమును వీడు" మనిన వీరపాపమాంబ వీరంభొట్లయ్యతో "తండ్రీ! నీ విశ్వరూప సందర్శనంబుచే నాజన్మము తరించినది. నన్ను కటాక్షించి యీ జనన మరణప్రవాహము నుండి తప్పింపవే"యని చేతులు జోడించి తనయెదుట నిలువంబడియున్న తల్లిని గాంచి వీరంభొట్లయ్య "జననీ! నీవు

నీవు మహాపతివ్రతవు గావుననే హరిహరాదులకు గూడ నసాధ్యంబైన నా నిజస్వరూపంబు చూడ గలిగితివి. నీజీవితంబు సార్థకంబయ్యె. ఇక నీ ప్రపంచ భ్రాంతిని వదలి, ప్రజలకు జ్ఞానోపదేశంబు గావించుచు నీవాపాఘ్ని మఠంబునందే యుండుము. నన్నాశీర్వదించి సెలవొసంగి పంపుము." అని పలుకుచున్న తనయుని నుడులాలకించి ఆనందించి కౌగలించుకొని, పుత్రగాత్ర పరిష్వంగసుఖంబును పొంది వీరపాపమాంబ "తండ్రీ! లోకరక్షకా! నన్నాశీర్వదించుటకును, సెలవొసంగి పంపుటకును నియమింప, నేనెంతటి దానను? అయినను లోకాచారంబురీతిగ నడుగుచుంటిని గాన, సర్వత్ర జయము కలుగునట్లు ఆశీర్వదించుచున్నాను. నీవుపోయి సకలతీర్థయాత్రలు చేసి సుఖంబుగ రమ్ము. తండ్రీ నాకొక సందేహము కలదు. దేవబ్రాహ్మణులైన మనవర్ణంబు కలియుగంబున ప్రాశస్త్యత కోల్పోవుటకు కారణం బెట్టిది? బ్రాహ్మణులకు నెప్పటినుండి యీ ప్రాశస్త్యంత లభించె? ఈ విషయంబు సవిస్తరంబున నాకెరిగించి, యిక నీయిష్టానుసారమేగు" మని వీరంభొట్లయ్య యిట్లని చెప్పదొడంగెను.

## విశ్వబ్రాహ్మణులు

తల్లీ! పంచబ్రహ్మల వంశమునందు జన్మించి దేవబ్రాహ్మణు లనంబరగు విశ్వబ్రాహ్మణులకు ఈ కలియుగంబున నయిదువేల సంవత్సరములనుండి మాత్రమే ప్రాశస్త్యత తగ్గినది. మరియు విశ్వబ్రాహ్మణులను 'పంచానన'ము వారని నామాంతరముకూడ కలదు. పంచ అనగ అయిదు-ఆననము

అనగా ముఖము. పంచానను డనగా నయిదుముఖములు కలవాడని భావము. ప్రపంచమంతయు పంచభూతములచే నిండియున్నదికదా! ఈ జగత్తును సృష్టించిన శిల్పియొక్క ముఖములనుండియే యీ పంచభూతము లేర్పడినవి అనగా జగత్ శిల్పియొక్క అయిదు ముఖములే యీ పంచభూతము లని అర్థము కనుక. సృష్టికర్తను పంచానను డనియు, విశ్వకర్త యనియు చెప్పుచుందురు.

ఇక పంచభూతములును వివరించుచున్నాను. వినుము (1) జ్ఞానమనోబుద్ధి చిత్తాహంకారములు ఆకాశపంచకము లనబడును. (2) సమానవ్యానోదానప్రాణాపానములు వాయుపంచకము లనబడును. (3) శ్రోత్రచక్షు స్త్వగ్జిహ్వా ఘ్రాణంబులను నయిదును నగ్ని పంచకము లనబడును. (4) శబ్ద స్పర్శరూప రసగంధంబు లనియెడు నయిదును జలపంచకము లనబడును. (5) వాక్పాణి పాద గుద గుహ్యములు అను నయిదును పృథ్వీపంచకము లనబడును. ఈరీతిగ పృథ్వి అప్ తేజోవాయు వాకాశంబు లనియెడు నయిదుపంచకములను నిరువదియైదు తత్వంబులతో చెప్పుచుందురు. ఈ పంచ భూతాత్మకమైన యిరువదియైదు తత్వములను సాధించిన వారే విశ్వబ్రాహ్మణులు, వీరలే పంచాననులు వారిని వ్యవహరింపబడుచుందురు. వీరే దేవబ్రాహ్మణు లనియు పిలువబడు చుందురు.

మరియు కలిపురుషుని మాయవలన నీకలియుగంబున జరుగుచున్న విపరీతంబులవలన పంచబ్రహ్మల వంశజులైన విశ్వబ్రాహ్మణులకు పూజ్యత దినదినము తగ్గుచున్నది.

శ్లో॥ కృతే యుగే మనశ్శుద్ధిః । త్రేతాయాం దృష్టిరూపకం
ద్వాపరే మంత్రసామర్థ్యం । కలియుగే కరసాధనం॥

అని చెప్పబడినవిధముగ కృతయుగములో సంకల్ప మాత్రముచేతను, త్రేతాయుగంబున దృష్టిచేతను, ద్వాపరంబున మంత్రశక్తివలనను కార్యములు నెరవేర్పబడు చుండెడివి. కాని యీ కలియుగంబున నిట్టి శక్తులన్నియు క్రమముగ నశించి "కరసాధన" అనగా ప్రతిపనియు చేతులతోనే చేసుకొనవలసి యున్నది. ఆరీతిగనే. అనగా సంకల్పమాత్రము చేతనే గడచిన యిరువదియెనిమిది మహాయుగంబు లందును ప్రపంచసృష్టి, పోషక, లయంబులు శ్రీ విరాడ్విశ్వకర్మ వలనను పంచబ్రహ్మలవలనను. పదునాల్గు మనువులవలనను జరుపబడెను.

శ్లో॥ మనూనాంలోహ కర్మాణి, మయానాందారు కర్మాణి
త్వష్టా కాంస్యక కర్మాణి, శిలా కారంతు శిల్పినః
విశ్వజ్ఞా స్వర్ణకర్మాణి, పంచబ్రహ్మమయంజగత్.

కలియుగములో అయిదువేల సంవత్సరముల వరకు ఇనుపపనిమను సంతతివారును, కఱ్ఱపని మయసంతతివారును, లోహపుపనులు త్వష్టసంతతివారును, శిలావిగ్రహములు శిల్ప సంతతివారును, బంగారపునగలు విశ్వజ్ఞ సంతతివారును చేయు చుందురు. ఆపిమ్మట విశ్వబ్రాహ్మణులు మరల పూజింపబడు దురు. మరలవిశ్వబ్రాహ్మణులే పౌరోహిత్యము మొదలగునవి జరిపించు కాలము వచ్చును.

ఇక బ్రాహ్మణుల విషయము చెప్పుచున్నను, వినుము.

## బ్రాహ్మణులు పూజింపబడుటకు కారణము

బ్రాహ్మణులు ఎప్పటినుండి పూజింపఁబడుచున్నారో చెప్పెదను వినుము.

శ్లో॥ "వ్యాసో లుబ్ధక సంభూతో వసిష్ఠో ఊర్వశీ సుతః" శ్రీకృష్ణభగవానుడు భూలోకమున తన యవతారము చాలించినంతనే ద్వాపరయుగము అంత్యమయి కలియుగము ప్రారంభమయ్యె. కలియుగము ప్రవేశమైన పిమ్మట లుబ్ధక సంభూతుండగు వ్యాసులవారు బయలుదేరి మనువిశ్వబ్రహ్మ సంభూతుఁడైన ఒక మహాత్ముని వద్దకేఁజని పన్నెండు సంవత్సరములు శ్రద్ధాభక్తులతో శుశ్రూష చేసి సకల వేదవేదాంగ శ్రుతిస్మృతి పురాణేతిహాసంబు లన్నియు సాకల్యంబుగ నభ్యసించి, ఆయనవద్ద మంత్రోపదేశంబును పొంది, అసమాన తేజోవిరాజితుఁడై సకల వేదవేదాంగములందును శ్రుతిస్మృతి పురాణేతిహాసము లందును తన "విప్రు" లను మాత్రమే పూజింపవలయునని సందర్భానుసారముగ సమస్తము విప్రులదే యనియు, విప్రులను మాత్రమే పూజింపవలయు ననియు పౌరోహిత్యాదులు జరిపించవలసినవారు విప్రులే యనియు, శాస్త్రపఠనార్హులు విప్రులుమాత్రమే యనియు "బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణాః" బ్రాహ్మణులు మాత్రమే బ్రహ్మజ్ఞానము కలవారనియు తారుమారు గావించి వ్రాసుకొనెను. అందువలన తదాదిగ నేటివరకు బ్రాహ్మణులు మాత్రమే పూజింపబడుచున్నారు. అనంతరము వ్యాసుండుతన అభీష్టము నెరవేర్చుకొనన దలంచి నిష్ఠాగరిష్ఠుండై తపంబాచరింప నారంభించెను. వ్యాసుల వారికి గురువైన మహనీయుఁడు తన

శిష్యుని నిశ్చలబుద్ధికి మెచ్చి "పుత్రా! నీవింత నిష్ఠాగరిష్ఠుండవై తపంబాచరింప కతంబేమి? నీకేదయినను యాప్సితార్థంబు గల దేని నాతో చెప్పుము. తప్పక నీకోరిక నెరవేరునట్లు చేసెద నని" పలుకుచున్న తన గురువరేణ్యుని గాంచి, ఆనందించి, వ్యాసుండు "తండ్రీ! నాకెట్టి కోరికయు లేదుగాని బహు కాలంబు తమకు శుశ్రూష గావించితిని. నేను వ్రాసిన సకల శాస్త్రపురాణేతిహాసములు కలియుగంబున పూజింపబడుటయే నా కోరిక" అని చెప్పెను. అనంతరము విప్రులనే పూజింపవల యునని వ్రాసిన శ్రుతిస్మృతి పురాణేతిహాసంబుల నన్నిటిం గాంచి, అయినను వరం బిచ్చెదనని వాగ్దానంబు చేసిన వాడగుటచే గురూత్తముడు మారుపలుకలేక "వ్యాసప్రోక్తం మయాదత్తం విప్రాస్సర్వత్ర పూజితాః, కలౌ పంచసహస్రాణి జాయతే వర్ణ సంకరః" అని తనవరమును సాధ్యమైనంతవరకు కూర్చెను. అనగా, కలియుగమునందు అయిదువేల సంవత్సర ములవరకు విప్రులు సర్వత్ర పూజింప బడుదురు. అటు పిమ్మట వర్ణసంకరము జరుగును. వ్యాసమహర్షి వరంబువలన నా విధముగ నీదశవిధ విప్రులగు ద్విజులు నేడు కలియుగం బున పూజింపబడు చున్నా"రని తనతల్లికిం దెలిపి, సమ్మతింప జేసి, ఆమెచే నాశీర్వాదంబుల గైకొని వీరంబొట్లయ్య భరత ఖండంబునం గల తీర్థయాత్రలనెల్ల సేవింప పాపాఘ్ని మఠంబునుండి బయలుదేరి వెడలెను. మరియు తాను వీరభోగ వసంతరాయుడను నామంబుతో మరల నవతరించి దుష్టనిగ్ర హంబును, శిష్టజన సంరక్షణంబును గావింతుననియు, తానీ జన్మలో ప్రజలకు తనమహిమలుచూపి, జ్ఞానోపదేశంబు మాత్రమే గావింతుననియు చెప్పి. తల్లి నాపాపాఘ్ని మఠంబు

నందేయుండి ప్రజలకు జ్ఞానోపదేశము చేయుచుండుమని చెప్పి, కాషాయ వస్త్రంబుల ధరించి వెడలిపోయెను.

ప్రథమ ప్రకరణము సమాప్తము.

# ద్వితీయ ప్రకరణము

## వీరంభొట్లయ్య తీర్థయాత్రలు గావించుచు హరిహర పురంబు చేరుట

కేవలము శ్రీమన్నారాయణావతారుండైన వీరంభొట్లయ్య ఆవిధము తల్లియొక్క అనుజ్ఞ పొంది, పాపాఘ్ని మఠమునుండి బయలుదేరి, కాషాయవస్త్రంబులును, దండ కమండలములును ధరించి, మెడయందు రుద్రాక్షమాలలు అలంకరించుకొని, శరీరంబంతయు విభూతి నలదుకొని బయలు దేరి శ్రీశైలము - కాశీ - ప్రయాగ - బ్రహ్మకపాలము-శ్రీ రంగము - కంచి - కాళహస్తి - రామేశ్వరము మొదలగా గల పుణ్యక్షేత్రంబుల నెల్ల సేవించుచు, నాయాక్షేత్రముల నద్వైతంబును బోధించుచు, బ్రహ్మోపాసనాపరుండై చివరకు హరిహర పురం బను నొకగ్రామంబుచేరి అందొక నిర్జన ప్రదేశంబున నొక తటాకము నొడ్డున వృక్షము క్రింద కూర్చొని. నిశ్చలభక్తితో తపస్సు గావించు చుండెను.

## ఈశ్వరాంశ సంభూతుండగు ఆనందభైరవయోగి అరణ్యమునకు వేటకై పోవుట

విష్ణుమూర్తియొక్క కోరిక ప్రకారము శ్రీశంకరులవారు కాశీరాజ్యమును పరిపాలించురాజునకు పుత్రుడై జన్మించి, ఆనందభైరవయోగియను నామంబుచే వెలయుచుండెను. కాలక్రమంబున ఆనందభైరవయోగి పెరిగి పెద్దవాడై యొక దినమున కాశీ పట్టణంబునుండి బయలుదేరి వినోదార్థమై వన్యమృగములను వేటాడ సమీపారణ్యంబులకుం జనెను.

ఆ విధముగ నరణ్యమునకు వేటకై వచ్చి అందుగల శరభశార్దూల మత్తేభాదులంబట్టి చంపుచు, నరణ్యంబెల్ల కలియ దిరుగుచు, నొక గోవు బాగుగ కసవుమేసి సమీపంబునంగల సెలయేటిలో నీరుద్రావుచున్న సమయంబున, నా గోవు నొక పెద్ద పులింగాంచి లంఘించి దాని పై బడవలయునని నొక పొదచాటున డాగి సమయమునకై నిరీక్షించుచుండుట నానందభైరవయోగి కనులారగాంచి, గోవును రక్షించవలయునని సంకల్పించుకొని, వింటబాణమును సంధించి తొందరగ పులిపై గురిపెట్టి కొట్టగా, నదిగురితప్పి గోవునకుందగుల నది 'అంబా' యని యఱచుచు నేలపై బడి, గిరగిర కొట్టుకొని ప్రాణంబుల వదలెను. పులియది యంతయు గాంచి వెరగంది పారిపోయెను.

## గోహత్యా పాపపరిహారంబునకై ఆనందభైరవయోగి తీర్థయాత్రలు గావించుట

ఆనందభైరవయోగి అదృశ్యమునుగాంచి, నిష్కారణముగ గోహత్యాపాతకము సంభవించినందులకు విచారించుచు

గోవుదగ్గరకుం జని, అది యపువుల బాయుట గమనించి, చేయునదిలేక యీ గోహత్యాపాప మేవిధముగ పోగొట్టు కొనగలుగుదునని ఆలోచించి "తీర్థయాత్రలు సేవించిన గోహత్యాపాతకము పోవు"నని మున్నొకతరి భూసురోత్తముం డొకడు చెప్పుచుండగా వినినవాడగుటచే, నానుడుల స్ఫురణకు దెచ్చుకొని, తనతోవచ్చిన పరివారంబును తన నగరంబునకు పంపివేసి, ధనుర్బాణములను త్యజించి, కాషాయాంబరములధరించి, యిది యంతయు నీశ్వర విలాసము తప్ప వేరుగాదని తలపోయుచు, సకల తీర్థయాత్రలు సేవించి ననే గాని తాను తిరిగి విజయనగరంబునకు రానని, తన తండ్రికి కబురుచేసి, తానా యరణ్యమునుండియే బయలుదేరి తీర్థయాత్రలు చేయుటకై వెడలెను.

ఆనందభైరవయోగి ఆవిధముగ తీర్థయాత్రలు సేయుటకై బయలుదేరి, యిలగల పుణ్యక్షేత్రంబులెల్ల సేవించుచు నందందుగల మునీంద్రుల నెల్ల దర్శించుచు, వారుచెప్పిన జ్ఞానోపదేశంబుల వినుచు ఆరీతిగ తిరిగితిరిగి చివరకు హరిహరపురంబు చేరెను. ఆపురంబునగల విశేషంబుల నారయుచు, నందొక నిర్జన ప్రదేశంబున మౌనముదాల్చి తపస్సొనరించుచున్న వీరంభొట్లయ్యను గాంచి "ఈ సాధుపుంగవుని చూడ విశేష తేజోసంపన్నుడుగ గాన్పించుచున్నాడు. ఈయన యెవ్వరో మహానుభావుండై యుండనోపు నేనిదివరకెందరనో మునులను గాంచియున్నాడను. కాని యీయనను గాంచినది మొదలు ఏలొకో నామనంబు ఆనందంబు నందుచున్నదిఅయి; నను నిందు తప్పేమియున్నది? పలుకరించి చూచెద, నేజేసిన

గోహత్యా పాతకంబునకు నీ మహానుభావుం డేమైన విముక్తి మార్గంబు తెల్పునేమో" యని తన మనంబున నాలోచించి నిశ్చయించుకొని, తపస్సుచేయుచున్న వారికి భంగము కలుగ జేయరాదని, వీరంభొట్లయ్య దగ్గర జేరి నమస్కరించుచు కూర్చుండెను.

## వీరప్పయాచార్యులు ఆనందభైరవయోగిని గోహత్యా పాపపరిహారంబునకై మహమ్మదీయ వంశంబునందు జన్మింపు మని శాపం బొసంగుట

వీరప్ప యాచార్యులు తపస్సుచాలించి నేత్రంబులు విప్పిచూచునరికి తనముందెవ్వరో ఒకనూతనవ్యక్తి గూర్చుండ గాంచి "నాయనా! నీ వెవ్వరవు? నిన్నుంగాంచ నేదో విచారంబుతో నున్నట్లు కాన్పించుచున్నావు. కారణంబేమి? నీ వృత్తాంతం బెఱిగింపు"మని యడుగ, ఆనందభైరవయోగి 'మహాత్మా! నేను కాశీరాజు పుత్రుండను, వేటకై యడవికి బోయి, నీరంబుద్రాగుచున్న గోవుపై లంఘించి పులియొకటి చంపనుండుట గాంచి, ఆపులిని చంపవలయు నని బాణంబు వదల నది గురితప్పి గోవునకుం తగులుటచే, నాగోవు వెంటనే మరణించెను. ఆగోహత్యాపాతకంబును బోగొట్టుకొనుట యెట్లాయని విచారించుచు తిరిగి గృహంబునకు బోక తీర్థ యాత్రల సేవించుచు, నేటికీపురంబు జేరి, యిందు మిమ్ములను గాంచితిని. చూడగా నేగాంచిన గోహత్యాపాతకంబునకు విముక్తిమార్గంబు దెల్ప మీరు సమర్థులని నాహృదయంబు నకు దోచినది. కాన నాపై ననుగ్రహముంచి, నేజేసిన పాపంబునకు పరిహారమార్గం బేదైన నున్న తెలుప వేడుచున్నా'

అని వినయవిధేయత లుట్టిపడ పలుకుచున్న ఆనందభైరవ యోగిని గాంచి, వీరప్పయాచార్యులు దివ్యదృష్టిం జూచి, ఆతండు శంకరుడే యని గ్రహించి "అయ్యా! మానవశరీరంబున నుండుటం జేసి, నీవిషయంబు నీవు దెలియుచుండుట లేదు. నీవు కేవలము కైలాసగిరియందుండు శంకరుండవు. నేను వైకుంఠంబుననుండు శ్రీ మహావిష్ణువను. ఇక 'బ్రహ్మ' అన్నాజయ్యా, బ్రహ్మానందులను నామంబులతో నీ భూలోకంబున జన్మించి, సన్యాసియై యున్నాడు. భూలోకంబున నీ విధముగ మనము ముగ్గురము ధర్మమును స్థాపించు నిమిత్తమై జన్మించి యున్నారము. నీవు శంకరాంశచే జన్మించినను, మానవ యోనియందు జన్మించుటవలన లోకధర్మము ననుసరించి గోహత్యాపాతకంబు ననుభవించ వలసియున్నది. అందుచే నీవు తురుష్కుండవై జన్మింపుము. ఇది నీస్వయంకృతాపరాధము. తురుష్కుండవై జన్మించినను నాకు శిష్యుడవై, బ్రహ్మజ్ఞానముకలవాడవై ప్రజాపరిపాలకుడవై ప్రసిద్ధి గాంచెదవు. దానితో నీవొనరించిన గోహత్యా పాతకంబు హరించును. మరియు నీగోహత్యా పాపంబు సర్వంబును హరించుటకు నీకొక మహామంత్రం బుపదేశంబు గావింతును" అని చెప్పి, ఆమంత్రము నీ విధముగ చెప్పనారంభించెను. "అస్య శ్రీ వీరబ్రహ్మేంద్ర మహామంత్రస్య సిద్ధి యోగీశ్వరో ఋషిః, పంక్తి శ్ఛందః పరంజ్యోతి విమల రూపిణీ పరమేశ్వరీ దేవతా" "ఓం అం బీజం. ఓం హ్రీం శక్తిః, ఓం క్రీం కీలకం; మమ ధర్మార్థ కామమోక్ష చతుర్విధపురుషార్థ సిద్ధ్యర్థం జపే వినియోగః :— కరన్యాసం కుర్యాత్.

ఓం అంగుష్ఠాభ్యాంనమః - ఐంతర్జనీభ్యాంనమః - సౌం అనామికాభ్యాంనమః - హ్రీం కనిష్ఠికాభ్యాంనమః - శ్రీం కరతల కరపృష్టాభ్యాంనమః - ఏవం హృదయాదిన్యాసః - ఓం హృదయాయనమః - ఐం శిరసేస్వాహా - క్లీం శిఖాయై వౌషట్ - సౌం కవచాయ హుం-హ్రీం నేత్రత్రయాయ వౌషట్-శ్రీం అస్త్రాయభట్ - భూర్భువస్సువరోమితి దిగ్బంధః"

అను నీ మంత్రమును సదా పఠించుచుండుము. మరియు, నీకు ద్వాదశీ మహామంత్రమును కూడ చెప్పుచున్నాను, వినుము. ఓం హ్రీం క్లీం శ్రీం శివాయ బ్రహ్మణే నమః అనెడి ద్వాదశాక్షరీ మహామంత్రమును నిత్యము జపించుచున్న యెడల సకలపాపంబులు పరిహారంబులగును. మోక్షప్రాప్తి కలుగును. మనస్సు, వాయువును ఏకముగావించి, దశవిధ నాదంబులు వినుచున్న యెడల పరబ్రహ్మ స్వరూపమును చూడనగును. ఈ మహామంత్రమును నీవు సదా జపించుచు భక్తులకుగూడ బోధించుము. ఇక నీ నిజనగరంబైన కాశీనగరంబున కేగుము" అని తెల్పిన, ఆనందభైరవయోగి వీరప్పయాచార్యులకు సాష్టాంగ నమస్కారంబు గావించి అనేకవిధంబుల బ్రస్తుతించి. హరిహర పురంబునుండి బయలుదేరి మార్గమధ్యంబున గల సింహాచలాది పుణ్యక్షేత్రంబుల సేవించుచు, కొలది దినంబులకు నిజనివాసంబైన కాశీ పట్టణంబుం జేరెను.

## వీరప్ప యాచార్యులు బనగానపల్లిలో గోపాలకుండగుట

కొలది దినముల తరువాత వీరప్ప యాచార్యులు హరిహరపురంబు నుండి బయలుదేరి మహానంది హంపి అహో

బిలము మొదలగు క్షేత్రంబుల సేవించుచు నీ గ్రామము నా గ్రామము ననక దేశంబెల్ల తిరుగుచు, నొకనాటి సాయం కాలమునకు బనగాన పల్లియను గ్రామము చేరి, తాను విశ్రమింప సరియైన తావెందును గానక, గ్రామమెల్లతిరిగి చివరకు గరిమరెడ్డి అచ్చమ్మగారు అను ఒక భక్తురాలి యింటి అరుగుపై పరుండి యుండెను.

మరునాడుదయమున అచ్చమ్మగారు గుమ్మము తుడుచుటకై బయటకువచ్చి అరుగుమీద కూర్చొని యున్న వీరప్ప యాచార్యులను జూచి "మనిషిచూడ పిచ్చివానివలె నున్నాడు, ముఖంబున బ్రహ్మతేజం బుట్టి పడుచున్నది" అని తలంచి "నాయనా! నీ వెవ్వరవు? ఇట కెందులకు వచ్చితి"వని అడుగ, అచ్చమ్మగారిని చూచి వీరప్పయాచార్యులు "తల్లీ! నన్ను పలుకరింప నెవరికిని అవసరము లేక పోయినది. నీవు మాత్రము పలుకరించితివి. నా విషయము నీకేల? అయినను నడిగితివిగాన, చెప్పుచుంటిని వినుము. నాకు ఒక యూరనునది లేదు. అన్ని గ్రామములును నావే; నాకెవ్వరును దిక్కు లేరు, ఒంటివాడను, దిక్కులేనివారిని గురించియే విచారించుచుందును. ఇక్కడకు రాకతంబేమని యడిగితివి? నాకు ఒకచోటని ఏమిటి? ఎల్లదేశంబులను తిరుగుచుందును. కాని మీవంటి వారికి సేవచేసి జీవించుచుందును." అని, చెప్పుచున్న వీరప్ప యాచార్యుల పలుకులు విని అచ్చమ్మగారు "పాపము, ఎవ్వరో పిచ్చివానివలె నున్నా"డని తనలో తాననుకొని, వారితో "ఓయీ! పోనిమ్ము. నీ వెవ్వరివైనను నాకు అవసరములేదు. నీకు అంతగ నెవరును దిక్కు లేనిచో మా యింట నుండుము. నీకు వేళకు నింతభోజనము, కట్టబట్ట

లును నిచ్చుచుందును. మాకు పశువులు గలవు. వాటిని ప్రతి దినము గ్రామమునకు సమీపముననే యున్న కొండదగ్గరకు తోలుకొనిపోయి, మేపి, తోలుకొనివచ్చు చుండు"మన విని వీరప్పయాచార్యులు "అమ్మా! ఇక నాకు కావలసిన దేమున్నది. కడుపునకు కూడును, కట్టగుడ్డయు నిచ్చెద నను చుంటివిగదా! చాలసంతోషము. ఇక నేనెందు బోవుటకును అవసరములేదు, మీయాలమందల గాయుచు మీగృహమునే కనిపెట్టుకొని యుందు"నని చెప్పి, అచ్చమ్మగారి గృహమందే యుండెను.

వీరప్పయాచార్యులు తనగృహంబునకు వచ్చినది లగాయితు అచ్చమ్మగారికి ప్రతిదినము శుభసూచకములైన స్వప్నములు అనేకములు వచ్చుచుండెను ఎందుచూచినను శుభశకునంబులే గానంబడ జొచ్చెను. ఒకనాడు అచ్చమ్మ గారు ఒంటరిగా కూర్చొని తనలో "ఈతడు మొదట నరుగు పై కూర్చొనియుండగ, నీవెవ్వరవని యడుగగా, చెప్పినజవా బులు చూడ నాకాశ్చర్యమును గలిగించుచున్నవి. ఈతని వచనంబులు రెండర్థంబులగుచున్నవి. ఏమియు తోచకున్న" దని తలంచెను.

వీరప్పయాచార్యులు ప్రతిదినము అచ్చమ్మగారి పశువు లను సమీపభూములకు దోలుకొనిపోయి వాటినన్నిటి నొక చోట నిలిపి ఆపశువుల మంద చుట్టును నొక గీటుగీసి, తానా సమీపముననున్న రసాలముకడకు బోవగా ఆచెట్టు నేలకు తాకు నట్లు వంగగా, మన ఆచార్యులు తనకు కావలసిన రసాలములు గోసుకొని కడుపార భుజించెడివాడు. అనంతర మా రసాల మెప్పటియట్లు నిలువబడును.

వీరప్పయాచార్యు లావిధముగ ప్రతిదినమును రసాలములు దినుచు సమీపముననుగల నొక కొండయందున్న గుహాలో కూర్చొని, తాటియాకులపై ముండ్లనుపయోగించి యేదియో వ్రాయుచుండెడివాడు. పాఠక మహాశయా! వీరప్పయాచార్యులు ఆవిధముగ కొండగుహాలో కూర్చొని వ్రాసిన గ్రంథమే కాలజ్ఞానము. ప్రపంచము యొక్క భవిష్యత్తు నంతయు నీ గ్రంధములో వ్రాయబడెను. అచ్చమ్మగారు ప్రతిదినమును అన్నమును మూటగట్టి వీరప్పయ్యకు గోవులను గాచుటకు పోవునప్పు డిచ్చుచుండెడిది. ఆ యన్నపుమూటను ప్రతిదినము నొక పాతరయందు వైచుచుండెడివాడు. మరియు తాను వ్రాసిన కాలజ్ఞానమును అచ్చమ్మగారి యింటిప్రక్కన నొక పాతరయందు వైచుచు, నది యెవ్వరికిని కాన్పించకుండు నట్లు నొక రాతిబండ నాపాతరపై మూతపెట్టెడివాడు. వీరప్పయాచార్యులు కాయుచున్న మందలోని పశువులన్నియు, ఒక దినముకంటె మరియొక దినము బలిసి వృద్ధియై పుష్టిగ నుండెడివి. మిగిలిన పశులకాపరులు తమ పశువులను భూములన్నియు త్రిప్పి యెంత మేపినను, అవి యన్నియు నెప్పటియట్ల బక్కచిక్కియే యుండెడివి.

ఒక దినము ఆ నా గ్రామస్థులు ఆ దారిని బోవుచు నొక చో కట్టకట్టినట్లు గుంపుగానున్న గోవులను జూచి. ఆగోవులెవ్వరివో యని, వాటిదగ్గరకు బోయి చూడగా నవియన్నియు కదలక నెమరు వేయుచు నట్లే నిలునబడియుండెను. వాటిని గ్రామములోనికి తోలుకొనిపోవుద మని ప్రయత్నించిన నవి కదలవాయెను. తరువాత వా రాపశులమందచుట్టును గీయు

బడిన గీటుదాటి లోపలకు బోవ, వారికి నేత్రములు కనబడ లేదు. వారందులకు భయపడి గోవులకు దూరముగ బోద మను ఆలోచన గలిగి మరల నా గీటుదాటి బయటకు వచ్చిన వెంటనే, వారినేత్రంబు లెప్పటియట్లు కనబడ నారంభించెను. పశువులు మాత్రము కదలక మెదలక యట్లే నిలువబడియుండెను. ఆపశువులు అచ్చమ్మగారివిగదా! ఆమె కీవిషయము తెలుపుదుమని. యూరిలోనికింబోయి ఆమె కీవిషయ మెరింగింప, నామెయు నాశ్చర్యపడి స్వయముగ తా నావిషయ మును పరీక్షింపవలయు నని పశువుల యొద్దకుం జనెను.

## అచ్చమ్మగారు వీరప్పయ్యగారి మహత్తు నెరింగి ప్రస్తుతించుట

అచ్చమ్మగారు వెంటనే పశువులున్న చోటికిం బోయి, ఆయూరివారు చెప్పినవిషయ మెంతవరకు యథార్థమో పరీక్షింపవలయు నని చూడగా, వారుచెప్పినట్లు ఆ గోవు లన్నియు గీటులోపలనే యుండెను. తరువాత వీరప్పయ్య యెచ్చటనుండెనో చూడవలయు నని, ఆ పరిసరప్రాంతముల వెదకుచు, అచ్చమ్మగారు కొండగుహయొద్దకుం బోయి చూడగా, గుహయంతయు దేదీప్యమానమై పట్టపగలుగ నుండెను. అందు వీరప్పయాచార్యులు కూర్చొని యేదియో వ్రాసుకొనుచుండుట చూచి. పలుకరించిన నేమి ప్రమాదము సంభవించునో యని, వెంటనే వెనుకకు మరలి యింటికిం బోయెను.

సాయంకాలమగు సరికి వీరప్పయాచార్య లెప్పటి యట్ల వ్రాత ముగించుకొని, ఆలమందనుదోలుకొని గృహంబు

నకు వచ్చిన వెంటనే, అచ్చమ్మగారు వీరప్పయాచార్యులకు సాష్టాంగ నమస్కారంబు గావించి "మహాత్మా! నాతప్పులు క్షమించి, నన్ను రక్షింపుము. ఇంతవరకు నీవెవ్వరివో తెలుసుకొనలేక చేసిన యపరాధము క్షమింపు"మని వేడ "తల్లీ! నన్ను నీవింతగా బ్రతిమాలవలసిన యవసరమేము న్నది? నీవు నాకొనరించిన యుపచారమేదియునులేదే! దిక్కు లేనివాడ నని తెల్పినంతనే, నన్ను ఆదరించి పోషించుచుం టివిగదా! అదియునుగాక నిన్ను రక్షింప నేనెంతటివాడను? నీవో ధనికురాలవు. నీయొద్ద సేవకావృత్తి చేసుకొని జీవించు చున్న నేను నిన్ను రక్షించుటా! నీ మాటలు కడుంగడు విపరీతంబులై తోచుచున్నవి" అని విని 'మహాప్రభూ! జగన్నాటక సూత్రధారీ! అజ్ఞానినైన నన్నింకను పరీక్షింప న్యాయమా! అబలను! ఈజరామరణప్రవాహంబునం బడి యీదులాడుచున్న మూఢురాలనైననాకు జ్ఞానోపదేశంబు గావించి తరింపజేయవా?" అని బహుభంగుల దీనాలాపంబు లాడుచున్న భక్తురాలిం గాంచి, భక్తవరదుండు గావున "అమ్మా! నన్నింతగా వేడనవసరములేదు. అయినను నీవు కోరినట్లు నీకు తప్పక జ్ఞానోపదేశంబు గావించెదను. కాని యిది తగిన స్థలముగాదు. రేపే మనము బయలుదేరి యాగంటి క్షేత్రంబునకు బోవుదము. నీకక్కడ జ్ఞానోపదేశంబు గావించి, సందేహంబులనెల్ల దీర్చెద"నని పల్కెను.

## వీరప్పయ్యగారు యాగంటి క్షేత్రమున అచ్చమ్మగారికి జ్ఞానోపదేశంబు గావించుట

మరుచటిదినమున సూర్యోదయమునకు పూర్వమే వీరప్పయాచార్యుల వారును, అచ్చమ్మగారును కలసి యాగంటి

క్షేత్రమునకు పయనమై పోయిరి. అచ్చట యాగంటీశ్వరుని సేవించి, దాపుననేయున్న నొకకొండపై కెక్కి, నిర్జన ప్రదేశంబున గూర్చుండిరి. అనంతరము అచ్చమ్మగారు వీరప్పయాచార్యుల వారిపాదంబులకు నమస్కరించి "స్వామీ! నాకు బ్రహ్మజ్ఞానోపదేశంబు గావించి, యీ జన్మ తరించు సాధనోపాయంబు తెల్పుమా" యని వేడ, వీరప్పయాచార్యులు ఆమెతో "తల్లీ! నీవు పరమసాధ్వివి, నీవు పూర్వ జన్మమునందు గావించిన తపః ఫలితంబువలన నేను నీ గృహంబునందు సేవకుండనైతిని. నీవు ధన్యురాలవైతివి. మహాపతివ్రతవుగావున నన్ను తెలుసుకొన గలిగితివి. నీభక్తివిశేషంబుల కెంతయు నానందించితిని. "ఓం నమశ్శివాయ" అను పంచాక్షరీ మంత్రంబును జపించుచుండుము. నీకు తప్పక మోక్షము లభించును. "ఓం" అను శబ్దమునుండియే యీ ప్రకృతి ప్రపంచమంతయు నుద్భవించినది. 'ఓం' అను ప్రణవశబ్దము నుండి ఆకాశమును, దానినుండి వాయువును, వాయువునుండి యగ్నియు, నగ్నినుండి తేజమును పుట్టెను. మరియు జలము నుండి పృథ్వియు, దానినుండి ఓషధులును, ఓషధులవలన పంచభూతాత్మకంబగు జలభూచరాదులైన యెనుబదినాలుగు లక్షలరూపభేదంబులు గలిగిన ప్రాణులను జన్మించెను. అట్టి ప్రాణికోటియందు మానవజన్మమే శ్రేష్టమైనది. ఈ జన్మయందే ప్రాణి తరించుటకు ప్రయత్నములుగావింపవలయును. ఆత్మజ్ఞానసంపన్నులు తమ శీలాదులచే పరమేశ్వరునిలో లీనంబగుచుందురు. ఆరీతిగ పరమేశ్వరసాన్నిధ్యమును బొందుటకు మార్గము పంచాక్షరీ మంత్రము దప్ప వేరొకటి లేదు. 'ఓం'- అన ఓంకారశబ్దమునుండి పుట్టిన యీప్రపంచము, న-అన

లేని కాలమున, మహాయన ప్రకాశకుండైన పరబ్రహ్మస్వరూప మొక్కటియే కలదు. అట్టిపరబ్రహ్మ స్వరూపమే 'శివం' అన శాశ్వతమైనదని యెఱుంగుము. మరియు "ఓం హ్రీం క్లీం శ్రీం శివాయ బ్రహ్మణే నమః" అను ద్వాదశాక్షరి మంత్రము యొక్క ప్రభావము అనంతమైనది. అందుచే నీ ద్వాదశాక్షరీ మహామంత్రమును గూడ నిశ్చలభక్తితో స్మరించుచుండుము. దానివలన నీజన్మ తప్పక తరించు"నని, చెప్పుచున్న ఆచార్యులతో అచ్చమ్మగారు "మహాత్మా! బనగానపల్లి దగ్గర కొండ గుహలో కూర్చుని తాము వ్రాసిన గ్రంథ రహస్యములను గూడ తెలుప గోరుచున్నా"నని వేడగా, ఆయన అచ్చమ్మ గారితో "తల్లీ! నేనా గుహలో కూర్చొని వ్రాసినగ్రంథము కాలజ్ఞానము. అందలి విషయంబులు దేశరహస్యంబులు. భవిష్యత్కాలము నందలి విషయంబు లన్నియు నల్పజ్ఞానసంపన్నులైన యీ కలియుగము నందలి మానవులు తెలుసుకొనునట్లుగ వ్రాసితిని. నీవును బ్రహ్మజ్ఞాన సంపన్నురాలవు గావున, నీ కాగ్రంథ రహస్యంబుల వెల్లడించు చున్నాను" అని ఆమె కీవిధంబున చెప్పదొడంగెను.

## వీరప్పయాచార్యులవారు అచ్చమ్మగారికి కాలజ్ఞానము తెలుపుట

"మాతా! కాలజ్ఞాన గ్రంథరహస్యంబులను దెలుపుచున్నాను. శ్రద్ధగ వినుము.

శ్లో॥ కలౌ పాపిని సంప్రాప్తే ధర్మభ్రష్టో భవిష్యతి।
యాతే త్వబ్దసహస్రాణాం పంచకే పాపినో జనాః॥

చండాలంప్రచురం యాంతి యాంతిబ్రహ్మతీర్ణోబేః బుద్ధిభ్రంశో ద్విజాతీనాం వేదకర్మాది సంక్షయః॥

శ్లో॥ ప్రభవ పార్థివమధ్యేషు బహుప్రళయ నిశ్చయమ్,
అనంతరే అనంత్యమధ్యే......రక్తపాతౌ రణారంభ
భూమే, భీభత్సా ప్రపంచస్థితిః॥

శ్లో॥ శతా త్వబ్ద సహస్రాణి యావత్పంచ గతానిచ?
ధర్మోనష్టః కర్మనష్టో జాతో భూద్వర్ణ సంకరః॥

శ్లో॥ బహూన్యదృష్ట పూర్వాణి శిల్పాని వివిధానిచ,
చతుర్దశాబ్ద దుర్భిక్షం మహామారి సముద్భవం॥

శ్లో॥ అసత్యం పతు పాతంచ నిర్మలాత్మంచ వంచకః।
జ్ఞానద్రోహి శ్రుతిద్రోహి నమే తేబ్రహ్మంచపాతకః॥

శ్లో॥ శాస్త్రాశ్చ పార్థివాశ్చ శిష్టాచార వినాశనం.
సూర్యాదిగ్రహ గోళానాం గతివైవవ్య సంభవః॥
గంగా మహత్వ హానిశ్చ శూద్రోపనయనాదికం।
కుండగోళక సంతానం మద్యమాంస పరిగ్రహం।
శివ కేశవనిందాచ శ్రద్ధాదీనాం విపర్యయః॥

శ్లో॥ ఆచార్యకుదు ధిక్కారం పురోహిత వివర్జనం!
పరనిందా పరస్వత్వం పరదారాపరిగ్రహః
స్త్రీణాంపునర్వి వాహాశ్చ శూద్రాసన్యాసలక్షణం।
దేవతామహిమాలోపో వేదాధ్యయన లక్షణం
వర్ధతాంమంత్రి తంత్రాణాంమదవాద దురగ్రహః।
సముద్రయానం విప్రాణాం కలిదోషాద్భ విష్యతి॥

ఈ కలియుగంబున 4808 సంవత్సరములు గడచిన పిమ్మట ధర్మమునశించును. ధర్మదేవత భూలోకమునందు పుణ్యస్థలములో మాత్రమే యుండును. అసత్యము వృద్ధియగును. పక్షపాతము హెచ్చును. జ్ఞానశూన్యులు, శ్రుతిద్రోహులు జన్మింతురు. పంచమహాపాతకములు వృద్ధియగును. శిష్టాచారములు అడుగంటును. సూర్యాది గ్రహములు గతులు తప్పును. ప్రజలలో కలహములు సంభవించి ఒకరి నొకరు కొట్టుకొని చత్తురు. గంగానదీ మహాత్మ్యము నశించును. శూద్రులు ఉపనయనాదులు చేసుకొందురు. శివ కేశవులు నిందింపబడుదురు. పరదారాపహరణము వృద్ధి యగును. స్త్రీలు పునర్వివాహము చేసుకొందురు. శూద్రులు సన్యాసలక్షణములు కలిగియుందురు. దేవతలయందు మహిమ నశించును. మంత్రతంత్రములలో శక్తిసన్నగిల్లును. బ్రాహ్మణులు సముద్ర ప్రయాణమును మాంసభక్షణను గావింతురు. ధర్మము నశించును. కర్మలయందు నమ్మకము తగ్గిపోవును. వర్ణసంకరము కలుగును. మహాభయంకరముగ కరువులు వచ్చును. మహామారులు చెలరేగును. ప్రజలు బలహీనులగుదురు, నీళ్ళలో స్త్రీలు యాలలు పాడుదురు. ఆస్త్రీలకన్నులర క్తముకారును. తండ్రియని, తమ్ముడని గానక స్త్రీలు విరహవేదనచే వావివరుసలులేక నడతురు. అర్ధరాత్రి సమయంబున సూర్యుడు గానంబడును. అప్పుడు ఆకాశంబు నెఱ్ఱనగును. ఇంద్రకీలాద్రి పర్వతంబున తొమ్మిదిమూరల స్త్రీయుద్భవించి పాపపునరులనుబట్టి తలల కోయును. తొమ్మిదిమూరలుగల ఆజానుబాహువులు వచ్చి శత్రువులను వరుసగ ఖండించును. పల్నాటిసీమలోభద్ర మహాంకాళిపుట్టి పల్లెలు పట్నాలు పాడుచేయును.వింతవింతలు

గల్గును. విపరీతజనులందరు విజయంబగుదురు. రాజాధిరాజులు వారిలో వారు కలహంబులు పెంచుకొని రణరంగంబునకు రాదు. ఊర నార నొకశక్తివచ్చి మాపటివేళల మేకపోతరచినట్లు అరచును. అందున కొందరు నశింతురు. తిరుపతికొండనుండి ధూమకేతువువలె నొకశక్తివచ్చి మట్టమధ్యాహ్నము ఆకాశమునుండి దామికి పాతాళగంగకు స్నానంబునకై వెళ్ళును. అప్పుడు మార్గములోని జనులందరు అదరిబెదరి బహుగా చత్తురు, అప్పుడు ఉత్తర మురిమి దక్షిణము మెరసి ఎండ వెన్నెలతో సమంబగును. బెంగుళూరులో బహువింతయైన చోద్యంబు గల్గును. ఇందుకుగుర్తు ఏమన? శుద్ధవిదియనాడురుములతో పిడుగులు పడును. వాటివెంబడి నాలుగు నిమువ్రల ఆజాను బాహువులు వత్తురు. వారి అడుగులు మనయడుగులతో నేడడుగు లుండును. అప్పుడు మానవులందరు తల్లుల ముఖములు పిల్లలు, పిల్లలముఖములు తల్లులు చూడకుండా ఉత్తరముగా పోదురు. తల్లీ! ఇట్టి వింతలన్నియు నేనేవీరభోగ వసంత రాయుడనై వచ్చువరకు జరుగుచుండును. నాభక్తులైన వారిని రక్షించి మోక్షము కలుగజేయుదును. నాయందు భక్తివిశ్వాసములు గలవారికిని, కాలజ్ఞానమును భక్తితో పూజించుచుపఠించువారికిని, ఎట్టియాపదలును కలుగవు. కాలజ్ఞానము చదువువారికి అష్టైశ్వర్యములు సమకూడును. ఇవియున్నియు పరమరహస్యములు. నీవు భక్తురాలవి గనుక, నీకు నేను తెలియజేసితిని" అని చెప్పగా అచ్చమ్మగారు విని సంతోషించి "స్వామీ! యిక మనగృహంబునకుం బోవుదము" యన్నని వీరప్పయాచార్యుల వారిని వెంటబెట్టుకొని బనగానపల్లె చేరెను.

వీరిరువురును బనగానపల్లి దగ్గరనున్న కొండపై కూర్చొని వేదాంత విషయములను ముచ్చటించు చుండెడివారు. అందు వలన ఆకొండ యిప్పటికిని "ముచ్చట్లకొండ" యనుపేరుతో పిలువ బడుచున్నది. వీరప్పయాచార్యులవారు తాను వ్రాసిన కాలజ్ఞాన గ్రంథమంతయు అచ్చమ్మగారి యింటిప్రక్కనున్న నొక గోతిలో వేయుచుండెడివారు. అదియొక పాతరగ తయారైనది. ఆపాతరపై నొక బండమూత బెట్టుచుండెడివారు. కొంత కాలమునకు ఆపాతరపై నొక చింతచెట్టు మొలచెను. అనంతరము అచ్చమ్మగారు లోకవ్యవహారంబులను పరిత్యజించి, సన్యసించి, స్వామి సేవచేయుచు కాలముగడుపనారంభించెను. అచ్చమ్మగారు స్వామికి ఏకాంత మఠమును కట్టించెను. వారిరువును ఆమఠములో కూర్చొని వేదాంతచర్చలు గావించుచు తపంబాచరించు చుండెడివారు.

## చింతచెట్టుయొక్క మాహాత్మ్యము

కొంతకాలమునకు వీరప్పయాచార్యులు వారు వ్రాసిన పదునాలుగువేల కాలజ్ఞానతత్వములుగల తాటియాకుల గ్రంథముంచిన పాతరపై నొక చింతచెట్టు మొలచెను. ఇప్పటికిని ఆ చెట్టు అక్కడనే కలదు. 700 సంవత్సరముల నుండియు నేటివరకు ఆ చెట్టు ఆవిధముగనే యున్నది. అది సుమారు ఇరువది గజముల యెత్తు కలిగి రెండుపంగలుగ నుండును. చెట్టు మొదలు సుమారు నాలుగడుగుల లావుండును. దానికాయలు లోపల కాటుకదేరినట్లు యుండును. అందుచే నాకాయల నెవరును తినుటలేదు. ప్రపంచమున నేదైన విపరీతంబులు సంభవించుటకు ముందు దానిపంగలలో నుండి రక్తముకారు నొక

ద్రవముకారుటకు మొదలు పెట్టును. చెట్టున గలపూత ఒకక్క దినములో పూర్తిగ రాలిపోవును. ఇట్టి దృష్టాంత మిప్పటికిని కనబడుచునే యున్నది. ఆ చెట్టునకు నేటికిని ధూపదీపనైవేద్యములు నిత్యమును జరుగుచునే యున్నవి.

ద్వితీయ ప్రకరణము సమాప్తము.

# తృతీయ ప్రకరణము

## ఈశ్వరాంశ సంభూతుండైన అన్నాజయ్యగారు వీరప్ప యాచార్యులవారిని కలుసుకొనుట

ఆవిధముగ వీరప్ప యాచార్యులవారు అచ్చమ్మగారు కట్టించిన లోమండపమునందే యుండి లోకమాయలందగిలి అజ్ఞానాంధకారమున చరించుచున్న జనులకు జ్ఞానోపదేశము గావించుచుండెను. అంత అచ్చమ్మగారు ఒకదినమున స్వామికి పాదసేవ జేయుచు "తండ్రీ! లేక లేక నాకొక పుత్రుడు కలిగెను. మాదురదృష్టవశంబుచే నతనికి కన్నులు గనబడుచుండుటలేదు. నాపై ననుగ్రహించి నా తనయునకు దృష్టికలుగు నుపాయమేదిమైన తెల్పరే"యనివేడ వీరప్ప యాచార్యులు "తల్లీ! యిన్నిదినంబులు నాకా విషయంబు దెలుపకుంటివేమి? రేపు నేను జపము చేసుకొను సమయమున నీ తనయుని తీసుకొని రమ్ము. నీ కుమారునకుదృష్టిలభించు యోగంబుకలదు" అనిచెప్పెను.

అంతట ఈశ్వరాంశ సంభూతుండైన అన్నాజయ్య గారు ఇలగల సమస్త పుణ్యక్షేత్రంబులు సేవించుచు, ఒకదినమున మార్గమధ్యంబున బనగానపల్లి చేరుకొనెను. బనగానపల్లియందు నెవరో స్వాములవారున్నారని తెలుసుకొని, ఆయన వీగప్పయాచార్యునికివాక్యంబువలన తెలుసుకొని, అచ్చమ్మగారి యింటికివచ్చెను. లోమండపములో కాలజ్ఞానమును వ్రాయుచున్న స్వాములవారివద్దకు బోయి సాష్టాంగ నమస్కారము గావించి చూచి, తనలో "ఆహా! ఈదివ్య పురుషుం డెవ్వరై యుండునోకదా! ఈయన తేజో విలాసంబులు గమనించిన సామాన్యుడుగాడని తోచుచున్నది. నేడొక సుదినము"అని, స్వామితో నీవిధముగ తెలుప నారంభించెను. "స్వామీ! నేను విశ్వబ్రాహ్మణ కులమునందు జన్మించిన బాలకుడను. నాకు మొదట తల్లిదండ్రులు అన్నాజయ్య అని పేరు పెట్టిరి. కాని నేను సంసారసుఖములరోసి సన్యాసినై బ్రహ్మజ్ఞానమును పొందవలయునని ప్రయత్నించు చుండుటచేనన్ను ప్రజలందరు "బ్రహ్మానందు"డని పిలువ నారంభించిరి. తనువు అనిత్యమని యెరింగి, నిరతము ముకుంద పాదారవిందముల సేవించుచు, సన్యసించి దేశాటనంబు గావించుచు, తమవంటి మహానుభావుల దర్శనముచేయుచు, "పునరపి జననం, పునరపి మరణం,' అను జననమరణ ప్రవాహమునుండి వెలువడు టెట్లాయని, కృషిసలుపుచున్నవాడ. నేటికి నాభాగ్యవశంబుచే తమ దర్శనంబు లభించెను. నాజీవితము ధన్యతగాంచినది, తాము వ్రాయుచున్న గ్రంథమేదో తెలిపి, అనంతర మీజన్మతరించుటకు జ్ఞానోపదేశంబు గావింప వేడు

చున్నాడ''నని ప్రార్థించుచున్న అన్నాజయ్యను గాంచి, స్వామి తనదివ్యదృష్టినిచూచి "ఓహో! ఈతడే బ్రహ్మాంశ సంభూతుండైన అన్నాజయ్య. వెతుక బోయిన తీగకాళ్ళకు తగిలినట్లయ్యెను." అని తనమనంబున నిశ్చయించుకొని, అన్నాజయ్యతో "నాయనా! నేను వ్రాయుచున్న గ్రంథము కాలజ్ఞానము. ప్రపంచము యొక్క రీతి ఏవిధముగ నుండునో, యీగ్రంథమున వ్రాయుచున్నాను. మూఢు లీగ్రంథమును చూచి హేళన చేయుచుందురు. నీవు ఇందలి రహస్యములు తెలుసుకొన సమర్థుడవని నాకు తెలుసు, ఈ ప్రపంచ మాయ యందుబడి నన్ను తెలుసుకొనలేక పోవుచున్నావు. కాలజ్ఞాన రహస్యంబులు తెలుపుమని కోరితివిగనుక, నీకీగ్రంథ విషయం బుల తొలుదొలుత నెరింగించెద. సావధాన చిత్తుండవై యా కర్ణింపు''మని యీ క్రిందివిధంబున చెప్పందొడంగెను.

## వీరప్పయాచార్యులవారు, అన్నాజయ్యకు కాలజానరహస్య ములు దెలిపి, జ్ఞానోపదేశంబు గావించుట

"అన్నాజయ్యా! కాలజ్ఞాన గ్రంథ రహస్యంబుల దెలుపుచున్నాను వినుము. అనాచారవర్తనులకు నీగ్రంథము అసత్యమై తోచును. పుణ్యాత్ములకిది వేదము వంటిది. ఇందలి రహస్యములను తెలుసుకొనుటకు నందరు సమర్థులుగారు. గ్రంథ మును ప్రతిదినము భక్తిశ్రద్ధలతో చదువువారికి మోక్షము సులభముగ లభించును. ఈ కలియుగంబున ముందు ననేక విపరీతంబులు కలుగనున్నవి. మత కలహములు హెచ్చు

పెరుగును. అట్టికలహములవలన చాలమంది కొట్టుకొనిచత్తురు. భూలోకమంతయు ప్రళయములతో నిండియుండును. కాలమానపరిస్థితులు క్షణక్షణము మారుచుండును. పల్లెలుపట్టణంబులగును. పట్టణంబులు పల్లెలగును. తక్కువ నాణ్యము చెల్లును. మేకపోతు వృషణములకుచన్నులుబుట్టి పాలుపితుకును. ఏనుగుగుఱ్ఱాల అవయవంబులలో నెత్తురు గురియును. కొన్ని ప్రదేశంబులలో నగ్ని కురియును. సకలజాతి దొరలు కలహములచే హతమగుదురు. ఘోరయుద్ధము సంప్రాప్తంబగును. చచ్చినవారికి ఏడ్చువారు లేకపోదురు; 360 వ్యాధులగయును. వైద్యము పారకపోవును. ఒక్కమగవానిని పదుగురు స్త్రీలు వెంబడింతురు. అప్పుడు మానవులకు వింతవింతలగుగుణంబులు పుట్టును. వివాహితమున ఒకవింత పుట్టును. అప్పుడు ప్రజలకు కాలజ్ఞానమహత్తు తెలియును. అప్పుడు కంది మల్లయ్యపల్లి ఆరామడపట్నంబగును. నవగ్రహముల నడకలుమారును. బాపల పంచాంగములు పనికిమాలినవై పోవును. నాస్తిక వాదులు నానాదిక్కుల చెలరేగుదురు. వడగండ్లవానలు విశేషముగ గురియును. మూడుతోకలుగల చుక్కలు భూలోకమున తూర్పున నుదయించును. అప్పుడనేక గ్రామంబులు కాలిపోవును. అప్పుడు ప్రపంచమున నాకీర్తి విస్తారంబగును. మసిపాత మాడకమ్మును: పోకకు పుట్టెడు బియ్య మమ్మును. దొమ్మరులు దొరలగుదురు, ఉల్లిగడ్డ కొకగురువునచ్చును; చోరులు వృద్ధియగుదురు. వారినివిచారించువారలేకపోవుదురు. గ్రామగ్రామముననొకశక్తిపుట్టును. అందుచే ప్రపంచమంతయు తల్లడిల్లిపోవును. అర్ధరాత్రి మేక

పోతుకూయును. అందునకొందరు చత్తురు. ఒకేసారిపదునెనిమిది పట్నాలుకొల్ల బోవును. గాజుపూసలు గణగణ వణకును. లక్ష్మి దేవిదుఃఖించును. తిరుపతికొండమీదనుండి ధూమకేతువు నొక శక్తివచ్చి మట్టమధ్యాహ్నము ఆకాశము మీదనుండిదుమికి స్నానమునకు పాతాళగంగకు బోవును. అందున మార్గమందలి జనులు కూడలి పెద్దగచత్తురు. రాజాధిరాజు లందరు తమలో తాము కలహంబులు పెంచుకొని రణరంగంబున కూలుదురు. నాయనా! అన్నాజయ్యా! ఇట్లు ప్రపంచంబున నెన్నియో విపరీతంబులు పుట్టును. నాకాలజ్ఞానమును నిత్యము ఎవరు చదువుచుందురో, ఎవరు వినుచుందురో, ఎవరు పూజించుచుందురో, వారికి మాత్ర మెట్టిహానియు కలుగక యిహపరంబుల సౌఖ్యము కలుగును. నేను వచ్చునంతలో భూలోకంబున నీరీతిగ వింతలెన్నియో పుట్టును. ఇదియే నీకు గుర్తు. అన్నాజయ్యా! నీవు సామాన్యుడవుగావు. భూలోకము నుద్ధరింప యవతరించిన బ్రహ్మావతారుండవు. నేను మహావిష్ణువను. శంకరులవారు ఆనందభైరవయోగిమై జన్మించియున్నాడు. నేను కొద్దికాలములో నీ వీరప్పయాచార్యుల నామము వదలి "వీరబ్రహ్మం" అనునామంబుతో వెలయుదును. కనుక నేను చెప్పిన యీభవిష్యత్తును మరువక, యీలోమఠంబున అచ్చబ్రహ్మంగారును నీవునుండుడు. 'ఓం నమోనారాయణాయ' అను అష్టాక్షరీ మహామంత్రమును, "ఓం నమశ్శివాయ" అను షడక్షరీ మహా మంత్రమును, సదా జపించుచుందుము. దానం జేసి నీవు అవతరించిన కార్యంబు నెరవేరుటయేగాక, యీభూలోకం

బున ప్రజలకు శుభంబు కలుగును." అని తెలిపిన విని, అన్నా జయ్య వీరప్పయాచార్యుల వారిని అనేకవిధంబుల బ్రస్తు తించెను.

## వీరప్పయాచార్యులువారు అచ్చమ్మగారి కుమారునకు అంధత్వము బోగొట్టుట

మఱుచటి దినము నుదయమున వీరప్పయాచార్యుల వారు జపము పూర్తిచేసుకొని కూర్చొని యుండగా, గరిమ రెడ్డి అచ్చమ్మగారు తన కుమారుని తీసుకొనివచ్చి "స్వామీ! యితడే నాపుత్రుడు. శాంతస్వభావము కలవాడు. బాల్య ములో నేత్రములు బాగుగానే కనబడియెడివి. తరువాత జబ్బు చేసి, దృష్టి పూర్తిగ పోయినది. దయతో నాతనయునికి దృష్టిలభించు విధానంబు తెలుపరే" అని దీనాలాపంబులాడు చున్న అచ్చమ్మగారితో స్వామి "తల్లీ! నీతనయునకు తప్పక దృష్టిలభించును" అని చెప్పి తనహస్తంబుల బ్రహ్మానందరెడ్డి నేత్రంబులపైనుంచి తుడుచుచు "నాయనా! నీ నేత్రములను కొంచెముసేపు మూసుకొని తరువాత తెరచి చూడుము" అని చెప్ప, అతండావిధంబుగ కొంతతడవు కన్నుల మూసికొని పిదప తెరవగా, వానినేత్రంబులు ఎప్పటియట్ల గానంబడ జొచ్చెను. అంత బ్రహ్మానందరెడ్డి అపరిమితానందంబు నొందుచు, స్వాములవారిననేకరీతుల బ్రస్తుతించుచు, సాష్టాంగ దండప్రణామంబు లాచరించి "లోకరక్షకా! నీవు సామాన్యుడవు గావు. మమ్ముల నుద్ధరింప మాగృహంబున కరుదెంచిన లోకరక్షకుండవు. అజ్ఞానులమైన మాయపరా ధంబులసైచి కటాక్షింపవే! భక్తవరదా! ఇక మాజీవిత

శేషంబుల తమసేవజేయుచు గడపువార”మని బహు భంగుల బ్రస్తుతించుచున్న బ్రహ్మానందరెడ్డినిగాంచి, స్వాములవారు “నాయనా! పూర్వజన్మంబున నొక పక్షి నేత్రములకు విఘాతంబు గావించితివి. దానం జేసి నీకీజన్మంబుననిట్టికష్టంబు సంభవించినది. అయినను నీవు పూర్వజన్మములో చేసిన ప్రజోపకారముల వలనను, సాధుసజ్జన సేవవలనను, మరల దృష్టిలాభంబు కలిగె. కనుక నికపాపభీతికలవాడవై, దానధర్మపరోపకారాదిసత్కార్యముల నాచరించుచు, భూతదయాతత్పరుండవై, ఓర్పును శాంతమును గలిగి, అజ్ఞానులై సంచరించుచున్న మానవకోటికి జ్ఞానోపదేశంబు గావించుచు, మీఅమ్మగారును నీవును అన్నాజయ్యయు నీమఠంబున సుఖంబుగ నుండుడు. సమస్తప్రజల నాదరించుచు, నామూలుగ నీమఠంబున నొకలింగంబును ప్రతిష్ట గావించి, అంత్యమున విష్ణులోకంబును పొందుడు. నేనిక నిచ్చట కొలదిదినములు మాత్రమే యుందును. నాజీవితరహస్యం బెరిగించుచున్నాను, వినుము. నేనీ యవతారమున మూడునామములు గలిగియుందును, బాల్యమున పదునాలుగు సంవత్సరములు వచ్చువరకు నన్ను వీరంభొట్లయ్య యనునామంబున పిలుచుచుండెడివారు, తరువాత నిప్పుడు వీరప్పయాచార్యులను నామంబుచే పిలువబడుచున్నాను. ముందు “వీరబ్రహ్మం” అను నామంబుతో పిలువబడుదును. వీరంభొట్లయ్య యని పిలువబడినప్పుడు సందికొండ యను గ్రామంబున పాపాఘ్నిమఠంబున నుంటిని. ఈబనగానపల్లిలో నున్నంతకాలము వీరప్పయాచారినై మీ యమ్మగారు కట్టించిన లోమఠంబున నుంటిని. ఇకముందు కంది

మల్లయ్య పల్లియను గ్రామంబును చేరుదును. అచ్చట "వీర బ్రహ్మం" అను నామంబుతో కాలజ్ఞానమహాత్మ్యమును దెలిపి, ప్రజలకు జ్ఞానోపదేశంబుగావించి, భూలోకంబునతిరిగి ధర్మము నెలకొల్పి, భూభారంబు తగ్గింపవలసి యున్నది. ఈరీతిగ స్థల త్రయంబున నామత్రయంబుచే విలసిల్లుచుందును. ఈచతుర్దశ భువనంబులందును నన్నెవ్వరును తెలుసుకొనలేరు. నేను మాత్రము ప్రతిప్రాణి యొక్క మనసూచారంబుల విచారించుచుందును." అనిచెప్ప వారందరును విని సంతసించి, ఆమఠము నందేయుండి స్వామిపాదసేవ చేయుచుండిరి.

## బ్రహ్మానందరెడ్డికి స్వామిఅనుగ్రహముచేత నేత్రములు వచ్చినవని తెలుసుకొని బనగానపల్లెలోని వారందరు స్వాములవారికి భక్తులగుట

అనంతరము స్వాములవారి యనుగ్రహముచే అచ్చమ్మగారి కుమారుడైన బ్రహ్మానందరెడ్డికి పోయిన నేత్రములు తిరిగివచ్చిన వనువిషయము నూరంతయు పొక్కిపోయినది. ప్రజలు గుంపులు గుంపులుగ మఠమునకువచ్చి బ్రహ్మానంద రెడ్డిని వింతగ చూడసాగిరి. ఈవిషయము పరిసర గ్రామములకు కూడ ప్రాకిపోయినది. ఇక రేయింబవల్లు ఆవింతను చూచుటకు జను లరుదెంచి బ్రహ్మానందరెడ్డిని జూచుటయు, అనంతరము స్వాములవారికి సాష్టాంగ నమస్కారములు గావించి ఫల పుష్పాదికాను కర్పించుటయు, మొదలగు కార్యములతో విశ్రాంతి విరామము లేకుండెను. అచ్చమ్మగారు కట్టించిన లోమఠము

నేడు వైకుంఠంబువలె నున్నది. అచ్చమ్మగారి జీవితము ధన్యత గాంచినది. వైకుంఠధాముడు భక్తులకు సేవకుడే కదా!

ఈయుదంతంబు ఆనోటనానోటనుండి చివరకు బనగానపల్లి నవాబుదగ్గరకు చేరినది. అప్పటిబనగానపల్లి నవాబు ఉత్తముడు. శాంతస్వభావము కలవాడు. నవాబు ఈవిశేషమును బాగుగవినినవాడై "నేనుపరిపాలించు నీబనగానపల్లెలో నిక్కముగ అంతటి మహానుభావు డుండెనా?" అని ఆశ్చర్యపడుచు సంతోషించి, 'అయినను చూత'మని సేవకుల బిలచి "ఓయీ! మీరు వెంటనే అచ్చమ్మగారి మఠమునకుబోయి నేను రమ్మంటినని చెప్పి, ఆస్వామినిటకు తీసుకొని రం"డని ఆజ్ఞాపించెను. ఆసేవకులు నవాబు ఆజ్ఞానుసారము అచ్చమ్మగారి లోమఠమునకు వచ్చి, వీరప్పయాచార్యులను జూచి "స్వామీ! తమమహాత్మ్యమును తెలుసుకొని, మా నవాబుగారు మిమ్ములను రమ్మని చెప్పిరి. కనుక ఒకపర్యాయము దయచేయు"డని చెప్పగా స్వాములవారు "ఓయీ! నాదగ్గర ఎట్టి మహాత్మ్యమునులేదే! ఊరక రమ్మనుట యెందులకు? అయినను రేపు ఉదయము వత్తునని చెప్పు"డని చెప్పగా వారు తిరిగి నవాబుదగ్గరకుబోయి ఆ విషయము చెప్పిరి. అది విని నవాబు 'ఓయీ! రమ్మనమని కబురుచేసి ఎందులకు ఏమైన ఆగ్రహముగ మాటలాడెనా?" యని యడుగ "సర్కార్! మేము వెళ్ళి, మీరు రమ్మనమని రని చెప్పగా కొంచెముసేపాలోచించి, తరువాత రేపు ఉదయము వత్తునని చెప్పె"నని ఆసేవకులు తెల్పిరి. అంత నవాబు వారితో "రేపు ఉదయము పాలకీ బాగుగ నలంకరించి ఆపాలకి తీసుకొని

వెళ్ళి, వీరప్పయాచార్యులవారిని అందు కూర్చుండబెట్టుకొని
రం"డని చెప్పెను.

## బనగానపల్లి నవాబు స్వాములవారిని పరీక్షించుట

మరుచటిదినము ఉదయమున నవాబుసేవకులు బాగుగ నలంకరించిన పల్లకీ నొకదానిని తీసుకొనివెళ్ళి, వీరప్ప యాచార్యులవారి నందు గూర్చుండబెట్టుకొని, నవాబు దర్బారునకు తీసుకొనివచ్చిరి. స్వాములవారిని దర్శింపవలయునని వీధులలో జనులు బారులుతీరి నిలువబడియుండిరి. స్వాములవారిని నవా బెట్టి చిక్కులు పెట్టునో యని జనులు అనుమానము చెందసాగిరి.

నవాబు సింహాసనమును దిగి స్వామికి నెదురేగి గౌరవ
నికిందీసుకొనివచ్చి ఉచితాసనమున గూర్చుండ
ి, సలాములు జేసి,కుశలప్రశ్నల గావించి "స్వామీ!
భాగ్యము కలిగినందున నేడొకసుదినము. తమరు
జ్ఞానసంపన్ను లని విని సంతసించితిని. తమవంటివారు
గరమునందుండుట తలప,మాపూర్వజన్మ పుణ్య ఫలమే
! తమ యట్టి ప్రజ్ఞాసంపన్నులకు మేమేమి సహాయము
గలము. తమ కరస్పర్శన మాత్రంబుచేత నే బ్రహ్మానంద
నంధత్వముపోయి దృష్టిలభించినదనియు, అంతియేగాక
తరము తాము మారాజ్యమందలి ప్రజలకు జ్ఞానోపదేశము
రుచున్నారనియు వినిననాటనోలె, తమదర్శనంబు గావింప
యునని నాహృదయం బువ్విళ్లూరుచున్నది. తమవంటి
రి సేవయే మాకు పరమావధి. మాకోరిక దీర్ప మీరిందుల
దెంచినందులకు మాకృతజ్ఞతా పూర్వక వందనములు.

ఈదినము నాగృహమున మే మొసంగు నాతిథ్యమును స్వీక రించి, మమ్మానందింపజేయ గోరుచున్నా''నని భక్తిరసం బుట్టిపడ పలుకుచున్న నవాబునుగాంచి, వీరప్పయాచార్యులు ''బిడ్డా! మాయందు నీకుగలభక్తి విశ్వాసముల కెంతయు సంతోషము. నీకోరిక ప్రకారము నీగృహంబున నాతిథ్యము స్వీకరింతు''నని చెప్పగా నవాబు స్వామి శక్తిసామర్థ్యంబులు పరీక్షింపవలయునని మాంసభక్ష్యాదులను తయారుచేయించి నొక బంగరుపళ్ళెరముసందుంచి, దానిపై నొకపట్టువస్త్ర మునుగప్పి స్వామియెదుట బెట్టెను.

స్వామి తన దివ్యదృష్టిచే నందున్న పదార్థము మాంస ముతో తయారుచేయబడినట్లు గ్రహించి, తన్ను పరీక్షింప దలచి నవాబువిధముగ జేసెనని నవ్వుచు, తన చేతితో రముమీదనున్న గుడ్డ నెత్తుసరికి, అందుగల వ మంతయు పుష్పములుగ మారిపోయెను. నవా సిగ్గుపడి, తానుగావించిన యపరాధమునకు వీరప్ప లెట్టి ప్రతిక్రియ సేయునో యని భయమంది, తడా స్వామికి సాష్టాంగదండప్రణామంబులు గావించి ''మహ ఈ అజ్ఞానము గావించిన అపరాధమును క్షమించి కటా గోరుచున్నాను. తమవంటి మహాత్ము లుండుటంజే ప్రపంచమున నింకను ధర్మమునడచుచున్నది. ఇంక మా రాజ్యంబున మీరాయిచ్ఛవచ్చినట్లు సంచరింప వచ్చు మావలన తమకెప్పు డేపనిగావలసినను, తప్పక అర్థాసని పేర్తును'' అని వేడుచున్న నవాబునుగాంచి, స్వామి ''బి భయమందకుము. నీసంశయములకు దీర్చుటకై యునపియు చ్చుటకె వచ్చితిని. నీవు మహమ్మదీయుడవైనను నీకుగల

విశేషంబులకెంతయు నానందించితిని'' అనిన వినినవాబు "మహానుభావా! నాకు జ్ఞానోపదేశంబు చేసి కటాక్షింప వేడుచున్నాను. మరియు తాము వ్రాయుచున్న కాలజ్ఞానమను గ్రంథమునుగూడ చదివి వినిపించి మమ్ములను కృతార్థులను జేయవే' అని ప్రార్థించిన, స్వాములవారు నవాబున కాదినమంతయు జ్ఞానోపదేశంబు గావించి, మరుచటిదినమున కాలజ్ఞానగ్రంథ రహస్యంబులు దెలుప నారంభించెను.

## బనగానపల్లి నవాబునకు వీరప్పయాచార్యులు కాలజ్ఞానంబును తెలుపుట

"బిడ్డా! కాలజ్ఞాన గ్రంథమును చదివినను, వినినను సకలసంపదలు కలుగును. సమస్తపాపములు హరించును. సకల కష్టములు తొలంగి సుఖంబు చేకూరును. అట్టి మాహాత్మ్యముగల కాలజ్ఞానరహస్యంబుల దెలుపుచున్నాను. వినుమ'' మని నవాబునకు కాలజ్ఞాన గ్రంథ రహస్యంబులను దెలుప నారంభించెను.

శ్లో॥ యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహం॥

ఈప్రపంచమున సద్ధర్మము నశించినప్పుడు, మరల ధర్మమును స్థాపించి భూభారమును మాన్పుటకు ప్రతియుగమందును భగవంతు డవతరించుచుండును. నేడు ప్రపంచమున దుర్మార్గులు వృద్ధియై శిష్టులను బాధించుచున్నారు. దుష్టజన నిగ్రహంబునకును, శిష్టజన రక్షణంబునకును భగవంతు డవతరించును.

భక్తులారా! కలియుగమున 5000 గతించిన మీదట ధూర్జటిపర్యాయ నామసంవత్సర వ్యాఘ్రకాలాంతర విచిత్రి మాసమాన భాసుర భానువార తిథి ప్రకాశ ప్రళయ నక్షత్ర దక్షణకాలమునకు పక్షిద్వయానకు దుష్టశిక్షణ, శిష్ట పరిపాలనంబుకొరకు నీలోకంబున శబలగ్రామంబున దేవస్థ యుండైన విష్ణ్వంశుండగు దేవబ్రాహ్మణునకు తనయుండనై జన్మించి, దేవతలు నిరీక్షింప వీరభోగవసంతరాయావతారుం డనై, దేవదత్తఘోటకారూఢుండనై, దుష్టజనులను దనకర వాలంబుచే ఖండించుచు భూలోకంబున సంచరింతును. అంత మానవులు దేవదేవుండైన విష్ణుమూర్తిని ప్రార్థించుచు, పూజా దులు గావించుచు, ధర్మపరాయణులై వర్థిల్లుదురు. అంత కల్క్యవతారమున సకలజనులు ధన్యులయ్యెదరు. అనంతర మీప్రపంచమున కృతయుగ ధర్మములు ప్రారంభమగును. "చంద్ర, సూర్య, శుక్ర, గురువులు" ఏకరాశిగతులైనప్పటి నుండియు కృతయుగ ధర్మములు ప్రారంభమగును. సకల దుర్జనరాజ్యధ్వంసం బొనరించి పిదప కృతయుగ ధర్మముల ప్రతిష్ఠించి, నాయవతారంబును చాలించి, నానిజనివాసంబైన వైకుంఠంబును జేరెద. కృతయుగ ధర్మము లేరీతిగనుండునో చెప్పుచున్నాను వినుడు.

శ్లో॥ ధృతిక్షమాదయాస్తేయం శౌచమింద్రియ నిగ్రహం।
ధీర్విద్యాసత్య మక్రోధో దశకం ధర్మలక్షణం।
దశలక్షణాని ధర్మస్య విద్యంతే సమధీయతే।
అధీత్యాను వర్తయే తేతేయాంతి పరమాంగతిం॥

ఇదియే మీకునిదానము. ఇకనైనను ప్రజలు గర్వులు గాక, నామాటలను చెడచెవినిబెట్టక, అజ్ఞానంబును

వదలి న్యాయమార్గమున సంచరించుట శ్రేయస్కరము. మరియు నీగ్రామంబున ఒక చిత్రంబు జరుగనున్నది. భక్తురా లగు గరిమరెడ్డిఅచ్చమ్మగారి వంశము నిర్వంశమగును, ఆమె పశువులన్నియు నశించును. నేను వ్రాసిన కాలజ్ఞానమంతయు అచ్చమ్మగారి యింటిప్రక్క నొకపాతరలో నుంచితిని. ఆపాతరపై నొక చింతచెట్టు మొలచును. ఈకలియుగమున నేను వీరభోగవసంతరాయుడనై అవతరించుటకు ముందు ఆ చింతచెట్టున చేమంతిపూవులు పూయును ఈగ్రామము ప్రక్క ప్రవహించుచున్న 'జుర్రేరు' పొంగి బనగానపల్లిదాక వరకు నష్టమగును. బనగానపల్లి నవాబుయొక్క బలము కూడ చాలవరకు తగ్గును. అచ్చమ్మగారు కట్టించిన లోమఠ మునందుగల లింగమునకు నీకలియుగ మున్నంతకాలము నిత్యము పూజలు జరుగుచుండును. నీకలియుగంబున నీ విధంబుగ నింకను నెన్నియో యుత్పాతంబులు ముందు కలుగనున్నవి" అని చెప్పెను.

అనంతరము బనగానపల్లి నవాబు అచ్చమ్మగారు కట్టించిన లోమఠముననున్న ఈశ్వరునకు నిత్యనైవేద్యదీపా రాధనలకు కొంతభూమి యినాముగ నిచ్చెను. ఇప్పటికిని బనగాన పల్లియందున్న మఠమున జరుగుచుండు ఉత్సవాదు లకు బనగానపల్లి నవాబులు భక్తిపూర్వకముగ కొంతధన మిచ్చుచుందురు.

ఆ విధముగ బనగానపల్లి యందు వీరప్పయాచార్యులు వారు భక్తులకు జ్ఞానోపదేశంబు గావించుచు, నూటయిరువది మూడు సంవత్సరము లుండెనని కాలజ్ఞానము నందున్నది.

భక్తులైనవారు బనగానపల్లికి వెళ్ళినప్పు డీవిషయముల నన్నిటిని చూడవచ్చును.

తృతీయ ప్రకరణము సమాప్తము

# చతుర్థ ప్రకరణము

## పోలేరమ్మచే బ్రహ్మంగారు నిప్పును తెప్పించుట

అనంతరము వీరప్పయాచార్యులు ఎవరికిని చెప్పక యొకనాటి యర్ధరాత్రియందు లేచి, కాలినడకను కడపజిల్లా బద్వేలుతాలూకా యందుగల 'కందిమల్లయ్యపల్లె' యను గ్రామము చేరిరి. అచ్చట తనపేరు "పోతులూరి వీరబ్రహ్మం" అని చెప్పి, చూచుటకు పిచ్చివానివలె గడబడుచు, నా గ్రామములో వడ్రంగి పని చేయుచు కాలముగడప నారంభించెను. ఎల్లప్పుడు నేవియో యాధ్యాత్మిక ప్రసంగములతో కాలముగడుపుచుండువాడు. కాని, పనిచేసి నట్లు గాన్పించెడి వాడుకాడు. అయినను తాను చేయుటకు నంగీకరించిన పనిని ఎవరివి వారికి మరుచటిదినమే యిచ్చుచుండెడి వాడు. ఈయన శక్తిసామర్థ్యములను గ్రహించలేక ఆయూరి వారు ఈయనను "పిచ్చిబ్రహ్మం" అని పిలుచుచుండెడివారు. ఒకదినమున నాగ్రామదేవతయైన పోలేరమ్మకు ఆయూరిపెద్ద కాపు జాతర చేయించుచుండెను. ఆజాతరకగుఖర్చు ఆగ్రామ

వాసులు తమ శక్తికొలది వారు చందానిచ్చుచుండెడివారు. అటీతిగ చందావసూలు చేయుటకు గ్రామపెద్దలు వీరబ్రహ్మం గారి యింటికివచ్చి "వీరయ్యగారు! అమ్మవారి జాతరకు నీవు తోచినచందా నివ్వ"మని అడిగిరి, అందులకు వీరబ్రహ్మం గారు "నేను బీదవాడనుగదా! చందానెట్లీయగలను? నన్ను వదలివేయగూడదా" అని చెప్పగా, వారు "ఓయీ! ఇట్టి పిచ్చి పిచ్చిమాటలుకట్టిపెట్టి, అందరవలెనే నీవు చందా యిచ్చి తీరవలయునని," కొంచెము కోపముగ నడిగిరి. అంతట బ్రహ్మంగారు "సరే! అట్లే యిచ్చెదను. ఈదినము నావద్ద డబ్బు లేదు. రేపు తప్పక యిచ్చెద"నని చెప్పివారి నాదినంబున బంపివేసెను. మరుచటిదినమున వీరబ్రహ్మం పొగాకు చుట్ట చుట్టుకొని చేతబట్టుకొని పోలేరమ్మ గుడిముందరనుంచి వెళ్ళు చుండెను. జాతర యింకను జరుగుచున్నది. ఆయూరిరైతులు గుడిముందు నుండిపోవుచున్న వీరబ్రహ్మమును జూచి "ఏమయ్యా! జాతరకు చందా యీదిన మిత్తునంటివిగదా? తెచ్చితివా" అని అడిగిరి. అంతవీరబ్రహ్మం "ఇచ్చుకుందు నని చెప్పితినిగదా! తొందరపడెదరేమి, చుట్టకాల్చుకొనుటకు కొంచెము నిప్పు నిచ్చెదరా" అనియడిగెను. బ్రహ్మమునకు చుట్టకాల్చుకొనుటకు నిప్పునందీయవలయునా? మేమురైతు లముగదా! గౌరవము తెలియక అడుగుచున్నాడే యని వారు కోపించి "లేదు" పొమ్మనిరి. అంత వారియెదుటనే నిలువబడి వీరబ్రహ్మం చుట్టచేతితో పట్టుకొని పైకిచూచుచు, "ఓ పోలేరమ్మా! చుట్టకాల్చుకొనుటకు కొంచెము నిప్పు తెచ్చియిచ్చెదవా" అని అడిగెను పోలేరమ్మ అదృశ్యరూప ముతో నిప్పుగల మూకుడును దీసుకొనివచ్చి స్వామివారి కం

దిచ్చి అక్కడనే యదృశ్యముగ నిలువబడి యుండెను. స్వామి వారా సిప్పుతో చుట్టను కాల్చుకొని "పోలేరమ్మా! యిక నిప్పు మూకుడును నీవు తీసుకొని వెళ్ళవచ్చు" నని చెప్పగా అమ్మవారు దానిని తీసుకొని వెళ్ళి పూర్వపు స్థలమునందే యుండెను. ఆరైతులందరు నదిగాంచి యాశ్చర్యపడి నమస్కరించుచు "స్వామీ! మాతప్పులు క్షమించుము. నీవు సామాన్యుడ వనుకొంటిమి.మన్నింపుమని" వేడుకొన మొదలు పెట్టిరి. వారి దీనాలాపంబుల గాంచి జాలిపడి స్వామి వారయనలారా! మీరు బుద్ధికలిగియుండుటే నాకు సంతోషము. మీకు జ్ఞానోపదేశంబు చేయవలయుననియే, నేనిచ్చటికి వచ్చితిని. నన్ను ఒరు లెరుంగలేరు. నేను భక్తులకు సేవకుడను. భక్తియందు అద్భుతశక్తిగలదు. భక్తితో సమానమైనది యీ మూడులోకంబులందును వేరొకటిలేదు. ఇది పరమేశ్వరునియందు నధిక ప్రేమగలవారికి మాత్రమే లభించును. ఇతరులయందిది కాన్పించదు. వేలకొలది మనుజులలో నేయొక్కడో మోక్షమును పొందవలయునని ప్రయత్నము సలుపుచుండును. అట్లు ప్రయత్నించువారందరిలో నొక్కడనో మహాపురుషుడు మాత్రమే భక్తిగనుండగలుగును. అట్టి భక్తి గలవార నేకులలో ఒకడు మాత్రమే బ్రహ్మజ్ఞానము నెరింగిన వాడై ముక్తినిపొంద నర్హుడగును. ఒక్క భక్తిమార్గముననే శాశ్వతానంద సంధాయకం బగు మోక్షమును బొంద వచ్చును.

శ్లో॥ కృతాది త్రియుగే బోధ్యో వైరాగ్యో ముక్తిసాధనః,
కలౌతు కేవలాభక్తి ర్బ్రహ్మసాయుజ్య కారిణీ॥

తా॥ కృత, త్రేతా, ద్వాపరయుగంబులలో ముక్తిని బొందుటకు వైరాగ్యమే సాధనము. కాని కలియుగమునందు మాత్రము "భక్తి" మాత్రముచేత బ్రహ్మసాయుజ్యమును పొందవచ్చును.

శ్లో॥ యత్ఫలంనాస్తితపసా న యోగేన సమాధినా ।
తత్ఫలంతు భవేత్సమ్యక్ కలౌ కేశవకీర్తనాత్ ।

తా॥ ఏ మోక్షము కృత, త్రేతా, ద్వాపరయుగములలో కష్టమైన తపస్సు,యాగము, యోగముల చేతకూడ సాధింపకష్టమై యుండునో, అట్టి మోక్షము కలియుగమునందు కేవలము శ్రీభగవన్నామోచ్చారణ మాత్రముచేతనే మిక్కిలి సులభముగ పొందనగును.

కనుక ఓ బిడ్డలారా! ఇహవిషయంబులలోబడి చిక్కుబడక, మీ మనస్సులను భక్తిమార్గమునకు త్రిప్పి ముక్తిని బొంద ప్రయత్నింపుడు. తుమ్మెదను జంపి, తిని క్రిమిస్వరూపమును వదలి కీటకము భ్రమరమగునట్లుగను, లవణము జలంబునంగలసి జలమైనట్లుగను, భక్తుడు సదా పరమేశ్వర ధ్యానము గావించునెడల పరమాత్మ స్వరూపమందు లీనమగును" అని బోధింపగా నార్యులందరును విని వీరబ్రహ్మంగారి వేదాంతవాక్యముల కచ్చెరువడి, సాష్టాంగ నమస్కారములు గావించి. స్వాములవారిని గృహంబునరకు సాగనంపి, అదిలగాయితు ఆయనయం దధికభక్తి విశ్వాసంబులతో మెలంగసాగిరి.

## గోవిందమ్మ జననవృత్తాంతాము

పుణ్యభూమియగు నాంధ్రదేశంబున సకలసంపదలతో నొప్పుచున్న 'పెదకొమర్ల' యను నొక గ్రామంబు కలదు. అందు భక్తుండును, సదాచార సపన్నుండునునైన శివకోటయ్య యను నామంబుగల శిల్పిబ్రాహ్మణు డొకడు వాసము చేయుచుండెను. ఆశిల్పి బ్రాహ్మణుండు సంతానముకొరకై ఈశ్వర్యోపాసనము జేయుచు, కులవృత్తి చేసుకొనుచు జీవించుచుండెను. ఆయన నిశ్చలభక్తికి మెచ్చి ఒకనాటిరేయి పరమేశ్వరి అతనికి స్వప్నములో కనబడి "బిడ్డా! నీభక్తికి మెచ్చితిని. కాని నీకు పురుషసంతానము కలుగు యోగము లేదు. నీవు చాలకాలమునుండి నన్ను సేవించుచున్న వాడవు గావున, నేనే నీకు పుత్రికనై జన్మింతును." అని చెప్పి అదృశ్యయయ్యెను. శివకోటయ్య వెంటనే నిద్రనుండి మేల్కాంచి చూచుసరికి తనముందర నేమియు కాన్పింపదయ్యె. అంత నిద్రించుచున్న తన భార్యను మేల్కొలిపి, తనస్వప్న వృత్తాంతం బంతయు నెరిగింపగా, నామెయు నందుల కెంతయు నానందించెను. నాటంగోలె ఆపుణ్యదంపతులు రెట్టించిన భక్తితో నాపరమేశ్వరి నారాధించుచుండిరి. కాలక్రమంబున శివకోటయ్యభార్య గర్భము దాల్చెను. నవమాసంబులు నిండినవి. పిదప నొక శుభదినంబున శుభలగ్నమున కుమార్తెను ప్రసవించెను. పరమేశ్వరీ వరప్రసాద లబ్ధమగు నా పుత్రికకు నొక శుభముహూర్తంబున గోవిందమ్మయను నామకరణంబు గావించి గుల్లారుముద్దుగ బెంచుకొనుచుండిరి. గోవిందమ్మకు పండ్రెండుసంవత్సరములు

పూర్తియైనవి. ఇక వివాహప్రయత్నంబు గావింప వల యునని ఆమె తలిదండ్రులు ఆలోచించిరి. ఎన్నియో సంబంధములు వచ్చినవి. వచ్చినవారినెల్ల నేదియో లోపము చూపించి, తన కావరుడు వలదని నిరాకరించు చుండెను. ఎన్నియో సంబంధములు వచ్చి తిరిగిపోయినవి. ఒక్క వరుడును గోవిందమ్మకు నచ్చడయ్యెను. అంత పుత్రికను తన ప్రక్క కూర్చుండబెట్టుకొని శివకోటయ్య "అమ్మా! యీవిధముగ నీవు ఎవరిని వరింపక వచ్చినవారినందరిని వల దనుచుండిన నెట్లు? నీయభిప్రాయ మేదియో తెలిగింపు"మని యడుగగా తండ్రితో గోవిందమ్మ "తండ్రీ! మీ రెంత చెప్పి నను, నే నంగీకరించుదానను గాను. ఆపురాణపురుషుని యామనోహరుని మాత్రమే వరియింతును. నాకై మీరు శ్రమ జెందవలదు. ఎన్నటికైన నాథ క్తవరదుడే తప్పక యరుదెం చును" అని చెప్పుచు కాలయాపనము చేయుచుండెను.

## శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారు పెదకొమర్ల గ్రామంబునకు నరుదెంచుట

కందిమల్లయ్య పల్లెయందు నావిధంబుగ కొంతకాలంబు గడపినపిదప, వీరబ్రహ్మంగారు ఆపరిసర గ్రామంబుల దిరు గుచు, చివరకు పెదకొమర్ల గ్రామంబుచు చేరిరి. అందొక శివాలయంబున కూర్చొని నిత్యము తపస్సుచేసుకొనుచుం డెను, వీరబ్రహ్మంగారు ప్రతిదినము స్నానమునకు శివ కోటయ్య యింటిముందరనుండి వెళ్లుచుండెడివారు. గోవిం దమ్మ ఒక దినమున గుమ్మములో నిలువబడి వీరబ్రహ్మము

గారిని చూచెను. అప్పటినుండియు నా మనసు ఆ సన్యాసి పైన లగ్నంబయ్యె. మరు దొకదినమున తండ్రితో గోవిందమ్మ "నాయనా! మన వీధి వెంబడి ప్రతిదినము ఒక సన్యాసి స్నానమునకై గోనేరున కేగుచుండుట చూచితివి కదా? ఆతడెవ్వరై యుండునో? ఆ దివ్యపురుషుని తేజోరూపాతిశయంబులు చూడ నాతడు సామాన్యుడు కాడని తోచుచున్నది. ఆయనను గాంచినప్పటినుండి నా హృదయం బేలకో ఆయనయందే లగ్నంబైనట్లు తోచుచున్నది. కాన నీవా పురుషపుంగవు డెందున్నాడో విచారించి, ఆయనయొద్దకుంజని, మాట వృత్తాంతంబుం జెప్పి, నన్నాయనకిచ్చి వివాహంబు గావించు ప్రయత్నము చేయింపుమని, తన యభిప్రాయంబు దెలుప, శివకోటయ్య మండిపడుచు "బిడ్డా! నీ అవివేకపు మాటలు కట్టిపెట్టుము. వినుటకు కూడును, కట్టగుడ్డయు లేని ఒక సన్యాసినా నీవు వరించుట. చాలు చాలు. ఎవరైనను వినిన పరిహాసము చేయరా?" అని యెన్నివిధంబుల చెప్పినను గోవిందమ్మ తన అభిప్రాయమును మార్చుకొనలేదు. అతనినే వివాహంబు చేసుకొందుననియు, అన్యుల వరింపననియు తాను పట్టినపట్టు వదలలేదు.

శ్రీ పరమేశ్వరావతారుండైన వీరబ్రహ్మేంద్రస్వాముల వారిని శివకోటయ్య సామాన్యమానవుడని తలంచి, తన పుత్రికయగు గోవిందమ్మను ఆయనకిచ్చి వివాహము చేయుటకు సంగీకరింపడయ్యె.

## మృతుండైన ఒక రెడ్డిని వీరబ్రహ్మంగారు బ్రతికించుట.

ఇట్లుండ నొకనాడు ఆగ్రామంబున నొకరెడ్డి చాలకాలము రోగముచే బాధపడి చనిపోయెను. అంతవానిబంధుమిత్రా

తులు దహనాదిక్రియలు గావింప శ్మశానవాటికకు వీరబ్రహ్మంగారున్న దేవాలయము ముందునుండి తీసుకొనిపోవుచుండిరి. ఆ విషయంబును గాంచినవారై వీరబ్రహ్మంగారు వారిని జూచి "ఓబిడ్డలారా! ఇది ఏమి అన్యాయము బ్రతికియున్నవానికే దహనక్రియలు జరుపుచున్నారే! అనెను. వాని బంధుమిత్రాదు లది విని "వీడెవ్వడో పిచ్చివానివలె నున్నాడే? చచ్చినవానిని గాంచి బ్రతికియున్నా డని చెప్పుచున్నా"డని తమలోదా మనుకొన నారంభించిరి. అంత వీరబ్రహ్మం వారిని జూచి "ఓయీ! ఆపిచ్చి మీకో, నాకో చూడవచ్చును. మీరు స్మశానవాటికకు బోయి కట్లువిప్పిన వెంటనే అతడు లేచికూర్చుండు"నని చెప్పెను. తరువాత వారు స్మశానవాటికకు బోయి కట్లువిప్పినయాసరికే ఆ మనుష్యుడు మెల్లగ కదలుచు లేచుటకు ప్రయత్నించుచుండెను. వెంటనే వాని బంధువులు మరల వానిని గృహంబునకు చేర్చి. వీరబ్రహ్మంగారి శక్తికి నాశ్చర్యపడుచు, శివాలయమునకు వచ్చి స్వామికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి "మరల తమ యనుగ్రహమువలననే పునర్జీవితుం డయ్యె"నని అనేకవిధంబుల బ్రస్తుతింపసాగిరి. ఈ విషయము గ్రామమునందలివారందరకును దెలిసినది. అంత పురజనులు గుంపులుగ వచ్చి స్వామివారిని ప్రస్తుతించి, సాష్టాంగదండప్రణామంబు లాచరింపసాగిరి.

## స్వాములవారి మహత్వముచే నొక తుంటరి మరణించి మరలిస్వామి యనుగ్రహంబుచే సజీవుండగుట

ఆ గ్రామమునందలి కొందరు తుంటరు లదియంతయుం గాంచి "యిదియంతయు నేదోయొక తాంత్రికముగ గన్పట్టు

చున్నది. లేకున్నచో ఒకసన్యాసి యెక్కడ? చచ్చిన వానిని బ్రతికించు టెక్క''డని హేళనజేయుచు, నాతంత్రమును గనిపెట్టవలయునని నిశ్చయించుకొని వారిలో నొకనిని చచ్చినట్లుగ పరుండమని వానిని వెదురుకట్లమీద పరుండ బెట్టికట్టి "అయ్యో! మావాడు చనిపోయినాడని," యేడ్చుచు వీరబ్రహ్మంగారున్న శివాలయము ముందరనుండియే తీసు కొనిపోవుచుండిరి బ్రహ్మంగారదిగాంచి, ఆశివాలయము యొక్క పూజారియగు రామబ్రహ్మమును బిలచి "నాయనా! చూచితివా? నేను తాంత్రికుడనని, నన్నెట్లయిన యవమానింపవలయునను తలంపుతో బ్రతికిన వానినే వెదురు కట్లలుకట్టి, చచ్చినవానిని మోసుకొనివచ్చునట్లు మోసు కొనివచ్చుచున్నా''రని చెప్పుచున్నంతలో, ఆతుంటరులు స్వామిదగ్గరకువచ్చి "అయ్యా! మావాడుఆరుమాసములనుండి జబ్బుచే బాధపడుచు, నేడు హఠాత్తుగ మరణించెను, మొన్న మీరు చనిపోయినవాని నొకనిని బ్రతికించినారని, ఊరంతయు చెప్పుకొనుచున్నారు, కనుక దయతో వీనిని వీనికూడ బ్రతికింపు''డని కోరిరి. అంత బ్రహ్మంగారు వారినిజూచి "అయ్యో! మీవాడు చనిపోయెను గదా! చని పోయినవాడు మరల నెట్లు బ్రతికివచ్చును? చనిపోయిన వానిని బ్రతికించుట నాచేతకాదు. కనుక తీసుకొనిపోయి దహనసంస్కారములు గావింపు''డని చెప్పి మిన్నకుండెను. అంతవారు అటనుండి వెడలిపోయి "చూచితిరా! వీని తంత్రమిప్పుడు బయటపడెను. మొన్న నేదో ఆ మను ష్యుడు బ్రతికియుండుట గ్రహించి, తానే బ్రతికించినట్లు నటిం చెను. ఇప్పుడీ మనుష్యుడు చనిపోయినాడు, బ్రతికించ

మనగా, నాకు చేత కాదనుచున్నాడు. వీనిః తంత్రము బయట పడినది. మావాడు నిజముగ మరణించలే''దని వారు ఒకరితో నొకరనుకొనుచు, నవ్వుకొనుచు, బ్రహ్మం గారిని పరిహాసముచేయుచు, ప్రక్కవీధిలోనికిబోయి, నెదురు గ్గలకు కట్టినవానిని కట్లు విప్పి "యికలేవరా" అనిరి. కాని పాపము ఆ మనుష్యుడు చచ్చియుండెను, అంతవారు భయపడుచు, నీయపవాదు నెవరినెత్తిమీదపడునోయని. ఎవరియంతటవారే యక్కడనుండి చల్లగ వెడలిపోయిరి. ఆ శవము దిక్కులేక యక్కడనె పడియుండెను. ఈ సమాచార ము వానిబంధుమిత్రులకు తెలిసి. వారు ఘోరఘోరముగ నేడ్చుచు, నిట్టి యాపదనుండి తప్పింపగలవారిక నెవ్వరును లేరని గ్రహించి పరుగున వీరబ్రహ్మేంద్ర స్వాములవారి యొద్దకుం జని 'మహాత్మా? ఊరక తుంటరు లోనరించిన యకృత్యంబుచే మావాడు చనిపోవుటకు కారణం బయ్యెను, ఆపద్బాంధవా! సాధుపుంగవా! తమశక్తి సామర్థ్యము తెలుంగక చేసిన యీయపరాధమును మన్నించి రక్షింపవే" యని స్వామిపాదంబులపై బడి 'రక్షించువరకు మీపాదములు విడువ''మని ఏడ్చుచున్న వారింగాంచి, వీరబ్రహ్మంగారు జాలినొంది''ఇక పొందు మీవాని కెట్టిభయంబును లేదు, కాని యొద్దకుపోయి "ఓంనమఃశివాయ-అను మంత్రమును చెవిలో నూదుడు. దానివలన నతండు లేచికూర్చుండు''నని తెలుప వారు రయంబునబోయి, వాని చెవియందామంత్రమును పఠించగా, నాతండు లేచికూర్చుండెను. ఆయూరివారం దరును ఆ విషయంబు వినినవారై, వీరబ్రహ్మంగారిని అనేక విధంబుల బ్రస్తుతింప నారంభించిరి.

## వీరబ్రహ్మంగారు పెదకోమర్ల గ్రామవాసులకు కాలజ్ఞానమును తెలుపుట

నాయనలారా! మీరందరును నన్ను తాంత్రికునిగ భావించితిరి. అయినను మీపై నా కెట్టికోపమును లే. అజ్ఞానాంధకారమున దవిలి, అనేక పాపకృత్యములు చేయుచున్న వారికి జ్ఞానోపదేశంబు గావించి, ప్రపంచమున ధర్మము వర్ధిల్లునట్లు చేయుటయే నాకర్తవ్యము. నే చెప్పబోవు నీ కాలజ్ఞాన రహస్యంబులను వినుడు. కాలజ్ఞానమును నిత్యము పారాయణ జేయుచు, పూజింపుచు నన్ను ధ్యానించువారలకు నిహపరసౌఖ్యంబులు కలుగును.

ఇకముందును ప్రపంచమున స్వధర్మమే పరమధర్మమగును. అన్యాయమునకు బలము హెచ్చును. నిజము కల్లయగును. కల్ల నిజం బగును. మంచితనము పనికిరాకుండును. చెడ్డ ప్రసిద్ధిగాంచును. వేదాంతవిద్యలెల్ల నిస్సారమగును. లౌకికవిద్యలయందభిలాష హెచ్చును. ప్రపంచమున స్త్రీపురుషజాతులు రెండే కలవను వాదమునకు బలము హెచ్చును. విప్రులు స్వార్థమునకై వేదశాస్త్రములను కల్పించిరనియు, వర్ణాశ్రమ ధర్మములు కేవలము బాధ జేయుననియు, భక్తిజ్ఞాన వైరాగ్యములు నిరుపయోగము లైననియు వాదములు చెలరేగును. ఇకముందు నిట్టి విపరీతజ్ఞానులు భూమండలమున చెలరే "తా చెడ్డకోతి వనమెల్ల చెరచిన దన్నట్లు" అట్టివిపరీత జ్ఞానులు పామరులనెల్ల పాడుచేయు చుందురు. ప్రపంచములో తండ్రిని కుమారుడును, కుమారుని తండ్రియు మోసగించుచుందురు. ప్రపంచధర్మము లన్నియు తారుమారగును.

వానలు సకాలమున వర్షింపవు. పాడిపంటలు నిస్సారమగును. ప్రజలు అనేక దుష్కార్యములు చేయుచుందురు. విప్రులు వేదవిద్యలను వదలినవారై చండాలురై పోవుదురు. తల్లి దండ్రులు తనుకుమార్తెల నమ్ముచుందురు. దేవ, పితృక్రియలు నడువవు. 'ప్రజానుమతో రాజా' అనునట్లు రాజులు ప్రజాన మతముగ సంచరింపవలసి వచ్చును. శ్రుతి ధర్మములు శూద్రులు చెప్పగా విప్రులు వినుచుందురు. దేవాలయము లలో నీచజాతులు చేరి పూజలుగావింతురు. చివరకు భూమియందరాజకము ప్రబలి, ప్రజలు అన్యోన్యకలహము లతో నొకరినొకరు కొట్టుకొని చత్తురు. ఎద్దుల యవసరము లేకుండనే బండ్లునడుచును. వెంపలి మొక్కలకు నిచ్చెనలు వేసి యెక్కెడివారు జన్మింతురు నీచులధికు లగుదురు అధికు లెందైనను గాన్పించకుందురు. పైర్లుకొంచెముగ ఫలించును. ఒకరిసొమ్ము నొకరు నపహరించుటకు ప్రయత్నము చేయుచుం దురు. చోర - రోగ - కపటాది ఉపద్రవములు హెచ్చును. ప్రజలు అసూయాపరులుగ నుందురు. శాంతస్వభావము అడుగంటును; కోపము హెచ్చును. వేదములను చండాలు రభ్యసింతురు. శిలలు కండలు గ్రక్కును. ఆకండలను తిను టకు గ్రద్దలువచ్చి చచ్చును. ఆ చచ్చినవాటిని పట్టుకొని ప్రజలు గంతులువేయుదురు. కొఅవులు నోటగరచుకొని తిరు గుదురు. మంచినీటిలో దీపములు వెలుగును. పులియు మేకయు నొకే రేవున నీరుత్రాగును, తక్కువ జాతివారు ఆచారవంతు లగుదురు. దైవవ్రతములు, దైవకార్యములు చేయువారలు దరిద్రులై పోవుదురు. కాశీ పట్నము నలువది దినములు పాడగును. కురుక్షేత్రమునందు ప్రజలు గుంపులు గుంపులుగ

కూడి ఒకరి నొకరు నరుకుకొని చత్తురు. వేపచెట్టు యొక్క ఆకులు తియ్యగానుండును. గోదావరి నదియందు పంద్రెండు దినములు నీరుండదు, తరువాత నుప్పొంగును. కంచికామాక్షమ్మ గిరగిరతిరుగును. మాచెర్ల చెన్నకేశవ స్వామి మహిమలన్నియు తగ్గిపోవును. గాలివానలచేత శ్రీశైలమునకు దక్షిణమున గండ్లుపడును. నెత్తురువానలు కురియును. మప్పుతీరని బిడ్డలు మాటలాడెదరు. ఆకసంబున పొగలు మంటలు పుట్టును. ఆహాధ్వనులు దిక్కులు పిక్కటిల్లును. ఒకరియాలు మరియొకరి పాలగును. కుక్కలు గుఱ్ఱాలను చంపును. పగలు చుక్కలు కనబడుటచే ప్రజలు హడలి చత్తురు. చుక్కలు రాలును. మళయాళములో మందపాలుడు మనుజులతో మాటలాడును. కాశిలో గంగ కనబడక పోవును. తిరుపతికిపోవు మార్గము కట్టుబడును. వెంకటేశ్వరస్వామి సొమ్ము దోచుదురు. ఆ దివ్యక్షేత్రంబున నారుగురు దుష్టులు జన్మింతురు. నాయనలారా! యీ రీతిగ నికమీదట కలియుగంబున ననేక విపరీతములు కలుగును." అని స్వాములవారు ఆయూరి వారికి ప్రపంచ భవిష్యత్తును తెలిపి, ఆదినమునకు సభచాలించెను. ఇది అంతయు వినుచున్న గోవిందమ్మతండ్రి శివకోటయ్య మాత్రము, స్వామివారి మాటలు విశ్వసింపక, వీరబ్రహ్మం కేవలము తాంత్రికవిద్యలు నేర్చిన మాంత్రికుడనియు, కృత్రిమవేషధారియనియు, అట్టివాని మాటలు నమ్మిన ప్రమాదములు సంభవించుననియు గ్రామములో ప్రచారముచేయుచుండెను. ప్రజలు శివకోటయ్య మాటలను విశ్వసింపక స్వాములవారిని గౌరవముగనే చూచు

చుండిరి. శివకోటయ్య మాత్రము వీరబ్రహ్మంగారి మాట యనిన శోకగ్రస్తుడై క్రాగుచు పెచ్చుచుండెను. స్వామి అదియంతయు గ్రహించి, ఒకనాటి రాత్రి శివకోటయ్యకు స్వప్నములో కనబడి "నీ పుత్రికను శివాలయమందున్న శ్రీమన్నారాయణాంశ సంభూతుండైన వీరబ్రహ్మమున కిచ్చి త్వరలో వివాహము జేయకున్న, నాకు ప్రాణత్యాగము చేసుకొనుట నిశ్చయ"మని చెప్పి యదృశ్యుండాయెను.

## శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు గోవిందమ్మ తల్లికి స్వప్నములో కనబడిసోదె చెప్పుట

ఆ రాత్రియే అనగా శివకోటయ్యకు స్వప్నమున గనబడిన రాత్రియే అతని భార్యకుకూడ స్వప్నమున ఎరుకలసాని రూపములో కనబడిరి. ఆ స్వప్నంబున శివకోటయ్య భార్యకు ఒక యెరుకలసాని ముడతలుపడిన శరీరమును, మూడు భాగములు నెరసిన తలవెంట్రుకలును, సన్నని శరీరంబును, చినిగినబట్టలును కలిగి మైనము మెత్తి గవ్వలు కరిపించియున్న కొల్లాపురి గంప నెత్తిపై బెట్టుకొని, పేముబెత్తమును చేత ధరించి, తనలో తానే నవ్వుకొనుచు, తనమాహాత్మ్యంబును ప్రజలకు జూపదలచి, శివాలయంబునుండి బజారువీధిబడి "సోదోసోదమ్మా! సోది చెప్పించుకోరమ్మా!"అని కేకలు పెట్టుచు చంకలోనున్న తనబిడ్డను సవరించుకొనుచు, మెల్లగ నడచుచుండెను. ఆ గ్రామమందలి స్త్రీలు సోదెచెప్పు ముదుసలిం జూచి "ఓ అవ్వా! యిటురమ్ము! మామనస్సులోగల విషయంబులను జెప్పిన నీకును, నీ బిడ్డకును కడుపారనన్నము పెట్టి,

మంచిబొట్టులిస్తా ననిచెప్పగా, అవ్వ "అబ్బో! సోదంటే సోదే గాదు. ఎఱ్ఱుమూరి కమ్మసోది నిజమైనసోది. నాసోది నన్ను తెలిసినోరికే తెలును. అందరికీ తెలవదు. అసలు సోదె యిదె. పంచభూతాలను పుట్టించి, యీ లోకం అంతా నిండి నిజస్వం ఉలిపూదిరి సర్వభూతములయొక్క జాగ్రత్ స్వప్న సుషుప్తు లకు కారణమై పరంజ్యోతితో కలసి, తనంత దానె ప్రకాశిం చుచు ఆనందించునట్టిది. నాసోదె యీ ప్రపంచాల్ని అన్నిటినీ పుట్టించి శాంతమూర్తులకు సంతోషమై సకలమునకు ఆధారమై మంగళకరముగ నుందునోయమ్మ, ఇది సామాన్యమైన యెరు కగాదే తల్లి" అని జవాబివ్వగా. ఆమాటలు వారి కర్థముగాక "పాపము గోవిందమ్మపెళ్లి ఎప్పుడవునో అడిగితే బాగుండునే "యని వారిలో వా రనుకొనుచుండ, అప్పుడే కొందరు గోవిం దమ్మ తల్లి యొద్దకుబోయి "మనయూరికి మంచి యెరుకలసాని వచ్చింది. గోవిందమ్మకు పెళ్ళిమాట అడిగి తెలుసుకొందామా" అని అడుగగా ఆమెయు నందులకు సమ్మతింపగా, వారందరును కలసి యా యెరుకలదానిని పిలిచి, ఓయవ్వా! యిటురమ్మా" అనివారు పిలువ "ఓయబ్బో! మీరు సాలా గొప్పోరులా గున్నారు. నాబోటి ముసల్ది మీ కేం పనిసేస్తది, గురువింత గింజలు, శంఖు ఉంగరాలు, ఎంటుకలు తెల్లబడి పోయాయి. నాబోటిదా మీకు చెప్పేది. ఎల్లండి, ఎల్లండి" అని ఆ ముసు కలిది జవాబిచ్చుచు మెల్లగ నడచి పోవుచుండగా, నాపడుచు కాంతలు "అదిగాదవ్వా? యిల్లారా! నీకునీబిడ్డకు అన్నం పెడ తాము" అని గోవిందమ్మ తల్లిదగ్గరకు యెరుకలసానిని పిలుచు కొనిపోయి 'ఓయవ్వా' సరిగాకూచో, యిటువిను. మామనసులో

లోనుఉండేని సరిగా చెప్తితే నీవుకోరింది యిస్తాము. మంచిబట్ట లిస్తాము," అని చెప్పుచుండగా, గోవిందమ్మతల్లి ఆ యెరుకల సానిముందర కూర్చుండెను. అంత నాయెరుకలసాని నవ్వుచు తన చేతియందున్న బెత్తముకొనను గోవిందమ్మతల్లి కుడిచేతిలో పెట్టి, పట్టుకొనుమని చెప్పుచు "ఓయమ్మ! నీకెందుకమ్మ సందేహం! ఉన్నదిఉన్నట్టే చెబుతాను. ఓయెల్లమారికమ్మా! మేం కొలిచే దేవతా! మరిడిమాంకాళమ్మా! యీపట్టు తెలుపుకో, నీకడుపులోవున్నది సెపుతాను. నిజం చెబుతాను. నూరాజేన తెలుతోడు. ఓయవ్వా! ఇటు అటుదిక్కులు చూడకేతల్లి. ఒక్కమనుసుతోటే యుండు మాయమ్మ. నాదిక్కేసూచి తెలుచుకో తల్లి! ఇదిగో యిటు చూడవేమాయమ్మ. మా దేవుడు తోడే తల్లి. ఒకటంటే రెండు, రెండంటే మూడే తల్లి. నీవు తల్సింది చెబుతాను ఇనవే అవ్వా! ఎవరినిగురించి అడుగుతున్నావంటే మాయమ్మ! సోదరులుగాదే తల్లి (అని భుజముల మీద పుల్ల బెట్టెను) కొడుకుగాదే అవ్వ! కూతురును గురించి అడుగుతున్నావే యమ్మ. నీవడిగింది గట్టిగాని ఓటిగాదుతల్లి. నీకూతురుకి పోతు యీ ఊళ్ళోనే ఉన్నాడేతల్లి. వాడుసామాన్యుడు గాదువారాయుడేయమ్మ; నరుడుగాడేతల్లి. నే చెప్పింది సత్యమంటావో, అసత్యం అంటావో యమ్మ? నిజమేగాని అబద్ధంగాదే తల్లి. ఆపోటు శివాలయంలోనే ఉన్నాడు" అని చెప్పి యిక నేను తర్వగా పోవలయును. నాకును నాబిడ్డకును పట్టెడు అన్నము పెట్టుమని అడిగి పెట్టించుకొని, తినబోయిన తాను పోయినట్లు శివకోటయ్యభార్యకు స్వప్నమున వచ్చెను.

## సన్యాసివేషంబునను్న వీరబ్రహ్మం కేవలము భగవత్సంభూతుండే యని గోవిందమ్మ తల్లిదండ్రులకు నచ్చజెప్పుట

ఒకనాటిరాత్రి గోవిందమ్మ శయ్యపై పరుండి దుఃఖించు చుండెను. తనుబిడ్డ దుఃఖించుచుండుట శివకోటయ్యయు, భార్యయువచ్చి, వారిరువురు కూతురుదగ్గరకువచ్చి "ఈరీతిగ దుఃఖించుటకు కారణమేమి? లేక లేక పరమేశ్వరి కృపాకటాక్షముచే నీవు కలిగితివి. నిన్ను అల్లారుముద్దుగ పెంచి సకల విద్యలు నేర్పించి పెంచి పెద్దదానినిగ చేసితిమి. అట్టినీవు విచారించుచుండిన మాకు కష్టముగా నుండదా?" అని పలుకుచున్న తల్లిదండ్రులను గాంచి గోవిందమ్మ "అమ్మా! నేను విచారించుటకు కారణమేమియును లేదు. సన్యాసివేషధారియైన ఆ వీరబ్రహ్మమున కిచ్చి వివాహము గావింతురో లేదో, యను విచారముదక్క వేరేమియులే" దని తెల్ప విని, శివకోటయ్య "తల్లి! నీకోరిక మంచిదికాదు, నిన్నొక సన్యాసి కిచ్చి వివాహము గావించిన మాకును, నీకునుకూడ నలుగురిలో నగుబాటుకాదా! వేరొక డెవరినైనను వరింపుము. నీవు కోరిన వరునకిచ్చి వివాహము గావించెద"ననగా విని గోవిందమ్మ "జననీజనకులారా! అద్దానివలన మనకెట్టి అపఖ్యాతియు కలుగదు. ఆపురుషోత్తముడు సామాన్యుడుగాడు. మనగ్రామములో చనిపోయిన రెడ్డిని బ్రతికించిన విషయము మీరెరింగినదే కదా! అదియునుగాక తుంటరులు చేసిన కొంటెపనికి ప్రతిక్రియ జేసినదికూడ మనము ప్రత్యక్షముగ నెరింగినదే కదా! ఇట్టి శక్తి సామాన్యుల యందుండునే? మీరేమియు సందేహింపక

సత్వరమే నమ్మాయనకిచ్చి వివాహముగావించు ప్రయత్నంబు సేయు' డన విని శివకోటయ్యభార్య "నాథా! మనబిడ్డ చెప్పినవన్నియు సత్యంబులనియే తోచుచున్నవి. నిన్నరాత్రి నాకు ఎరుకలసాని స్వప్నములో గనబడి, మన అమ్మాయికి అతడే భర్తయగునని యు, నతడు సామాన్యుడు కాడనియు, సన్యాసికిచ్చి వివాహము గావింపకున్నచో గోవిందమ్మ ఆత్మహత్యకూడ చేసుకొనుననియు చెప్పెను. కనుక నిక మీరు ఆలోచింపక రేపుఉదయమున శివాలయమునకేగి ఆయనను మనయింటికి భోజనమునకై పిలువు" డనెను. భార్యయు, కూతురును అంగీకరించినప్పుడు నిక తానుకాదన్నను గృహ కలహంబు వచ్చునని తాను నంగీకరించి, మరునాటి దినము ఉదయముననే స్వాములవారికడకు బోయి, ఆయన జపము చేసుకొనుచుండుటచే పలుకరింప సాహసింపక, స్వామికి ప్రక్కగ కూర్చుండి యుండెను.

కొంతసేపటికి స్వాములవారు జపముచాలించి, చూచు సరికి ప్రక్కనే శివకోటయ్య కూర్చొనియుండెను. అంత శివకోటయ్య "స్వామీ! తమకులంబేది? మీనామధేయంబేమి? తమ జన్మభూమి ఎక్కడ? తల్లిదండ్రులెవరు? సన్యాసివేషధారులై యీ శివాలయంబున నుండ కారణంబేమి" యని యడుగ వీరబ్రహ్మేంద్రస్వాములవారు శివకోటయ్య వచ్చిన కారణంబు తన దివ్యదృష్టిచే గ్రహించి, ముసిముసి నవ్వులు నవ్వుచు నట్టి ప్రశ్నలన్నియు నీ ప్రకృతి దేహ[illegible] బంధించినవే గాని, జీవాత్మను సంబంధించినవి [illegible] గిన విషయంబులతో నాకెట్టి ప్రయోజనంబును [illegible] ఒంటివాడను. అయినను నీవడిగితివిగాన చెప్పుచ[illegible]

"నేను దేవబ్రాహ్మణ కులమైన విశ్వబ్రాహ్మణ వంశంబు నందు జన్మించితిని, నన్ను "వీరబ్రహ్మం" అని పిలుచు చుందురు. నా స్వగ్రామము కంది మల్లయ్యపల్లె. నేను శివాలయమునందే గాదు, భక్తులెచ్చట నుందురో యచ్చటనే నివాసంబు గావించుకొని యుందును. నాకు నిచ్చట నుండ వచ్చును; ఇచ్చట నుండరాదను నియమం బేమియు లేదు. ఎచ్చటనైనను నుందును" అనిన విని శివకోటయ్య మహాత్మా! మేమును విశ్వబ్రాహ్మణులమే. ఈ పూట మా గృహంబునకు ఆతిథ్యంబునకు దయచేయవలసినదిగ కోరుచున్నా" ననెను. అందులకు వీరబ్రహ్మంగారు "అయ్యా? మీ గృహంబునకు వచ్చుటకు నాకెట్టి యభ్యంతరము లేదుగాని, నాదగ్గర నీ పూటకు సరిపోవు రాగిసంకటిముద్ద కలదు. మీ పంక్తిని గూర్చొని ఆముద్దనే భుజింతును. మీ కావిధముగ నంగీకారమైన వత్తు"నని దెలుప, శివకోటయ్య అందులకు వేరుగా చెప్పలేక, "స్వామీ! మీ యిచ్చవచ్చినట్లుగనే చేయువచ్చును. మీరు మాగృహంబునకు వచ్చుటే ప్రధాన" మని తెలుప, వారిరువురును కలసి శివకోటయ్యగారి గృహంబునకు బయలుదేరిరి.

## స్వాములవారు "రాగిసంకటిముద్దను" పంచభక్ష్య పరమాన్నములుగ మార్చుట

...టయ్యయు, వీరబ్రహ్మం గారును ఆ విధముగ ...యగారి గృహంబునకు వచ్చుచు, మార్గ ...వకోటయ్యగారు వేసిన ప్రశ్నలకు జవాబు ...హ్మంగారు "అయ్యా! నేను నందకొండ

పాపాఘ్ని మఠాధ్యక్షులైన 'యనమదల వీరభోజయాచా
ర్యులును, ఆయన ధర్మపత్ని వీరపాపమాంబకును దత్త
పుత్రుండ"నని తెల్పెను. అంతట శివకోటయ్యగారు బ్రహ్మం
గారితో భోజనమునకు లెంమని చెప్ప, బ్రహ్మంగారు
"అయ్యా! నావద్ద నీ పూటకు సరిపడు రాగిసంకటిముద్ద
యున్నదని యిదివరకే చెప్పియుంటినిగదా! సహాపంక్తిని
గూర్చొని అముద్దనే భుజింతునని చెప్పెను. పిమ్మట వారిరు
వురును సహాపంక్తిని గూర్చొనిరి. గోవిందమ్మతల్లి శివ
కోటయ్యగారికి వడ్డించెను. బ్రహ్మంగారు "అమ్మా! నేను
తెచ్చుకొనిన సంకటిముద్ద మూటను విప్పి నాకు వడ్డించు"
మని చెప్పెను. అంత నామె స్వామివచనంబుల కెదురాడ
లేక, ఆయన తెచ్చుకొనిన రాగిసంకటి మూటను విప్పగా;
అందు కమ్మనిసువాసనలతో పంచభక్ష్య పరమాన్నంబులు
గానంబడియె. పదార్థములన్నియు నప్పుడే పచనము గావిం
పబడినట్లు కనబడుచుండెను. ఆమె అపదార్థముల నన్నిటిని
దెచ్చి భర్తకు చూపించెను. భార్యాభర్త లిరువురును
స్వామి శక్తికి నాశ్చర్యపడుచు, తమ యవివేకంబునకు పశ్చా
త్తాపపడసాగిరి. అనంతరము శివకోటయ్యయు, భార్యయు
వీరబ్రహ్మంగారి ననేకవిధంబుల బ్రస్తుతించిరి. పిదప శివకో
టయ్య బ్రహ్మంగారితో "అయ్యా! తమ యమృత హస్తం
బులతో మాకు తీర్థము దయసేయు"డని కోరగా స్వామి
వారు తీర్థంబియ వార లాతీర్థమును కన్నులకద్దుకొని స్వీకరిం
చిరి. పిదప తల్లి గోవిందమ్మను స్వాములవారి దగ్గరికి తీసు
కొనివచ్చి "తల్లీ! స్వామికి నమస్కరించి పాదతీర్థ
మును తీసుకొను"మని చెప్పెను. అంత గోవిందమ్మ సిగ్గుతో
తలవంచుకొని, ముఖమున చిరునగవు తాండవింప స్వామికి

ప్రక్కగ నిలువబడియుండెను. అంతస్వాములవారు "ఈప్సి తార్థసిద్ధిరస్తు" అని దీవించి తీర్థప్రసాదంబిచ్చి "దేవీ! నీవు సామాన్యురాలవు గావు. పరమేశ్వర్యాంశ సంభూతురాలవే గాని వేరుగాదు. లోకోద్ధరణ కార్యభారము నీపై నున్నది అట్టినీవు సామాన్యస్త్రీవలె సిగ్గుజెంద నేటికి." అని సమయోచిత సంభాషణ గావించి, యనంతరము వీరబ్రహ్మంగారు శివకోటయ్యకును, అతని భార్యకును, గోవిందమ్మకును, కాలజ్ఞాన రహస్యంబుల దెలిపిరి. అనంతరము శివకోటయ్య ఒకశుభ ముహూర్తంబున గోవిందమ్మను శ్రీవీరబ్రహ్మంగారికి కన్యా దానంబుచేసి వివాహంబు గావించెను. శివకోటయ్య గోవిందమ్మను తనప్రక్కన గూర్చుండబెట్టుకొని "తల్లీ! నీ కతంబున లోకపూజ్యుండైన యిమ్మహనీయుండు మాకు అల్లుడయ్యెను. దానం జేసి మావంశంబు పావనంబయ్యె. ఇక నీవు ఇమ్మహనీయుని యడుగుజాడలలో వర్తించుచు, ఇరు వంశములవారికిని కీర్తి దేవలయును. పుత్రపుత్రికాసంతానంబుల బడసి కీర్తిగాంచు"మని దీవించి గోవిందమ్మను వీరబ్రహ్మంగారి హస్తములయం దుంచెను. వీరబ్రహ్మంగారు కొన్నిదినములు అత్తవారింటియందుండి, పిమ్మట భార్యతో కలసి బయలుదేరి కందిమల్లయ్యపల్లెను చేరెను.

## శ్రీ వీరబ్రహ్మంగారు గోవిందమ్మతో కలసి తీర్థయాత్రలు సేయుట

వీరబ్రహ్మంగారు భార్యతో కలసి కందిమల్లయ్య పల్లెలోనుండి, ప్రజలకు జ్ఞానబోధలు గావించు చుండెను.

అనంతరము వీరబ్రహ్మంగారికి భరతఖండమునగల తీర్థయాత్రల నన్నింటిని సేవింపవలయు నను నభిప్రాయము కలిగినది. అందుచే భార్యయైన గోవిందమ్మగారిని వెంటబెట్టుకొని బయలుదేరి, మహారణ్యమధ్యములం బడిపోవుచు, మార్గమధ్యంబునగల మునీంద్రుల యాశ్రమములలోనాగి సూర్గాయాసంబు దీర్చుకొనుచు, మునీంద్రులతో సంభాషించుచు, నచ్చటచ్చటంగల వింతలను విశేషంబులను గోవిందమ్మకు జూపుచు, మహాపర్వతంబు లెక్కుచు దిగుచు, కాశీ-గయా-ప్రయాగ-హరిద్వారము-బ్రహ్మకపాలము - జగన్నాథము - పండరీపురము - సింహాచల మాదిగాగల ఉత్తర దిగ్యాత్రల నన్నిటిని గావించి. దక్షిణదేశంబునకు మరలి శ్రీశైలము దాక్షారామం-కాళహస్తి-తిరుపతి-కంచి-మహాబలిపురము - కుంభకోణము-రామేశ్వరము - ధనుష్కోటి మొదలగు సమస్త దక్షిణతీర్థయాత్రలను సేవించుకునని, అటనుండి బయలు దేరి చిదంబరము - చియాళీ-శ్రీరంగము - మొదలగు మహాక్షేత్రంబు లెల్లదర్శించి, అందుగల పుణ్యనదీ జలంబుల గ్రుంకు లిడి, కాంచీవిరూపాక్షుని సేవించి కతిపయదినంబులకు బనగానపల్లినిచేరి, పూర్వము తానుండెడి మఠంబులోన గల భక్తజనులజూచి నవాబును కలుసుకొని, అటనుండి బయలుదేరి ఓంకారక్షేత్రంబున ఓంకారేశ్వరుని సేవించి, పిమ్మట మహానందికివచ్చి యచటగల కొలనునందు స్నానం బాచరించి మహానందీశ్వరుని భజియించి, పిదప నహోబిలమునకువచ్చి సప్తప్రాకార మధ్యంబుననున్న శ్రీ నృసింహమూర్తిని పూజించి, గిద్దలూరుచేరుకొని అందుగల పాతాళ నాగేశ్వరస్వామిని దర్శించి మఱియు నందందుగల తీర్థ

యాత్రల సేవించుచు, కతిపయదినంబులకు కంది మల్లయ్య పల్లె చేరెను. అంత కొంత కాలంబునకు భక్తులు వీరబ్రహ్మంగారికి నొక మఠముకట్టించి యిచ్చుట ఉచితమని సంకల్పించుకొని, భక్తసరేణ్యు లందరును గలిసి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి కొక మఠమును గట్టించి యిచ్చిరి.

## శ్రీ వీరబ్రహ్మంగారికి సంతానము కలుగుట

ఆవిధముగ కంది మల్లయ్యపల్లెయందు భక్తులు కట్టించిన మఠమునందు ఆశ్రమమునుగావించుకొని, భక్తులకు జ్ఞానోపదేశంబు గావించుచు వీరబ్రహ్మంగారు కాలముగడుపుచుండిరి. అనంతరము కాలక్రమంబున గోవిందమాంబ గర్భంబు దాల్చి, పదియవమాసంబున నొకసుపుత్రుని గనెను. ఆబిడ్డకు 'సిద్ధలింగయ్య' యని నామకరణంబు గావించిరి. అనంతరము ఆపుణ్యదంపతులకు కాలక్రమంబున గోవిందయ్య, శివరామయ్య, పోతులూరయ్య, ఓంకారయ్య అను సుపుత్రులు కలిగిరి. శ్రీ వీరనారాయణమ్మయను సుపుత్రికయును కలిగెను. అందు జ్యేష్ఠకుమారుండైన సిద్ధలింగయ్యను శివకోటయ్యగారికి దత్తతయిచ్చిరి.

అందు ద్వితీయపుత్రుండగు గోవిందయాచార్యులకు కొలపేటలో 'గరెమ్మ' యను నామెను వివాహముచేసిరి. పిదప 'యన్నలూరు' యనుగ్రామంబున పాపమ్మయను పడుచును నిర్ణయించి తృతీయపుత్రుండైన శివరామయ్యకు వివాహము గావించిరి. అనంతరము కోము పేరుగల సంబంధమును చూచి పార్వతమ్మయను నామెను పోతులూరయాచార్యులకు పరిణయంబు గావించిరి. ఆవిధముగనే మరి

తంత్రులు సిద్ధయ్యను అల్లారు ముద్దుగ పెంచుకొన సాగిరి. శుక్లపక్ష చంద్రునివలెనే సిద్ధయ్య దినదిన ప్రవర్ధమానుం డగుచుండెను. అయిదవ సంవత్సరమున అక్షరాభ్యాసము గావించిరి.

బాల్యముననే సిద్ధయ్య హరినామస్మరణ చేయుట కారంభించెను. ఉపాధ్యాయుడు పాఠముల జెప్పుచున్నను సరిగవినక భగవన్నామస్మరణ చేసుకొనుచు కూర్చుండెడి వాడు. పూర్వజన్మ సుకృత సంపన్నుడగుటచే సిద్ధయ్య మహమ్మదీయ కుటుంబమున జన్మించినను, బాల్యముననే మాంసాహారభక్షణ విసర్జించిన వాడాయెను. పుట్టుకచేతనే బ్రహ్మజ్ఞాన సంపన్నుడగుటచే పెద్దలయందు వినయ విధేయతలు, భూతదయ, అహింస అతనికి పెట్టని యలంకారము లయ్యెను. శాంతిదాంతాది సద్గుణంబులు కలవాడై విరాజిల్లు చుండెను. భగవదనుగ్రహంబుచే సిద్ధయ్యకు పదునాల్గు వత్సరములుండెను. సంతత భగవన్నామోచ్చారణ యందేగాని సిద్ధయ్య దృష్టి వేరొండు కార్యంబులకై పోకుండెను.

## సిద్ధయ్యగారు బ్రహ్మంగారియొద్దకువచ్చుట

తాను నివసించుచున్న గ్రామమందలి జనులందరును శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి మహిమలను చెప్పుకొనుచుం డుట వినినవాడై, వేదాంతజిజ్ఞాసమానసో ద్రేకంబుచే తల్లి దండ్రులకు చెప్పకయే ఒకనాటి యర్ధరాత్రంబున లేచి, బయలు దేరి వీరబ్రహ్మంగారిని దర్శింపవలయును అను నిశ్చలచిత్తం బుతో కందిమల్లయ్య పల్లెకుం జనెను. కొన్నిపుష్పంబులు పూచినదాదిగనే సువాసనల వెదజల్లుచుండును గదా! సం కల్పసిద్ధుల ఆలోచనలకు తిరుగుండునే!

ఆ విధంబుగ కందిమల్లయ్య పల్లెకుంజని, శ్రీవీరబ్రహ్మేంద్ర స్వాములవారి మఠం బెక్కడనని యాతాయాత జనంబుల నడుగుచు దెలుసుకొని సువిశాలంబైన మఠంబును సమీపించి, సింహద్వారము దగ్గరకుపోయి, సింహద్వారంబు కడ సాష్టాంగదండ ప్రణామంబులు గావించి, మొదటలోపల కుడిపాదంబునుంచి లోనికిం జని. తపోనిష్ఠాగరిష్ఠులై యున్న భక్తవరేణ్యుల గాంచి పులకాంకిత గాత్రుండై, తన్మయత్వంబునం మునింగి, కొంతవడికి దెప్పరిల్లి, తనలో "అహో! ఈమఠమాహాత్మ్యంబు వర్ణనాతీతంబుగదా! నాపూర్వజన్మ సుకృతఫలంబుచే గాబోలు పరమేశ్వరుండు నన్నిటకు జేర్చె. ఇంక కాలిడినదిమొదలు నాకెన్నియో శుభశకునంబులు గానంబడుచున్నయవి. ఈమఠంబు చూడగా రెండవకైలాసంబువలె చెన్నొందుచున్నది గదా! ఇందుగల భక్తులు నారదతుంబురాది మునిగణంబును పరిహసింపజాలున ట్లొప్పుచుండిరిగదా! ఇందలి భక్తగణము కూర్మాసన, పద్మాసన, ఉత్తానకూర్మాసన, టిట్టిభాసన, వీరాసన, స్వస్తికాసనాదులచే నొప్పుచు, తమదృష్టి నాసికాగ్రంబునను నిలిపి నిశ్చల మనస్కులై తపంబాచరించుట గాంచిన, వీరల జీవితంబులు ధన్యతగాంచినట్లు తోచుచున్నది. కేవల వల్కలాంబరులై కృష్ణాజిన వ్యాఘ్రాజినముల గూర్చుండి, కందమూల ఫలాదులను భక్షించుచు కర్మ భక్తిజ్ఞాన వైరాగ్య జపతపహోమాది సత్కర్మానుష్ఠానపరులై యున్న భక్తగణంబు మధ్య సింహాసనమున గూర్చుండి. తారాగణంబుమధ్య వెలుగొందు రెండవ సుధాంశునివలె చెన్నొందుచున్న. భగవదంశసంభూతుండు గావున నిరుపమాన తేజో ప్రభావంబుచే శోభిల్లుచున్న వీరబ్రహ్మేంద్ర స్వాములవారిని సిద్ధయ్యగాంచి, తన్మ

యత్నంబు చేంది. కొంతవడికి దెప్పరిల్లి శ్రీ స్వాములవారి పాదంబుల పైబడి, సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి లేచి, నిలువబడి, నమస్కరించుచు అనంతకోటి బ్రహ్మాండ నాయకా! ఆదిమధ్యాంతరహితా! శ్రీమద్విరాడ్విశ్వకర్మ వంశోద్భవా! బ్రహ్మాండపురనివాసా! భక్తవరదా! సంపూర్ణావతార! ప్రకృత్యంతరాగర్భ శుక్తి ముక్తాఫలావతారా! నాదబిందు కళాతీతా! అమనస్క యోగ నిష్ఠాగరిష్ఠా! అఖండ మండలాకారా! సచ్చిదానంద స్వరూపా! స్వామీ! సద్గురు మహాప్రభూ! సకలలోకరక్షకా! పరాత్పరా! ఈ అజ్ఞానతిమిరంబునంబడి మార్గంబుగానక పరితపించు నీ మూఢుని తమశిష్యునిగ పరిగ్రహించి రక్షింపవే" యని వేడుచున్న సిద్దయ్యను గాంచి, స్వాములవారు ఈప్సితార్థసిద్ధిరస్తు - అని ఆశీర్వదించి కూర్చుండ నియోగించెను.

చతుర్థప్రకరణము సమాప్తము

---

# పంచమ ప్రకరణము

## స్వాములవారి కుమారులు సిద్దయ్యను దూషించుట, స్వాములవారు కుమారులకు నీతిని బోధించుట

సిద్దయ్య [illegible] అపకీర్తి సంభవించుచున్నదని, స్వాములవారి కుమారులైన గోవిందయ్యయు, పోతులూరయాచార్యులును కోపోద్దీపి

తుడై మనమఠములో నుండవలదని, మాకుమాసువడలిపొమ్మని
యనేక విధముల దుర్భాషలాడ నారంభించిరి. చేయునది లేక
సిద్ధయ్యవారితో "నాయనలారా? యథార్థము నాలోచిం
పగా శరీరంబునకేగాని, ఆత్మకు జాతిభేదంబులు లేవుగదా?
హీనకులుండైన వాల్మీకి ఒకముని యొక్క కరుణచే తరించ
లేదా! కులభేదములు పాటించుట యజ్ఞానముగదా! నన్ను
మీ సోదరులలో నొకనిగా భావించి రక్షింపు"డని యనేక విధం
బుల వారిని వేడ నారంభించెను. అయినను వారాతని ప్రార్థ
నల నంగీకరింపక "ఓరీ! నీకెంత చెప్పినను ప్రయోజన మావం
తయు లేదు. నీవు మఠంబునందున 'మఠము అనాచారమై
పోయిన'దని ప్రజలు చెప్పుకొనుచున్నారు. నీవలన మామఠము
నకును, మాకును కూడ నపకీర్తి సంభవించుచున్నది. కనుక
నిటనుండి సత్వరమే వెడలిపోవలయును. మఠమునుండి వెలు
పలకు పొమ్మని నెట్టి కొట్టసాగిరి.

మఠమునందు తనకు ఆశ్రయము లభింపక పోయినందుకు
సిద్ధయ్య విచారించుచు, అయినను తుదినారి స్వాములవారినే
యడిగి చూతమని స్వామియొద్దకుం బోయి. ఆయన పాదంబుల
పైబడి "సద్గురూ! నీ పాదసేవతప్ప నాకీ ప్రపంచంబున నిత
రము కేమియు నవసరము లేదు. ఈ ప్రపంచంబు మిథ్యయని
భావించి, నీపాదసేవ జేయుచు తరింతునని వచ్చితిని. తమ
పుత్రులైన గోవిందయ్య, పోతులూరయాచార్యులును నే
నిందుండ నర్హుడనగానియు, నావలకుం బొమ్మనియు బాధించు
చున్నారు. వారికి జ్ఞానోపదేశంబు గావించి నన్ను కటాక్షిం
పవే"యని పాదములు వదలక అనేకరీతుల వేడుచున్న
సిద్ధయ్యను గాంచి, ఆతడు నిశ్చలభక్తిగలవాడని గ్రహించి,

కుమారులను పిలిచి, స్వాములవారు "నాయనలారా! కులములు పాటించుట అవివేకము. కులం బేదైన నేమి? జ్ఞానమే ప్రధానము. అందఱును మూత్రపురీష సంయుతంబైన రజస్సంభూతులే గదా! కులాతిశయంబుల పాటింపక సిద్ధయ్యను మీతో సమానముగ గౌరవింపుడు. ఈశరీరములు ఎముకలు, మాంసము, నరములతో నిండి వాతపిత్త శ్లేష్మాదుల ప్రకోపంబుచే నానావిధగంబులచే బాధపడుచుండును. జీవితములు నీటిపైనుండు బుడగలవంటివి. ఇట్టి అశాశ్వతంబైన శరీరముపై నభిమాన ముంచుకొని, యీ ప్రపంచము శాశ్వతమే యనుకొని, సర్వము శాశ్వతమే నని కామక్రోధ లోభ మోహమద మాత్సర్యములకు లోనై కొట్టుకొనుచు, ముక్తి మార్గమును మరచి దురవస్థలకు లోనై బాధలజెందుందురు. ఈ రీతిగ జీవితకాలమును నిరుపయోగంబుగ వ్యర్థము గావించి సంచరించుచు, నంత్యమున యముని సమ్మెటపోటుల కోర్వలేక నరకకూపంబునం బడివిచారించుచుందురు. అనంతరము నానాయోనులం బుట్టుచు నుందురు. నాయనలారా! ఇట్టి జననమరణ ప్రవాహమునుండి తప్పించుకొను వారే భాగ్యులు.

## సిద్ధయ్య కనుపించనందున తల్లిదండ్రులు విచారించుట

ఆవిధముగ బ్రహ్మజ్ఞాన సంపన్నుడైన సిద్ధయ్య తల్లిదండ్రులకు చెప్పక యర్థరాత్రియందు నింటినుండి బయలుదేరి కంది మల్లయ్యపల్లెకు పోయిన పిదప నుదయము సిద్ధయ్యతల్లిదండ్రులు తమకుమారుడు కనుపించనందున దిగులొంది యూరంతయు వెదకిరి. బావులు, చెరువులుకూడ చూచిరి. ఎంత

వెదకినను సిద్ధయ్య కాన్పింపడయ్యె. వెదకి, వెదకి విసిగి సాహే యికలాభములేదని బిడ్డపై నాశ వదలుకొనిరి. తల్లియైన ఆదంబి పుత్రవియోగమును భరింపలేక నేలపైబడి దొరలుచు వెక్కి వెక్కి యేడ్వసాగెను, గుండెలు బాదుకొనుచు "అయ్యో! సిద్దయ్యా! ఏమైపోయితివి నాయనా! నిన్ను జూచినవారలు జగత్ప్రఖ్యాతిని గాంచువాడవగుదువని చెప్పుచుండెడి వారు గదా! తండ్రీ! పాఠశాలయందు విద్యాబుద్ధులలో నీకు సమానులు లేరని, తోటిబాలురలలో నీకంటె మిన్నయగు బాలుండు లేడని, నీగురువులే చెప్పుచుండ విని యెంతయో యానందించెడి దానను. తండ్రీ! నీవిద్యాబుద్ధులే మైనవోగదా! పరమేశ్వరుండు నిన్ను చూడలేకపోయెనా! ఇంత పిన్నవయస్సుననే నికిట్టి విద్యాబుద్ధులు అలవడు టేమియని, అందరు నాశ్చర్యపడసాగిరే; కన్నతండ్రీ! మావృద్ధాప్యమున నీ సంసారమును వడిపి, మమ్ముల సుఖపెట్టెద వనుకొంటిని; నాయనా! నీకప్పుడే నూరేండ్లు నిండెనా? తండ్రీ! నీవులేని నాకీబ్రతు కెందులకు? మాయాస లన్నియు నిరాశలజేసితివా" అని వెక్కి వెక్కి యేడ్చుచుండెను. అంతలో సిద్దయనను వెదకుటకు బోయిన పీరుసాహేబు వచ్చి "దేవీ! విచారింపకుము. మనసిద్దయ్య జాడ తెలుసుకొని వచ్చితిని. సిద్దయ్య కందిమల్లయ్య పల్లె బోయి అక్కట వీరబ్రహ్మంగారి మఠములో నున్నాడనియు, గారికిశుశ్రూషలజేయుచు నందున్నాడనియు, కందిమల్లయ్య పల్లెనుండి యిప్పుడే మనగ్రామమునకు వచ్చిన సాధువులు చెప్పుచున్నారు. నేను వెంటనే కందిమల్లయ్యపల్లెకు బోయి మనసిద్దయ్యను తీసుకవత్తును. నీవు విచారింపక యింటనే యుండు"మని భార్యతో చెప్పగా ఆమె "నాథా!

పసిపాపవైన మనపిల్లవానికి బ్రహ్మంగారివిషయ మెట్లు తెలిసినది? ఎవరైనను తీసుకొనిపోయిరా? లేక తనంతటతానే వెళ్లెనా? నన్నువదలి యీ నాల్గుదినంబులు నెట్లుండగలిగెనో గదా! మీరికబోయి బ్రహ్మంగారి కీవిషయమంతయు చెప్పి మనసిద్ధయ్యను మనయింటికి తీసుకొనిరం"డని పీరుసాహేబును కందిమల్లయ్యపల్లెకు పంపెను. పీరుసాహేబు వడివడిగ కందిమల్లయ్యపల్లెకుం జని, బ్రహ్మంగారి మఠమును జేరి, లోనికింబోయి, బ్రహ్మంగారి పాదములదగ్గర కూర్చుండి ఆయనపాదము లొత్తుచున్న కుమారునింగాంచి, తనకుమారుడు మరల తనకంటికి కనబడినందులకు సంతోషించుచు, రివ్వున కుమారునిదగ్గరకుంబోయి, సిద్ధయ్య చేయిపట్టుకొని, కౌగిలించుకొని కంటతడిపెట్టుచు "నాయనా! యిక్కడి కెట్లు వచ్చితివి? నీకొరకై మీయమ్మ బెంగపెట్టుకొని, నిద్రాహారములు మాని విచారించుచున్నది. ఇంకమనయింటి కేగుదము గమ్ము. మన మిక నిక్కడ నొక్కక్షణమైనను ఆలస్యము చేయరాదు. మనకై మీయమ్మ యెదురుచూచుచుండు"ననిన విని, సిద్ధయ్య, నవ్వుచు "తండ్రీ! నాకు తల్లి ఎవ్వరు? తండ్రి ఎవ్వరు? నేను మరల నింటికి వచ్చుటకు నిచ్చటకు వచ్చి యుండ లేదు.

పీరు :- "నాయనా! నీమాటలు విచిత్రముగ నున్నవి ఇక్కడనుండి ఏమిచేయదలంచితివి?

సిద్ధ :- తండ్రీ! నేను వీరబ్రహ్మేంద్ర స్వాములవారి దగ్గర విద్య నేర్చుకొనదలచి వచ్చితిని.

పీరు :- కుమారా! మనగ్రామములో పాఠశాల లేదా? అక్కడ లేని విద్య యిక్కడేమి ఉన్నది?

సిద్ధ :- జనకా! నేను నేర్చుకొనదలచినది పొట్టకూటి విద్యగాదు, బ్రహ్మవిద్య. ఇది సామాన్యముగ లభించునది కాదు. సామాన్యులు దీనినభ్యసింపలేరు. ఇట్టివిద్య నుపదేశించుటకు సద్గురువు లభించుట దుర్లభము. శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవంటి గురువులు లభించుట నాపూర్వజన్మఫలము.

వీరు :- కుమారా! 'బ్రహ్మవిద్య యననేమి?'

సిద్ధ :- అజ్ఞానాంధకార కూపంబునంబడి సంచరించు మూఢులకు జ్ఞాననేత్రంబును ప్రసాదించునదియే బ్రహ్మవిద్య, అట్టి జ్ఞాననేత్రంబును కలుగజేయువాడే సద్గురువు. వాడేతండ్రి. ఈవిద్య సకలవేదవేదాంగ శాస్త్రపురాణేతిహాసములకు నతీతంబైనది సుమా! నేను తనయుడ నని, నీవు తండ్రివని భావించుటే అజ్ఞానము. ఈ సంబంధములు శరీరాత్మకములే, జీవాత్మకములు కావు, తండ్రీ! నీవిక వెఱ్ఱిఆశలను కట్టికొట్టి, జన్మతరించు నుపాయము నాలోచింపుము.

## సిద్దయ్య యింటికి రానని తండ్రి కెరిగించుట

ఆరీతిగ తనమాటలకు బదులుచెప్పుచున్న తనయుని మాటలకు నాశ్చర్యపడుచు కుమారుని పీరుసాహేబు "చూడగా నీకు పదునాలుగు సంవత్సరముల వయస్సేగదా! అప్పుడే నీకు వైరాగ్యమా? అదియునుగాక మహమ్మదీయులకు హిందూమతధర్మములు ఆచారవిరుద్ధములుగావా? మన దేవుడు అల్లానువదలి హిందూదేవతలను కొలుచుచున్న, తోటి మహమ్మదీయులలో మనకు చిన్నతనముగాదా? వృద్ధాప్యములో మమ్ము గాపాడెదవని, నిన్ను పెంచి పెద్దచేసిన మమ్ము విడనాడుట ధర్మమేనా? ఈరీతిగ జేయువానికి మోక్షమెట్లులభించు?" నని గద్దించియడుగుచున్న తండ్రిమాటలకు వినయవిధేయుత

లతో "తండ్రీ! చిన్నతనంబును, వృద్ధతనంబును ననునవి శరీరంబునకేగాని జీవునకు కాదా. సర్వము నెరింగిన నీవే యిటుల చెప్పుట ధర్మమా? దేవుడందరిమతముల వారి కొక్కడేగదా! అలంకారములు వేరైనను సువర్ణలోహంబు వేరగునా? ఎవరి కేరితిగ నభిరుచియో, వారావిధముగ దైవము నారాధించుట మతముకదా! నెనెన్నిజన్మముల నెత్తితినో వారందరు నాకు తల్లిదండ్రులేనా? వారందరికి నీవృద్ధాప్యమున నేను సేవలు చేసితినా? అందరిని సంరక్షించువాడు పరమేశ్వరుడే గాని నేను కాదుగదా! పరమార్థంబు పాటింపక నీ వాడు మాటలు ధర్మవిరుద్ధములుగావా! కాన నీ ప్రపంచమాయ అందగిలి, బేలతనంబున నీవాడుమాటలు హాస్యాస్పదములుగ నున్నవి" అని పలుకుచున్న కుమారుని మాటలు చెవులకు ములుకులవలె తోచ, పీరుసాహేబు "బిడ్డా! వయోధర్మము పాటింపనలదా! నీ వాడుమాటలు యుక్తియుక్తములైనవె గాని, గృహస్థాశ్రమవాసులకు నాచరణీయములైనవిగావు. వివాహముచేసుకొని, గృహస్థాశ్రమమున సౌఖ్యముగ కాలము గడపుచు, అతిథి-అభ్యాగతుల నాదరించుచు దైవమును ప్రార్థించుచున్న మోక్షము సూక్ష్మములో పొందవచ్చును. గదా" అనిన విని సిద్దయ్య "తండ్రీ! నీకీప్రపంచపచ్చి వదలుట అసాధ్యమని తోచుచున్నది. సంసారసుఖంబుల రోసి, కేవలము వైరాగ్యము నవలంబించి, సద్గురువును సేవింపవచ్చిన నాకు వివాహంబు జేసి, సంసారమను బురదలో ముంచదలంచు చుంటివా! సంసారము వలనను భార్యయందు గలుగు మోహమువలనను సౌఖ్యము పొందవచ్చునని యీ మీ తలంపు! భార్య, బిడ్డలు, ధనము, గృహము ఇవి శాశ్వత

సుఖమును కలుగచేయుగలవా? స్వల్పకాలము మాత్రమే యుండు ఇహలోక సౌఖ్యముల జూచుకొనుచు, శాశ్వతానంద సంధాయకంబగు సౌఖ్యమును మరచుట వివేకదాయకమా?

## సిద్ధయ్య తండ్రికి విరక్తిమార్గమును చెప్పుట పీరుసాహేబు తనకుమారుని శ్రీవీరబ్రహ్మేంద్రస్వాములవారికి అప్పగించి గృహంబున కేగుట

తండ్రీ! ఇహపాశంబులనుండి తెంచుకొనగలిగినవాడే ధన్యుడు. అప్పుడే సరియైనజ్ఞానము లభించును. అట్టిజ్ఞానము వలన సంసారక్లేశములనుండి తప్పించుకొననగును. అప్పుడు తపం బాచరింపవలయునను కోరిక కలుగును. పరమేశ్వరాను గ్రహము పొందుట కదియే ఉత్తమమార్గము. కనుక జీవన్ముక్తికై నేజేయు ప్రయత్నమునుండి నన్ను వారింప వలదు. కాన నిక నాకై విచారింపక మీయిరువురును, భగవన్నా మమును స్మరించుచు కాలముగడపుడు. నన్నాశీర్వదించి గృహంబునకుం జనుము. ఇదియే నామనోనిశ్చయము. ఇక నామ నస్సు సంసారసుఖంబులపై పోదు. వివేక జ్ఞానముకల మానవుడు హేయభాజనంబైన సంసార సౌఖ్యమును వదలి సకల లోకారాధ్యుం డగు పరమేశ్వరుని చేరుమార్గము నెరుగుటకై సద్గురువు నాశ్రయింపవలయును. మీనములు జలంబునువదలి చరియింపలేని తెరంగున, భక్తుడు సద్గురువును వదలి చరియించుట దుస్తరము. కేవల శ్రీమన్నారాయణ స్వరూపుండైన శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారిని విడిచి నేను గృహంబునకు రాజాలను. నీమాటల కెదురాడుచున్నందులకు నన్ను క్షమియింపుము. తల్లిగారికి నావినయపూర్వక నమస్కారంబులను

తెలుపుము, ఇక నాపై నీవు ఆశవదలి గృహంబునకుంజని సుఖం బుండు"మని చెప్పెను.

పీరుసాహేబు తనకుమారుడు చెప్పిన వైరాగ్యవచనములు విని, మొదలునరికిన వృక్షంబువోలె నేలపైబడి యేడ్చుచు, స్పృహతప్పి కొంతవడికి తెలివిగాంచి, కన్నులనీరు తుడుచుకొనుచు "కుమారా! మేము నిన్నువదలి జీవింపగలమా?-నాసిద్దయ్య యేడని యడుగ, మీయమ్మకు ఏమని చెప్పగలను? మాగర్భంబుల చిచ్చు పెట్టితివా? ఎన్నివిధంబుల చెప్పినను నామాటలు పెడచెవిని పెట్టుచుంటివి కదా! ఇక మమ్ము రక్షించువా రెవ్వరు? మా ఆశలు నిరాశ లయ్యెనా! పరమేశ్వరా! లేక లేకకలిగిన తనయు డిట్లయ్యెనా? పూర్వజన్మంబు మేముచేసిన మహాపాపం బెట్టిదోగదా?" యని ఏడ్చుచు నెంత చెప్పినను సిద్దయ్య యిక గృహంబునకు తిరిగి రాడని తెలుసుకొని, నిశ్చయించుకొని, యిక లాభము లేదనుకొని, పొంగిపొరలివచ్చుచున్న దుఃఖమును దిగమ్రింగుచు, గుండె రాయిచేసుకొని, సిద్దయ్యను కౌగలించుకొని, పిదప వీరబ్రహ్మంగారి దగ్గరకుచేరి, సలాముచేసి "అయ్యా! సిద్దయ్య నేనెంత చెప్పినను వినకున్నాడు. ఇక వీనిని తమకు నప్పగించి, గృహంబునకుంబోవ దలచితిని. ఇక వానిని మీరు తండ్రివలె కాపాడుచు, చిన్నతనంబుచే నేవైన యపరాధంబులుగావించునెడల క్షమించుచు, తమకుమారునివలె చూచుకొనవలసినదిగ కోరుచున్నాను" అని చెప్పి మిగిలినభక్తుల యొద్దకూడ సెలవుతీసుకొని, కందిమల్లయ్యపల్లెను వదలి, ముడుమాలచేరుకొని జరిగిన విషయమంతయు భార్య కెరిగిం

చెను. అనంతరము పీరుసాహేబును, నాదంబియు తరచు కంది మల్లయ్యపల్లెకు వచ్చి, సిద్ధయ్యను చూచిపోవు చుండిరి.

## శ్రీస్వాములవారు సిద్దయ్యభక్తిని పరీక్షించుట

సిద్దయ్య ఆరీతిగ తండ్రిమాటలను త్రోసిపుచ్చి తిరిగి యింటికి పోకుండుట, జూచి, వీరబ్రహ్మంగారు "ఓయీ! సిద్దా! నీవు మహమ్మదీయ మతాచారములను వదలి, హిందువులతో కలసి జాతిభ్రష్టుడ వగుచున్నావని తలపోసి, విచారించుచు నీతండ్రి యిటకువచ్చి, నిన్నెంత బ్రతిమాలినను తిరిగి యింటికి బోకుంటివి. తల్లిదండ్రుల యాజ్ఞ మీరుట ధర్మ విరుద్ధముగాదా! నీవు తిరిగి గృహంబునకేగి, నీతల్లిదండ్రులకు సమ్మతమైన కన్యను వివాహముచేసుకొని హాయిగ నుండుము. లేకున్న నిన్ను మతభ్రష్టుని గావించితినను నవ ఖ్యాతి నానెత్తిపై బడును. దానంజేసి మహమ్మదీయులు మాపై విరోధము వహించి, మమ్ముల బాధింతురు. నేడుచూత మన్న పాలకులుకూడ మహమ్మదీయులే గదా! అందుచే నిన్నిందుండనిచ్చిన, మాకును మామతంబునకును ముప్పు తప్పదు. ఇట్టి ఆపద సంభవించునేమో యనియే గోవిందయ్యయు, పోతులూరి యాచార్యులును, నిన్ను నిందుండనీయ రాదని పట్టుపట్టుచున్నారు. నే తెల్పునవన్నియు నీకప్రియంబుగ తోచవచ్చును. అదియునుగాక అపరమాత్మ స్వరూపంబును తెలుసుకొనుట హరిహరాదులకే యలవిగాదు. సంసారంబులరోసి, విపినభూములందుండి పవనభక్షకులై ఘోర తపం బాచరించువారి కేమైన ప్రాప్తించునేమోగాని, నీవంటి పసివానికి నసాధ్యము. కనుక నిటనుండి వెంటనే వెడలి

పో''మ్మనిన విని, సిద్దయ్య మొదలు నరికినవృక్షమువలె నేలపై బడి మూర్ఛిల్లి, కొంతవడికి తెప్పరిల్లి లేచికూర్చుండి, కన్నుల నీరు తుడుచుకొనుచు "స్వామీ' హేయంబైన సంసారసుఖం బులంబడి మునుంగుట కంగీకారము లేనివాడనై సర్వమున్ను పరిత్యజించి, మీరే సర్వమునని నమ్మికొని, మీపాదమునాశ్ర యించినవానిని పొమ్మనుట న్యాయమా? మరలగృహంబు నకుబోయి సంసారసాగరంబున మునుంగు మనిచెప్పుట ధర్మ మా? ప్రాణత్యాగమైనను గావించుకొందును గాని, తిరిగినేను గృహంబునకుబోను. నీపాదసాక్షిగ నేనికనింటికి బోనని త్రిక రణశుద్ధిగ తెలుపుచున్నాను. నాపూర్వజన్మ సుకృతఫలంబు నంజేసి, నేటికి మీపాదసేవ లభించినందుల కెంతయో ఆనం దించుచున్నాను. తమకు నాపై కరుణకలుగకపోవుట నాదుర దృష్టమే గాని వేరుగాదు. నాపైమీకింత వెగటుకలిగిన నా కిక ప్రాణత్యాగమే శరణ్యము. అనుగ్రహించి నాతప్పులు మన్నించి నన్ను సుజ్ఞానునిగ జేయవే' యని స్వాములవారి పాదంబులంబట్టుకొని, వదలక యుల్లేయున్న సిద్దయ్యను గాంచి స్వాములవారు సిద్దయ్యపై జాలినొంది "సిద్దా! విచారించ కుము. లెమ్ము. నీమతస్థులైన మహమ్మదీయులవలన మాకెట్టి కష్టములు కలుగునోయని, అట్లంటినే గాని, నీపై నాకెట్టి క్రోధమును లే''దని చెప్పెను.

## బ్రహ్మంగారు సిద్దయ్యకు బ్రహ్మోపదేశము గావించుట

"ఆహా! ఏమి! ఈతనిభక్తి నిరుపమానమైనదిగ తోచుచున్నది. ఎందరినో చూచుచున్నాముగాని, యిట్టినిశ్చల భక్తిసంపన్నుని గానము. బాల్యముననే యీతని కిట్టిజ్ఞానసం

పన్నత్వము, పూర్వజన్మ సుకృతఫలంబు వలననే లభించి యుండ నోపు"నని బ్రహ్మంగారు తనమనంబున తర్కవిత ర్కంబుల గావించుకొని. బ్రహ్మోపదేశముపొందుటకు సిద్దయ్యే తగినభక్తుడని స్థిరపడచుకొని, ప్రేమతో సిద్దయ్యను చేరబిలచి "వత్సా! నీవు విచారమున నున్నట్లు కనబడు చున్నావు. విచారమును వదలుము. భక్తులైనవారు సుఖదుఃఖములను రెండింటిని సమానముగ పాటింపవలయును. నీకు బ్రహ్మోద దేశంబు గావించి తరించు మార్గము నెరింగింతును. వినుము. మాంసపిండంబైన శరీరమును మంత్రపిండంబుగ జేసెదను వినుము నన్ను నమ్మినవారికి, నా భక్తులకు, ఎట్టి ఆపద సంభవించినను అట్టి యాపద నా యాపదగనే భావించి, వారి నా యాపద నుండి రక్షించుచుండుటయే నా కర్తవ్యము. నా భక్తులకెట్టి కొరతయు రానీయను. వారియభీష్టముల నెరవేర్చుటయె నా పని" అని చెప్పుచు, సిద్దయ్యను పద్మాసనము వేసుకొని కూర్చుండు మని, ఆతని శిరస్సును తనచేతులతో తడుపుచు. లలాటలిఖితంబైన పూర్వపుఁవ్రాలును తుడిచి మరల వ్రాసి, నాలుకచాచమని, అద్దానిపై బీజాక్షరముల వ్రాసి, వీపుతడు వుచు సిద్దయ్య చెవిలో "ఓం, హ్రీం, క్లీం, శ్రీం, నమశ్శివాయ పరబ్రహ్మణే నమః" అను బీజాక్షర సంయుతంబైన పంచా క్షరీమహామంత్రంబును బోధించి, బిడ్డా! నీవు సామాన్యుండవు కావు. పూర్వజన్మ సుకృత ఫలంబునంజేసి నీకిట్టిజ్ఞానం బల పడినదేగాని వేరుగాదు. నేజెప్పునది స్థిరచిత్తుండవై వినుము. నేచూపించు లక్ష్యంబును చక్కగ చూడుము. అంతర్లక్ష్యం బును జూడుము. మనస్సును, పవనంబును బంధించి, త్రివేణీ సంగమంబగు భ్రూమధ్యమున దృష్టి నిలిపి పరంజ్యోతిని

చూడుము. ఆ రీతిగ దృష్టిని నిలిపి బుద్ధిని పరబ్రహ్మాయం దైక్యము గావించి, ముక్తిని బొందుము.

బాహ్యాలక్ష్యము ;- బిడ్డా! పైన చెప్పబడిన విధముగ దృష్టిని నిలిపి, నాలుగంగుళ దూరమున నైల్యంబును, ఆరంగుళ దూరమున ధూమ్రంబును, ఎనిమిది యంగుళముల దూరమున రక్తవర్ణంబైన కాంతియు, అట్టిజ్యోతి పండ్రెండంగుళమున పీతవర్ణంబుగను గానంబడును. పంచభూతవర్ణంబులై నీవైదును ఎదుట గానంబడినప్పుడు తలమీది కెత్తుచు, తదేక దృష్టితో వీక్షించిన చంద్రప్రకాశసమానంబైన జ్యోతి గానంబడును. అట్టిసమయంబున చెవులు, ముక్కు, నేత్రములు అను నాలు రంధ్రములను చేతివ్రేళ్ళతో మూసుకొని, నా జ్యోతియందు చిత్తంబు లీనంబుగావించునెడల ప్రణవనాదంబు వినబడును. అదియే బాహ్యాలక్ష్యం బనంబడును.

మధ్యలక్ష్యము :- పైన చెప్పబడిన విధముగ దృష్టిని నిలిపి, మనస్సునంతయు నాదృష్టియందే లగ్నంబుచేసి, తదేక దృష్టితో వీక్షించుచున్న యెడల, సూర్య చంద్రాదుల ప్రకాశంబును, నక్షత్రంబులును, మెఱపులును, పంచభూతములును ఆజ్యోతియు కనబడ నారంభించును. మఱియు నాజ్యోతియందు నిరవధికంబును, గాఢాంధకారంబును, కాలాగ్నిసమానమైన పరాకాశంబును, అధికప్రకాశంబగుతత్త్వాకాశంబును, అనంత కోటి సూర్యప్రకాశంబులను పంచ విధాకాశంబులును నంత్యు గానంబడును. అట్టి పంచవిధాకాశంబులను జూచుచు తన్మ యత్వంబు జెందుము. ఇదియే మధ్యలక్ష్యం బనబడును.

అంతర్లక్ష్యము :- పైన చెప్పబడిన విధముగ నాసికాగ్రమున దృష్టిని నిలిపినప్పుడు కనంబడు జ్యోతిరసనంబునకు

ఆశ్రయమై గానంబడుచుండును. ఇట్టిజ్యోతి భ్రూమధ్యమున బరమాత్మహైరణ్య సచ్చిదానందామృతములను సాక్షిస్వరూపమై బాహ్యాంతరమున గానంబడుచుండును. అట్టిరెంటిచిహ్నములును స్ఫటికనైల్యవర్ణంబున నాయుపస్థానమందుండి, జీవతారకంబను నామంబుతో వెలయుచుండును. ఈరీతిగ తారకయోగాభ్యాసంబు ప్రతిదినము నభ్యసించుచుండిన యెడల, మనస్సును వాయువును చలింపక స్థిరత్వము పొందియుండును. అప్పుడు అంతరాత్మ పరమాత్మయందు ఐక్యము జెందింప సాధ్యంబగును. ఇట్టియోగాభ్యాసంబువలన నెట్టి కార్యంబులనైనను సాధింపవచ్చు"నని యెరింగించినవిని, సిద్ధయ్య అమితానందంబు నొంది స్వాములవారితో నిట్లనియె.

## స్వాములవారు శిష్య గురు స్వభావంబు లెరిగించుట

"స్వామీ నేను అజ్ఞానుడను, శిష్యులక్షణంబు లెట్లుండవలయునో తెలిపి, నన్ననుగ్రహింపవే"యన, స్వాములవారు "సిద్దా! నే జెప్ప బోవు విషయంబులు శ్రద్ధతో వినుము. శిష్యుండు సదా గురునకు సేవలు చేయుచు, గురునియందు భక్తి శ్రద్ధలతో వర్తించుచుండ వలయును. మరియు శాంతము, విశ్వాసము, అహింస. భూతదయ మొదలగు సద్గుణములు కలవాడై, పాపకార్యముల నాచరింపక. వేదోక్తకర్మల నాచరించుచు వృూర్వాచారముల విడనాడక, ఫలాపేక్షరహితుండై ప్రపంచభోగముల యందు మనస్సును బోనీయక, గురువే పరబ్రహ్మస్వరూప మని భావించుచుండువాడే నిజమైన శిష్యుం డనంబడును. ఇట్టిధర్మంబుల నవలంబించి మోక్షము సాధింపవలయు నను పట్టుదల గలవాడై, అజ్ఞానంబను సంసార

మును వదలి, అహంకార మమకారములయందు మనస్సును జొనియక, దేహాభిమానమును త్యజించి యథార్థ జ్ఞానంబు కలవాడై, కామక్రోధ రాగద్వేషాదులను విడచి, సాత్వికాహార సాత్విక జీవనంబుల కలవడి, గురువులయనుగ్రహంబునకు బాత్రుండు గావలయును.

"ఇక సద్గురులక్షణంబు లెరింగించుచున్నాను, వినుము. ధర్మము తప్పక చరించువాడును, దంభదర్పాది గుణంబులు లేనివాడును, సత్కర్మల నాచరిందువాడును, సంసారసుఖములయం దాసక్తి లేనివాడును, నిందాస్తుతులను పరిగణింపనివాడును, అహంకార మమకారములు లేనివాడును, దాన ధర్మపరోపకారాది సద్గుణంబులు గలవాడునునై యుండవలయును. అట్టివాడే గురుం డనజెల్లును. అన్యులకు గురునామంబు చెల్లదు."

"మరియు, సిద్ధా! నే తెలుపంబోవు విషయంబులను శ్రద్ధాళుండవై యాకర్ణింపుము. మనస్సు పరిపక్వంబైనవారందరును బ్రహ్మవిచారమును చేయవచ్చునని. గీతాశాస్త్రమునందు చెప్పబడియున్నది. సంసారదుఃఖ నివృత్తికోరకందరును బ్రహ్మజ్ఞానమున కర్హులేయని యెరుంగుము. నేను అజ్ఞానుడను, నేను కృశాంగుడను, నేను వికలాంగుడను, నేను సంసారబద్ధుండను, అశక్తుడను, నేను శూద్రుడను, నేను స్త్రీని, అని యీరీతిగ ననాత్మయైన శరీరమం దాత్మబుద్ధితో గూడి, అజ్ఞానులై, నిజస్థితిని గ్రహింపజాలక, బ్రహ్మ జ్ఞానమునకు నేనర్హుండనని భావించుచు, తమవారు జీవితములను. నిష్ప్రయోజనములుగ గావించుచున్నారు. కనుక భేదంబులు కల్పించుకొనక, సర్వజనులును బ్రహ్మజ్ఞానమును పొందుటకై ప్రయత్నంబు

గావింప నుచితంబగును. బిడ్డా! నీవు పూర్వజన్మ ఫలంబుచే పుట్టుకనుండియు బ్రహ్మజ్ఞాన సంపన్నుడవు. కావుననే నీకిట్టి చిరుతప్రాయంబుననే వైరాగ్యంబు కలిగినది. నీవు యోగ్యుం డవు. నీ కిక జన్మపావనమునుగూర్చి తెలుపుదును వినుము.

## శ్రీ స్వాములవారు సిద్దయ్యకు జన్మపావనమును గురించి తెలుపుట

శ్లో॥ భోగే రోగభయం రతౌ యమభయం విత్తేనృపాలాద్భయం।
మానే దైన్యభయం, బలేరిపుభయం, రూపేజరాయాభయం।
శాస్త్రే వాదభయం. గుణేఖలయం కామేకృతాంతాద్భయం।
సర్వంవస్తు భయాన్వితం భువినృణాం వైరాగ్యమేవాభయం॥

"బిడ్డా! యీ ప్రపంచమునందు సర్వవిషయంబులకును భయమే కలదు. భోగవంతునకు రోగభయంబును, ధనవంతు నకు రాజులవల్లను, బలవంతునకు శత్రువులవలనను, మాన వంతునకు దరిద్రమువలనను, రూపవంతునకువృద్దాప్యమువలన ను, కామమునకు మృత్యువువలనను, శాస్త్రమునకు వాదమునను గుణవంతునకు ఖలులవలనను, వ్యభిచారునకు యమునివలనను వలనను, ఈరీతిగ ప్రపంచమున సర్వవిషయంబులకునుభయమే ఏర్పడుచున్నది. కాని వైరాగ్యమునకు నెట్టిభయంబును లేదు. కావున వైరాగ్యము పొందినవానికి జన్మపావనములభించును. అజ్ఞానులిట్టివైరాగ్యంపొందజాలక నుండవమా[illegible] గాన్పిం చుదారాపుత్రబంధుగృహాభాధన పశుసంప[illegible]ందాశ [illegible] దుఃఖములకు లోనగుచుండుట ప్ర[illegible]గ

గనబడుచున్నది. స్వప్నసమానమైన బంధు మిత్రాదులు నీ రాగారమునుం బొందెడు పాంధునిక్రియ స్వల్ప కాలంబు మాత్రమె వారితో ననుభవించి, పిమ్మట నరక కూపంబునంబడి యనేక బాధలం బడుచుందురు. ఈరీతిగ ప్రపంచ మాయలం దగిలి యాశల విడనాడలేక, అజ్ఞానులు జరా మరణ ప్రవాహంబునం బడి దరి జేరలేక ఈదులాడుచుందురు, సరియైన జ్ఞాని సంసారమున గృహస్థాశ్రమమున నుండినను, తామరాకుపై నీటిబిందువువలె నిమిత్త మాత్రముగ ప్రవర్తించుచు, సుఖదుఃఖముల నంటక కర్మచే కలిగిన యీ దేహంబున శాశ్వతంబని గ్రహించి, తనకర్తవ్యము శాశ్వతానంద సంధాయకమైన పరబ్రహ్మస్వరూపమును జేరుటయేనని గుర్తించి, యీ శరీరము నిరర్థకమైనదిగ భావించి, దేహాభిమానమును సంపూర్ణముగ వదలి వర్తించుటయే జ్ఞానము" అని స్వాములవారు తన నిజశిష్యుండైన సిద్దయ్య కెరిగించెను.

## బ్రహ్మంగారు సిద్దయ్యకు పంచముద్రలను జూచువిధానము తెలుపుట

అనంతరము సిద్దయ్య కోరినమీదట స్వాములవారు అతనికి పంచముద్రలను జూచువిధానము చెప్పదలచి "శిష్యా! నీవడిగిన తారకయోగంబును, శ్రవణమనననిధిధ్యాసములవిధానం బెరింగించుచున్నాను వినుము. ఈ శరీరమున నుండు కర్మేంద్రియ - జ్ఞానేంద్రియ - బాహ్యేంద్రియ - పంచభూతాత్మక ప్రాణాది [illegible] వాయువులును, స్థూలసూక్ష్మకారణ దేహంబును, [illegible]కాది దుర్గుణంబులను జయించుటకు తారక సంఖ్య[illegible] యోగంబులు సభ్యసించు భక్తులు

యోగము ముందు నభ్యసింపవలసి యున్నది. నీకు పంచ ముద్రల జూచువిధానమును కూడ నెరిగింతును వినుము. "వత్సా! తారకయోగమునకు ఖేచరి - భూచరి - మధ్యమ - షణ్ముఖి - శాంభవి - అనబడు పంచముద్రలను తెలుసుకొని అభ్యాసము గావించుచు, 'ఓం' కారమునందలి చిణి - చీణి - ఘంట - శంఖ - వీణ - వేణు - తాళ - భేరి - మృదంగ - మేఘ యనబడు నాదములను వినుచు, బుద్ధిజ్ఞాన చిత్తాహంకారముల సముదాయక ప్రత్యేకభేదంబులగల ఈశ్వరజీవ చైతన్యముల గ్రహించినచో ప్రణవలక్ష్యార్థంబగు పరబ్రహ్మము తానే యనెడు స్థితి సిద్ధించును, కనుక నిక పంచముద్రల జూచు విధానం బెరిగించెద వినుము.

1. నేత్రముల తెరచిగాని, మూసుకొనిగాని, నాసికాగ్రమునందు దృష్టిని నిలిపి చూచుట ఖేచరి యనబడును. 2. నేత్రములను తెరచియుంచి నాసికాగ్రమున దృష్టిని నిలిపి చూచుట భూచరి యనబడును. 3. భ్రూమధ్యమున దృష్టిని నిలిపి, అంతర్లక్ష్యమున మనస్సునిలిపి చూచుట మధ్యమ లక్ష్యమనబడును. 4. చెవులరంధ్రమును, నాసికారంధ్రములను నేత్రములను చేతితో మూసి యుంచి భ్రూమధ్యమున దృష్టిని నిలిపిచూచుట షణ్ముఖి యనబడును. 5. మనోమారుతంబుల రెండింటిని బంధించి, అంతర్లక్ష్య-బాహ్యలక్ష్యముల దృష్టితో చూచుట శాంభవి యనబడును. ఈవిధముగ పంచ ముద్రలను నీ వైదువిధంబులగు దృష్టిని మొదట సాధించవలయును. నేత్రములు పూర్తిగ మూసుకొనిగాని, సగము తెరచియుంచుకొనిగాని, ఆత్మయందుండెడి పరబ్రహ్మస్వరూపమును చూచుశక్తి లభించువరకు పంచముద్రల సాధనమును

పట్టువదలక యాచరించుచుండ వలయును. సూర్యచంద్ర నక్షత్రములలోనుండు బిందువును మలిన రాహిత్యముగ దృష్టిచేనైక్యంబు జేసి లక్ష్యత్రయము చేసాధించుటయే తారక యోగంబనబడును. బాహ్యామధ్యాంతరము లనబడునవియే లక్ష్యత్రయంబులు. ఈవిధముగ మండలత్రయంబునం దుండెడి ముప్పదియెనిమిది కళలనుచూచు సాధనము నాచరింప వల యును. పద్మాసనమున గూర్చుండి సాధకముగావించిన పిదప తారకయోగము గావించి పరబ్రహ్మస్వరూపమును తెలుసు కొని ముక్తుడ నగుము.'' అని చెప్పి ఆనాటికి ఉపదేశంబును చాలించెను. సిద్ధయ్య సద్గురువాక్యములు వినినవాడై పరమా నందంబు జెంది, స్వామికి సాష్టాంగనమస్కారంబు గావించి, అనంతరము స్వామి సేవాతత్పరుండై యుండెను.

## బ్రహ్మంగారి ఉత్తరదేశ సంచారము

ఆనంతరము కొన్నిదినములకు వీరబ్రహ్మంగారికి శిష్య సమేతంబుగ హైదరాబాదునకుబోయి, చూడవలయు నను నభిప్రాయము కలిగినది. ఆకాలములో పుణ్యభూమి యనంబ రగు నీ భరతఖండమున హైదరాబాదు గొప్పపట్టణముగ నుండి, మహమ్మదీయుల పరిపాలన యందుండెడిది. అట్టి పేరు గాంచిన మహానగరంబును చూడవలయు నను కుతూహల ముతో శిష్యగణంబును వెంటబెట్టుకొని, శ్రీ గురుపీఠసహితం బుగ నొక శుభదినంబున బయలుదేరి మార్గమధ్యంబున గఱ పోరు మామిళ్ళ, కంభంమొదలగు గ్రామములలో మజిలీలు చేయుచు, అందు భక్తజనులకు జ్ఞానోపదేశంబు గావించుచు, కతిపయ దినంబులకు కృష్ణానదీతీరమును చేరి నదీజలంబుల

అనంతరము స్వాములవారిని. వారిప్రియశిష్యుండైన సిద్దయ్యను అధికోత్సాహంబుతో సన్మానించి, కానుకలిచ్చి గౌరవించి సమారాధనలు జరిపి స్వాములవారిని, సిద్దయ్యను నగరమంతయు మహావైభవంబుతో నూరేగించి, వారియను గ్రహము వడసి తీర్థప్రసాదంబుల తీసుకొని "స్వామీ! మీరు కాలజ్ఞాన మను గ్రంథము వ్రాసియుంటిరని వినియుంటిని, నా కా గ్రంథవిషయంబులు తెలుసుకొనవలయునని కుతూహల ముగా నున్నది. కాన నా కాగ్రంథము చదివి వినిపించి కృతార్థునిజేయరే" యని వేడెను,

## హైదరాబాదు నవాబునకు శ్రీ వీరబ్రహ్మంగారు కాలజ్ఞానమును తెలుపుట

భక్తవరేణ్యులారా! సకల పాపంబుల కాలవాల మైన యీ కలియుగంబున దుష్టజనరక్షణకును, శిష్టజనపరి పాలనకును వీరభోగవసంతరాయ లను నామంబుతో భగ వంతు డవతరించ నున్నాడు. ఆవిధంబుగ వీరభోగ వసంతరా యులు అవతరించుటకు ముందు ఈ ప్రపంచంబున ఉత్పాత ములు పెక్కు పుట్టును. కాశీపట్టణంబున సాలగ్రామంబులు నాట్యంబు జేయుచు ప్రజలతో మాటలాడును. భక్తులైన వారు ప్రయాగతీర్థమందు సురక్షితంబుగనుందురు. సరస్వతీ దేవి అంగడిపెట్టి అమ్ముదురు. నదులన్నియు పొంగి జనులు నశిం తురు. మహమ్మదీయుల పరిపాలన అంతె మగును. నీచజా తులు ఇరువురుమాత్రమే మిగులుదురు. చీమకుర్తి పన్నెం డామడ పట్నమగును. గంగాగోదావరీ నదులు పొంగును జమ్ములమడకి నాంచారమ్మ మానవులతో మాటలాడును. కావే

పొంగి జననాశనమగును. సముద్రంబులో నమృతము పొంగును. నారాయణ నదియే మీకు తార్కాణము. తనకుతానై తెలుసుకొనిన రాజయోగులకు మాత్రము నేను దర్శన మిత్తును. సువర్ణముఖి నదియందు పదిమంది మహాపురుషులు విలసిల్లుదురు. అప్పుడు నాయుడుపేటలో నుండు ధనవంతు లందఱు నాశన మగుదురు. తూర్పు దేశము లన్నియు నవనాగరికత జెంది మరల నష్టమగును. బంగాళా దేశంబున ప్రజలు నీటగలసిపోవుదురు. ఇరవైయెనుగురు అక్కచెల్లెండ్రు ఏకంబులై దుర్గాంబ కల్యాణమును జేయుదురు. కులగోత్రంబులు వదలి వివాహంబులు జరుగును. నేను వచ్చుటకుముందు నీ విధంబుగ ననేక విపరీతములు పుట్టును. కనుక నికముందు మీరు సదా వీరభోగవసంత రాయలను స్మరించుచుండుడు. నీచులును, క్రోధము గలవారును నధికులగుదురు. ప్రజలు నానావిధ దుష్కర్మలాచరించుట వలన కష్టములపాలై చెడిపోవుదురు. తండ్రికొడుకులు తమలోతాము కలహింతురు. చోర, రోగ ఉపద్రవంబులు హెచ్చును. ఎచ్చటచూచినను అగ్నిభయము లే కలుగును. అడవిమృగంబులు గ్రామములలో చేరును. ఏనుగ కడుపున పందిపుట్టును, పందికడుపున కోతి పుట్టును. ప్రజలు నానావిధ దరిద్రంబులకు లోనగుదురు. వేదంబులను ఛండాలురు అభ్యసింతురు. పుణ్యపురుషులు నా ప్రభావంబును చెప్పుకొను చుందురు. కృష్ణా గోదావరీ నదులమధ్య గోవులు గుంపులు గుంపులుగ చచ్చును.'' అని స్వాములవారు ఈ రీతిగ తానువ్రాసిన కాలజ్ఞాన మంతయు నవాబునకు వినిపించెను. నవాబును స్వాములవారు చెప్పిన విషయంబు లన్నియు శ్రద్ధాభక్తులతో విని కొన్ని బిరుదులును, అమేయధ నావళులను

స్వాములవారి కర్పించి వారికృపకు పాత్రుడయ్యెను. అనంతరము స్వాములవారు నవాబుదేవిడీనుండి తమబసకు తిరిగి వచ్చిరి. కొన్నిదినములు ఆవిధముగ ప్రజలకు జ్ఞానోపదేశము చేయుచు హైదరాబాదు నగరమందుండి. పిదప శిష్యసమేతంబుగ కంది మల్లయ్యపల్లెకు ప్రయాణంబైరి.

పంచమ ప్రకరణము సమాప్తము.

# షష్ఠ ప్రకరణము

## శ్రీ వీరబ్రహ్మంగారు సిద్దయ్యపై అసూయ వహించిన శిష్యులకు గర్వభంగము గావించుట

స్వామి వారితోకూడ సిద్దయ్య సమానముగ పూజింపబడుచుండుటయు, తమకట్టి గౌరవ మర్యాదలు జరుగకుండుటయు జూచి తక్కుంగల శిష్యులకు చాల కంటకముగనుండె. సిద్దయ్యపై నీర్ష్యవహించియుండిరి. "సిద్దయ్య మనకన్న నేమంత అధికుడు? ఇదిఅంతయు గురువుగారిలోనే యున్నదనియు వారిలో వారనుకొనసాగిరి. "స్వామియు సిద్దయ్యనే గౌరవించుచుండుట మన చూచుచున్నాముగదా! యిక మనము ఉపేక్ష చేయుటవలన ప్రయోజనములేదు. సిద్దయ్యకంటె మనము గౌరవముగ చూడబడు నుపాయంబులు చూడకున్న, మనమింక నిటనుండియు లాభములేదు." అని వారాలోచించుచు తర్కవితర్కంబులు గావించుకొనుచుండ, ఆమాటలు స్వామివారి చెవులబడినవి. "ఓహో"

వీరి అభిప్రాయ మిదియా ? వీరికి గర్వ పరిహారం బొనరింప కుండుట మంచిది గా"దని తనలో తానాలోచించి సమయమునకై వేచియుండెను.

స్వాములవారు శిష్యులను వెంటబెట్టుకొని, మార్గ మధ్యంబునగల గ్రామాదులలో వేదాంతోపన్యాసములు జేయుచు, తిరుపతి మహాక్షేత్రమునకు చేరెను. అందు కొన్ని దినములుండి, అటనుండి బయలుదేరి కడపకు పయనమైరి.

స్వాములవారు తమ శిష్యులకు గర్వభంగము చేయుటకు నిదియేసమయంబని తలంచి, తన మహిమంబుచే మార్గ మధ్యంబున చనిపోయిన శునకముయొక్క కళేబరం బొకటి పడియుండునట్లు చేసెను. ఆశునక కళేబరంబు కుళ్ళి పురు గులతో నిండి, భరింప వలవిగాని దుర్గంధము కొట్టుచుండెను. అట్టి దుర్వాసనను భరియింపలేక నాసికాపుటంబులు మూసు కొనియు, చూచుటకుకూడ అసహ్యముగ నుండ కన్నులు కూడ మూసుకొనియు నాత్రోవ బోవుచుండిరి. సర్వ విష యందులందును సమత్వభావముగల సిద్దయ్య మాత్ర మట్టి దుర్గంధమునకు బాధనొందక స్వాములవారి వెన్నంటినడుచు చుండెను. అంత స్వాములవారు అచ్చట నిలువంబడి "శిష్యు లారా ! చూచితిరా. అమృత శునక కళేబరము. అది సామాన్యమైనదిగాదు సుడీ, అందొక అద్భుతమాహాత్మ్యము గలదు. అమృతశునక కళేబరము భక్షించువారికి పూర్వ జన్మ జ్ఞానము లభించును, అంతియేగాక దివ్యదృష్టి, దివ్య జ్ఞానము, దూరశ్రవణము మొదలగు అద్భుత శక్తునలపడును. అదియునుగాక భూతభవిష్యద్వర్తమానంబు లట్టివారికి కరత

లామలకంబులై యుండు. ఇట్టి అవకాశంబు నిక మరి లభింప బోదు; కనుక మీర లందరును సందేహింపక యీ శునక మాంసంబును భక్షింపు"డని తెల్పెను. అంత శిష్యు లందరును స్వాములవారి వాక్యంబులకు నివ్వెరబోయి మొకరి మొగంబు లొకరు చూచుకొనసాగిరి. "చూచుటకే యసహ్యాముగనుండి పురుగులతో నిండియున్న యీ శునకమాంసంబును భక్షించుటెట్లనువారును, అట్టిశక్తి లేకున్నను మంచిదేగాని మేము ఇంత కాలము స్వాముల సేవచేసినందుల కిదియా ఫలమను వారునై యీ విధంబుగ వారందరును గురువు నాజ్ఞ నిరాకరించిరి.

సిద్దయ్య మాత్రము వెంటనే గురువులముందు నిలువంబడి "స్వామీ! తమఆజ్ఞ యయినచో నేనాశునకమాంసమును భక్షింపగల"నని తెలుప, స్వాములవారు "సిద్దా! నీవందులకు సమర్థుడవే యని నాకు తెలుసు. సకల విషయంబులందును సమదృష్టి గలవారే దీనిని భక్షింపగలరు. కాన నీకంగీకారమైనచో నాయభ్యంతర మేమియు లేద"ని తెలిపెను. అంత సిద్దయ్య బ్రహ్మంగారికి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి ఆశునక కళేబరంబుదగ్గర కూర్చుండి, అద్దానిని అమృత తుల్యముగ భావించి భక్షింప నారంభించెను. ఒక్కత్రుటిలో నా శునక మాంసమంతయు భక్షించె. మిగిలిన భక్తులందరును అదిచూచి సిగ్గుపడ సాగిరి. సిద్దయ్యకు గురుస్వాములపైగల భక్తి విశ్వాసంబులు తేటతెల్లమయ్యెను. సిద్దయ్య భక్తిఅపారమని తక్కంగల శిష్యులందరును గ్రహించగలిగిరి. సిద్దయ్య భక్తశిరోమణియని యంగీకరించిరి. అప్పుడు స్వాములవారు మిగిలిన శిష్యులను జూచి "బిడ్డలారా! సిద్దయ్య భక్తి తాత్ప

ర్యములు గ్రహించితిరా? మీ సందేహంబులు తీరెనా? సిద్దయ్య నిక్కముగ సిద్ధుడే సుడీ, నిశ్చలభక్తి సంపన్నుడు సుడీ! మీరిక నీతనిపై ఈర్ష్య వహింపక, మీకు మాయందెట్టి భక్తి కలదో అట్టి భక్తివిశ్వాసములతోడే సిద్దయ్యను గూడ చూచుచుండుడు, మీరును సిద్దయ్య వంటివారగుదురుగాక'' అని చెప్పెను. అనంతరము శిష్యులందరును, బ్రహ్మంగారి ప్రజ్ఞావిశేషంబుల కును, సిద్దయ్య నిశ్చలభక్తికిని ఆశ్చర్యపడసాగిరి.

అనంతరము బ్రహ్మంగారు శిష్య సమేతంబుగ మెల్లగ మార్గమునుబట్టి పోవ నారంభించిరి. సాయంకాల మగుటచే నడచుటకు త్రోవ సరిగ కానరానందున వారందరును నొక వటవృక్షము క్రింద ఆ రాత్రి విశ్రమింప సంకల్పించుకొనిరి.

## బ్రహ్మంగారు కుష్టువ్యాధిచే బాధపడుచున్న నొక బ్రాహ్మణునికి కుష్టువ్యాధిని పోగొట్టుట

స్వాములవారు విశ్రమించిన వటవృక్షంబునకు దాపు ననే వేరొక వృక్షముక్రింద బ్రాహ్మణుడు కుష్టురోగముచే బాధపడుచు, తన భార్య తొడలపై తలపెట్టుకొని పరుండి మూల్గుచుండెను. ఆతని భార్య భర్త పడుచున్న బాధను చూచి విచారించి ''హా పరమేశ్వరా! ఆపద్బాంధవా! లోకబాంధవా! నాభర్తను ఈ బాధనుండి తప్పింపవా! నేనెంత దౌర్భాగ్యురాలనో కదా! మమ్మీకష్టమునుండి తప్పించువా రెవ్వరో కదా!'' అని విలపించుచుండెను. ఆ

బ్రాహ్మణుడును చీమును నెత్తురును కారుచున్న పుండ్లపై దోమలుగ్రాలుచుండ నాబాధ భరియింపలేక "హాదైవమా! ఇక నీదుర్మార్గుని ప్రాణములు తీసుకొనిపోరాదా! ఇక నీ రోగము నయమగు నను నాశలేదు, శరీరమంతయు కుళ్ళి పోయినది కదా! నేను బ్రతుకుట యీబాధ భరియించుటకేకదా! ఇక నేను బ్రతికినను ప్రయోజన మేమున్నది? ఓగరుడగంధర్వ యక్షకిన్నర కింపురుషులారా! నన్నీ కష్టమునుండి రక్షింపరే" యని విలపించుచుండెను.

అంత వీరబ్రహ్మంగారు తన శిష్యులతో "ఓయీ! ఏదో ఆర్తనాదము వినబడుచున్నట్లున్నదే! ఒకపురుషుని కంఠధ్వనియు స్త్రీ కంఠధ్వనియు కూడ వినబడుచున్నది. ఈ నిర్జనప్రదేశమున నెవ్వరైయుందురో కదా?" యనెను. అంత శిష్యులు కాగడాల వెలిగించుకొని, పరిసరప్రాంతము లను పరిశీలింపగా, నందొక వృక్షముక్రింద కుష్టువ్యాధిచే బాధపడుచున్న బ్రాహ్మణుడు తనభార్యతొడపై తలనిడు కొని, రోగబాధచే విచారించుచుండుట జూచి, వెంటనేపోయి బ్రహ్మంగారి కావిషయ మెరిగించిరి. బ్రహ్మంగారు వెంటనే ఆదంపతుల దగ్గరకుబోయి "అమ్మా! మీరెవ్వరు? ఈ నిర్జన ప్రదేశమున నిట్లొంటరిగ నుండుటకు కారణ మేమి?" యని యడుగ, ఆమె "మహాత్మా! మీరెవ్వరో! మీ తేజో రూపలక్షణములుచూడ మమ్ముద్ధరింప నరుదెంచినవీరబ్రహ్మ స్వరూపమువలె నున్నారు. తండ్రీ! మాదీనస్థితి నేమని తెలియజేయుదును? మావంటి దౌర్భాగ్యులు నీప్రపంచముననుండ బోరు. మాచరిత్ర తెలిపి మీమనస్సులుకూడ పాడు చేయు టయే గాని వేరు లేదు. అయినను మీరడుగుచుంటిరి గాన

తెలుపుదు వినుడు, మాది ప్రసిద్ధిగాంచిన కాంచీపురమునకు సమీపమునగల 'ముసిపల్లె' యనునొక గ్రామము, మేము బ్రాహ్మణకులస్థులము. నాభర్త కుష్టువ్యాధిచే సుమారు పది సంవత్సరములనుండి బాధపడుచుండెను. ఈవ్యాధి మాన్పగల వైద్యశిఖామణు లెందైన నున్నారేమోయని, నాభర్తను వెంటబెట్టుకొని దేశదేశంబుల తిరుగుచుంటిని. ఆ రీతిగ తిరుగుచు నిక్కడకు చేరుసరికి సూర్యాస్తమయం బయ్యెను. చేతధనమేమియు లేదు, తుదకుభోజనముకే కొరతయయ్యెను. అయిదునాళ్ళనుండి ఆహారమే లేదు." అని చెప్పుచు, సిరసముచే ఆమె నేలకొరగెను. అంత బ్రహ్మంగారు తమబసయందున్న ఫలములు తెప్పించి, ఆమె కిచ్చి తినుమనెను. అయ్యా! నాభర్త ఆహారములేక నాకంటెను డస్సియుండిరి. భర్త భుజించిన పిమ్మటనే కదా భార్య భుజించుట? ధర్మవిరుద్ధమగుజీవితముకంటె మరణమే మేలుగదా" అని ఆఫలములు భర్తకుబెట్టి శేషమును తానారగించెను. అనంతరము బ్రహ్మంగారు 'సాధ్వీ! విచారింపకుము. కష్టసుఖములు శరీరమునకేగాని ఆత్మకుగావు. ప్రాణులు పూర్వజన్మ పాపపుణ్యఫలంబులచే బుట్టుచు గర్మలననుభవించుచు గిట్టుచుండును. జ్ఞానులైనవారు కష్టసుఖములయందు సమత్వముగ నుందురు" అని చెప్పుచు, కుష్టువ్యాధిచే బాధపడుచున్న బ్రాహ్మణుని శరీరము ఆపాదమస్తకము తనచేతులతో తడువగ. మంత్రము వేసినట్లుగ కుష్టువ్యాధి పూర్తిగ మాయమై, తొల్లింటి యౌవనశరీరము గలవా డయ్యెను. ఇది అంతయు చూచుచున్న బ్రాహ్మణునిభార్య ఆశ్చర్యపడి, అపరిమితానంద భరితురాలై, స్వామికి ప్రత్యుపకారము జేయశక్తి లేశమంతయు

లేక సిగ్గుపడి, స్వామి పాదంబుల పైబడి "తండ్రీ! మమ్ముల నుద్ధరింప నరుదెంచిన శ్రీ మన్నారాయణుండవుగాని వేరు గాదు. భగవంతుడే వచ్చి మమ్మీయాపదనుండి తప్పింపగల వారు ఇక నెవ్వరును భూలోకంబున లేరని, నా ఆశలు నిరాశ చేసుకొంటిని. తుదకు భగవంతుడే యీరూపంబునవచ్చి మమ్ముల గటాక్షించె"నని బహువిధంబుల బ్రస్తుతించు చున్న సాధ్వీలలామను గాంచి బ్రహ్మంగారు "పుణ్యవతీ! నీవు మహాపతివ్రతవు. నీపతివ్రతా ప్రభావంబువలనే నీభర్త కీవ్యాధి పోయినది. అంతకుమించి మరేమియు లే"దని చెప్పి యోదార్చి, యిక మీగ్రామంబున కేగుడని చెప్ప, నావనిత "మహాత్మా! మేమిక నెందునకు బోము. మీపాదసేవ చేసు కొనుచు, మీయొద్దనే యుందు"మన, స్వాములవారు "స్త్రీ! మీకింకను గృహస్థాశ్రమమున నుండవలసిన యోగ మున్నది. అదియును గాక మీకు సంతానము కలిగి, ఆసంతానము వలన సౌఖ్య మనుభవించు యోగము కలదు" కాన మీరు తిరిగి యింటికేగుడని తెల్పెను. తరువాత స్వాములవారు ఆ పుణ్యదంపతులకు "ఓం హ్రీం, క్లీం, క్రీం, శ్రీం నమశ్శివాయ, శ్రీవీరబ్రహ్మేంద్ర స్వామినే నమః' అని మహామంత్రోప దేశంబుగావించి, ఆ మంత్రంబును సదా జపించుచున్నయెడల సకలపాపములు హరించి, వంశవృద్ధియు సకల సంపదలును కలుగునని చెప్పి వారిని పంపించెను. ఈవిషయమును తెలుసు కొని భక్తులందరును స్వామివారిని తొల్లింటికంటె విశేష భక్తిశ్రద్ధలతో గౌరవింపసాగిరి.

## బ్రహ్మంగారు కందిమల్లయ్యపల్లెకు చేరినపిదప శిష్యులకు జన్మరాహిత్యంబును తెలుపుట

అనంతరము బ్రహ్మంగారు శిష్యసహితంబుగ నట్ట నుండి బయలుదేరి కందిమల్లయ్యపల్లెకు సమీపమున తుంగ భద్రానదీతీరమునగల "అల్లాటపల్లె" చేరి ఆనదీ జలం బుల స్నానం బాచరించి, తనగురుదైవంబైన శ్రీ వీరభద్ర స్వామి దర్శనంబుజేసి, మరుచటిదినంబున కందిమల్లయ్య పల్లెకు చేరిరి.

ఒక దినంబున స్వాములవారిని జూచి సిద్దయ్య "స్వామీ! మరణించినపిదప మనుష్యులకు మరల జన్మము న్నదా? లేదా? యని ప్రశ్నించెను. అంత స్వాములవారు "బిడ్డా! ఈ ప్రపంచసృష్టి అంతయు బీజాంకురము రీతిని ననుసరించియున్నది. భూమిపై జన్మించినపిదప మాయచే నావరింపబడుటచే పూర్వజన్మజ్ఞానం బేమియు లేకపోవుటం, జేసి, ప్రపంచ విషయములలో దగుల్కొని సంచరించుచు, శరీరమే నేను; శరీరమే శాశ్వతం బను భ్రమనుజెందుచు, జీవిత కాలమంతయు నిరర్థకముగా బోగొట్టుకొని, నానావిధయో నులం బుట్టుచు మరల గిట్టుచు, నరకలోకంబునంబడి యమ కింకరులు పెట్టు బాధలకు సహించలేక కష్టముల ననుభవించు చుందురు. జన్మరాహిత్యంబు పొందినవారికిం దక్క అన్యుల కందరికిని జన్మయున్నదనుమాట యథార్థము. జన్మరాహి త్యంబు నొందుటకు ననేకమార్గములుగలవు. వేగినగింజలకు నేరీతిగ బీజోత్పత్తిలేదో, ఆతీరుననే జన్మరాహిత్యంబు నొందినవారికి మరల జన్మంబులేదు. ఆవిధంబుగ జన్మరాహి

త్త్రంబును స్వాములవారు శిష్యులకు బోధించుచున్న సమయంబున, కడప నవాబు దగ్గరనుంచి జవానులు ఒకజాబును తీసుకొనివచ్చి స్వాములవారికిచ్చిరి. ఆజాబునం దీక్రిందవిధంబున వ్రాయబడియున్నది.

"శ్రీ కందిమల్లయ్యపల్లె మఠాధిపతియైన శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహ్మంగారికి - కడప నవాబు తెలియజేయున దేమన:- మారాజ్యములోగల ముడుమాల గ్రామ కాపురస్థులగు దూదేకుల పీరుసాహేబు, తనకుమారుడైన సిద్ధయ్యను మతభ్రష్టునిగా నొనరించి మీ హిందూమతములో చేర్చుకొని రని, పీరుసాహేబు మాదగ్గర ఫిర్యాదు చేసినాడు. కనుక ఈజాబు చూచినవెంటనే, మా ఎదుట హాజరై సిద్ధయ్యనుగురించి మీపైన తేబడిన ఫిర్యాదు విషయమై మాఖుద్దున తగినసంజాయిషీ చెప్పవలసి యున్నది. లేనిచో మీ మీద తగినచర్య తీసుకోబడు నని యిందుమూలముగ తెలియజేయడమైనది,

ఇట్లు

కడప నవాబు."

వీరబ్రహ్మంగారు ఆజాబు చూచి, చిఱునవ్వు నవ్వుచు "సిద్ధా! వింటివా? మీ తండ్రి నిన్ను నేను హిందూమతములో చేర్చి మతభ్రష్టుని గావించితి నని కడప నవాబువద్ద ఫిర్యాదు చేసెనట! ఇందులకు నన్ను తనయెదుట హాజరై తగిన సంజాయిషి చెప్పుమని సమ్మను పంపియున్నాడు; ఇట్టి చిక్కులు కలుగుననియే నాకుమారులు నిన్నొంతమాత్రము నిక్కడ నుంచకూడ దని పట్టుపట్టిరి. ఇప్పుడు ఎట్లు వచ్చినదో చూడుము." అనిన, సిద్దయ్య బ్రహ్మంగారికి నమస్కరిం

చుచు నిలుచబడి "సద్గురూ! మీరిందులకై భయపడవలదు. నేనే స్వయముగ ఆకడప నవాబుదగ్గరకేగి, తగిన సమాధానము చెప్పి, మీకెట్టి కష్టమును గలుగకుండునట్లు చేసెద" నని పలికెను. బ్రహ్మంగారు "వత్సా! నీనిశ్చల భక్తి విశ్వాసములు నేనెరుంగనివాడ గాను. నీఅభిప్రాయము సమంజసముగానే యున్నది. కాన నీవు వెంటనే ఆ నవాబు కడకేగి, తగిన సమాధానము చెప్పి యొప్పించి, మెప్పు బడసిరమ్ము" అని ఆశీర్వదించి, నవాబు పంపిన జవానుతోకూడ పంపెను.

ఆరీతిగ సిద్దయ్య నవాబు పంపిన జవానులతో కలసి కడపకు పోవుచున్న సమయమున, జవాను సిద్దయ్యతో "అయ్యా! మన 'అల్లా' కంటె హిందువుల దేవుడు గొప్పవాడనియా, హిందూ మతములో చేరితివి? అని అడుగ సిద్దయ్య జవానుతో "నేనే కాదు; ఇంకను అనేకమంది మహమ్మదీయులనుకూడ హిందువులలో చేర్చుటకే, నీతో కలసి కడపకు వచ్చుచుంటి"నని చెప్పుచు. అదృశ్యుండాయెనా యనునట్లు జవానులకన్న ముందుగ కడపకు త్వరితగతిని నడచి పోయెను. కడపలో ఎక్కడ చూచినను మహమ్మదీయులే కనబడుచుండిరి. సిద్దయ్య కడపయందొక వృక్షము క్రింద జపము చేసుకొనుచు కూర్చుండెను. ఎవరో మహానుభావుడు చెట్టుక్రింద జపము చేసుకొనుచు కూర్చున్నాడని, మహమ్మదీయులు చాలమంది సిద్దయ్య చుట్టును చేరి, ఆయనతో వేదాంత విషయములను చర్చింపసాగిరి. తన్నడుగు ప్రశ్నలకు ఉచితరీతిని తగు సమాధానములు చెప్పుచు, వారినందరిని మెప్పించి, వారినికూడ హిందూ మతములో చేర్చుచుండెను. సిద్దయ్య ఈరీతిగా రెండు మూడు దినములలో చాల

మంది మహమ్మదీయులను హిందువులుగ మార్చి, వారి గడ్డములు తీయించి పిలకలు పెట్టించి, బిళ్ళసంచికట్లు; అంగవస్త్రములు విభూతిపెండికట్లు, రుద్రాక్షమాలలు ధరించునట్లు చేసెను. అంత మహమ్మదీయ మతగురువు ఆ విషయమంతయు జూచి సిద్దయ్యవద్దకు వచ్చి "ఓయీ! నీవు మోసగించి మహమ్మదీయుల నందఱను హిందువులుగ చేయుచుంటివి, నీవు మాకడపను వదలిపోకున్నచో మానవాబుతో చెప్పి తగిన ప్రాయశ్చిత్తము గావించెద"నన, సిద్దయ్య "అయ్యా! నాపై తమకంత ఆగ్రహ మెందులకు? మాగురువుగారిని మీ నవాబుగారు రమ్మన మనిసమనులంపగా, ఆయనకు మారుగ నేను వచ్చియున్నాను, వచ్చినపనిముగియుగనే వెళ్ళువాడను" అని చెప్పగా, మహమ్మదీయ మతగురువు "ఓహో! నీవేనా బ్రహ్మంగారి వద్దనుండి వచ్చినది? జవాను వెనుక వచ్చినట్లే వచ్చి మాయమైతివట గదా! సరే, మరల దొరికితివి. ఇంకెందు బోగలవు? నేనిప్పుడే నవాబువద్దకుపోయి, నీవిషయమై చెప్పి, నీపని పట్టించెదనుచూడు"మని చెప్పి, వెంటనే నవాబు వద్దకేగి "ప్రభూ! నిన్న మధ్యదారిలో తప్పించుకొని పారిపోయిన బ్రహ్మంగారి శిష్యుడు మనయూరిలో ఒక చెట్టు క్రింద కూర్చుకొని, మహమ్మదీయులను మోసగించి హిందువులుగ జేయుచున్నాడు. వానిని వెంటనే పట్టి బంధించితగిన శిక్ష గావింపకున్న, మన మతము నాశనమగుట తప్ప"దని చెప్పిన, విని వెంటనే నవాబు బ్రహ్మంగారి శిష్యుని వెంటబెట్టుకొని రమ్మని తన నౌకరును బంపెను. ఆ నౌకరు వెంటనే సిద్దయ్య యొద్దకు బోయి, ఆతనిని తనవెంట తీసుకొని వచ్చి నవాబు ఎదుట హాజరుపెట్టెను.

## నవాబు సిద్ధయ్యను ప్రశ్నించుట

సిద్ధయ్య నవాబు ఎదుటకువచ్చి, సలాము చేయకనే నిలువబడియుండెను. నవాబది చూచి మనస్సున కోపించుకొని సిద్ధయ్యను ఈ క్రింది విధముగ ప్రశ్నించెను.

నవాబు:- ఓయీ! నీ వెవ్వడవు?

సిద్ధయ్య:- నేను శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి శిష్యుడను. నాపేరు సిద్ధయ్య యని యందురు. మీరెందులకో మాజగద్గురువులను రమ్మనమని వర్తమానము లంపిరట. మీరు సమాధానము చెప్పిరావలసినదిగ మాగురువులు నన్ను పంపిరి.

నవాబు:- ఓహో! నీవేనా సిద్ధయ్యవు? మహమ్మదీయ మతమును వదలి హిందువుడ వైతివట గదా! అదియునుగాక నీవు చెడుటయేగాక, తాచెడిన కోతి వనమెల్ల జెరచి'నట్లు మాకడపయందున్న మహమ్మదీయులనుగూడ హిందువులుగ మార్చుచుంటివట గదా! ఇందులకు తగిన సమాధానము చెప్పకున్న నీకును, నీజగద్గురువునకుగూడ తగినశిక్ష విధింపబడునని మాఆజ్ఞగా నెరుంగుము, అని గద్దించుచు పలికెను.

సిద్ధ:- మతములు వేరైనను, సమస్త మానవకోటికిని దేవు డొక్కడేకదా! జరామరణ ప్రవాహామునుండి తప్పించుకొనుటకు ముక్తిమార్గమును చూపువాడే గురువు. జన్మవిముక్తికై జగద్గురు శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారిని ఆశ్రయించితిని. ఇందు తప్పేమియున్నది?

నవాబు:- బ్రహ్మంగారి శిష్యుడ ననియా నీకింత గర్వము? నీగురువునకు అగౌరవమనియా, మాకు సలాములు చేయకనే నిలువబడితివి?

సిద్ద :—నవాబుగారూ! మీకదియూ కోపము? మా సలాములు మాగురువుతప్ప యితరులు భరియింపలేరు. అందు వలననే నీకు సలాములు చేయలేదు. అంతకుమించి కారణ మేదియు లేదు.

నవాబు :—నీవంతశక్తి గలవాడవా? చాల గర్వముగ మాటలాడుచున్నావే? నీమాటలు చాల ఆశ్చర్యముగ నున్నవే?

సిద్ద :—నాసలాములు నీవు భరియించలేవు. నేను నీకొక సలాము గావించిన, నీవును నీసింహాసనమును భస్మమగును.

నవాబు :—ఊరకున్న నీ డాంబికము క్రమక్రమించి రాగమున బడుచున్నది. హద్దుమీరి మాటలాడుచున్న నిన్నేమిచేసినను పాపములేదు. మాసేవకుని మోసపుచ్చి పారిపోయి, మరల నిచ్చట పట్టువడి, మరల తప్పించుకొన ప్రలాపములు పలుకుచుంటివా? నిన్నేమిచేసెదనో చూడుము.

## సిద్దయ్య కడప నవాబుకు తన శక్తిని చూపుట

సిద్ద :-తారతమ్య మెరుంగక మాటలాడుట భావ్యము కాదు. కోపము యుక్తాయుక్త జ్ఞానమును నశింపజేయును. దూరదృష్టితో యోచించుకొనుము. అని సిద్దయ్య పలికెను.

నవా :-"ఓయీ! నీకేమైనదైవబలమున్న చూపుము,"

సిద్దయ్య:-"అయ్యా! ఒక పెద్ద రాతి గుండును తెప్పించుడు" నాకుగల శక్తిసామర్థ్యంబుల జూపెద" ననెను. వెంటనే నవాబు సిద్దయ్య కోరినట్లు పెద్దరాతిబండను తెప్పించి, నగర మధ్యమందున్న మైదానములో పడవేయించెను. సిద్దయ్య ఆగుండును ఏమిచేయునో చూతమని ఆనగర మందుండు

జనులందరును, ఆమైదానము చుట్టును నిలువబడి యుండిరి. వెంటనే సిద్దయ్య లేచి, నవాబును పరిశీలించుచుండ మని చెప్పి, ఆబండకు యెదురుగ నిలుపబడి, తనగురువైన వీరబ్రహ్మేంద్ర స్వాములవారిని మనస్సులో తలచుకొని, తన చేతి నెత్తి బండకు సలాముచేయగా 'ఢాంఢాం' అను శబ్దముతో ముక్కలు ముక్కలుగ పగిలిపోయెను. చూచు వారందరును ఆశ్చర్యపడుచు, ఏమియు తోచక అట్లే నిలువబడి పోయిరి.

అంత సిద్దయ్య నవాబుతో "అయ్యా! చూచితిరా? నేజేయు సలాములు మాగురువులైన శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు తప్ప అన్యులు భరింపలేరని చెప్పియుంటిని గదా! నాతండ్రి అజ్ఞానముతో పిర్యాదు చేసినంత మాత్రముచే, మాగురుస్వాములను అన్యులుగా తలచి, సమస్కులు పంప వచ్చునా?" అని పలుకగ, నవాబువిని, సిద్దయ్యయే యింతటి ప్రభావము కలవాడై యుండ, నిక ఆయనగురువు ఇంకను ఎట్టి శక్తిసంపన్నుడోయని తలపోసి, తానుచేసిన అపరాధమునకు వారు తనకెట్టి హానికలిగింతురో గాని, ఆందోళన జెందుచు నవాబు "సిద్దయ్యా! నీభక్తివిశేషం బెరుగక నేను త్వరపడినందులకు వేరుగా తలంపకుము. నీ భక్తి నిరుపమానమైనది. నీవు ఏమతమును అవలంబించినను మాకెట్టి అభ్యంతరములేదు. నీజీవితము ధన్యతి గాంచినది." అని చెప్పుచు తన నిజభవనమునకుంవోడ్కొనిపోయి, ఉచితరీతిని గౌరవించి "మహాత్మా! అనుగ్రహించి నన్ను మోక్షార్హునిగ జేయు భారమిక మీదే" యని ప్రార్థించెను. సిద్దయ్య నవాబును చూచి "అయ్యా! మీకింత స్వల్పకాలములో హృదయపరివర్తన కలిగినందులకు చాలసంతోషము. నేనితరులను తరింపజేయునంతటి శక్తిసంపన్నుడను గాను. అట్టి అధికారము

గురుస్వాములవారికి మాత్రమే కలదు. మీ కట్టి అభిలాష కలదేని గురుస్వాముల నిటకు దోడ్కొనివచ్చి, మీ కోరిక తప్పక సఫలీకృతము గావింతు"నని చెప్పెను. అంతట నవాబు "స్వామీ! నాకీరాజ్య పాలనయందు మనసు వదలి మీతో వత్తును. అనుగ్రహింపు"డని కోరెను. సిద్దయ్య నవాబుతో "అయ్యా! ప్రజాపరిపాలన గావింపకున్నచో, దేశము అరాజక మగును, కావున ప్రజాక్షేమమును కాంక్షించి, నీవు రాజ్యపాలన వదలరాదు. దానంజేసి నీవు నా వెంటవచ్చుటకు వీలులేదు. కొలది దినములలో మహామహిమాన్వితుండైన జగద్గురువు శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారినే నేను మీ నగరమునకు తీసుకొనివచ్చి, మీ యీప్సితార్థంబు తప్పక నెరవేర్తు"నని నవాబునకు దెల్పి, అట కొన్ని దినంబులుండి, బ్రహ్మంగారికి నవాబొసంగిన కానుకలను తీసుకొని, తానంతకుముందు హిందువులుగ నొనరించిన మహమ్మదీయులను వెంటబెట్టుకొని, పయనంబై కందిమల్లయ్య పల్లెకు చేరి గురువులదర్శనంబు గావించి జరిగిన వృత్తాంతంబంతయు నెరింగింప, బ్రహ్మంగారు సిద్దయ్య నిశ్చలభక్తి కెంతయు నానందించెను.

పాఠకమహాశయా! ఆత్మశక్తి సంపన్నులైన భక్తులకు అసాధ్యంబైన దెద్దియు నీ లోకంబున నుండదు కదా! అట్టి ఆత్మశక్తి మంచిశీలము వలననే లభించు నని యెఱుంగవలయును.

# సప్తమ ప్రకరణము



## సిద్దయ్యకు బ్రహ్మంగారు సాంఖ్యయోగమును బోధించుట

ఒకదినమున సిద్దయ్య బ్రహ్మంగారికి పాదము లొత్తుచు "తండ్రీ! ఈ ప్రపంచమంతయు నెట్లు సృష్టింపబడినదో తెలిపి నా సందేహమును తీర్పరే" యని ప్రార్థింపగా, స్వామియు సిద్దయ్య జ్ఞానమునకు నానందించి యీ రీతిగ తెలుప నారంభించెను. "వత్సా! నీకట్టి విషయంబు తెలుపుటకు సాంఖ్య యోగము నెరింగింతును. వినుము. సాంఖ్యయోగంబు నెరింగినవారల కట్టి విషయంబు లన్నియు సులభముగ గ్రాహ్యంబగుచుండును. మనకంటికి కనిపించుచున్న యీ ప్రపంచమంతయు నేవిధముగ సృష్టింపబడినదో తెలిపెదను. వినుము. ఈ సృష్టికి పూర్వము నాశనము లేనిదియు, వికారరహితంబైనట్టియు, కాలత్రయమునందు మార్పుచెందనట్టియు, సృష్టికి కారణమైనట్టియు, నిత్యనిర్మల - నిర్వికార - నిరామయ - నిర్గుణ- సర్వాత్మక సత్యస్వరూపమై నటువంటిదియు నైన దొక్కటి యుండె నని గ్రహింపవలయును. అప్పుడు రెండవది లేదు. అదియే పరబ్రహ్మస్వరూపము. అట్టిదాని యందేమియు లేనిదై, ఆకారశూన్యంబై, సృష్టిని కల్పించుటకు శక్తికలదై ప్రధానమనగు ప్రకృతి యొకటి గలదు. అట్టి శక్తియందు పైన తెలుపబడిన నిర్వికారాది న్యాయములుగల యట్టిబ్రహ్మము కలసి ఈశ్వరుండనియు, అవ్యాకృత్యుం డనియు పేరు గలిగి యుండెను. అట్టి ఈశ్వరునియందు సృష్టి కర్తయైన హిరణ్యగర్భుడు జన్మించెను. హిరణ్యగర్భునియందు సృష్టి ఆదివిరాట్టనెడు వైశ్వానరుడు పుట్టెను.

శ్లో॥ బ్రహ్మణోరవ్యక్తః అవ్యక్తాత్ మహాన్! మహతో అహంకారో, అహంకారాత్ పంచతన్మాత్రాణి, పంచ తన్మాత్రేభ్యో పంచమహాభూతాని, పంచమహాభూతే భ్యో అఖిలం జగత్॥

ఆదివిరాట్టునందు మహాత్తును, ఆమహత్తునందు అహంకారమును, అహంకారమునందు సత్వరజస్తమోగుణంబులు గలిగిన ప్రకృతియు పుట్టెను. అట్టి ప్రకృతివలన కర్మేంద్రియంబులును, తమోగుణమువలన జ్ఞానేంద్రియములును, వాటి వలన పంచమహాభూతములును పుట్టెను. అనగా 1 శబ్దము నుండి సదాశివు డధిపుడైనట్టి యాకాశంబును, 2. స్పర్శము వలన ఈశ్వరు డధిపతియైనట్టి వాయువును, 3. రూపమునుండి రుద్రుడధిపతి యైనట్టి అగ్నియు, 4. రసంబునుండి విష్ణుండధిపతియైన జలమును 5. గంధంబునుండి బ్రహ్మ అధిపతియైన పృథ్వియు పుట్టెను. పరమేశ్వరుడు ప్రకృతిని ఈ రీతిగ సృష్టించెను. పైన తెలుపబడిన పంచమహాభూతములు వేరువేరు తక్కిన భూతములతో కలసినప్పుడు 'పంచీకరణ' మేర్పడెను. ఆకాశమును రెండుభాగములుగ చేసినఅందొకభాగము సమష్టి భాగ మనబడును. ఈ రీతిగ భూతంబుల నన్నిటిని విభాగించిన యెడల నిరువదియైదు తత్వంబు లేర్పడును, .. జ్ఞాన మనో-బుద్ధి - చిత్త - అహంకారములను అంతరింద్రియములును 2. ప్రాణ - అపాన - వ్యాన - ఉదాన-సమానంబులను పంచ విధప్రాణంబులును 3. త్వక్కు - చక్షు - శ్రోత్ర - జిహ్వా - ఘ్రాణంబు లనియెడి జ్ఞానేంద్రియంబు లైనను. 4. వాక్కు, పాణి, పాద,గుద, గుహ్యాంబులనబడు పంచవిధ కర్మేంద్రియ

ములును, ౯. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనబడుపంచ తన్మాత్రలును అయిన నీయిరువదియైదు తత్వంబులచే నీస్థూల శరీరం బేర్పడుచున్నది. జ్ఞానేంద్రియంబు లైదును, కర్మేంద్రియము లైదును, ప్రాణంబులైదును, మనోబుద్ధులు రెండును, మొదలగు నీ పదునేను తత్వంబులతో కూడిన దే సూక్ష్మదేహ మనబడును. ఇదియే లింగదేహ మనంబడును. స్థూల సూక్ష్మ శరీరంబులు రెండును కలసి కార్యరూపమును దాల్చుచున్నవి. పొగవచ్చు నప్పుడు అగ్ని కనబడ కున్నను, కార్యరూపమైన పొగకు అగ్నియే కారణముగదా! ఆరీతిగనే అజ్ఞానస్వరూపముగు కారణశరీరమునకు అదియే కారణమగుచున్నది. నేను అజ్ఞానుడను అనుకొన్నప్పుడు, అజ్ఞానమె పైకికనబడుచున్నది. అజ్ఞానమే కారణ శరీరంబగు చున్నది. అనగా అజ్ఞానమువలననే స్థూలసూక్ష్మ శరీరంబు లేర్పడుచున్నవని గ్రహించవలయును.

మరియు "అజ్ఞానాదవివేకః। అవివేకాదభిమానః। అభిమానాద్రాగా దయః। రాగాదిభ్యః కర్మాణి। కర్మభ్యశ్శరీర పరిగ్రహం॥ అనగా అజ్ఞానంబుచే అవివేకంబును అవివేకముచే నేను, నాది యనబడు శరీరాభిమానమును, అభిమానము వలన కామక్రోధాదులును, వానివలన కర్మలనాచ రించును, నట్టికర్మలవలన జీవమునకు జననమరణంబులును కలుగుచుండును. కారణ శరీరము నశించువరకు జీవమునకు ముక్తి కలుగదు. "తథా విద్వాన్ బ్రహ్మజ్ఞానాగ్నినా కర్మబంధం నిర్దహేత్" అని చెప్పబడినది గావున బ్రహ్మజ్ఞానమను అగ్ని వలన కర్మపాపము నశించువరకు జీవమునకు ముక్తికలుగదు. మరియు——

శ్లో॥ పంచైతాని దశేంద్రియాణి విషయాంప్రాణాంశ్చ షట్ చక్రకా. రాగాష్టా కరుణా షడూరుభి రమీా సప్త భవద్ధాతవః, నాడీ మండల మీాషణత్రయ గుణావస్థాశ్చతా పత్రయం కోశా పంచతనుశ్చషణ్ణవతికం తత్వాని జీవాత్మనా॥

తా॥ ఈశరీరము తొంబదియారు తత్వములతో కూడు కొని యున్నది. అవి ఎవ్వియన పంచభూతము. లైదును, జ్ఞానేంద్రియము లైదును, కర్మేంద్రియంబు లైదును, విష యంబులు పదియు, వాయువులు పదియు, చక్రంబులారును, రాగంబు లెనిమిదియు, అంతఃకరణంబులు నాలుగును: ఊర్మ్యులారును, ధాతువులు ఏడును, నాడులు పదియును, మండలములు పదియు, ఈషణములు మూడును, గుణములు మూడును, అవస్థలు మూడును, తాపత్రయంబులును,కోశంబు లయిదును కలవి మొత్తము తొంబదియారు తత్వము లగు చున్నవి. ఇట్టి తత్వంబులన్నిటితో కూడినజీవమే 'నేను' అనబడుచున్నది. ఇంకను నీఘటవివరణంబు తెలిపెద వినుమని బ్రహ్మంగారు సిద్దయ్యకు నీ క్రిందివిధంబున చెప్పదొడంగెను.

ఘటవిమర్శ

ఘట మనబడు నీ శరీరము 96 అంగుళముల ప్రమాణ ముతో 7 జానలపొడవును, 4 జానలలావును, 83 కోట్ల రోమ కూపంబులును, 30 మూరల పొడవుగల ప్రేవులును, 93 కీళ్ళు ను, 216 ఎముకలును, 3 పలములు బరువుగల గుండెలును, 40 పలముల రక్తంబును, 360 పలముల మాంసమును,

సోలెడు పైత్యరసమును, అరసోలెడు శైత్యంబును. సోలెడు శుక్లంబును కలిగి యొప్పుచుండును. ఇట్టిశరీరమే అనాత్మ. అసజ్జడ దుఃఖస్వరూపము. నేనుఅను అజ్ఞానమే జీవాత్మ. శరీర విలక్షణమైనదే ఆత్మ, సిద్ధా! నీకు మరియు నీ దేహంబున దేవతలుండు స్థానముల నెరింగించుచున్నాను వినుము.

ఈశరీరము ఆధార - స్వాధిష్ఠాన-మణిపూరక - అనాహత - విశుద్ధ - ఆజ్ఞేయం బను షట్చక్రంబులతో నొప్పుచున్నది. అట్టి షట్చక్ర వివరంబును దెల్పెద నాకర్ణింపుము.

## బ్రహ్మంగారు సిద్దయ్యకు షట్చక్ర నవచక్ర విషయంబులను దెలుపుట

"వత్సా! సిద్దా! ప్రపంచమున సూర్యకిరణములును అశుభ్రమైన వాటిపై ప్రసరించినప్పుడు, వాటి అశుభ్రత సూర్యకిరణములకు ఏరీతిగ నంటదో, ఏరీతిగ ఘటజలమందు ప్రసరించిన సూర్యకిరణంబులును ఘటమందుండు రంధ్రములు జలమందుండు మలినముల నేవిధముగ నంటవో, ఆరీతిగనే పరమాత్మకు నీస్థూలశరీరంబున దుర్గంధాదులును, సూక్ష్మమున కామక్రోధాదులును, కారణమందున అజ్ఞానమును నంటవని గ్రహించవలయును. సద్గురువు నాశ్రయించి శాస్త్రజ్ఞానంబును పొంది, జ్ఞానదృష్టిచే విచారించిన పరమాత్మ యీ శరీరమందే కానవగును. ఇరువదియైదు తత్వంబులున్ను, దశవిధనాడులును, సప్తవిధధాతువులును కలిగియున్న యీ శరీరంబులో ఏడుకమలములు గలవు. వాటి వివరంబు దెల్పెద వినుము.

# షట్చక్ర విధానము

## 1. మూలాధారము

మూలాధారమనుచక్రము గుదస్థానమందు వ, శ, ష, స, అను నాలుగు దళములు గలిగి, పచ్చనిరంగు గలిగి 'వ' ఆకారంబుతో పృథ్వీ నిలయమై, ఘ్రాణకారణంబు కలిగి, భూమివలె నాలుగు కోణములతో నొప్పుచుండును. ఆధార లింగము స్వేచ్ఛాశక్తి గలిగియుండును. 1 ఘ. 40. వి. ఘ. కాలములో 600 పర్యాయములు జపమగును. ఈచక్రమునకు అధిదేవత వినాయకుడు.

## 2. స్వాధిష్ఠాన చక్రము

మూలాధార చక్రమునకు సుమారు రెండు అంగుళ ముల పై భాగములో 'స్వాధిష్ఠానచక్ర మొప్పుచుండును. ఇది నాలుగు రేకులు, మూడుకోణములు కలిగి 'మ' ఆకారముననుండి తెలుపు వర్ణంబుగలదై, జలస్థానమై, జిహ్వాకారంబుతో బ, భ, మ, య, ర, ల, యను దళంబులతో పక్షి ఆకారము కలిగియుండును. క్రియాశక్తి గురులింగము. ఈ చక్రమునకు బ్రహ్మదేవు డధిపతి. 16,40 వి, ఘ, ల కాలములో 6000లు పరమహంసల జపము జరుగును.

## 3. మణిపూరక చక్రము

పైన చెప్పబడిన స్వాధిష్ఠాన చక్రమునకు మూడు అంగుళముల పైన నాభిప్రదేశమున నాడులచుట్టుకొని మణి వంటి ప్రకాశముగలదై, నీలవర్ణముతో 'ఇ' ఆకారమున డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, అను దళంబులతో ప్రకా

శించుచు, నేత్రకారణంబై పీఠికాకృతితో నుండును. జ్ఞాన శక్తి శివలింగము. ఈ చక్రమునకు అధిష్ఠానదేవత విష్ణువు. అగ్నిముద్రవా దోద్భవ స్థానము. 16 ఘ. 40. వి ఘ. లలో 6000 పరహంసల జపము జరుగును.

### 4. అనాహత చక్రము

పైన చెప్పబడిన మణిపూరక చక్రమునకు పదిఅంగుళముల పై భాగములో హృదయస్థానమునందు సువర్ణ చ్ఛాయ గలిగి పండ్రెండు దళములతో 'వా' ఆకారమున వాయుసకు స్థానమై క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ ఞ, ట, ఠ, అను రేకులతో వాయునిలయమై, లింగాకృతిగలదై, త్వగింద్రియ కారణమై యొప్పుచుండును; ఈచక్రమునకు రుద్రుడధి దేవత, బీజశక్తి, చరలింగము. వాయుముద్ర నాదప్రకాశ స్థానము, 16 ఘ. 40 వి. ఘ. ల. కాలములో 6000 పరమహంసల జపమగును.

### 5. విశుద్ధ చక్రము

పైన నిరూపింపబడిన అనాహత చక్రంబునకు పైన పండ్రెండు అంగుళంబుల దూరములో తెలుపువర్ణంబు గలిగి అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఐ, ఓ. ఔ, అం, అః, అను పదునారు దళంబులతో మత్స్యాకారము గలిగి 'య' ఆకారంబున గగన నిలయంబై కర్ణస్థానమున కంఠ ప్రదేశము నందుండును. ఈ చక్రమునకు జీవు డధిష్ఠాన దేవత. ఈచక్రము సరస్వతికి స్థానము. ఆకాశముద్ర ఆది శక్తి, ప్రసాదలింగము. జ్యోతివర్ణముగలదై 2 ఘ. 46 వి. ఘ, ల కాలములో 1000 పర్యాయములు జపమగును.

## 6. ఆగ్నేయ చక్రము

పైన చెప్పబడిన విశుద్ధచక్రమునకు పన్నెండు అంగుళములపైన భ్రూమధ్యప్రదేశములో హం, క్షం అను ద్విదళంబులు గలిగి, అంతఃకరణ నిలయంబై, అగ్నిహోత్రమువలె ప్రకాశమానమై యొప్పుచుండును. ఈ చక్రమునకు అధిష్ఠాన దేవత ఈశ్వరుడు. మరియు నిది మహాలింగమై పరాశక్తియై, సువర్ణ కాంతిగలిగి; సర్వసృష్టినిలయంబై, ప్రకాశముద్రతో నుండును. ఇందు 2 ఘ. 40 వి. ఘ. ల కాలములో ఈశ్వరునకు 1000 పరమహంసల జపము జరుగుచుండును.

## 7. సహస్రారము

పైన తెలుపబడిన విశుద్ధచక్రమునకు పైభాగములో నీ సహస్రారచక్రము బ్రహ్మరంధ్రమున, తేజోరూపముతో సహస్రదళములు గలిగి 'ఓం' అనుప్రణవవర్ణంబై దేదీప్యమానముగ బ్రకాశించుచు. బుద్ధికి నిలయంబై మాయచే నావరింప సృష్టికి మూలాధారమై, సత్యమునకు సృష్టిరహితంబై, సచ్చిదానంద స్వరూపమై యొప్పుచుండును. ఈ చక్రమునకు శ్రీగురుమూర్తి అధిష్ఠాన దేవత ఓంకార లింగరూపముగ జ్యోతినిలయంబై, సర్వాకర్షణప్రణవస్థానమై యొప్పుచుండును. విమల జ్ఞానముద్ర. ఇందు 2 ఘ 40 వి. ఘ. ల కాలములో శ్రీ గురుమూర్తికి 1000 పరమహంసల జపము జరుగుచుండును.

పైన తెలుపబడిన ఏడుచక్రములను గ్రహించినవానికి బ్రహ్మజ్ఞానము కరతలామలక మగును. ఈ చక్రముల ప్రసరించువాయువు ప్రాణవాయు వనబడును. ఆవాయువు స్థాన భేదంబులతో దశవిధ నామంబుల నొప్పుచుండును. అవి

ప్రాణ- అపాన- వ్యాన- ఉదాన- సమానము లనబడు ప్రాణ వాయువులు. నాగ-కూర్మ-కృకర- దేవదత్త- ధనంజయము లనబడు నామంబులతో ఉపవాయువు లైదుగలవు. ప్రాణ వాయువులు కుడియెడమ భాగములందు ఇడాపింగళనాడులలో పైకిని క్రిందకును ఆడుచుండును. ఈ ఇడాపింగళ యనబడునవి ఆధారచక్రము మొదలు ఆగ్నేయ చక్రమువరకును వ్యాపించి యుండును. ఇడాపింగళలమధ్య సుషుమ్నయను నాడియుండును. ఈ సుషుమ్ననాడి ఆగ్నేయ చక్రమునకు పైభాగమున బ్రహ్మరంధ్రము వరకు వ్యాపించి, శరీరమధ్య భాగములో ప్రధానమైనదై రహస్యముగ నుండును. ఈనాడులందు సంచరించు జీవుడు ప్రాణవాయువుచే ఆగ్నేయ చక్రమునం దుద్భవించినట్టి 'స' కారంబును, మూలాధారమున అపానవాయువునం దుద్భవించిన 'హ' కారమునుచేరి 'హంస' 'సోహం' అను నామములతో, ఊర్ధ్వ అధోకుండలములందు వ్యాపించెడి ఆత్మ మంత్రము ఆధారాది షట్చక్రముల కధిష్ఠాన దేవతలగు గణపతి, బ్రహ్మ, విష్ణు, రుద్ర, జీవ, ఈశ్వరులను ప్రతిక్షణమును జపము చేయుచు నర్పణచేయు చుండును. అందుగణపతికి 600, బ్రహ్మకు 6000, విష్ణువునకు 6000, రుద్రునకు 6000, జీవునకు 1000, ఈశ్వరునకు 1000 సగుణ సహితంబుగ జీవు డర్పణము చేయుచుండును. శ్రీ గురు పరమాత్మలకు సహస్రారమున తేజోమయ రూపంబున 1000 హంసల అర్పణ జరుగు చుండును. ఈరీతిగ 21600 ల హంసల సగుణ నిర్గుణ రూపముగ నర్పణ జరుగుచుండును. ఇట్టివిషయంబును తెలుసుకొనలేక, జీవుడు సద్గురువు నాశ్రయించక కాశీరామేశ్వరాది తీర్థములను సేవించి ముక్తిని బొందవలయునని ప్రయత్నించుచు, సాలోక్యాది మోక్షముల నపేక్షించుచు, కాల

మంతయు వృథాపుచ్చుచుండును. ఈ రీతిగా సంచరించుట వలన దరిగానలేక సంసార సాగరములోబడి కొట్టుకొను చుండును. సహస్రారమే సృష్టికి కారణము. అదియే శబ్దరూప మైన వాక్కుగను, పరంజ్యోతిగను, ఊర్ధ్వకుండలిగను, అమృత భాండంబుగను నుండి మెఱుపువలె మెఱయుచుండును. ఈసహస్రారచక్రమే సమస్తసృష్టికిని మూలాధారం బగు చున్నది. అందు 'నేను' అను జీవుడు ప్రవేశించినప్పుడు,సమస్త సృష్టియు చిద్విలాసముగ గానబడుచుండును. అట్టిజీవునకు ఎట్టికర్మంబులును అంటవు. ఇట్టివిషయంబును దెలుసుకొనలేక అధోకుండలింబడి సుఖదుఃఖంబుల ననుభవించుచు, హృదయ కమలమందున్న యమృతమును పానమును జేయలేక, శరీరమే శాశ్వత మనుకొని సంచరించుచుందురు. ఇట్టి అవస్థయందు జీవుడు 'నేను' అనుదానికి అతీతముగ వేరొకటికలదని తనజ్ఞాన శక్తికొలది కర్మబద్ధులను గావింపుచు, కర్మకాండకు బద్ధుడై నడయాడుచుండును. మసిబారిన కుండ నదీజలములో ఎన్ని పర్యాయములు ముంచినను ఏరీతిగ దానిమలినము వదలదో అదేవిధముగ నీ శరీరమును ఎన్నిపర్యాయములు గంగలో ముంచినను ముక్తినిపొందలేరు. వ్రతములు, తీర్థయాత్రలు మొదలైనవి జీవన్ముక్తికి దూరంబులైనవి. ఇది యు నవచక్రంబులనియు, సప్తచక్రంబులనియు సహస్రారంబున శిఖా - శూన్యపశ్చిమ చక్రంబులుగలవని తెలుసుకొనుము. ఆధార - స్వాధిష్ఠాన - మణిపూరక - అనాహత - విశుద్ధ - ఆగ్నేయ - సహస్రార - ఆకారతౌల్య - ఆకాశ చక్రం బులు నవచక్రంబు లనబడును. సప్తచక్రంబులని చెప్ప బడునప్పుడు తౌల్యాకాశ చక్రంబులు రెండును, విశుద్ధసహ

స్రార చక్రంబులలో అంతర్భాగములుగ పరిగణింపబడును. షట్చక్రంబు లని వ్యవహరింపబడినప్పుడు సహస్రార చక్రము అధిష్ఠానముగ భావించి నిరూపింపబడుచుండును. కాని శ్రుతికి విరుద్ధముగ నుండును. సప్తచక్రములలో ప్రకృతి ఆత్మనిరూపణ గావింపబడెను. ఈరీతిగ షట్చక్రంబులనుండు అధిదేవతలను కనుగొనవలయు ననిన, అంతర్లక్ష్యవిధానము ననుసరించి కనుగొనవలయును.

## స్వాములవారు తెలిపిన షట్చక్రనిరూపణను మాదిగ కక్కయ్య గోడచాటుననుండి విని, తన భార్యగర్భమును చీల్చి అందుదేవతలు కనబడనందున విచారించుట

శ్రీస్వాములవారు పైవిధముగ సిద్దయ్యకు షట్చక్ర విధానమును గురించి తెలుపుచుండగ, గోడచాటున నుండి మాదిగ కక్కయ్య బాగుగవిని, దేవుడెక్కడో యున్నాడను కొనుచుంటిని; నావంటి అమాయకు డుండునా? వెంటనే యింటికింబోయి నాభార్యగర్భమును చీల్చి, బ్రహ్మాగారు చెప్పినట్లు దేవతలను సందర్శించి, ముక్తిని బొందెదనని ఆలోచించి, మూఢభక్తి గలవాడగుటచే వెంటనే గృహంబున కేగి, నిద్రించుచున్న భార్యనుచూచి. యిదియే మంచి సమయంబని తలపోసి, కత్తినిబట్టుకొని కుత్తుకగోసి, పిమ్మట ఉదరమును చీల్చి, అందు బ్రహ్మంగారు చెప్పినట్లుగ చక్రమును గాని దేవతలుగాని కన బడనందున విఫలమనోరథుండై, నిష్కారణముగ భార్యను చంపుకున్నందుకు నమితముగ దుఃఖించుచు, నేలంబడి పొర్లిపొర్లి యేడ్చుచు, తనయవివేకం

బునకు సిగ్గుపడుచు, దైవమా! కాషాయవస్త్రముల ధరించి ఉదరపోషణార్థమై ప్రజలను మోసగించుచున్న సన్యాసుల మాటలనువిని, పండువంటి యిల్లాలును తుదముట్టించితినిగదా! ఇకనాకు దిక్కెవ్వరు? గృహకృత్యము లింకెట్లు జరుగును? అని వెక్కివెక్కి యేడ్చుచు, "మూడుమిక్కిలి స్త్రీహత్యా పాతకంబున కొడిగట్టుకొంటినే"యని వగచుచు, అయినను లోకప్రఖ్యాతి వహించిన బ్రహ్మంగారిని త్వరపడి దూషింప రాదనియు, నింకను నదేమి రహస్యంబున్నదో స్వయముగ నడిగి తెలుసుకొనవలయునని, నిశ్చితాత్ముడై బ్రహ్మంగారును, సిద్ధయ్యయు నున్న తావునకుంబోయి, మరల నెప్పటియట్ల గోడచాటున నిలువబడి వారిసంభాషణవినుచు, బ్రహ్మంగారు చెప్పుచున్న ప్రతి విషయంబును "అదియంతయు అసత్యము, అసత్య" మని మారు పలుకనారభించెను.

ఆరీతిగ తాను చెప్పుచున్న ప్రతివిషయంబును"అసత్య"మని గోడ చాటునుండి ఎవ్వరో బదులుచెప్పు చున్నారని బ్రహ్మంగారు విని, "వీడెవ్వడో నేజెప్పు ప్రతివచనంబును అసత్యం బని చెప్పుచున్నాడు, అందులకు కారణం బేమైయుండునోగదా" యని తలపోసి, ప్రత్యక్షముగ "ఓయీ! నీవెవ్వండవు? నేజెప్పు ప్రతివిషయంబును అసత్యం బని గోడ చాటునుండి మారుపలుకు చుండుటకు కారణంబేమి?" అని అడుగ, కక్కయ్య వెంటనే స్వాములవారి యెదుటకువచ్చి నమస్కరించి "స్వామీ! నా అవివేకంబేమని యెంచింతును? మీరు సిద్ధయ్యకు చెప్పుచున్న ప్రతివాక్యంబును, ఈ గోడ

చాటున నిలువబడి వినినవాడనై, యథార్థమే యనుకొని నాభార్యను నిష్కారణముగ చంపుకొంటి''నని కంట తడి పెట్టుకొని యేడ్వ నారంభించెను.

అదివిని యాశ్చర్యపడుచు స్వాములవారు "ఓయీ! నీ మాటలు చాలవింతగానున్నవే? నేనేమి చెప్పితిని? నీభార్యను చంప మని నేనెప్పుడును చెప్పియుండలేదే? ఇట్టియపవాదునా నెత్తినేల పెట్టెదవు? జరిగిన దేదో సవిస్తరంబుగ దెలుపు''మన కక్కయ్య యేడ్చుచు. "స్వామీ! మీరు సిద్దయ్యగారికి చెప్పు చుండగ విని, సకల దేవతలుమన గర్భమునందే యున్నారని గ్రహించి, యింటికిబోయి కత్తితో నిదురించుచున్న నాభార్య గర్భమును చీల్చిచూడగా, అందేమియు గనబడక నిష్కార ణముగ భార్యను చంపినవాడనై దుఃఖము పాలైతి''నని చెప్పెను. మరియు నాతడు "స్వామీ! ఇక సన్యాసులమాటలు నమ్మగూడదని బోధపడినది. మీరు సిద్దయ్యకు చెప్పుచున్న మాయమాటలను నమ్మి మోసపోయితిని. నాగతి యిట్లయ్యె'' నని చెప్పి విలపింపసాగెను. స్వాములవారు ఆ మాటలువిని, కక్కయ్య శుద్ధ మూఢభక్తిగలవాడని గ్రహించి, అతనిని తరియింప జేయుట ముఖ్యమనినిశ్చయించుకొని "కక్కయ్యా! చనిపోయిన నీభార్య శరీరము ఎక్కడ నున్నదో నాకు చూపుము. నేను నీవెంట వత్తును. దేవతలను చూడవలయు నని నీకు దృఢాభిప్రాయ మున్నచో, నీకు ఆ దేవతలను తప్పక చూపగలను'' అని చెప్పి కక్కయ్యను వెంటబెట్టుకొని ఆతని గృహంబునకు బోయెను.

## స్వాములవారు కక్కయ్యభార్యను బ్రతికించి, అతనికి దేవతలను చూపించుట

ఆవిధంబుగ బ్రహ్మంగారు సిద్దయ్యను వెంటబెట్టుకొని కక్కయ్యతోగూడ నతని గృహంబున కేగి, ఒకచోగూర్చుండి తన శిష్యులైన సిద్దయ్యకును, కక్కయ్యకు నీరీతిగ చెప్ప నారంభించెను. "నాయనా! నేను జెప్పబోవు విషయంబులను శ్రద్ధతో వినుడు. మెడ క్రిందలయిగాతు గుదస్థానము వరకు గల వెన్నుముకకు ముక్తికాంతయనియు, వీణా దండమనియు, బ్రహ్మదండ మనియు, మేరువనియు పేర్లు. అట్టి వెన్నెముక నాశ్రయించి మూలాధారము సువర్ణచ్ఛాయతో నుండును. 2. స్వాధిష్ఠాన మనునది జలనిలయమై తెల్లని వర్ణము కలిగి యుండును. 3. మణిపూరకం బనునది అగ్నికి నిలయమై యెరుపు రంగుతో నుండును. 4. అనాహతంబు వాయునిలయంబై ఆకుపచ్చని వర్ణంబున నొప్పుచుండును. 5. విశుద్ధం బనునది ఆకాశనిలయంబై నీలిరంగు కలిగియుండును. 6 ఆజ్ఞేయం బనునది మాణిక్యమువంటి రంగు గలిగి యంతఃకరణమునకు స్థానమై యొప్పుచుండును:" అని వారలకు బోధించి, పిమ్మట కక్కయ్య భార్య శరీరమున్న తావునకు వారు ముగ్గురును పోయిరి.

అంత బ్రహ్మంగారు "బిడ్డలారా! నేచూపింపబోవు విషయంబులను శ్రద్ధగ చూడుడు. 1. ఇది ఆధార చక్రమన బడును. అందుగల నాలుగు దళములమధ్య నున్న వినాయకుని చూడుడు. 2. ఇది స్వాధిష్ఠాన చక్రము. దీనియందు ఆరు దళంబులు గలవు. ఆ దళంబుల మధ్యనున్న బ్రహ్మదేవుని గాంచుడు. 3. అదిగో పదిదళములతో నొప్పుచున్న

మణిపూరక చక్రంబును గాంచుము. ఆదళంబులకుమధ్య విష్ణుమూర్తి విలసిల్లుచుండును. 4. పన్నెండు దళములుగలిగిన అనాహత చక్రము మధ్యనున్న ఆరుద్రుని చూడుడు. 5. అదిగో పదియారు దళములతోనున్న విశుద్ధ చక్రము మధ్యనున్న జీవుని పరిశీలింపుడు. 6. అదే ఆగ్నేయచక్రము! రెండు దళములతో నున్నది. దాని మధ్యనున్న పరమాత్మ స్వరూపమును చూడుడు. 7. అదియే సహస్రారము. వేయి దళంబులు గలవు. వాటిమధ్య ప్రకాశించుచున్న శ్రీ గురుమూర్తి స్వరూపమును గాంచుడు" అని చెప్పి ఆ చక్రంబుల మధ్యనున్న దేవతలను వారిరువురకు చూపింపగ, కనులు మిరుమిట్లుచెంది నిశ్చేష్టులై చూచుచు అమితానందంబు నొంది, కొంతవడికి తెప్పరిల్లి, స్వాములవారికి సాష్టాంగదండ ప్రణామము లాచరించి "స్వామీ! తమ యనుగ్రహముచే మా జీవితములు ధన్యత గాంచిన వని పలికిరి. అనంతరము కక్కయ్య "స్వామీ! దేవతల దర్శనము చేయించి నాకు సంశయము బాపితిరి, కాని నాకు భార్యనుచంపిన స్త్రీహత్యా పాతక మెట్లు పోవునో, తోచక విచారించుచున్నా"నన విని, బ్రహ్మంగారు "నాయనా! బ్రహ్మజ్ఞానివైన, నిన్ను స్త్రీ హత్యాపాతకం బంట నేరదు. అయినను నీభార్య మరణించలేదు; అని చెప్పుచు, తనకమండల జలంబుల నామెపై ప్రోక్షించి విభూతిని మంత్రించి ఆమె లలాటమునబెట్ట, ఆమె ఎప్పటివలెనే యుండెను. అంతకక్కయ్య "గురువర్యా! యిదియేమి. మీరు మంత్రజలముల ప్రోక్షించినను నాభార్య ఎప్పటివలెనే ఉన్నది. ఇక బ్రతుకు నాశలేదు కాబోలు' నని విచారించు చుండెను. స్వాములవారు "కక్కయ్యా! ఆమె

మహాపతివ్రత. నీహస్తస్పర్శ కలిగిననే గాని ఆమెకు
కలుగదు. కనుక నీచేతులతో నా శరీరము మీద
తట్టుమని చెప్పగా, కక్కయ్య తనభార్య శరీరమును
తట్టుచు "దేవీ! నాయపరాధమును సైరించి మే
మన ఆమె దిగ్గునలేచి కూర్చొని "అబ్బా! ఎంత
అని అనుకొనుచు కనులు నులుముకొనుచు నెదురుగ
నంతలో తనయెదురుగ నిలువబడియున్న బ్రహ్మం
సిద్ధయ్యగారిని చూచి తనలో "వీరెవ్వరై యుందురో
ఇక్కడ కెందులకు వచ్చిరో కదా!" యని యనుకొ
కాషాయవస్త్రంబులు దాల్చి వేదాంతులవలె గన్పట్టుచ
టంజేసి సాష్టాంగ దండప్రణామము లాచరించి "పూజ్యులా
యిందు రాకతంబేమి? తమరాకచే మేము ధన్యులమైతిమి
అని బహువిధంబుల బ్రస్తుతించుచుండ, స్వాములవారు
దించి "తల్లీ! నీవు నీచజాతియందు జన్మించినను మహాసాధ్వి
కులముకంటె గుణమే ప్రధానమైనది. పూర్వజన్మ సుకృత
వలన నీవు మహాపతివ్రత వైతివి; నీవు సచ్చరితవు గావు
మేము మీగృహంబునకు రాగలిగితిమి. నీభర్త మహాభక్తు
మీరిక సుఖంబుగ నుండి సౌఖ్యము పొందుడు. మేము మ
వాసంబుల కేగెద"మని చెప్పి దీవించి, కక్కయ్యతో "బి
మీకిక నట్టి యాపదలును కలుగవు. హరినామస్మరణ గా
చుకొనుచు సుఖంబుగ నుండు"మని చెప్పి, వారలవీడి బ్ర
గారును, సిద్ధయ్యగారును తమ నిజవాసంబులకుం జనిరి. క
య్యయు, అతని భార్యయు బ్రహ్మంగారి విగ్రహమును
గృహంబునందు నెలకొల్పికొని నిత్యము విగ్రహమునకు

...క్రొనుచు, గృహస్థాశ్రమ ధర్మమున సుఖముగ గడుపసాగిరి.।

సప్తమ ప్రకరణము సమాప్తము.

# అష్టమ ప్రకరణము

## బ్రహ్మంగారు కాగుచున్న లోహమును దాహముగ త్రాగుట

బ్రహ్మంగారు రాయలసీమ యందున్న నంద్యాల ...ప్రాంతములో శిష్యసమేతంబుగ సంచారము చేయుచు, ...దినమున "దిగువమెట్ట"యను గ్రామములో నాగెను. ...వారికి ఆ యూరు చేరగనే దాహంబగుటచే, ఒక ...బ్రాహ్మణుని గృహంబునకేగి దాహమునకు జలంబడుగ. విశ్వబ్రాహ్మణుడు "అయ్యా! యింటిలోపల ఎవ్వరును ...రు; ప్రక్కనే తటాకమున్నది అక్కడకు బోయి త్రాగు"డని ...ప్పెను. అంత సిద్దయ్య "అయ్యా! మాగురువుగారు విశ్వబ్రాహ్మణులు. మీరును విశ్వబ్రాహ్మణులే కదా! కులము వారి యిల్లుగదా అని యడుగ చెరువునకు బొండని చెప్పుట న్యాయమా? అదియును గాక సాధుపుంగవుండైన యంతటి మహానుభావుడు మీగృహమునకు వచ్చుటే గొప్పవిషయము కదా! దాహమునకు జలంబిచ్చు నంతలో నెంతపని పోవును. ఆహా! కాల మేవిధముగ మారుచున్నది." అని పలుకగా, విశ్వబ్రాహ్మణుడు విని, విసుగుతో సిద్దయ్యను చూచి

"ఏమయ్యా! మీగురువుగారు మాగృహమునకు వ
అంత అపురూపమా? అంతటి మహానుభావుడా? నీ మా
చాల అద్భుతముగ నున్నవే. సాధువులు భేదరహి
గదా! సర్వంబును పరమాత్మ స్వరూప మనియే చెప్
దురు గదా! కరుగుచున్న యీలోహమును త్రాగుమన
ఆయనశక్తి చూతము" అని పరిహాసముగ పలుక, బ్ర
గారు ',అయ్యా! శక్తికేమిగాని, నిక్కంబుగ నాకు ద
మగుచున్నది. కరుగుచున్న యాలోహంబునే త్రాగను
దానిని త్రాగి దాహమును తీర్చుకొనుట కెట్టి యభ్యం
మున్నా లేదు. దాని నిటు తె"మ్మని అడిగి కొలిమియందు
మూసను తీసుకొని "దాహంబునకు జలంబగుగ కరుగుచు
లోహంబును త్రాగుమనుట, కాల వైపరీత్యముగదా"
అనుచు, ఆ మూసనెత్తి నోటిదగ్గర పెట్టుకొని మంచినీ
త్రాగినట్లుగనే గుటగుట త్రాగి "ఓవిశ్వబ్రాహ్మణోత్తమా
నాకు దాహం బింకను తీరలేదు. మీయింట నింక
లోహంబు లేవైననున్న యెడల కరగించి దాహంబునకి"మ్మ
యడుగ, ఆ విశ్వబ్రాహ్మణుడు ఆశ్చర్యపడి, తన కేమి వా
బిన్నునోయని గడగడ వణకుచు, శరీరము చిరుచెమటల
గ్రమ్మ నమస్కరించుచు నిలువబడి, ఏమి చెప్పుటకును నోట
రాక నెమ్మదిగ "అయ్యా! మీరెవ్వరో తెలియక, అవి
కంబుచే నేనాడిన మాటలు మన్నించి నన్ను క్షమింప కోరు
చున్నాను. ఏపుట్టలో నేపామున్నదో తెలుసుకొనుట కష్టము
కదా! నావంటి అవివేకుని తరింప జేయవచ్చిన పరమేశ్వరా
వతారమువలె గన్పట్టుచున్నారు. క్షమింపు"డని బ్రహ్మం
గారి పాదములపై బడి విడువకున్నంత, స్వాములవారు చూచి

ఇది అంతయు కాలవైపరీత్యము. ఇది కలియుగము.
ను పశ్చాత్తాపమువలన పాపములు శమించును. తెలి
చేసినదానికై అంతగా విచారింప బనిలేదు'' అని
చేతులతో శివదీక్ష నిలువఁబెట్ట. ఆ విశ్వబ్రాహ్మణుడు
స్వామీ! తమ రాకవలన నాగృహంబు పావనంబయ్యె.
తో నిపూట మా గృహమందుండి, యీ బీదవాని
తిథ్యమును స్వీకరించి, నన్ను పావనునిగ జేయు''డనిబహు
ల ప్రార్థింప, స్వాములవా రంగీకరించి, ఆపూటకు శిష్య
ంబుగ ఆవిశ్వబ్రాహ్మణునియింటనాతిథ్యమునుస్వీకరించి,
కి జ్ఞానోపదేశమును, మంత్రోపదేశంబును గావించి,
చటి దినము బయలుదేరి మహానందియను గ్రామంబు
బోయి, ఆ గ్రామమందున్న మహానందీశ్వరుని సేవించి
దినం బక్కడ గడపి, మరుచటి దినమున నంద్యాలకు
ను.

## నంద్యాల గ్రామమందలి విశ్వబ్రాహ్మణులు స్వాములవారిని అగౌరవముగ చూచుట

విశ్వబ్రాహ్మణులలో పంచాననమువా రనునొక తెగ
రు గలరు. నంద్యాలలోనున్న విశ్వబ్రాహ్మణు లందరును
తెగకు చెందినవారే. నంద్యాలలో వీరందరును మా
ుంతటి ధనవంతులు, తెలివిగలవారు ఇక ప్రపంచంలో
క్కడను లేరని విఱ్ఱవీగుచుండెడి వారు. బ్రహ్మంగారు
విషయ మెరింగియే, వార లెల్లరకు జ్ఞానోపదేశము చేసి,
త్ప్రవర్తన పరులుగ మార్చవలయు ననుతలంపుతో నంద్యా
కు వచ్చిరి. నంద్యాలలో స్వాముల దర్శనమునకు వచ్చు

## బ్రహ్మంగారు నంద్యాలలో పంచానన విశ్వ బ్రాహ్మణులకు తత్త్వోపదేశము చేయుట

నంద్యాలలో పంచానన విశ్వబ్రాహ్మణులందరును బ్రహ్మంగారు గొప్పదైవజ్ఞుల సంపన్నుడనియు, నిరుపమాశక్తి సామర్థ్యములు గలవాడనియు గ్రహించి, ఆయనయం దధిక భక్తిశ్రద్ధలు గలవారైరి. బ్రహ్మంగారు పంచాననవారికి జ్ఞానోపదేశము చేసి ధర్మ ప్రవర్తనులుగ చేయదలచి వేదాంతసార బోధనల గావించుచుండెను. ఒక దినమున బ్రహ్మంగారు పంచాననమువారికి మానవసృష్టి రహస్యమును దెలుపుచు "భక్తులారా! మీలో నొక జ్ఞానసంపన్నుని నా యెదుట కూర్చొనబెట్టి, నేనడుగు ప్రశ్నలకు సదుత్తరంబిచ్చు నట్లుచేయు"డన, నాసభాసదులలో నొక బుద్ధిశాలి లేచి బ్రహ్మంగారి యెదుటకూర్చుండెను. అప్పుడు బ్రహ్మంగారావ్యక్తితో నీక్రింది విధముగ సంభాషింప దొడంగెను.

బ్రహ్మ :—అయ్యా! నీవు ధరించిన వస్త్ర మెవరిది?

జవా :—నాదే!

బ్రహ్మ :—అనగా, వస్త్రము వేరు, నీవు వేరు అని కదా భావము.

జవాబు :—నిజమే! మీరు చెప్పినట్లు వేరుగనే యున్నవి.

బ్రహ్మ :—నీ దేహ మెవరిది?

జవా :—నాదే?

బ్రహ్మ :—అయినచో నీవు వేరు, నీ దేహము వేరు అని కదా?

—సత్యమే!

బ్రహ్మ:—అయినచో, నీకాళ్ళు, చేతులు, ముక్కులు, నోరు మొదలగునవి యెవరివి?

జ:—నావే!

బ్రహ్మ:—ఆ అవయవములు, ఇంద్రియములు నీవని యేవలన చెప్ప గలుగుచున్నావు?

జ:—బుద్ధిచేత చెప్ప గలుగుచున్నాను.

బ్రహ్మ:—నీబుద్ధి అస్థిరమైనదనియు, మందమైనదనియు నెట్లు తెలుసుకొన గలుగుచున్నావు?

జ:—మనస్సువలన ప్రపంచమందలి సర్వవిషయములు తెలుసుకొన గలుగుచున్నాను.

బ్రహ్మ:—మనస్సుచే సర్వవిషయములు తెలుసుకొన గలుగుచున్నానని యెట్లు గ్రహించ గలిగితివి?

జ:—ఆత్మవలన తెలుసుకొన గలుగుచున్నాను.

బ్రహ్మ:—ఆత్మయనునది యొకటి కలదని ఎట్లు గ్రహించ గలిగితివి.

జ:—నా బుద్ధికి ఆత్మయనునది యొకటి కలదని తోచుచున్నది.

బ్రహ్మ:—సర్వవిషయములకు ఆత్మయే మూలకారణమనియు, దానికి మించి ఏమియు లేదని కదా నీ వాదము. అటులయినచో 'అదియే' నీ 'నిజరూపము.' దానికి మించి వేరొకటి లేదని గ్రహించుము.

జవా:—మీరు చెప్పునది సత్యముగనే తోచుచున్నది. ఆత్మ స్వయంప్రకాశమనియు, దానికి మించి వేరొకటి లేదనియు చెప్పుట యథార్థముగనే గన్పట్టుచున్నది.

"బిడ్డా! దీనినిబట్టి ప్రపంచమందలి సర్వప్రాణికోటి యొక్క 'ఆత్మ' పరమాత్మయొక్క స్వరూపమేయని గ్రహించ వలయును. అట్టి ఆత్మను పరమాత్మయందు లీనము చేయుటకు ప్రయత్నించుటయే భక్తి యనబడును. ఇది శంకరాచార్యమతము. కనుక మీరెల్లరును భక్తిజ్ఞానసంపన్నులై వర్ధిల్లు" డని తెలుప, వారిలో నొక జ్ఞానసంపన్నుడు లేచి బ్రహ్మంగారితో "అయ్యా! బ్రాహ్మణులు వేదంబులు నాలుగేయనియు, బ్రహ్మకు ముఖంబులు నాలుగేయనియు చెప్పుచున్నారు గదా! యీ విషయంబు మాకు బోధపడుట లేదు. కావున విరాడ్విశ్వబ్రహ్మ కెన్ని ముఖంబులో ఏముఖంబున నెవరు జన్మించిరో, తెలుప గోరుచున్నా"మని కోరెను. అంతట బ్రహ్మంగారు వారికి సృష్టి క్రమమును గూర్చి తెలుప నారంభించెను.

## బ్రహ్మంగారు నంద్యాలయందు విశ్వబ్రాహ్మణులకు సృష్టి క్రమమును తెలుపుట

శ్లో॥ శివాత్మేతిమనుఃపూర్వం, హార్యంశమితి దక్షిణే।
బ్రహ్మా వంశంచ త్వష్టానాం. ఉత్తరం దేవ శిల్పయోః
ఊర్ధ్వంనారాయంశ విశ్వజ్ఞ ముఖం పంచత్రినేత్రకం॥

శ్లో॥ న భూమి ర్న జలంచైవ న తేజో న చ వాయవః।
న చ బ్రహ్మా న చ విష్ణు ర్న చ నక్షత్రతారకాః।
సర్వశూన్యం నిరాలంబం స్వయంభూవిశ్వకర్మణః॥

తా॥ భూమి, జలము, అగ్ని, వాయువు, బ్రహ్మ, విష్ణు, నక్షత్రములు, చంద్రుడు మొదలగునవి ఏవియు లేని సమయమున 'జ్యోతి' యొక్కటి మాత్రమే కోటిసూర్య ప్రభాభాజ

ంబై వెలుగొందు చుండెను. అట్టి జ్యోతియందు 'ఓం' అను ప్రణవము పుట్టెను. అట్టి 'ఓం' అను ప్రణవమునుండి దశవిధనాదములు జనించినవి. అట్టి నాదములు పదివిధములైన నాదములతో కలసి, జ్యోతిర్మయాకారముగ ప్రకాశించు చుండిన నదే 'స్వయంభూవిరాడ్విశ్వబ్రహ్మ' రూపము. అట్టి రూపమున పంచముఖ 'విశ్వకర్మ' జన్మించెను.

శ్లో॥ సద్యోజాతం వామదేవం అఘోరం పురుషంస్తథా।
ఈశాన్యముఖ సంజాతా పంచైతే విశ్వకర్మణః॥

శ్లో॥ అయోమనుశ్చ ఋగ్జాతం వామయోధార్యజుస్తథా।
తామ్రత్వష్టారజస్సామా శిలాశిల్పి రథర్వణః।
కాష్ఠంవిశ్వజ్ఞ ప్రణవం పంచబ్రహ్మ విధీయతే.

తా॥ సద్యోజాతము, వామదేవము, అఘోరము, పురుషము. ఈశాన్యము అనబడు అయిదు ముఖములతో మొదట 'విశ్వకర్మ' జనించెను. అట్టి పంచ ముఖములలో సద్యోజాత ముఖమందు మనుబ్రహ్మ పుట్టెను, మనుబ్రహ్మ వలన ఋగ్వేదము పుట్టెను. అందువలననే 'మనుఋగ్వేదకం చైవ' అని చెప్పబడుచుండును. ఈ బ్రహ్మయొక్క గోత్రము సామగము. సూత్రము అశ్వలాయనము, ఋక్శాఖ ప్రవర సద్యోజాతము, స్పటికవర్ణము, వెండి దండకోల, వెండి జందెము, హోమగుండము, త్రికోణాకారము, వాహనము కాలమేఘము, మంత్రజపము ఏకాక్షరి. శివమయ బ్రహ్మ అని చెప్పవలయును.

2. వాసుదేవ ముఖమందు మయబ్రహ్మపుట్టెను. అందువలననే "వామయోధార్యజుస్తథా' అని చెప్పబడుచుండును. మరియు యజుర్వేదోమయస్తథా" అని చెప్పబడియున్నది.

అనగా నీ బ్రహ్మవలన యజుర్వేదము పుట్టెను. ఈ బ్రహ్మ యొక్క గోత్రము సనాతనము, ఆపస్తంభ సూత్రము, యజుశ్శాఖ, ప్రవర వామదేవము, నీలవర్ణము, నలుచరము హోమగుండము వెదురు దండకోల, పద్మపుజందెము, వాహనము ఉత్తాలమేఖము, చతురాక్షరీమంత్రజపము, హరిమయబ్రహ్మ, అని చెప్పవలయును.

3. 'తామ్రత్వష్టారజస్సామా' అని చెప్పబడియున్నది. మరియు త్వష్టానాం బ్రహ్మణేనమః అని చెప్పుదురు. అనగా, అఘోరముఖమున త్వష్టబ్రహ్మయు సామవేదంబును బుట్టెను. ఈబ్రహ్మయొక్క గోత్రము అహాభూనస, ద్రావ్యాయన సూత్రము, శాఖసామము ప్రవర అఘోరము. తామ్రవర్ణము, హోమగుండము వర్తులాకారము, రాగి దండకోల, రాగి జందెము, నీలమేఘము, వాహనము, మంత్రజపము అయిదు వర్ణములు కలిగియుండును.

4. 'శిలాశిల్పర్యధర్వణః' అని చెప్పబడియున్నది. అనగా నాల్గవ ముఖమున శిల్పబ్రహ్మయు, అధర్వణవేదమును ఉద్భవించెను. శిలబ్రహ్మ, గోత్రము ప్రత్న, ఆప్యాయన సూత్రము, అధర్వణశాఖ, ప్రవర తత్పురుషము, ధూమ్ర వర్ణము, పంచకోణ హోమగుండము. దండము బెత్తము, జందెము శూలము, వాహనము కుంభ మేఘము, మంత్రజపము ఆరువర్ణములతో కూడుకొని యుండును. 'మహేంద్రో శిల్ప బ్రహ్మ' అని చెప్పబడియున్నది.

5. రాప్యం విశ్వజ్ఞ ప్రణవం పంచ బ్రహ్మ విధీయతే'', ఈశాన్య ముఖమైన అయిదవ ముఖమందు విశ్వబ్రహ్మయు, ప్రణవవేదమును నుద్భవించెను. ఈబ్రహ్మయొక్క

గోత్రము సువర్ణము, కాత్యాయని సూత్రము, ప్రణవశాఖ, ఈశాన ప్రవర, సువర్ణచ్ఛాయ, అష్టకోణ హోమకుండము, సువర్ణ దండకోల, హేమజుండెము, వాయు మేఘము, వాహనము, మంత్రజపము ఎనిమిది వర్ణములు కలదిగ నుండును. 'విశ్వజ్ఞ దివిబ్రహ్మ' అని చెప్పవలయును.

పైన చెప్పబడిన విధముగ పంచ ముఖములు గలిగిన విశ్వకర్మ ముఖములందు మను, మయ, త్వష్ట, శిల్ప, విశ్వజ్ఞ బ్రహ్మలు జన్మించిరి. అట్టి పంచ బ్రహ్మలవలన ఆదిశక్తి పరాశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తులు పుట్టెను. అట్టి పంచశక్తుల మూలమున ప్రపంచ సృష్టి జరిగెను. ఈ పంచశక్తుల వలనను సృష్టి, స్థితి, లయ, తిరోధానాను గ్రహంబులనియెడు పంచవిధ కార్యంబులును నిర్వహింపబడు చున్నవి.

## స్వాములవారు నంద్యాలయందలి పంచాననము వారికి సృష్టి రహస్యంబులను దెలుపుట

నంద్యాల యందలి పంచానన శాఖోద్భవులగు విశ్వ బ్రాహ్మణులకు పంచముఖ బ్రహ్మ వృత్తాంతం బెరిగించి, అనంతరము సృష్టిరహస్యంబులకు దెలుప నారంభించెను. "భక్తులారా! పంచభూత ప్రకృతి స్వభావములవలనను, భూసారమువలనను మానవులు - పక్షులు - మృగములు-క్రిమికీట కాదులకు సప్తధాతువులేర్పడి. స్త్రీ పురుషజాతులు కలిగి జీవాత్మలు ప్రకాశమానమై, వటబీజ మూలములుగ నుద్భవించుచు వచ్చిన సృష్టి, పృథ్వీతత్వమైనదే బ్రహ్మమనబడును. అట్టి బ్రహ్మ స్వరూపమే మనువాచార్యులు. ఈ మనువా

చార్యునకు గినుము సృష్టించుటయు, ఋగ్వేదమును పఠిం
చుటయు, ఔపాసనంబును, త్రికోణ హోమకుండము
నేర్పరచిన సృష్టిసంహార కర్తయగు రుద్రసృష్టియని తెలుప
బడుచుండును. 'అహోమనుశ్చ ఋగ్జాతం' అను వేద
ప్రమాణముచే రుద్ర రూపంబగు కర్తచే సకల వర్ణములును
సృష్టి పాలనంబగునట్లు గర్భమున జన్మించి, శిశువు నాభినాళ
మును కోసి, పిల్లను తల్లినుండి వేరుచేసిన పిదప, ధర్మార్థ
కామమోక్షంబు లనియెడు చతుర్విధ పురుషార్థములు నడచు
నట్లుగ కదురుమైన, కాడుమైన, ఘు... మైన, కర్త
మైన, త్రాసుమైన యను నైదింటివలనను ప్రపంచమునడచు
చున్నది. రుద్రుడు ఇట్టి విషయములకు కర్త ...యని ఋగ్వే
దమునందు వివరింప బడియున్నది. అట్టిరుద్రుడే ...నువా
చార్యుండని పిలువబడుచుండును.

2. ఇక ద్వితీయంబగు 'స్థితి' విధానంబెరింగింతు నాల
కింపుడు. స్థితి జలాంశమైనదిగ నున్నది. స్థితి కార్యములకు
కర్త విష్ణుమూర్తియని యజుర్వేదమందు చెప్పబడియున్నది.
విష్ణువే మాయాచార్యులు. మయబ్రహ్మయే స్థితికార్యముల
నిర్వహించుచుండును. దానినే ఆపోవా విష్ణువనియు చెప్పబడు
చుండును. 'వాయుయోధార్యజుస్తథా' అనెడు వేదవాక్యం
బుచే సమస్తప్రాణాలును సౌఖ్యముకొరకు దైవకల్పితమైన
గృహక్షేత్ర సస్య సామగ్రుల నేర్పరచుకొని జీవించుచుం
డును. ఈవిధమైన స్థితికార్యమంతయు విష్ణువు చేయుచుండును.

3. మూడవది సంహారకృత్యము. ఈకృత్యమును నెర
వేర్చుచుండునది ఈశ్వరుడు. ఆ ఈశ్వరుడే త్వష్టాచార్యుండని
పిలువబడుచుండును. ఇదియే తామ్రసృష్టియని చెప్పబడు

చుండును. ఈశ్వరుడు సామవేదమును పారాయణ జేయు
చుండును. ఔపాసన ము ను వర్తులాకార హోమగుండమును
సృష్టించెను. 'త్వా[ష్ట్ర] ...త్వష్టారజస్నామా' అని చెప్పబడియుం
డుటచే సమస్త ప్రా ణులును జీవయాత్రకు లోహములను
కరిగించి వివిధరూపవ ...లు కలిగించి, విగ్రహములను, యాగ
ములకు కావలసిన క ...లశాదులను, పచన పాత్రలను ఏర్పరచు
కొనుచుండును. ఇట్టి కృత్యము బ్రహ్మోద్యోగమని యజు
ర్వేదమున తెలుపబడి ...యుండెను. అట్టి బ్రహ్మయే త్వష్టాచార్యు
లనబడును ఈ బ్ర... హ్మయే లయమునకు కారకుడు. ఈకృత్యము
తేజోమయాంశ... మైనది. ఇది జలాంశ కృత్యము. అధికరింప
నీయక ప్ర... స్వతత్వముచే నుద్భవించినజలవాతాదులతో గలసి
...భంచిన సమయమున వాతపైత్య శ్లేష్మంబులచే కలుగు
పలువిధ రోగములను బోకుండ జేయుటయే సంహారకృత్యమన
బడును. ఆరీతిగ సంహార సృష్టికర్త ఈశ్వరుడగుచున్నాడు.

4. ఇక నాల్గవది తిరోధానకృత్య మనబడును. ఇది వాయ్వంశమైనది. సర్వప్రపంచమును వ్యాపించి తేజోంశము నతిగమింపనీయక పృథ్వీచే జనించిన ప్రాణుల స్పర్శ వేదులం గలసి బయలు వెడలునపుడు సత్వగుణ ప్రధానమైన ఆత్మలను అణచియుండుట తిరోధాన మనబడును. అదియే మహేంద్రకృత్యమనికూడ పిలువబడుచుండును. ఆ మహేంద్రుడే శిల్పాచార్యుడనంబడును. అట్టి శిల్పాచార్యుండు ఔపాసనంబును, ఆఱు మూలలుగల హోమగుండమును కల్పించి తిరోధానకృత్య కర్తయగుచున్నాడు. ఇదియే మహేంద్ర సృష్టియని చెప్పబడుచుండును. 'శిలాశిల్పి అథర్వణః' అని చెప్పబడియుండుటచే ప్రపంచమునగల సకల ప్రాణులును

ప్రపంచ విషయములకుగాను దైవసర్గ్మితంబులగు అరుప యారు శిల్పములును గోపుర, స్థూపాది త్రయస్త్రింశత్కోటి దేవతా ప్రతిష్ఠాది కార్యములును, వేద మంత్రాంగంబులును. జప, తప, బీజ. ఆవాహన, హోమ అనుష్ఠానాది అష్టాదశ కార్యకలాపములును, షోడశకళా న్యాసంబులును ఏర్పరచుకొని, ముక్తిప్రదాయమైన జ్ఞాన, నియమ, నిష్ఠా గరిష్ఠ యోగసమాధికి నుపయోగించుచు సాంప్రదాయ సిద్ధమై అద్వైత బ్రహ్మ స్వరూపంబగు విరాట్పర బ్రహ్మ స్వరూపమును దెలియుటకు మార్గమునను దేవతలకు స్థపతియాచార్యులై యుండి వివిధమంత్రముల సకల దేవతలను ఆరాధించి ముక్తిని బొందుటకు కారణభూతులైనవారే శిల్పాచార్యులనంబడుచున్నారు. ఈసృష్టియే దేవేంద్రసృష్టియని యజుర్వేదమున తెలుపబడెను. శిల్పాచార్యుడే మహేంద్రుడు. ఈ బ్రహ్మయే 'తిరోధాన' కృత్యములకు కారకుడగుచున్నాడు.

౫. ఇక మిగిలిన అయిదవదగు 'అనుగ్రహము' ఆకాశాంశముచే శ్రీ విరాడ్విశ్వ బ్రహ్మజ్యోతియం దుద్భవించి వాయవ్యాంశమును అధిగమింపనీయక, వాయునంశము అధిగమించినప్పుడు భావోద్రేకంబైన 'ఆత్మ' ప్రకాశము బయలుపడి, విశ్వబ్రహ్మయొక్క ప్రభావంబున క్షీరమునుండి ఘృతము వచ్చునట్లుగ మోక్షమును కలుగ జేయుచుండును. ప్రకృతిసిద్ధమైన ఆకాశంబును శివంబనియు, సదాశివుడే విశ్వజ్ఞాచార్యుండనియు పేర్కొనుచుందురు. ఈ విధంబుగు సృష్టి సువర్ణసృష్టి యనియు, ప్రణవవేద పారాయణంబును, జ్ఞానోపాసనమును, ఎనిమిదిమూలలుగల హోమగుండమును సృష్టించి 'అనుగ్రహము'నకు కర్తయై యుండు సూర్యసృష్టి యని వ్యాస

సారింపబడు చుండును. 'రౌప్యం విశ్వజ్ఞ ప్రణవం పంచబ్రహ్మ విధీయతే' అను వేదవాక్యంబుచే సకలప్రాణులును జీవితయాత్రకై సౌఖ్యముకొరకు సువర్ణ, రజిత, రత్నాభరణాదులను కల్పించి, అష్టాదశ జాతులయందును స్త్రీ పురుషులకు జరుగుచుండు అష్ట విధంబులగు వివాహంబులకును వలయు మాంగల్యాది ఆభరణములను యేర్పఱచి, కాలచక్ర, జ్యోతిషాదులు కల్పించి, సమస్తజాతులందును అపవిత్రులగు స్త్రీల వలన మాంగల్యరహితులై ఉద్భవించిన అనులోమ ప్రతిలోమ, అంతరాళ, కర్ణ, కుండక, గోళకాదులైన వర్ణబీజ నిషేధంబులైన వారిని మాంగల్యాదులవలన కులపవిత్రుల గావించి, చతుర్విధపురుషార్థములు పొందుటకు యుక్తులుగ గావించి "అనుగ్రహము" కలిగియుండుటే సూర్యసృష్టియొక్క విధానమని యజుర్వేదమునందు తెలుపబడియె. అట్టి సూర్యుడే విశ్వజ్ఞాచార్యుండన బరగు చుండును. 'అనుగ్రహము' నకు ఈ బ్రహ్మయే కారకుడు.

పైన చెప్పబడిన పంచవిధ బ్రహ్మల వలననే యీ ప్రపంచ వ్యవహారములు నడచుచున్నవి. ఈ పంచవిధ బ్రహ్మల సృష్టికిమించి వేరొండేమియు నీ ప్రపంచమున లేదనియు నివియే పంచముఖ బ్రహ్మకర్తవ్యఅవతార కృత్యమనియు యజుర్వేదంబున తేటతెల్లంబుగ తెలుపంబడియుండె. మరియు ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణములను నాలుగు వేదములందును, మూలస్తంబ సూత్రములందును. షట్ శాస్త్రములందును, సకలపురాణేతిహాస సిద్ధాంత గ్రంథములందును, ముప్పదిమూడు వాస్తుగ్రంథములందును, అరువదియారుశిల్పశాస్త్ర గ్రంథములందును, పారాశర్య, నాగర

ఖండ, విశ్వకర్మ, విశ్వసార, వశి, మయ, భాను, కార్యపశ్య, సృష్టి, మానస, సయుద్ధిక, వజ్ర, సోమ, ముద్రగం, కాపిలం, ఛిద్రం, నామసంహిత, నాస్తికం, విశ్వబోధ, ఆదిసార, వితారం, ఇంద్రం మొదలగు సమస్త గ్రంథములందును ఇదేరీతిగ తెలుపబడి యున్నది.

అందుచే 1. ఆదిశక్తికి మను బ్రహ్మ స్వరూపాభ్యాం, ఉమా మహేశ్వరాభ్యాం నమః అనియు, 2. పరాశక్తికి మయబ్రహ్మ స్వరూపాభ్యాం లక్ష్మీనారాయణాభ్యాం నమః అనియు, 3. ఇచ్ఛాశక్తికి త్వష్టబ్రహ్మస్వరూపాభ్యాం వాణీహిరణ్యరూపాభ్యాంనమః అనియు, 4. క్రియాశక్తికి శిల్పబ్రహ్మస్వరూపాభ్యాంశచీపురందరాభ్యాంనమః అనియు, 5. జ్ఞానశక్తికి విశ్వజ్ఞ బ్రహ్మస్వరూపాభ్యాం సజ్ఞా భాస్కరాభ్యాంనమః అనియు చెప్పుచుందురు.

మరియు మనుబ్రహ్మసృష్టి ఉమా మహేశ్వరుండగు రుద్రసృష్టి యనియు, మయబ్రహ్మసృష్టి లక్ష్మీనారాయణుండగు శ్రీమహావిష్ణువుయొక్క సృష్టియనియు, త్వష్ట బ్రహ్మయొక్క సృష్టి సరస్వతి ప్రజాపతియగు బ్రహ్మసృష్టియనియు, శిల్పబ్రహ్మముయొక్క సృష్టి శచీపురందరుండగు దేవేంద్ర సృష్టియనియు, విశ్వబ్రహ్మసృష్టి సజ్ఞా భాస్కరుండగు సూర్యుని సృష్టియనియు చెప్పబడియుండెను.

మరియుసామ్రాడ్విశ్వకర్మవిరాడ్విశ్వబ్రహ్మయనియు, పరబ్రహ్మ విశ్వబ్రహ్మయనియు, సామ్రాడ్విశ్వ స్వరూపంబనియు, వ్యవహరింపబడు చుండును. ప్రపంచమునగల శాక్తేయజనులు ఈ పంచముఖబ్రహ్మను పంచాక్షరీ మొదలైన మంత్రములచే జపతపంబు లాచరించుచుందురు. కనుక పంచ

విధబ్రహ్మలు ఈ చతుర్దశ భువనంబులకును సృష్టిస్థితి సం హారకృత్యములకు కారకులుగ నున్నారు." అని చెప్పగా పంచాననమువారు విని స్వాములవారి ప్రజ్ఞానిశేషంబులకు సంతసించి. స్వాములవారిని వారల నిట్లని ప్రశ్నింపదొడంగిరి. "అయ్యా! పంచాంగము అనగానేమి? అద్దాని నెవరుసృష్టించిరి. ఆనతీయరే" అనియడుగ వారలకు బ్రహ్మంగారీవిధంబున తెలుప నారంభించిరి.

"భక్తులారా! వినుడు. 1. తిథి 2. వార 3. నక్షత్ర 4. యోగ 5. కరణములనెడు అయిదు (పంచ-అయిదు, అంగ-భాగములు) విషయములను తెలుపునదే పంచాంగ మనబడును.

శ్లో॥ తిథిరూపం మనుప్రోక్తం వారస్తు మయసంభవః
నక్షత్రం త్వష్టరూపంచ శిల్పయోగించదైవతం
విశ్వజ్ఞం కరణంచైవ పంచాంగో అధిదేవతా॥

బిడ్డలారా! వినుడు. మనుబ్రహ్మ తిథులను, మయశిల్ప బహ్మవారములను, త్వష్టబ్రహ్మ నక్షత్రములను, శిల్పబ్రహ్మ యోగములను, విశ్వజ్ఞబ్రహ్మ కరణములను - ఈ విధముగ పంచబ్రహ్మలును పంచఅంగములను సృష్టించి మొదట పంచాంగమునకు కర్తలైరి. అందుచే పంచాంగమునకు ఈ పంచవిధ బ్రహ్మలును అధిదేవతలగు చున్నారు. ఈ విధం బుగ వేదమునందు చెప్పబడి యుండె"నని వారలకుం దెల్పు వారందరును సంతసించి స్వాములవారిని బహువిధముల బ్రస్తుతించి, సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, సత్కరించి గౌరవించిరి.

అష్టమప్రకరణము సమాప్తము

# నవమ ప్రకరణము



## బ్రహ్మంగారు అహోబిలక్షేత్రమునకు వెళ్లుట

అనంతరము బ్రహ్మంగారొక శుభ ముహూర్తమున శిష్యసహితంబుగ బనగానపల్లెనుండి బయలుదేరి, మార్గమధ్యమున అటనట గ్రామాదులలో నాగుచు, భక్తులకు జ్ఞానోపదేశంబులు గావించుచు, అరణ్యముల బడిపోవుచు, నాయా తావులగల విశేషంబుల నారయుచు కతిపయదినంబులకు అహోబిలక్షేత్రమును చేరుకొనిరి. అహోబిలమునకు 'చినవోబులము'నియు, 'పెదవోబులను'నియు పేర్లుగలవు. ఆ క్షేత్రంబున శ్రీ లక్ష్మీ నృసింహస్వామి ఆలయము గలదు. ఆ ఆలయంబును నిర్మించిన శిల్పచాతుర్య మిట్టిదని బ్రహ్మకైన వర్ణింప తరంబుగాదు. వేనోళ్లుగలిగిన చిలువకైన వర్ణింప నశక్యంబే యని చెప్పనొప్పును. చూచువారలకు నిది దేవతా నిర్మితంబై యుండనొప్పు ననియు, మానవులకిట్టి శక్తి అసాధ్యంబనియు తోచును. అట్టి మహాక్షేత్రము నానావిధ క్రూరమృగ విలసితంబై చెన్నొందు మహారణ్య మధ్యంబున వెలయుచున్నది. ఆలయ నిర్మాణము చాలవరకు ప్రతాపరుద్ర మహారాజుచే జరిగినట్లు, అందుగల శాసనములవలన దెలియవచ్చుచున్నది. ఆ దేవాలయమున ప్రతిసంవత్సరము మాఘశుద్ధ తదియలగాయితు బహుళవిదియ వరకును మహావైభవంబుగ నృసింహస్వామికి ఉత్సవములు జరుగుచుండును. ఆ ఆలయంబునకు సుమారొక మైలు దూరమున నొకపర్వతంబు గలదు. ఆపర్వతంబుపై గూడ శ్రీ నృసింహస్వామి ఆలయంబు గలదు, నృసింహస్వామి చరిత్రయంతయు నందు శిలలపై చెక్కబడి

యున్నది. క్రింద ఆలయమునందుగల స్వామిని చినవోబులేశ్వరుండనియు కొండపైగల ఆలయమందున్న స్వామిని పెదవోబులేశ్వరుండనియు వ్యవహరించు చుందురు. కొండపై నున్న ఆలయమున ఒకవిచిత్రంబగు చలువరాయి కలదు. ఆ రాతిదగ్గర నిలువబడి 'నారాయణ' అని రెండు చేతులతో చప్పట్లు కొట్టిన చేతుల మధ్యనుండి నీటిబిందువులు క్రింద పడును. కొండపై పూర్వము ప్రహ్లాదుని శిక్షించిన ఉక్కు స్తంభము గలదు. హిరణ్యాక్షుడు సంహారింప బడిన ప్రదేశమున రక్తవర్ణముగల నీటితో ఒక కోనేరుగూడ గలదు. భక్తులందరును ఆకోనేరునందు స్నానంబాచరించు చుందురు. కొండఅంతయు దట్టముగనున్న వృక్షములతో నిండి అరణ్యముగనుండును. బ్రహ్మంగారు అట్టి విషయంబుల నన్నిటిని గాంచి, అనంతరము కడపకు బోవలయునని బయలుదేరిరి.

## బ్రహ్మంగారు కడపకుబోవుచు మార్గమధ్యమున ఒకబ్రహ్మరాక్షసికి గర్వభంగము గావించుట

బ్రహ్మంగారు ఆవిధముగ అహోబిల క్షేత్రమునుండి శిష్యసహితంబుగ బయలుదేరి, కడపకు బోవలయునను తలంపుతో మార్గమును బట్టి పోవుచుండెను. సూర్యుడస్తమించు సరికి మార్గమధ్యమున వారొక వటవృక్షము క్రింద బసచేసిరి. ఆవృక్షంబుపై చాలకాలమునుండి ఒకబ్రహ్మరాక్షసి నివాసము గావించుకొని దారింబోవ బోవు బాటసారులను బట్టి చంపుచుండెడిది. అందుచే ఆ మార్గమున బోవుట మాని వేసిరి. దైవవశంబున స్వాములవారు ఆ వటవృక్షము క్రిందనే బసచేయుట తటస్థించెను. శిష్యులు వంటచేసి, విస్తరాకులకై

ఆలోచించిరి. అందొకశిష్యుడు అవటవృక్షంబునే యెక్కి-ఆకులుగోయ నారంభించెను. అంత బ్రహ్మరాక్షసిఅది చూచి "శాపురే! నేవసియించు చెట్టు ఆకులనే గోయుచున్నాడే? వీని సాహసంబేమి? చూడువీని నేమిచేయుదునో" యని కన్నెఱ్ఱ జేసి అంగలార్చుచు, భూమ్యాకాశంబులకు సరిపోవునట్లుగ నోరుదెరచి, ఆశిష్యునిపై దుమికెను. ఆ శిష్యుండదిగాంచి, భయపడి, స్మృహదప్పి, పట్టువదలి, నేలంబడియె. మిగిలినశిష్యులందరు అదిగాంచి, ఏ చీమయో కుట్టుటచే నేలంబడి స్మృహదప్పినాడనుకొని, మరల వేరొకనిని నెక్కించిరి. వాడును అదేవిధంబుగ నేలంబడెను. శిష్యులందరును ఆ రీతిగ ఒకరి తరువాతనొకరు ఆచెట్టునెక్కి నేలగూలుచుండుట సిద్ధయ్య చూచి ఆశ్చర్యపడి, జపము చేసుకొనుచున్న స్వాములవారి దగ్గరకుంబోయి "స్వామీ! చూచితిరా యీవింత? ఆకులు గోయ చెట్టెక్కిన వారందరును నేలగూలుట విచిత్రముగ నున్నది. ఇదిఏమి?" యని అడుగ స్వాములవారు "సిద్ధా! వారందరును నిశ్చలభక్తులుగాక పోవుటవలననే, వారావిధముగ స్వల్పవిషయమాత్రంబునకే నేలంబడిరి. ఆరహస్యంబుం జెప్పుచున్నాను వినుము. ఈవటవృక్షంబుపై పెద్దకాలంబు నుండి ఒక బ్రహ్మరాక్షసి వసియించుచు, నీ మార్గమున బోవువారలనుబట్టి పీడించుచున్నది. దానిని గర్వభంగము కావలసిన కాలమాసన్నమగుట వలననే నేను మనమీ వృక్షముక్రిందనే బసచేయ తటస్థించెను. కనుక నీవీ వెండి బెత్తమును చేతధరించి, చెట్టుపైకెక్కి, అది ఎన్ని మాయోపాయములు పన్నినను, బెత్తమును మాత్రము చేయివదలక, ఆబ్రహ్మరాక్షసిని కొప్పుపట్టి, క్రిందకు నీడ్చుకొనిరమ్ము" ని

పంపెను. సిద్ధయ్య గురువుగు ఆజ్ఞననుసరించి నిశ్చయంబుగ చెట్టుపైకెక్క, బ్రహ్మరాక్షసియు పూర్వమువలెనే సిద్ధయ్యపై బడెను. సిద్ధయ్య అదిగాంచి భయమునొందక తన చేతినున్న బెత్తమును, ఆ బ్రహ్మరాక్షసి నెత్తిపై బెట్టబోయెను. బ్రహ్మరాక్షసి ఆ బెత్తమునుచూచి వెరగంది, ఎటులైన నాబెత్తమును పారవేయునటుల జేయవలయునని, నవమన్మథ మోహనాంగియై యొక స్త్రీరూపమున సిద్ధయ్య ఎదుట నిలువబడి "కాషాయవస్త్రంబులు దాల్చితివేమి? హాయిగా కలసి కామోపభోగముల దేలుదము రమ్ము. చేత నాబెత్తమెందులకు దానిని క్రిందబడవేసి, నన్ను కౌగలించుకొను"మని వేడుచున్న బ్రహ్మరాక్షసిని గాంచి, దాని మాయోపాయములు మున్నే బ్రహ్మంగారివలన వినిన వాడగుటచే లేశమాత్రమైనను లొంగక, దాని చేష్టలకు చలింపక, వెండిబెత్తంబును దానితలపై బెట్టెను, నది తనశక్తిని గోల్పోయి నిశ్చేష్టితయై నిలువంబడియె. అంత సిద్ధయ్య దానిజుట్టునుబట్టి వృక్షంబునుండి క్రిందకుదింపి, స్వాములవారి యెదుట నిలువబెట్టెను. అంత స్వాములవారు "ఓసీ! రాక్షసీ! నీవాచరించుచున్న దుష్కృత్యంబులన్నియు నేనెరుంగుదును. నేటికి దుర్మార్గము లడంగుకాలము వచ్చినది" అనిచెప్పి, తనచేతనున్న విభూతిని ఆ బ్రహ్మరాక్షసిపై జల్లగా, నా రాక్షసి తనశక్తి సామర్థ్యంబులన్నియు గోల్పోయి, నిర్వీర్యంబై నిలునబడి, బ్రహ్మంగారి నిట్లని ప్రార్థింపజొచ్చె. "మహాత్మా! నేను నాను గర్వభంగమైనది నేటివరకు నీ మహారణ్యమునకు రాజువలె నాయిచ్చవచ్చినట్లు చరించితిని. యోచింపమీరెవ్వరో దైవాంశ సంభూతులవలె గాన్పించు

చున్నారు. సామాన్యులకు నన్నుపట్టి బంధింప శక్యంబుగాదు. మహాత్మా! నాపై కరుణవహించి వాక్‌స్తంభనావస్థను తొలగించి, జన్మరాహిత్యంబగునట్లు నేదేని మార్గంబు దెలుపరే" యని దీనయై స్వామిపాదంబులపైబడి వేడుచు. పాదంబులు వదలి లేవకున్న రాక్షసినిగాంచి, స్వామి "రాక్షసీ! ఇదిఅంతయు నీ పూర్వజన్మఫలము నీవింకను కొంతకాలము ఈ రీతిగనే యుండవలసిన యోగముగలదు. ప్రస్తుతము నేను నీకెట్టి నను పాయంబును గావింపనోప. కొలదికాలములో ఈశ్వరమ్మ అను ఒక భక్తురాలు శిష్యులతో నీ మార్గంబున నరు దెంచును. ఆమె నీకు జన్మరాహిత్యంబు కలుగు తెరగో పాయంబు తెల్పును. ఆమె వచ్చువరకు నీకు ఆకలిదప్పులు కలుగకుండునట్లు చేసెద నోరు తెరవు"మని చెప్పుచు ఆమె నోటియందు విభూతిని మంత్రించివైచెను. అది మొదలు ఆ రాక్షసి నడచుటకు కాళ్ళురాక, చేతులు పట్టువదలి మాట లాడ నోరాడక, సకలశక్తుల నడంగి యందే పడియుండెను. అనంతరము స్వాములవారు సిద్ధయ్యను పిలుచుకొనిస్పృహదప్పి పడియున్న తనశిష్యుల యొద్దకేగి వారిపై మంత్రజలంబులు ప్రోక్షింప వారందరును "అబ్బా! ఎంతనిద్ర పట్టినది" అనుచు దిగ్గునలేచి కూర్చొనిరి. అనంతరము సిద్ధయ్య జరిగినదంతయు వారల కెరిగించి, సర్వశక్తులు కోల్పోయి పడియున్న బ్రహ్మ రాక్షసిని వారికి చూపించెను పిదప స్వాములవారు శిష్య సమేతంబుగ నటనుండి బయలుదేరి కడపపట్టణంబు చేరి తమరాకను నవాబునకు తెలియజేసిరి.

## కడప నవాబునకు బ్రహ్మంగారు తన మహిమను చూపించుట

శ్రీవీరబ్రహ్మేంద్రస్వాములవారు స్వయముగ తమ కడప నగరంబున కరుదెంచుచున్నారని, పరిచారకులవలన వినిన వాడై, మున్ను సిద్దయ్యవలన స్వాములవారి విశేషంబు లెరిం గినవాడగుటచే కడప నవాబు సపరివారముతో బయలుదేరి, స్వాములవారికి నెదురేగి, సలాములొనర్చి, స్వాములవారిని సుశోభితంబుగ నలంకరింపబడిన నొక పల్లకీయందు గూర్చుండ బెట్టి మృదంగాది వాద్యంబులతో నగరమంతయు నూరే గించి. తన నిజభవనమునకుం దోడ్కొనిపోయి, సర్వాలంకార శోభితంబగు నొక మహలున బ్రవేశపెట్టి యుచితాసన మున గూర్చుండబెట్టి, అర్ఘ్యపాద్యాది విధులం బూజించి, సలాము లొనర్చుచు నిలువబడి వినయపూర్వకంబుగ "స్వామీ! నేడు తమరు మానగరంబున కరుదెంచుటం జేసి, నేనును, మారాజ్యమందలివారును ధన్యులమైతిమి. మీరు మానగరంబున నుండునంతకాలము మాభవనమందే యుండి. మా ఆతిథ్యమును స్వీకరింప వేడుచున్నా"ననెను. స్వాముల వారు ఆమాటలు విని సంతసించి "బిడ్డా! నీకోరిక ప్రకారము ఇందే యుండగల"మని చెప్పెను. అంత సిద్దయ్య స్వాముల వారి కెదుర్కుంజేరి "తండ్రీ! నన్ను మీరు మతభ్రష్టుని గావించితిరని మాతండ్రి ఫిర్యాదు ఈనవాబుదగ్గరనే చేసు కొనెను సుడీ" అని చెప్పుచు తనకును నవాబునకును మున్ను జరిగిన సంభాషణలన్నియు నెరింగించెను. అనంతరము బ్రహ్మంగారు శిష్యసహితంబుగ స్నానసంధ్యానుష్ఠానంబుల గావించుకొని, నవాబొసంగిన అతిథ్యమును స్వీకరించి, భోజ

నామముల గావించి సుఖంబుగ పరుండెను. శ్రీ స్వాములవారు గొప్పమహిమ గలవారని మున్ను సిద్దయ్య చెప్పగా వింటిని గదా! వీరి మహాత్మ్యం బెట్టిదో పరీక్షింపవలయు''నని నవాబు తన మనంబున ఆలోచించుచుండెను.

బ్రహ్మంగారు నిద్రనుండి మేల్కాంచిన పిదప, నవాబు వారిదగ్గర కరుదెంచి, నమస్కరించి నిలువంబడి "అయ్యా! తమ దర్శనమునకును, మీరేమైన వేదాంత రహస్యములు దెలుపుదురేమో యనియు, పురజనులు వేగిరపడుచున్నారు. అందువలన రేపునగర మధ్యమందున్న మైదానములో సభ వర్పాటు చేయదలంచితిని. అందులకు తమ అంగీకారమును దెలిపిన, నీ విషయము పురమున చాటింపు చేయించె దను'' అని వినయ పూర్వకముగ అడిగెను. స్వాములవారు "నాయనా! నీవేమి ఆలోచించు చుంటివో నాకు తెలియును. నీ అభీష్టము ప్రకారము రేపు సభకు వచ్చుటకు నాకు అంగీకారమే'' యనెను. అందులకు నవాబు ఆశ్చర్యపడుచు తనలో" నేనేమి ఆలోచించుచున్నానో, ఆ విషయము వీనకు తెలుసునని బ్రహ్మంగారు చెప్పుచున్నారే. అబ్బా! ఈయన సామాన్యుడు కాడు. శిష్యుడైన సిద్దయ్య యిదివరలో నా దగ్గర తనశక్తిచూపి మెప్పించెను గదా! ఇక అట్టి శిష్యుని గురువు నేనాలోచించు విషయము తెలుసుకొనుటలో ఆశ్చర్యమేముంది? అయినను పోయినదేమున్నది? బ్రహ్మంగారిని కూడ పరీక్షించి చూతును'' అని తలంచుచు సేవకులను బిలచి "ఓయీ! శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారు శిష్య సహితం బుగ మన నగరంబునకు వేంచేసియున్నారు. రేపు నగర మధ్యమునగల మైదానములో వారు వేదాంతోపన్యాసము

గావింతురు. కావున పురజను లెల్లరును వచ్చి వారిదర్శనము చేసుకొని, వారు తెలుపు వేదాంత విషయములు విని, తరింప గోరుచున్నాను". అని నగర మంతటయు చాటింపుడని ఆజ్ఞా పించెను. తదాజ్ఞానుసారము సేవకులు వెట్టి వారిని నియమించి నగరమంతయు చాటింపించిరి,

"ఎవరో బ్రహ్మం గారట, గొప్ప వేదాంతియట, ఆయన మహిమలు చెప్పుటకు సాధ్యముగావట, గొప్ప తేజ శ్శాలియట, శిష్యసహితంబుగ మన నగరంబునకు వచ్చిరట. చూత"మని, ఆ మరునాడు జనులు గుంపులుగ వచ్చి మైదాన మున గూర్చొనియుండిరి. నగర మంతయు బాగుగ నలంక రింపబడెను, నగర మందెచ్చట విన్నను స్వాములవారి విష యమేగాని, యితరములు వినబడుచుండుట లేదు. స్వాముల వారు ఆ మరుచటి దినమున నవాబుచే నియమింపబడిన నౌక పల్లకీయందు గూర్చుండి, శిష్యసహితంబుగ భేరీ మృదం గాది వాద్యంబులతో నగరమంతయు నూరేగి, సభజరుప నేర్పాటు చేయబడిన మైదానమునకు వచ్చి, జనులు ఆనంద మతో 'జై' 'జై' నలుపుచుండ, మైదానమున మధ్య భాగ ములో తనకై అమర్చబడిన నౌకయుచితాసనమున గూర్చుం డెను. పిదప బ్రహ్మంగారు పరబ్రహ్మ స్వరూపమును గురిం చియు, ముక్తిమార్గమును గురించియు విపులముగ ఉపన్యా సము గావించెను. జనులు ఆ విషయంబులు విని చాల ఆనం దించి స్వాములవారిని అనేక విధంబుల బ్రస్తుతింప సాగిరి. ఇక సభ ముగియనున్నది. అంతలో నవాబు స్వాములవారి ఎదురుగవచ్చి సలాము లొనర్చి యీ క్రింది విధంబున ప్రశిం చెను.

## నవాబుతనయొద్దనున్న చూడిగుఱ్ఱము గర్భమునందలి శిశువు ఆడదో, మగదో చెప్పుమని స్వాములవారిని ప్రశ్నించుట

"స్వామీ! నామనస్సులో నొకకోరిక కలదు. చాల స్వల్పమైనది. ఏమియులేదు కాని, మాగుఱ్ఱపు శాలలో ఒక చూడిగుఱ్ఱము కలదు. దాని గర్భము నందు శిశువు ఆడదో, మగదో తెలుసుకొన వలయునని నాకు కుతూహలముగ నున్నది. సర్వజ్ఞులైన తమకిదియొక అసాధ్యము కాదు. అవివేకుండనైన నాసంశయముదీర్చి కృతార్థునిగ జేయ వేడు చున్నా"ననెను. స్వాములవా రా మాటలువిని చిఱునగవుతో "వత్సా! నీ సంశయము మున్నే నేనెరుంగుదును. తప్పక నీసంశయము దీర్చెదను. ఆ గుఱ్ఱంబును ఈ సభామధ్యమమునకు రప్పింపు"మన నవాబు వెంటనే సేవకులను గుఱ్ఱపుశాలకుబంపి, దానిని తెప్పించి స్వాములవారి ఎదుట నిలువబెట్టించెను. బ్రహ్మంగారు ఆవిషయమును చెప్పగలరో, లేదో చూతమని సభాసదులందరును చూచుచుండిరి. "హిందువుల కెట్లయిన వంచింప జేయవలయునని, నవాబు ప్రశ్నిన ప్రశ్నగడు"యని సభలోకొందరు గుసగుసలాడ దొడంగిరి. సరిగ చెప్పి నిదర్శనము చూపలేకున్న అగౌరవమే కదా" అని వారిలోవా రనుకొన సాగిరి.

పిదపస్వాములవారు వీగుఱ్ఱమును పరీక్షించి, "నాయనా! ఈ గుఱ్ఱముయొక్క గర్భమునందలి శిశువు బూడిదవర్ణము కలిగి, వీపుపై నొక తెల్లని పెద్దమచ్చతో నున్నది. మగ శిశువేగాని ఆడదికాదు. నామాటలు సత్యమని తలంచుము

అన్యథా తలంపవల''దనెను. అంత నవాబు స్వాములవారి నెట్లైనయ గౌరవపరచ వలయునని "సామీ! మీరు చెప్పినది సత్యమో కాదో నావంటి అజ్ఞానుడు గ్రహించుటెట్లు? శరీరములు బుద్బుదప్రాయంబులుగదా. ఈగుఱ్ఱి మీనువరకు నేను జీవింతునను నమ్మకమేమున్నది. ఇక నా సందేహము దీరుటెట్లు'' అని తన మనోగతం బెఱిగించెను.

స్వాములవారు "నాయనా! సందేహము మనుష్యుని పాడుచేయును. నీ కింకను సందేహము దీరకున్న, చుట్టును ఒక తెరగట్టి, యీ గుఱ్ఱమును తెరలో నుంచుము. దాని గర్భమందున్న శిశువును నీకేగాక, యీసభయందున్న వారందరికిని చూపింతు'' ననెను. అంతనవాబు "మహాత్మా! మీరు చేయదలచిన పని గ్రహించితిని. నాకాశిశువును జూపకున్న మేలేగాని, నాయపరాధమును సైరించి, నిష్కారణముగ నీనోరులేని జంతువు గర్భమును కోసి దానిప్రాణములను మాత్రము దీయకుడు. మనవేదాంతము నీ గుఱ్ఱము ప్రాణములు తీయుటకా?'' యనెను. అదివిని బ్రహ్మంగారు "ఓయీ! నవాబూ! నీవు చాల పొరపడుచున్నావు. మేము వేదాంతులము. నేను వేదాంతిని. అహింసయే మాకు ప్రధానము. గుఱ్ఱమును చంపి, దాని గర్భమునందలి శిశువును బయటకు తీసిచూపింతునను కొంటివా? కాదు. గుఱ్ఱము జీవించియుండగనే దాని గర్భమందున్న శిశువు, ఈసభయందున్నవారందఱికి కనబడునట్లుచేసెద, గుఱ్ఱమును మాత్రము తెరలోబెట్టించు'' మనెను. నవా బందుల కాశ్చర్యపడుచు వెంటనే చుట్టును తెరగట్టించి, ఆ తెరమధ్యములో గుఱ్ఱమును నిలువబెట్టించెను'' పిదప బ్రహ్మంగారు తెరలోపలికిఁబోయి

గుఱ్ఱము వీపుపై తన చేతియందున్న వెండిబెత్తముతో తాకి "బిడ్డా! బయటకు రమ్మను"మని చెప్పెను. అనంతరము స్వాములవారుకూడ తెరబయటకువచ్చి నిలువబడియుండిరి. అంత నాగుఱ్ఱముయొక్క గర్భమునందలి శిశువుబయటకువచ్చి, తెరబయటకు మెల్లగవచ్చి, సభాసదులందరికిని కనబడి, మరల తెరలోనికింబోయి, తల్లిగర్భమును ప్రవేశించి యథా ప్రకారంబున నుండెను. జనులందరును ఆశ్చర్యపడి "యిట్టి మహిమ కనివిని యెరుంగమే. ఈ మహానుభావుడు భగవంతుడే కాని వేరుకాదు. ప్రపంచము నుద్ధరింప అవతరించి యుండవచ్చును, వీరిదర్శనము లభించుట నేడొక సుదినము" అని ఒకరితో నొకరు ముచ్చటించుకొనసాగిరి. ఇక నవాబు బ్రహ్మంగారు తనకెట్టిశాపం బిత్తురోయని గడగడ వణంకుచు, ఆయనపాదంబులపైబడి, వదలక "మహాత్మా! తెలియక జేసిన అపరాధమును క్షమింపరే, తండ్రికుమారుని అపరాధములు మన్నించురీతి నన్ను మన్నించి కాపాడవే" యని వేడ, బ్రహ్మముగారు "బిడ్డా! నీవు మాకు చేసిన యపరాధం బేమియును లేదు. నీకెట్టిభయంబును లేదు. లెమ్మ"ని తన చేతులతో నవాబును లేవదీసెను. పిదప నవాబు "స్వామీ! మీరు సామాన్యులుగారు. జగదుద్ధరణకై యవతరించిన భగవంతునివలె గన్పట్టుచున్నారు. నన్ను మీశిష్యునిగ పరిగ్రహించి అనుగ్రహింపుడు. నారాజ్యము నేటితో మీయధీనము గావించితి"ననెను. బ్రహ్మంగారు నవాబుమాటలు విని సంతసించి, "బిడ్డా! సంసారమునురోసి సంచరించు మాకీ రాజ్యభోగములేల? నీవేపాలింపుము. రాజులేకున్న అరాజకమై ప్రజలుపలుకష్టంబుల పాలగుదురు. ప్రస్తుతముకలియుగ

మున ప్రథమపాదమే నడచుచున్నది, ముందింకను అధర్మము హెచ్చుపెరుగును. రేపు మరల సభ నేర్పాటు చేయుము. ఆసభ యందు కాలజ్ఞానంబు దెలుపుదు" ననెను.

## బ్రహ్మంగారు కడపనవాబునకు కాలజ్ఞాన రహస్యంబుల దెలుపుట

బ్రహ్మంగారి అనుమతిప్రకారము మరుచటిదినమున కూడ సభయేర్పాటు చేయబడెను. ఆసభకు నగరమందలి ఆబాలగోపాలము నరుదెంచిరి. స్వాములవా రేమి చెప్పె దురో యని తలలు పైకెత్తుకొని నిశ్శబ్దముగ కూర్చొనియుం డిరి. సభమధ్య నుచితాసనా సీనుండై స్వాములవారు ఇట్లుప న్యసింపనారంభించిరి "బిడ్డలారా! ఈ ప్రపంచమున అనేక యుత్పాతంబులు కలుగనున్నవి. కలియుగమున 5000 సం వత్సరములు గడచినపిదప దుష్టనిగ్రహంబునకు, శిష్టజనపాల నంబునకును వీరభోగవసంతరాయల నామముతో భగవంతు డవతరించును. నదులు పొంగి జననష్టము కలుగును. మసి పాత మాడకమ్మెదరు. వైశ్యులు నష్టమయ్యెదరు. నాలుగు వర్ణంబుల వారును న్యాయముతప్పి సంచరించుచుందురు. కొచ్చెర్లకోటలో కోడిమాటలాడును. సరియైన ధాతనామ సంవత్సర మాఘశుద్ధ బుధవారమునాడు పట్టపగలు పదు నెనిమిది పట్నంబులు కొల్లబోవును. వడ్డీకిచ్చిన సొమ్ములు దిగమ్రింగి, మొగనాడి, కాసుకు నయారగుదురు. ముండ మోపులంతె ముత్తయిదువు లగుదురు. ఉత్తర భూమియందు కోమటికులంబున ఒకమహాత్ముడు పుట్టును. గుణములేని వారందరు కూలిపోవుదురు. అద్దంకి నాంచారమ్మ మాట్లా

డును. నేనువచ్చు లోపల యీరీతిగ అనేక మహిమలు పుట్టును. నేనువచ్చుసరికి బనగానపల్లెదగ్గర పన్నెండామడ పట్నంబై వెలయును. వీపున వింజామరలు, అరికాలిని తామరపద్మముగలవారు వత్తురు. వారేనేనని భ్రమపడుదురు. ఎఱ్ఱచీమ యేనుంగు రూపమున కానబడును. అదే నారాకకు గుర్తు. మాయాశక్తి మనుష్యులతో మాటలాడును. పంది కడుపున ఏనుగపుట్టును. కోడి మనిషివలె అరచును. మేక కడుపున అయిదుతలలుగల మేకపోతు పుట్టును. బనగాన పల్లెలో కాలజ్ఞానము పాతరపైన మొలచిన చింతచెట్టునకు జాజిపూవులు పూయును. సూర్యబింబములో తూట్లు కన బడును. కుంభకోణమున గుడి కూలిపోవును. కంచి కామాక్షమ్మ కన్నులనుండి రక్తము నీరువలె కారును. అంగన కొందరు చత్తురు. రామానుజ మతమువారు నియమముతప్పి పాతకులగుదురు. నాభక్తులైనవారు దరిద్రులుగ నుందురు. ఆవుకడుపులోదూడ మాటలాడును. ముండలకు బిడ్డలుపుట్టు దురు. రాజాధిరాజులు రాజ్యములువదలి భ్రష్టులైపోవుదురు. ఇదియెనారాకకు నిదర్శనము. నేజెప్పినవన్నియు తప్పక జరు గును. కాదనిన వారందరు కూలిపోదురు. నవాబు పేరుతో కొంతకాలముమాత్ర మీ రాజ్యము పాలింపబడును. పిమ్మట అన్యులపాలై పోవును," అనిచెప్పగా నవాబువిని సంతసించి స్వాములవారికి అనేకకట్నంబు లర్పించెను. కాలాతీతమగు టచే ఆనాటికి సభచాలించిరి. ఎవరిగృహము వారేగి స్వాములవారి మహిమ చెప్పుకొనసాగిరి.

## బ్రహ్మంగారిపై తొమ్మండుగురు దొంగలుపడుట

బ్రహ్మంగారు ఆ మరునా డుదయముననే నవాబు దగ్గర అనుమతిని బొంది కడపనుండి బయలుదేరి, ప్రొద్దుటూరు మీదుగ అల్లాటపల్లెను చేరుకొనిరి. అల్లాటపల్లెలో స్వాములవారి యిష్టదైవంబైన వీరభద్రస్వామి ఆలయము కలదు. బ్రహ్మంగారుఅల్లాటపల్లెకు ప్రక్కనగల తుంగభద్రా నదిలో స్నానముచేసి శ్రీవీరభద్రస్వామి దర్శనము చేసుకొని, ఆదినమంతయు ఆ దేవాలయమందే జపము చేసుకొనుచు గడపి, మరుచటి దినంబున ఉదయముననే పయనమై శాక యరణ్యమార్గంబును బట్టి పోసాగిరి. బ్రహ్మంగారు కూర్చొనిన బండివెనుక శిష్యులు పాదచారులై నడచుచుండిరి. ఆ అరణ్యంబున తొమ్మండుగురు దొంగలు నివాసము గావించుకొని, యీమార్గంబున బోవువారి తలలు పగులగొట్టి, వారి దగ్గరనుండు ధనంబును దోచుకొనుచుండిరి. అందువలన బాటసారులు ఆమార్గంబున పోవుటకు భయపడుచుండిరి. ఆ విషయ మెరుంగక స్వాములవారు ఆబాటనబడి పోవసాగిరి. అంతలో ఒక బాటసారి దొంగలకుచిక్కి, మరల ఎట్లో వారి బారినుండి తప్పించుకొని చెమటలలు గ్రక్కుచు పరుగెత్తిపారి పోవుచు మార్గమధ్యంబున స్వాములవారి బండిచూచి, పాప మెవరో తెలియక బండిలో యీమార్గముననే బోవుచుండిరని మనసులో తలంచి, స్వాములవారి బండిదగ్గరకువచ్చి "అయ్యా! ఆముందు తొమ్మండుగురు దొంగలు గ్రోవలో కాచుకొని యున్నారు. ఈమార్గంబున బోయిన అపాయము సంభవించును [illegible] త్రిప్పికొని వెనుకకు బోవు"డనెను. అంత స్వాములవారు [illegible]చే యుండెడి పదముగ్గురు దొంగలను బ్రతికి

దాహముత్రాగితిని. అట్టినన్నా తొమ్మండుగురు దొంగలు ఏమి చేయగలరు? నాయనా భయములేదు. బండి పోనీయుము" మని బండివానితో చెప్పిరి.

బండి ఆమార్గముననే పోవుచుండెను. సిద్దయ్య బండి వెనుక నడచుచు స్వాములవారిని చూచి "అయ్యా! జిల్లాల పల్లెయందుగల శ్రీ వీరభద్రస్వామి మహిమ తెలుపవే" యని అడుగుచున్నంతలో ఆదొంగలు తొమ్మండుగురు ఒక్కుమ్మడిగా స్వాములవారి బండిపై యముకింకరులవలె చేతకర్రలు ధరించి పడిరి. శిష్యులదిచూచి భయపడి ఎవరిదారివారు పిక్కబలముకొని పారిపోయి, వృక్షములచాటునదాగి ఏమిజరుగునో యని చూచుచుండిరి. బండివాడు గడగడవణకుచు "అన్నలారా! నన్నుమాత్రము కొట్టకుడు. నాదగ్గర ధనంబేమియును లేదు. పొట్టజరుగక బండితోలుకొని వచ్చుకూలిచే బ్రతుకుచున్నాను. నన్నూరక కొట్టిన లాభమేమున్నది. అదిగో ఆ బండిలో మీకు కావలసిన వాడున్నాడు, విశేషంబుగ జ్ఞానధన మార్జించినవాడు. అజ్ఞానమును జ్ఞానంబను వస్త్రంబుచే గట్టి అష్టకోణములుగల శరీరంబను పెట్టెయందుంచి దాచి యుండెను. వానిని బట్టితిరా, మీరు సఫలీకృతులగుదురు. అట్టి జ్ఞానధనం బన్యులకు అసాధ్యంబగునట్లు మీవంటి పదమువ్గురు చోరులకు కాపుంచి, యింటిముందర యీమహాక్షేత్రంబను మూడుచుక్కలను కాపలాయుంచి, తానెల్లప్పుడును దినమునకు యిరువదియొక్కవేల ఆరువందల పర్యాయములు వెలుపలకు లోపలకు నడయాడుచు, మీవంటి అజ్ఞానులకు గానరాకుండ సుజ్ఞానులకు మాత్రమే దర్శనంబిచ్చుచు, వారికి కావలసిన జ్ఞానధనంబంతయు నిచ్చుచు నున్న అజ్ఞానాంధ

భాస్కరుండు అటుగో! చూచుటకు ఏమియు తెలియని పిచ్చి వానివలె నుండును. ఆమహానుభావుని బట్టితిరా మీజన్మలు తరించుటకు కావలసిన జ్ఞానధనంబంతయు నిచ్చును. మీ దరిద్రమనెడి అజ్ఞానంబు ఆయనయొద్ద లభించు పరమార్థంబు చేతనే నశించును''అని చెప్పుచున్నంత దొంగలువిని "ఓరీ! నీ మెట్టవేదాంతము మాకడ గట్టిబెట్టుము. ముందర నీవు బండిదిగుమని బడితకఱ్ఱతో వానివీపుపై నొకపెట్టుపెట్టిరి.

## బ్రహ్మంగారు దొంగలను తలలు పైకెత్త లేకుండునట్లు చేయుట

పిదప ఆతొమ్మండుగురు దొంగలును బ్రహ్మంగారిని చూచి "ఓయీ కాషాయవస్త్రంబులు ధరించి మాయ మాటలు చెప్పి సంపాదించిన ధనమంతయు నిక్కడబెట్టుము'' అని అనుచుండగా, బ్రహ్మంగారు తన కమండలంబు నందలి జలంబును చేతియందుంచుకొని వారిపై జల్లగా వారందరును తలలు క్రిందకువంచి చూచుచు అట్లే కొయ్యబొమ్మలవలె నిలువబడిపోయిరి. సిద్దయ్యమాత్రము ఏమియు భయము మొందక అదిఅంతయు చూచుచు, స్వాములవారి సాన్నిధ్యమును వదలక బండివెనుక నిలువబడియుండెను. అంత స్వాములవారు దొంగలనుచూచి "బిడ్డలారా! నన్నుకొట్టి నాదగ్గరనున్న ధనము దోచుకొనవచ్చి, అట్లేనిలువంబడి యుంటిరేమి? సంశయమేల? యీబండియందుగల ధనకనక వస్తువుల నన్నిటిని బట్టుకొని పొండు''న, దొంగలు నిశ్చేష్టులై యిటునటు కదలలేక చేతులు స్వాధీనముతప్పి, నడువ కాళ్లురాకుండుట జూచి, తమలోతాము విచారించి "అయ్యా! మాతప్పు

క్షమించుడు. అజ్ఞానముచే నేటివరకు యీమార్గమున పోవు బాటసారులను దోచుకొని జీవించితిమి. మీరు భగవంతుని వలె నున్నారు. మేమెందరినో చూచితిమి గాని మమ్ములనీవిధంబుగ జేసినవారెవ్వరు లేరు. నేటికిమాకు కష్ట కాలముదాపురించినది. మాతప్పు క్షమియించి, మాశరీరములు తొల్లింటివలె మామూలుగ నుండునట్లు జేయరే" అని వేడ, స్వాములవారు "ఓయీ! మీరు కొంతవరకు పశ్చాత్తాపమునకు వచ్చితిరి గావున, మీచేతులును, కాళ్ళు, నోరునుమాత్రము స్వాధీనములగును. మీశిరంబులు మాత్రము ముందువకు వంగియుండి, క్రిందచూపు చూచుటకు మాత్రమే వీలుగనుండును, మీరు యింతవరకు చేసినపాపములకు మీజీవితకాలమంతయు మీ శిరంబులట్లే యుండు"నని వారలకుజెప్పి, అచ్చటనుండి బయలుదేరెను.

ఇక్కడ జరుగుచున్న విషయంబులన్నియు మిగిలిన శిష్యులందున్న చెట్లులచాటుననుండి పరిశీలించి, వారిలోవారు మనమువట్టి అవివేకులము. స్వాములవారి శక్తి సామర్థ్యము లెరింగియు దొంగలవలన యెట్టికీడు మూడునోయని చెట్టునకొకడు పుట్టకొకడు చొప్పున పరుగిడితిమి. చూచితివా! సిద్దయ్య ప్రాణములకు తెగించి స్వాములను వదలక బండివెనుకనే నిలువబడి యుండెను. అందువలననే గురువుగారు సిద్దయ్యకును, మనకును హస్తిమశకాంతరము తేడాగలదని చెప్పుచుందురు" అని చింతించుచు, వారందరును ఒకరితరువాత ఒకరు బండి చాటునకు చేరి బండితో కలసి మెల్లగనడున నారంభించిరి.

నవమ ప్రకరణము సమాప్తము

# దశమ ప్రకరణము



## బ్రహ్మంగారు పుష్పగిరి అగ్రహారము చేరుట

స్వాములవారి బండి అరణ్యముదాటి పుష్పగిరి అగ్రహారమను నొకగ్రామమును చేరెను. సిద్ధయ్య చేత వింజామరము ధరించి వీచుచుండ శిష్యులకు వేదాంతరహస్యములను, సాంఖ్య తారకయోగంబులను తెలుపుచు బ్రహ్మంగారు బండిలోకూర్చొని ప్రయాణము చేయుచుండిరి. ఏదో యొక గ్రామము సమీపించినదని శిష్యులు స్వాములవారి ముప్పదిరెండు బిరుదులను ముప్పది యిరువురు శిష్యులుచేత ధరించి బండి ముందునడువ నారంభించిరి. కొందరు శిష్యులు వేదాధ్యయనము చేయుచుండిరి. ఆరీతిగ బ్రహ్మంగారు బండిలోకూర్చొని చూచువారలకు కేవలము శ్రీమహావిష్ణువు వచ్చుచున్నాడో యని తోచునట్లు పుష్పగిరి అగ్రహారము నడివీధిని బోవుచుండెను. ఆ అగ్రహారీకులందరు అది తమలో తాము సంప్రదించుకొని, సిద్ధయ్యనుచూచి "ఆబండిలోని వారెవ"రని అడిగిరి. సిద్ధయ్య వారితో "అయ్యా వారిని మీరెరుగరా? జగద్విఖ్యాతి గాంచిన శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహ్మంగారు. నేనువారి శిష్యుండను. నన్ను సిద్ధయ్య యందురు" అనెను, అదివిని వారు ఆజ్యమునుపోసిన మంట వలె మండిపడుచు, మీరందరు వేదపారాయణ చేయుచు, మాయగ్రహారము నడివీధిని బడిపోవుచున్నారే? ముత్యాలను పరిహాసము చేయుటకు వేదపారాయణచేయుటకు బ్రాహ్మణేతరులైన మీకధికార మెవ్వరిచ్చిరి. అదియునుగాక నీవు దూదేకుల కులస్థుడవని చెప్పుచుంటివి. కంసాలివాడు గురు

వును, దూదేకులవాడు శిష్యుడునూ. నిన్ను శిష్యునిగ పరిగ్రహించుటకు ఆగురువులవారికే తగును. మీ వేదాంతము మట్టి గలసినట్లే యున్నది. మీగురువులను బండిదిగి మాకు సమాధానము చెప్పి వెడలుమనుము. లేకున్న మిమ్ములనందరిని 'అగౌరపరచి పంపింతు'' మని ఆగ్రహావేశులై పల్కుచున్న బ్రాహ్మణుల మాటలువిని, సిద్ధయ్యవారితో "అయ్యా! కోపగించకుడు. కోపము పాపముగదా! మీకోపము మీకే నష్టదాయకము. మీసందేహములకు నేనే సమాధాన మీయగలను వేగిరపాటు తగ"దనెను.

## బ్రహ్మంగారికిని పుష్పగిరి అగ్రహారీకులకును వర్ణవివక్షత గురించి జరిగిన సంభాషణ

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్యో శూద్రో ఛండాలఏవచ
వేదాభ్యాసపరోనిత్యం పునర్జన్మ న విద్యతే.

సిద్దయ్య పైశ్లోకమును చదివి బ్రాహ్మణులకు వినిపించి "అయ్యా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, చండాలురలలో నెవరైనను ప్రతిదినమును వేదాధ్యయనమును, భగవన్నామోచ్చారణయు జేసిన జన్మరాహిత్యంబు నొందుదురని శ్రుతులయందు చెప్పబడియుండగా, బ్రాహ్మణేతరులకు వేదాధ్యయనమునకు హక్కులేదనుట న్యాయమా?" అనెను. అంత నాయగ్రహారీకులలో నొకడు సిద్దయ్యతో నిట్లనియె.

"బ్రాహ్మణోస్య ముఖమాసీ ద్బాహూ రాజన్యఃకృతః।
ఊరూతదస్యయద్వైశ్యః పద్భ్యాంశూద్రోఅజాయత॥

అను శ్రుతిప్రమాణంబుచే బ్రహ్మముఖమునందు జన్మించిన మాకు హక్కుకలదుగాని, అన్యులకధికార మెక్కడ నున్నది?" అనెను. అంత స్వాములవారు ఆ అగ్రహారీకులను చూచి "నాయనలారా! మీరు బ్రహ్మముఖమునందు జన్మించితి మనియు, అగ్రకులమువారనియు, సిద్ధుడు నీచకులమువాడనియుగదా మీరు తెలుపుచుంటిరి. మీ అవివేకంబునకు నాకు విచారము కలుగుచున్నది. వృత్తిభేదంబు చేతనే వర్ణంబు లేర్పడెనుగాని పృథ్వ్యాతత్వంబుతో అన్నరసంబువలన సతీపతులు కలియగ శుక్లశోణితములచే నేర్పడిన కులమేగాని వేరుకులములేదు. సకలవర్ణంబులు యోగిసంజాతములే గాని వేరుకాదుగదా. 'అజ్ఞానమే శూద్రత్వము, సుజ్ఞానమే బ్రహ్మము' డెక్కలవాడు మాదిగవాని దగ్గర భిక్షానకు బోవును. ఆడెక్కలవానిని మూగలవాడు బిక్షుకోరును. మూగలవాని దగ్గర చపల మూగలవాడు బిచ్చమెత్తుకొనును. అదే రీతిగ చపలమూగవాని దగ్గరకులస్థుడును, కులస్థునిదగ్గర మైలపు సాక్కన్నయు, వానిదగ్గర పొప్పరకట్టెవాడును. వాని దగ్గర సింహాసిష్టుడు, వానిదగ్గర చపలచోరకుడును బిచ్చమెత్తుకొను చుందురుగదా. ఊర్వసి అట్టిగడజాతి చపలచోరకుని సోదరియేకదా. బ్రహ్మ ఆ ఊర్వసిని మోహించలేదా? వశిష్టుడు ఆబ్రహ్మకుమారుడేగదా! వశిష్టుడు కృతయుగమున హరిశ్చంద్రునకు గురువుకాడా? వశిష్టుడు త్రేతాయుగమున శ్రీరాములవారి వంశమునకు కులగురువుకాదా? వశిష్టునిభార్య చండాలికదా. అట్టిచండాలికి పుట్టినవాడు శక్తి; శక్తిభార్య చపలాత్మ, చపలాత్మ కుమారుడు పరాశరుడు, పరాశరునకు కైవర్తియను భార్యయందు వ్యాసుడు

పుట్టెను, వ్యాసునకు ధృతరాష్ట్ర పాండవులు జన్మించిరికదా. శ్రీశుకులువారు నీచజాతియందు జన్మించి తరించలేదా?

## బ్రహ్మంగారు చాతుర్వర్ణ్యములు లేవనుట

ఇంకను బ్రహ్మంగారు పుష్పగిరి అగ్రహారీకులతో నీవిధంబుగ బలుకంజొచ్చిరి. "అయ్యలారా! బ్రహ్మ ముఖమునందు జన్మించినవారే బ్రాహ్మణులనికదా మీ అభిప్రాయము? ఆ బ్రహ్మ విష్ణు నాభికమలంబున జన్మించిన విషయము మీరెరిగినదేకదా? దానంజేసి బ్రహ్మకే బ్రాహ్మణత్వము లేదుకదా. ఇక మీకుమాత్రము బ్రాహ్మణత్వము ఏరీతిగ కలిగినది? బ్రహ్మముఖమునపుట్టిన బ్రాహ్మణులెవ్వరును ప్రపంచమునలేరు. మహావిష్ణువు పాదములయందు జన్మించిన గంగ సర్వ ప్రపంచమును పావనము జేయుచున్నది. అట్టిగంగకు మీవలననే శూద్రత్వము కలిగినది, దక్షప్రజాపతికి కూడ మీవలననే శూద్రత్వము కలిగినట్లు భాగవతమున చెప్పబడి యుండలేదా?

ఇక క్షత్రియులు బ్రహ్మయొక్క బాహువులనుండి జన్మించిరనిగదా మీపట్టుదల. క్షత్రియులయందు సూర్యవంశమువారని, చంద్రవంశమువారని రెండు తెగలు కలవు. సూర్యవంశమునకు మూలపురుషుండైన సూర్యుడు కశ్యప బ్రహ్మకు పుట్టెనుకదా! చంద్రు డత్రిమహాముని కుమారుడే కదా! ఇక వీరు బ్రహ్మయొక్క బాహువులనుండి పుట్టినట్లు ఏరీతిగ నిరూపింప గలరు?

మీరు చదివిన శ్లోకమునకు యథార్థమైన అర్థము చెప్పుచున్నాను వినుడు. ఈ ప్రపంచము భగవంతునకు శరీ

రము. శరీరమున ముఖము ప్రధానమైనదగుటచే ఉత్తమం బనియు, భుజంబులు మధ్యమంబులనియు, తొడలు అధమంబు అనియు, పాదములంతకంటెను అధమంబులనియు, దానంజేసి ఈశ్వరసృష్టియగు మానవులలో ఉత్తమస్వభావములు కల వారు ఉత్తములనియు, మధ్యమగుణంబులు కలవారు మధ్య ములనియు, తక్కువగుణములు గలవారు అధములనియు, నీచగుణములుగలవారు చండాలురనియు నెరుంగవలయును. బ్రాహ్మణులు జ్ఞానులు. బ్రాహ్మణేతరులు అనగా అజ్ఞాను లనియే భావము, వేమనవ్రాసిన విషయము చూడుడు.

క. అజ్ఞానమె శూద్రత్వము,
సుజ్ఞానమె బ్రహ్మమనెడి శ్రుతులను వినరా
అజ్ఞానముడిగి వాల్మికి
సుజ్ఞానపు బ్రహ్మమందె చూడగ వేమా.

మరియు భారతమున శాంతిపర్వమున చెప్పబడిన నీ క్రిందిపద్యమును చూడుడు. భగవద్గీతయందు శ్రీకృష్ణుడు సద్గుణంబులచేతను, భక్తివలనను మాత్రమే బ్రాహ్మణత్వము లభించునని అర్జునునకు తెలిపియుండలేదా?

తే. పాపవర్తనుండు బ్రాహ్మణుడయ్యును
నిజము శూద్రుకంటె నీచతముడు
సూనృతవ్రతుండు శూద్రుడయ్యును గూడ
నతడ ద్విజుడటంచు నందురవని.

## బ్రహ్మంగారు అన్నిజాతులవారికి వేదాధ్యయ నాధికారము కలదని తెలుపుట

ఓ అగ్రహారీకులారా! ఇంకను నేజెప్పబోవు విషయ ములను వినుడు

శ్లో॥ ద్విజవత్ క్షత్రియ స్యోక్తః ప్రాణాయామో మహామునే
విరక్తానాం ప్రబుద్ధానాం వైశ్యానాం చ తథైవచ
శూద్రాణాంచ తథా స్త్రీణాం ప్రాణసంయమనే మునే॥

వేదాధ్యయనమునకు బ్రాహ్మణులకెంత అధికారంబుకల దని శాస్త్రంబులందు చెప్పబడియున్నదో, అంత అధికారము క్షత్రియ, వైశ్య, శూద్రాదులకును, స్త్రీలకునుకూడ కలదని యోగశాస్త్రమునందు చెప్పబడి యున్నది.

మఱియు మహాభారతంబున శాంతిపర్వమునందు శివుడు పార్వతీదేవికి వర్ణంబులు గుణంబులవలననే కలుగునని చెప్పి యుండెను.

శ్లో॥ జ్ఞానవిజ్ఞాన సంపన్నః సంస్కృతో వేదపారగః।
విప్రో భవతి ధర్మాత్మా క్షత్రియః స్వేనకర్మణా॥

తా॥ జ్ఞానసంపన్నుడైనవాడు బ్రాహ్మణుడనబడును. అట్టి బ్రాహ్మణునకు వేదపారాయణకు అధికారంబుకలదు, సద్గుణంబులు కలవాడైనచో క్షత్రియుండైనను బ్రాహ్మణుడే యగుచున్నాడు.

శ్లో॥ ఏతైః కర్మఫలైర్దేవి న్యూనజాతి కులోద్భవః।
శూద్రోప్యాగమ సంపన్నో ద్విజో భవతి సంస్కృతః॥

ఓ పార్వతీ! పైనచెప్పబడిన రీతిగ శౌచశాంత శమద మాది ధర్మంబులచే జాతులేర్పడుచున్న వేగాని వేరువిధంబు లుగ మానవులందు జాతులేర్పడుటలేదు. సద్గుణంబులు కల వాడు శూద్రుండైనను బ్రాహ్మణుండగును.

"ఏనసర్వ మిదంప్రోక్తం సూత్రే మణిగణా ఇవ"

అని భగవద్గీతయందు చెప్పబడియున్నట్లు పరబ్రహ్మ మను సూత్రంబును పొందినవారే వేదాధ్యయనంబున కర్హులు

ఒకదారమం దనేకపూసలు గ్రుచ్చువిధంబున భగవంతుని యందు సర్వంబును గ్రుచ్చవలయును. బ్రహ్మంగారావిధం బుగ ఎంత చెప్పినను ఆ బ్రాహ్మణులకు తలకెక్కలేదు. తాము బట్టిన కుందేటికి మూడేకాళ్ళని వారిపిడివాదము. "మీరు చెప్పెడి శాస్త్రములు మేమెరుంగనివా? మీమాటలన్నియు కల్ల. అంతమాత్రమునకే మా మనంబులు మారుననుకొంటివా?" అని బ్రహ్మంగారిని ఎదుర్కొన మొదలుపెట్టిరి. అంత బ్రహ్మంగారు బ్రాహ్మణులతో 'అయ్యలారా! నే జెప్పబోవు విషయములను యింకను వినుడు.

శ్లో॥ సత్యాచార్యస్య గమనేకదాచిన్ముక్తి దాయకం
కాశీక్షేత్రం ప్రతిసహాగార్య మార్గేతు శంకరః॥

అని 'మనీషాపంచక' మను గ్రంథమున చెప్పబడి యున్న విధముగ, తొలుదొల్త శంకరాచార్యుల వారుకూడ మీకువలెనే జాతిభేదములుండినట్లు భావించినట్లును, అట్టి జాతి భేదములు లేవని శంకరాచార్యుల వారికి శ్రీ పరమశివుడు కాశీక్షేత్రమున చండాలరూపమున యుపదేశించినట్లును తెలుపబడి యున్నది.

శ్లో॥ చండాల దేహపశ్వాది స్థానరే బ్రహ్మవిగ్రహే
అన్యేషు తారతమ్యేన స్థితేషు నతథామ్యహం।

చండాల దేహములందును జంతువులు మొదలగు వాటియందును సమస్తమునందును తృణములగాయితు బ్రహ్మ పర్యంతము నేను వ్యాపించియున్నానని చెప్పబడియుండగా, బ్రాహ్మణునకును శూద్రునకును భేద మేవిధముగ కలుగు చున్నది?

శ్లో॥ న యోనిర్నాపి సంస్కారో నశ్రుతంచ న సంతతిః
కారణాని ద్విజాతస్య వృత్తమేవ తు కారణం॥

బ్రహ్మశ్రీకి జన్మించినంత మాత్రముచే బ్రాహ్మణత్వము లభింపదు. సత్యము, ధర్మము మొదలగు ధర్మము లవలంబించుటవలననే బ్రాహ్మణత్వము లభించును.

బ్రాహ్మణుడైనను, చండాలుడైనను జ్ఞానమను తెప్పను ఆధారముగ చేసుకొని జనన మరణ ప్రవాహమును దాటి ముక్తియనెడి పరమాత్మను చేరగలుగుచున్నాడు. బ్రహ్మము సర్వప్రాణికోటి యందును సమానముగ నున్నది. పరమాత్మను చేరుటకు అందరును సమానులే. వారివారి గుణముల ననుసరించి, బ్రాహ్మణులలో బ్రాహ్మణులు, బ్రాహ్మణులలో క్షత్రియులు, బ్రాహ్మణులలో వైశ్యులు, బ్రాహ్మణులలో శూద్రులుకూడకలరు. ఆవిధముగనే నాలుగు వర్ణములలోకూడ వారివారి గుణముల ననుసరించి నాయా వర్ణములవా రుందురేగాని, వేరుకాదు. మరియు భగవద్గీత యందు శ్రీ కృష్ణుడు అర్జునకు యీ క్రిందివిధమున చెప్పెను.

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని, స్వభావ ప్రభవైర్గుణైః॥

ప్రతివారును వారివారి పరిపక్వముననుసరించి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులని నాలుగువర్ణంబులుగ యేర్పడుచున్నారు. అనగా వర్ణవిభాగము వారివారి సత్యదాన తపోనిష్ఠాములచే కలుగుచున్నదని భావము.

శ్లో॥ ఋష్యశృంగో మృగాజ్జాతః కౌశికో గాధి నందనః
జంబుకో జంబుకోత్పతిః గౌతమో గోత్రసంభవః

వాల్మీకో వల్మికోత్పత్తిః అగస్త్యః కుంభసంభవః
వ్యాసోలుబ్ధకసంభూతో వశిష్టో ఊర్వశీసుతః
నారదో రజకీపుత్రః కౌండిన్యో ముండకీసుతః
సాంఖ్యాయన స్సర్ప సంభూతో శౌన కాది మహర్షయః॥

ఋష్యశృంగ మహాముని లేడికిని, విశ్వామిత్రుడు క్షత్రియ కులమందును, జంబుక మహాముని నక్కకును, గౌతముడు కుందేటికిని, వాల్మీకి పుట్టయందును, అగస్త్యముని భాండమునను, వేదవ్యాసుడు చంబడస్త్రీకిని, వశిష్టుడు వేశ్యకును, మాండవ్యుండు కప్పకును, సాంఖ్యముని ఛండాలస్త్రీకిని, గార్గేయుండు గాడిదకును, శౌనకాది మహామునులం కుక్కలకును జన్మించిరికదా? దీనిని బట్టి ఆలోచింప జాతిభేదము లెట్లేర్పడినవో గ్రహించుడు. ఇక బ్రాహ్మణులు కర్మబ్రాహ్మణులని, వేషబ్రాహ్మణులని, సద్బ్రాహ్మణులని మూడుతరగతులుగ విభజింపబడు చున్నారు.

1. రాత్రి నాట్యశాలయందు బ్రాహ్మణవేషము ధరించుచు పటెదినమున యెప్పటివలె శూద్రుడుగ నుండువిధముగ నున్న వేషధారిని బోలినవాడు వేషబ్రాహ్మణుడగుచున్నాడు.

2. మాయచే గప్పబడిన నీ ప్రపంచమున కర్మలనాచరించుచు పైకి బ్రాహ్మణవేషము ధరించి నిజస్థితియందు బ్రాహ్మణత్వములేక చచ్చుచు పుట్టుచు, నితరులుతనకన్న భక్తిజ్ఞాన వైరాగ్యములయందు మిన్నగా యున్నవారిని జూచి సహించలేక మీకు వేదాధ్యయనమున కధికారము లేదనుచు, మీరు శరీర వర్ణాభిమానులై కాంచికవృత్తి నవలంబించువారే కర్మబ్రాహ్మణు లనబడుదురు.

కి. బ్రహ్మజ్ఞానము కలవారును, గాయత్రీజప మాచరించువారును, అహింసాది సద్గుణములు కలవారే సద్బ్రాహ్మణు లనబడుదురు.

శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః
వేదపాఠేన విప్రస్స్యాత్ బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః॥

జననమందు ప్రతివాడును శూద్రుడుగనే యుండును. ఆత్మసంస్కారాభివృద్ధిచే బ్రాహ్మణుడగుచున్నాడు. వేదాధ్యయనము చేసినవాడు విప్రుడగుచున్నాడు. బ్రహ్మజ్ఞానము కలవాడే బ్రాహ్మణుడు. విష్ణువును పూజించువారు వైష్ణవు లనబడుదురు. శివుని పూజించువారు శైవులగుచున్నారు. గణపతిని పూజించువారు గాణాపత్యు లనబడుచున్నారు. శక్తిని పూజించువారు శాక్తేయు లనంబడుదురు. అదేరీతిగ బ్రహ్మజ్ఞానము కలవారికే బ్రాహ్మణులను నామము చెల్లును. జన్మచే కలుగు వర్ణంబులు అసత్యములైనవి. ఈ విషయమును బట్టి ఆలోచించినయెడల వేదపారాయణమున అధికారముకలదు.

ఆ. కశ్యపుడుజేరి కదియంగ నొకనాడు
నుచ్ఛయందు పిండ ముద్భవించె
హెచ్చుతగ్గు లెవరు హీనుండెవండురా!
విశ్వదాభిరామ! వినరవేమ!

అవిఘ్నంబుగ బ్రహ్మంగారు వారికి ఎన్నివిధంబుల నచ్చజెప్పినను వారు తమ మూఢత్వమును వదలరైరి. బ్రహ్మంగారి ఉపన్యాసమంతయు బూడిదలో బోసిన పన్నీరు చందమున నిష్ప్రయోజనంబయ్యె. "మమ్ములనిక పొనిందు భోజనమునకు కాల మతిక్రమించుచున్న"దని బ్రాహ్మణులు ఎన్ని పర్యాయములు వారిని అడిగినను, వారు అంతని పోనీయక,

బండిచుట్టును నిలువబడి, ఒకఅడుగైన కదలనీయక నానా విధముల అల్లరిపెట్ట సాగిరి.

## బ్రహ్మంగారి మహిమచే పుష్పగిరి అగ్రహారము తగులబడుచున్నట్లు బ్రాహ్మణులకు కనబడుట

బ్రహ్మంగారు ఓర్పువహించిన కొలది వారి కొంటె చేష్టలు అతిక్రమింపజొచ్చెను. అంత స్వాములవారు వారిని జూచి "ఓ నామబ్రాహ్మణులారా! నేనెంత చెప్పినను మీరు యథార్థమును గ్రహింప లేకున్నారు. "చతుర్వేద ధరావిప్రా సూక్ష్మబ్రహ్మ న విద్యతే" అని చెప్పబడినట్లు వేదముల నెల్ల చదివినను సూక్ష్మమైన పరబ్రహ్మమును తెలుసుకొనలేనిచో అట్టిది అవిద్యయనబడును. "వినాశకాలే విపరీతబుద్ధి" యను నట్లు మీకేదో చేటుకాలం దాపున్నంబై యుండనోపు. లేకున్న మమ్మాలరక యిట్లు ప్రయాణంబున కాటంకంబు కలుగ జేయుదురే. మీరు అజ్ఞానులవలె గన్పట్టుచున్నారు" అని అనుచుండగా, ఆ బ్రాహ్మణులు బ్రహ్మముగారి మాట లకు అడ్డుతగిలి "మీయట్టి మాయగురువులను చాలమందిని చూచితిమి. నీమెట్ట వేదాంతము మాకును తెలుసు. గర్వ భంగముగావింపక మిమ్మూరగ పోనిత్తుమే!' యని ప్రగల్భము లాడజొచ్చిరి. బ్రహ్మంగారు ఆవిధముగ బ్రాహ్మణులకు చెప్పి చెప్పి విసుగుజెంది, యిక ఊరకున్న లాభములేదని తన దృష్టిని ఆపుష్పగిరి అగ్రహారమున బ్రాహ్మణులు నివసించు చున్న భాగంబుపై ప్రసరింపజేసెను. అంత తమయిండ్లన్ని అంటుకొని కాలిపోవుచున్నట్టు బ్రాహ్మణుల కంటికి కనబడ నారంభించెను. అదిచూచి వారందరును నోరును నెత్తియు

కొట్టుకొనుచు నింకేమున్నది? మనకొంపలు దగ్ధములైన వని'' యనుకొనుచు, యిదిఅంతయు బ్రహ్మంగారిని, తా మావిధముగ పరిహాసము చేయుటవలననే కలిగినచేటని భావించి, బ్రహ్మంగారి దగ్గరకుజేరి నమస్కరించుచు "మహానుభావా! తమశక్తి సామర్థ్యము గ్రహించలేక అజ్ఞానముచే చేసిన మా తప్పులు మన్నించి; మాయాలు బిడ్డలను రక్షింపవే'' యని భయభ్రాంతులై బ్రతిమాల నారంభించిరి. అంత స్వాములవారు నిరుపమాన కరుణాసము ద్రుండు గావున "బ్రాహ్మణులారా! ఇదియేనా మీ బ్రాహ్మ ణత్వము? అందినజుట్టును అందకున్న కాళ్లునా బట్టుట? భయ మందవలదు. మీకెట్టి భయంబును కలుగనేరదు పరమాత్మను నమ్మిన వారికిని, పూజించువారలకును వారికెట్టిఆపదలును సంభ వింపనేరవు. మీయందట్టిభావంబు పూజ్యంబగుట వలననే భయమందుచున్నారు. అదిగో! అటుచూడుడు మీగృహంబు లెప్పటియట్లనే యున్న''వని చెప్పుచు తనదృష్టిని మరల ఆ గృహంబులపై నుంచెను. అంత పొగ లెగయుచు మండు చున్న గృహంబులన్నియు ఆబ్రాహ్మణులకు యధారీతిగ గను పడ నారంభించిన, బ్రాహ్మణులదిగాంచి అమందానంద కంద లిత హృదయారవిందులై ఆశ్చర్యపడుచు "స్వాములవారు నిక్కముగ భగవదంశ సంభూతుడేగాని వేరుగాదని స్థిర పఱచుకొని, బ్రహ్మంగారితో "మహాత్మా! మాగ్రామంబున నాల్గుదినంబులుండి, యీబీదల ఆతిథ్యము స్వీకరించి, కృతా ర్థులజేయరే'' యనివేడ, బ్రహ్మంగారు అందుల కంగీకరిం చిరి. అనంతరము బ్రహ్మంగారిని, బాగుగా అలంకరించిన ఒకపల్లకీయందు కూర్చుండబెట్టుకొని మృదంగాది [illegible]బు



లతో పుష్పగిరి అగ్రహారమంతయు శోభాయమానముగ నూరేగించి, వారిగృహంబునకు తీసుకొనిపోయి పంచభక్ష్య పరమాన్నములతో స్వాములవారిని, శిష్యులకును ఆతిథ్య మొసంగి సమారాధనలు సలిపిరి. అనాల్గవదినమున పుష్ప గిరి అగ్రహారీకులందరును స్వాముల వద్దజేరి "అయ్యా? తమరు కాలజ్ఞానమను గ్రంథమును రచించిరనియు. ఆగ్రంథ మున ప్రపంచ భవిష్యత్తంతయు సాకల్యంబుగ తెలిపినట్లును వినియున్నారము. మాకా గ్రంథవిశేషంబుల దెలిపి ఆనం దింపజేయ గోరుచున్నా"మని వేడగా బ్రహ్మంగారును ఆనందించి. సభచేసి, ఆసభయందు కాలజ్ఞాన గ్రంధరహా స్యంబుల దెలుప నారంభించిరి.

## స్వాములవారు పుష్పగిరి అగ్రహారీకులకు కాలజ్ఞానమును చదివి వినిపించుట

కాలజ్ఞానమును వినవలయునని పుష్పగిరి అగ్రహారము నందుండెడి వారందరును పసిపాపల సహితంబుగ సభకు విచ్చేసిరి. అంత బ్రహ్మంగారు తానుచదువుచున్నవిషయుంబు లను శ్రద్ధాభక్తులతో వినుడని వారల నందరును హెచ్చ రించి, తాను రచియించిన కాలజ్ఞాన గ్రంథమును జదువ దొడంగెను.

"కలియుగంబున దుష్టశిక్షణకును శిష్టజనరక్షణకును శ్రీ వీరభోగ వసంతరాయులను నామంబుతో, కలియుగము 5000 గడచిన మీదట నేనీ భూమియందు అవతరించెదను. మార్గశిరమాసమున దక్షిణ దిగ్భాగమున నొక ధూమకేతువు పు... అదియే నారాకకు నిదర్శనము. ఆధూమ



కేతువును మీరు చూడగలరు. క్రోధినామ సంవత్సర మార్గశిర శుద్ధపంచమీసోమవారమున పునర్వసూ నక్షత్ర కర్కాటక లగ్నమందు శ్రీ వీరభోగ వసంతరాయులు అను నామంబుతో నేనవతరించి దుష్టసంహారము గావించెదను. ఇకముందు వర్ణములు సంకరమగును. మద్యపానముచే జనులు భ్రష్టులై పోవుదురు. వేదము లంత్యజాతుల అధీనంబగును. బ్రాహ్మణులు కలియుగమున 5000 సంవత్సరముల వరకే పూజింపబడుదురు. పిమ్మట వర్ణసంకరము జరుగును. ఇకముందు దేవ బ్రాహ్మణులైన విశ్వబ్రాహ్మణులు అభివృద్ధిలోనికి వత్తురు. అత్తలకు పీటలు కోడళ్ళకు మంచాలు అగును. విప్రులు నీచ జాతులవారి దగ్గర సేవలు చేయుచు జీవించుచుందురు. ముండలు పునర్వివాహములు చేసుకొందురు. బ్రాహ్మణులు నీచముగ చూడబడుదురు. వేదవిద్య నశించును, నామాటలు నిలకడమీద నిజమగును. నేను వీరభోగ వసంతరాయుడనై అవతరించి, చేత నాలుగుమూరల ఖడ్గము ధరించి, శ్రీశైల పర్వతము మీదకువచ్చి, అచ్చటి ధనంబంతయు పుణ్యాత్ములైనవారికి పంచియిత్తును. నామాటలు నమ్ము కొన్నారు. కాశీ దేశమున కలహములు పుట్టును. యాగంటీశ్వరుడు భక్తులకు కనబడి మోక్షమిచ్చును. వావివరుసలు పాటింపక నరులు విరహముల జెందెదరు. కులగోత్రములు, జాతినీతులు పాటింపక వివాహములు జరుగును. చిటివేలు తాలుకాలో అనేక వింతలు పుట్టును. వినాయకుడు వలవలా యేడ్చును, కొచ్చెర్ల కోటలో చెళ్ళపిళ్ళరాయుడు మనుష్యులతో మాట్లాడును. ఇక నీ ప్రపంచమున అనేక అద్భుతములు కలుగనున్నవి. ఇంటికి ఏడుగురు విధవముండ లుందురు. అహోబిలమున

ఉక్కుస్తంభమునకు కొమ్మలువచ్చి జాజిపూవ్వులు పూయును. బ్రహ్మకపాలములో రామచిలుక రాజ్యమేలును. హరిద్వారమున మఱ్ఱిచెట్టుపై మహిమలు పుట్టును. కాశీదేశమునుండి వెనుకముకము వారు వత్తురు. మహానంది చాటున మహిమలు పుట్టును. శృంగేరీ పుష్పగిరి పీఠములు పంచాననవారి పాలగును. భూతలంబున మంటలెగయును. నాలుగు సముద్రముల మధ్యనున్న ధనము శ్రీశైలము చేరును. పాతాళగంగ యింకిపోవును. ముండలందరును ముత్తైదువ లగుదురు. ఈ రీతిగ భూమియందు అనేకవిచిత్రములు కలుగు"నని చెప్పవారందరు విని ఆనందకందళిత హృదయులై, స్వాములకు భక్తిపూర్వకముగ నమస్కారములు గావించి, సెలవు తీసుకొని నిజనివాసంబులకేగి సౌఖ్యముగ నుండిరి.

## స్వాములవారు సిద్ధయ్యకు ఆత్మతత్వమును బోధించుట

అనంతరము బ్రహ్మంగారు పుష్పగిరి అగ్రహారము నుండి కందిమల్లయ్యపల్లెకు బోవలయునని బయలుదేరిరి. మార్గమధ్యంబున వారందరును నొక వటవృక్ష చ్ఛాయను గూరుచుండి విశ్రాంతి తీసుకొనుచుండిరి. అప్పుడు సిద్దయ్య "తండ్రి! మున్నొకపర్యాయము దృశ్యాత్మవిధానంబు తరువాత నెప్పుడైనను విశ్రాంతిగ నున్నప్పుడు బోధించెద మని తెలిపి యుంటిరిగదా? ఇప్పుడు విశ్రాంతిగనే యున్నదికదా? ఆ విషయంబు తెలిపి ననుకృతార్థునిజేయరే" అని ప్రార్థింప స్వాములవారు సిద్దయ్య కీవిధంబున తెలుప నారంభించిరి.

"నాయనా! వినుము. జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియములుఅయిదు, ప్రాణములు అయిదు, శబ్దములు

అయిదు, కరణములు నాలుగు, మొత్తము యిరువదినాలుగు తత్వములతో నీ శరీర మేర్పడియున్నది. రక్త, శ్యామల, ధవళ, పీతవర్ణంబులతో ప్రకృతి విలసితంబై యొప్పు చున్నది. అదియే క్షరమనియు, క్షేత్రమనియు, శిఖరంబనియు, అపోజ్యోతియనియు, అంతర్లక్ష్యంబనియు, నీవారశూకం బనియు, గగనసముద్రంబనియు, విద్యుల్లేఖయనియు, మేరు శిఖరంబనియు, శిఖరస్థానముగను, వైకుంఠముగను, కైలాస ముగను, చిన్మయ నేత్రముగను, జీవనముగను, ఆత్మగను, సచ్చిదానంద స్వరూపముగను, స్థూలశరీరము రక్తవర్ణంబు గను, సూక్ష్మశరీరంబు శ్వేతవర్ణంబుగను, కారణశరీరము శ్యామలముగను, మహాకారణ శరీరము పీతవర్ణముగను, వీటిమధ్యస్థంబై కైవల్యంబను తనువు ప్రకాశ మానంబై యొప్పుచుండును. ఇక తనువుల ప్రమాణ విధానం బెరింగింతు వినుము. స్థూలశరీరమున వర్తులాకారముగ అంగుళ ప్రమాణ మున నొప్పుచునుండును. కారణశరీరము కూడ అంగుళ ప్రమాణముననే యున్నది. వీటికన్నిటి మధ్యను 'ఆత్మ' అఖండమై ప్రకాశించుచుండును. దానినేసచ్చిదానందస్వరూ పంబగు చైతన్యమందురు. ఇవియన్నియు నేత్రంబుననే యున్న"వని తెలుపుచు నొక దర్పణమును తెప్పించి సిద్దయ్యకు దృశ్యాత్మ విధానంబంతయు ప్రత్యక్షంబుగ చూపించెను.

## బ్రహ్మంగారు సిద్దయ్యకు ధర్మోపదేశంబు గావించుట

"బిడ్డా! ముక్తిని బొందుటకు సద్గురువు నాశ్రయింప వలయును. బ్రహ్మచర్యము నవలంబించి, నిరంతరము హరి

కథామృత పానంబును జేయుచుండవలయును. చెడుతలంపు లన్నియు మనసును బోనీయక శాంతస్వభావమును, భూత దయయు, అహింసయు, పరోపకారబుద్ధియు కలిగియుండ వల యును. సాధుజనసేవయు, సర్వజనవిధేయతయు, సదాచార సంపన్నతయు, క్షమయు, తపోశక్తియు, మౌనవ్రతంబును, సుఖదుఃఖములయందు సమబుద్ధియు, వేదశాస్త్ర పురాణాది పఠనంబును, అపారభగవద్భక్తియు, పరనిందావర్జితంబును, అన్యమత సహనంబును, దూరాలోచనయు, దుర్జనులకు దూరముగ నుండుటయు, శమదమాది సద్గుణంబులును, సమస్తంబును దైవకైంకర్యంబు గావించుటయు, సకలంబును పరమాత్మయనియే భావించుటయు మొదలగు లక్షణంబులు కలిగియుండుటయె మానవధర్మము. సదాచారసంపన్నతయు, సద్గుణంబులును మోక్షమును బొందుటకు మార్గము" లని తెలిపి అటనుండి శిష్యసమేతంబుగ బయలుదేరి, సూర్యా స్తమయమునకు కందిమల్లయ్యపల్లెకు చేరెను.

## బ్రహ్మంగారు పశ్చిమదేశీయులైన పంచాననము వారికి కాలజ్ఞానోపదేశము చేయుట

శ్రీ వీరబ్రహ్మంగారు ఆరీతిగ మరల కందిమల్లయ్య పల్లెకు చేరి, శిష్యజనసహితంబుగ భగవన్నామ స్మరణ గావించుచు సుఖంబుగ నుండిరి. అంత కొంతకాలము నకు పశ్చిమ దేశీయులైన పంచానన విశ్వ బ్రాహ్మణులు స్వాములవారి దర్శనార్థమైవచ్చి, దర్శనము చేసుకొని, ఒక దినమున స్వాములవారితో "మహాత్మా! మీరు కాలజ్ఞాన మను గ్రంథము వ్రాసినట్లు వినియుంటిమి. మాకాగ్రంథవిష

యంబుల దెలిపి అనుగ్రహింపరే” యని వేడ, స్వాముల వారు “భక్తులారా! మీ కోరికల దీర్చుటయే నాసంకల్పము. మీ కాగ్రంథ విశేషంబులు తెలుసుకొన వలయునని కుతూహలముగ నున్న తప్పక వినిపించెద”నని సావకాశముగ నున్నసమయంబున వారిని తనముందు కూర్చుండ నియోగించి “బిడ్డలారా! ఈ ప్రపంచమున అనేక విపరీతంబులు కలుగనున్నవి. కలియుగమున ధర్మము ఒకపాదము కూడి యుండదు. గడచినదినములే మంచివని ఎప్పటికప్పుడు తోచుచుండును. ధర్మదేవతకు బలముతక్కువయియుండును ధర్మ ప్రవర్తనగలవారు అనేకకష్టములు పడుచుందురు. నీచులు వృద్ధిపొందుదురు. పతివ్రతలు ఎక్కడనోగాని యుండరు. భూసారము తగ్గిపోవును. ప్రజలు అల్పాయుర్దాయము కలవారై నానావిధరోగములచే బాధపడుచుందురు. మంత్ర శాస్త్రములయందు పటుత్వము తప్పును. ధనాశచే ప్రజలు ప్రమగ్గుచుందురు. భోగములయందు కాంక్ష అధికమగును. ప్రజలు బలహీనులుగ నుందురు. గోవుల క్షీరములందు సారముతగ్గును. నన్ను నమ్మిస్మరణజేయువారల కెట్టిహానియు కలుగదు. నేను శ్రీముఖనామ సంవత్సరమున వీరభోగ వసంతరాయుడను నామముతో వచ్చి దుష్టసంహారము గావింతును. కృష్ణా, గోదావరి, గంగ, కావేరీ, సింధు, బ్రహ్మపుత్ర, తుంగభద్ర మొదలగు నదులన్నియు పొంగి జననాశనము కలుగును. తెల్లకాకులు గ్రామ పొలిమేర్లలో నేర్పుచుండును. భూమియంతయు దుర్మార్గులరక్తముతో తడియును. స్త్రీలు చెడుప్రవర్తనగల వారగుదురు. నావాక్యములు తప్పవు. నామఠమునందు ఏడుసారులు దొంగలుపడుదురు.

భక్తులు కానివారలకు నాశనము తప్పదు. జనులకు కోప స్వభావము, అసూయత అధికమగును. మనుజులు సప్త వ్యసనంబులకు లోనై క్రమ్ముచుందురు. ఒకరిసొమ్ము ఒకరు అపహరింప జూచుచుందురు. శిలలు రక్తము గ్రక్కును, సర్వేపతము లోకకంటియగును. తక్కువ జాతివారు ఆచారవంతులగుదురు. దైవభక్తిగలవారు దరిద్రులుగనుందురు. కుక్కలు గుఱ్ఱాలను చంపును. పట్టపగలు చుక్కలు పొడచును. ప్రజలలో అర్థములేని నాగరికత హెచ్చును. పొట్టకూటి విద్యయే ప్రధానమగును. వేదాంత శాస్త్రమునందు నమ్మకముపోవును, నాస్తికులు వృద్ధిపొందుదురు. నానాటికి విపరీతములు పెరుగును. నేనిక భూలోకమున కొలదికాలము మాత్రమే యుండి పిమ్మట సమాధియందుండి తపంబాచరించుచు కొంత కాలము గడపి, తరువాత దుష్టనిగ్రహ శిష్టపోషణకై రావలసి యున్నది. ఇంక కొలది కాలముననే నేను సమాధినుండెదను" అని చెప్పిరి. పశ్చిమ దేశమునుండి వచ్చిన విశ్వబ్రాహ్మణులు స్వాములవారు చెప్పిన విషయంబుల నన్నిటిని శ్రద్ధతో విని, బ్రహ్మంగారికి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, సెలవుతీసుకొని అటనుండి బయలుదేరి తమ దేశంబునకు వెడలిరి.

## బ్రహ్మంగారి మఠమునకు దొంగలు కన్నము వేయుట

బ్రహ్మంగారు తమపీఠమును భక్తులొసంగిన సువర్ణాలంకారముల తోటియు, రజితవస్తువులతోటియు శోభాయమానమున నిత్యమును అలంకరించుచుండెడివారు. కొందరు దుర్మార్గులదిచూచి ఆమఠమునకు కన్నము వేసి ఎటులైన ఆ

సువర్ణ రజితములను అపహరింపవలయునని సంకల్పించుకొని యుండిరి. స్వాములవారు ఏదైన దేశసంచార మేగినప్పుడు కన్నము వేయుట మంచిదని వారి అభిప్రాయము. కాని నంద్యాల సంచారము వెళ్ళివచ్చిన పిదప యిక దేశసంచారమును మాని స్థిరముగనే మఠమున నుండవలయునని బ్రహ్మంగారు సంకల్పించుకొనిరి. బ్రహ్మంగారిక సంచారమునకు బోరను సమాచారము దొంగలు ఎట్లో తెలుసుకొని, నిరుత్సాహులై, ఒకదినమున వారందరు ఒకచోట కలుసుకొని ఆలోచింప దొడంగిరి. అందొకడు "అన్నలారా! కన్నము వేయవలయునని మనము చాల కాలము నుండి తలంచుచున్నాము. ఇట్లే కాలమంతయు గడచిపోవుచున్నది. బ్రహ్మంగారు ఇకసంచారమునకు బోరట. ఈదినము అమావాస్య కదా! ఈదినము చాలబాగున్నది. మరల మనమందరము కలుసుకొనుట దుస్తరము. కనుక ఈరాత్రియే కన్నమునకు బాగున్నది" అని వారు స్థిరపరచుకొనిరి. వారు లెక్కకుసరిగ పదిమందిగలరు. వారిలో స్వాములవారి భక్తుడు కూడా యొకడుండెను. ఆదినమున స్వాములవారు రాత్రి చాలసేపు వరకు పూజలుచేసుకొని, అనంతరము మఠమునకు తాళము వేసుకొని యింటికివచ్చి, శిష్యులతో "శిష్యులారా! మన మఠంబున యీ రాత్రి ఒక విశేషము జరుగనున్నది. మీరందరును ఆ చిత్రమును ఉదయము చూడవచ్చునని చెప్పి భోజనాదులజేసి పరుండెను. అందరును గాఢనిద్రయందుండు సమయము గనిపెట్టి, ఆ దొంగలు మఠమునకు కన్నముపెట్టి మఠములోపల ప్రవేశించి, పీఠముదగ్గర వెలిగింపబడిన యఖండము వెలుగున విగ్రహముల కలంకరింపబడి యున్న

సువర్ణాభరణములును, శతగోపురము, ఇతరములైన వెండి సామానులు, విలువగలిగిన సామానులును తీసుకొని ఒక మూటగగట్టి, ఆ మూట నొకని తలపై బెట్టి, వారందరును కలసి మఠమునుండి పైటకువచ్చు నుద్దేశ్యంబుతో కన్నము దగ్గరకు వచ్చుసరికి, వారలకందరకును నేత్రములు గానిపించక అంధులైపోయిరి. అంత వారు ఎటుబోవుటకును కన్నులు గానరాక, మనగతి చివరకు నిట్లయ్యెనని దుఃఖించుచు మఠములోపలనే ఉండిపోయిరి. వస్తువుల మూట నెత్తిన బెట్టుకొనిన వానికి, ఆమూట శిరముపై పెట్టుకొనుటకు వీలు లేనంత బరువుకలదిగ మారిపోవుటచే, ఆమూటను నెత్తిపై భరించలేక నేలబారవైచెను. నగలమూటను క్రిందబారవేసిన వెంటనే వానికొకవిధమైన శిరోవేదన ప్రారంభమై దుర్భరమగుబాధ ప్రారంభమాయెను. తూర్పు తెల్లవారు సమయమున స్వాములవారు లేచి కాలకృత్యంబుల నెరవేర్చుకొని, స్నాన సంధ్యానుష్ఠానము లాచరించి, ఆగ్రామమునందలి పెద్దమనుష్యులను వెంటబెట్టుకొని వచ్చి మఠంబు తాళంబు దీయు. నందు కన్నులు గానరాక పడియున్న పదుగురు దొంగలు గానంబడిరి. అంత స్వాములవారు పెద్దమనుష్యులతో "నాయనలారా! వీరలను చూడుడు. దొంగతనము చేయుటకు ఈ మఠంబే దొరికినది కాబోలు.. ఇట్టి మూఢులకు దైవబల ప్రభావంబేమి తెలుసును. వారలకీ ప్రాయశ్చిత్తము జరుగవలసి యుండుటవలననే, యిట్టిబుద్ధి పుట్టెను. అంత పెద్దమనుష్యులందరును "యిది ఏమి పనిరా? బ్రహ్మంగారి మఠమునకా మీరు కన్నము వేయుట?' అని వారల రెక్కలు విరిచికట్టి, అనంతరముకొట్ట నారంభించిరి. దొంగలు

పెద్దగోల చేయుచు "మా నేత్రములు పోయి ఏడుచుచుంటిమి; యింకను మమ్ములను కొట్టిన నేమిలాభము, నేటితో మాకు బుద్ధివచ్చినది. ఇక జన్మములో దొంగతనము ఎన్నడును చేయము. చేసిన దానిని క్షమింపుడు, మమ్ము కొట్టకు"డని ఆ పెద్దమనుష్యుల కాళ్ళు పట్టుకొనసాగిరి. నవ్యనవనీత సమాన హృదయుండు గావున పెద్దమనుష్యులను చూచి "నాయునలారా! యిక వారిని కొట్టకుడు, వదలివేయుడు. వారికర్మము నట్లుండుటవలన నే, వారికీబుద్ధి పుట్టినది" అని వారించి దెబ్బలు కొట్టకుండ ఆపుచేసెను. అంత నాపదుగురు చోరులును స్వాములవారి పాదంబులపై బడి "తండ్రీ! అజ్ఞానముచే మీరలు సామాన్యమానవులుగ భావించి మేమిట్టి కృత్యమునకు పాల్పడి, నేత్రములనే పోగొట్టుకొంటిమి. మేమీరీతిగనున్న మాయాలుబిడ్డలు అన్నఆహారములు లేక మలమల మాడి పోవుదురు. ఈబిడ్డలపై కనికరము వహించి దృష్టినికలుగ జేయు కున్న మేమిక బ్రతికినను ప్రయోజనంబులే"దని పాదములు పట్టుకొని వదలకుండుటగాంచి, ఆ ప్తజన బాంధవుండు గావున, వారిదుఃఖము చూచి జాలిపడి "ఓయీ! మీరందరును పీఠంబునకు రండని, వారల చేతులను బట్టికొని, పీఠముకడకు తీసుకొనిపోయి, పురజనులందరును చూచుచుండగనే, పీఠము దగ్గరనున్న విభూతినితీసి, దొంగల నేత్రంబులపై బూయ, వారలందరకును నగల నేత్రములు యథాప్రకారముగ గన పడ నారంభించెను. కాని శిరంబుపై మూటను బెట్టుకొనిన వానిశిరో వేదన మాత్రము తగ్గలేదు.

పిమ్మట శిరోవేదనచే బాధపడుచున్న దొంగలనాయకుడు స్వాములవారితో "తండ్రీ! నగలమూటను నెత్తిపై

పెట్టుకొనిన పాపిష్టిని నేనే, నగలమూట నెత్తిపై పెట్టుకొనినది లగాయితు నాకు శిరస్సున దుర్భరమైన బాధ ప్రారంభమైనది. పుట్టి బుద్ధిఎరింగిన తరువాత నిట్టిబాధ యెన్నడును నెరుగను. బాధభరింపలేక పోవుచున్నాను. ప్రాణములు పోవుచున్నవి. రక్షింపు"డని వేడ స్వాములవారు, దీనత నూళుండు గావున, విభూతిని చేతబెట్టుకొని మంత్రించి వానిశిరంబుపై జల్ల, మంత్రము వేసినట్లు ఆశిరోబాధ మాయమయ్యెను, అనంతరము ఆదొంగలను ప్రతిదినము మఠమునకు రండని చెప్పి, వారలకు ఆవిధముగ నిత్యముజ్ఞానోపదేశంబు గావించి, చోరశిఖామణులను భక్తశిఖామణులుగ గావించె.

పాఠకమహాశయా! ఆత్మబలసంపన్నులకు అసాధ్యమైనదేదియు నీప్రపంచమున లేదు. అట్టిఆత్మబలము నుంచి శీలమువలననే లభించును. ఆత్మబలమే దైవబలము. ఆత్మబల సంపన్నులకు సర్వంబును వశ్యంబై యుండు. అట్టి ఉత్తములకు ధనంబేటికి? భోగము లేటికి? అట్టిఆత్మబల ప్రభావంబువలననే మహర్షులు నేడు నక్షత్రమండలమున వెలయుచున్నారు. అట్టి ప్రకాశంబును కలుగజేయునదియే విద్య. తక్కువంగల విద్యలు పొట్టకూటి విద్యలుగదా! మలమూత్రభూయిష్టంబగు నీశరీరముపై ఆశవదలి, ముక్తిమార్గము నెరుంగుటయే విద్య. అట్టి విద్య బోధించుగురువులు నేడు మచ్చునకైనను గానరాకున్నారు. దీపముండగనే యిల్లు చక్కబెట్టుకొనుట మంచిది.

దశమప్రకరణము సమాప్తము

# ఏకాదశ ప్రకరణము

## శ్రీ వీరబ్రహ్మంగారు గోవిందయాచార్యులకు సంసార విషయంబుల దెలుపుట

జ్ఞానసంపన్నుడైన శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు సమాధి నిష్ఠనుండుండ సంకల్పించుకొని, భార్యయైన గోవిందమ్మగారిని, తనకుమారులను బిలచి, "దేవీ! కుమారులారా! మాయామేయంబగు నీభూమిపై నుండుటకు నాకిష్టము లేకున్నది. నేనికకొలది దినములలో సమాధి నిష్ఠయందుండ దలచితిని. దానంజేసినా జ్యేష్ఠకుమారుడైన గోవిందయాచార్యులకు పట్టాభిషేకంబుజేయు తలంపుతో నున్నాను. అందులకు మీ అభిప్రాయంబు తెలుపు"డన, గోవిందమ్మగారు "నాథా! ఏన్నువిడనాడి మీరు సమాధియందుండిన నిక నాకీప్రపంచ మెందులకు? మీరులేని జీవనమేల? నేనును మీతోకలసి సమాధియందుండునట్లు అనుగ్రహింపు" డనెను. అంత స్వాములవారు "దేవీ! నీవు నాతోకలసి సమాధియందుండుటకు వీలులేదు. నీవు మనకుమారులను కనిపెట్టుకొని, యిందేయుండుము. నేను సమాధియందుండుటకు పూర్వము నీవు అవలంబింపవలసిన విధానమునుగూర్చి తెలుపుదు"నని, పలుకుచు కుమారునిగాంచి, "కుమారా! గోవిందయాచార్యా! నీకు పట్టాభిషేకంబు జేయదలచితి"నన గోవిందయాచార్యులు నమస్కరింపుచు "జనకా! పట్టాభిషేకము నాకేల! మీకు సిద్ధయ్యపై అభిమానము మెండుకదా? సమస్తవేదాంత రహస్యములను. నాతనికే బోధించి మీయంతవానినిగ చేసుకొంటిరిగదా? పీఠాధిపత్యము వహించి నేనేమిచేయగలను?

భక్తుల సందేహములుదీర్ప నాకు సామర్థ్యంబేమికలదు? ఈ పీఠాధిపత్యంబు వహింప నే సమర్థుండనుగాను. మీకుం దెలియని దేమున్నది? ఈసంసారసాగర మీదుటకే నాకు కష్టసముగా నున్నది. కనుక నన్ను వదలి యీపీఠాధిపత్యంబు కుమారియోరి కైన నప్పజెప్పు'డన విని బ్రహ్మంగారు "పుత్రా! సింహముకడుపున కుందేలుపుట్టునా! నీసామర్థ్యంబు నేనెరుం గనిదికాదు. ఇనుమునకు పరుసవేదితగిలినంతనే బంగారమగు చుండుటలేదా? నాయనా! సంసారము దుర్భరదుఃఖశోక వ్యాకులంబై, తాపత్రయాభీల కీలానలము వంటిది. నరుడు సంసారదుఃఖారణ్యంబునబడి పుణ్యాపాపముల నాచరిం చుచు, ఎందుకు సుఖంబుగానక విసుకుజెంది విశ్రాంతిగానక, తనకర్తవ్యంబు తెలుసుకొననేరక విచారించుచుండును. ఆలో చింపగా సంసారము ముండ్లతోకూడిన ఒక మహావృక్షము వంటిది. అట్టివృక్షమునకు ప్రకృతియే మూలము. అట్టివృక్షము నందలి సుఖములనియెడు ఫలంబులకు ఆశించి, శాశ్వతానంత సౌఖ్యమును గ్రహింప నసమర్థుండై, పలుబాధలకు లోనగు చున్నాడు. ధర్మార్థ కామమోక్షము లనబడు చతుర్విధ పురుషార్థములే సంసారవృక్షఫలముల రసము. అట్టి సంసార వృక్షమునకు పంచేంద్రియంబులనునవి యూడలుగ పోల్ప దగును. సప్తధాతువులును వృక్షముయొక్క బెరడుగ నెరుం గుము. రాగద్వేషములు శాఖలు. నరుండాచరించు కర్మలు పుష్పములకు పోల్పవచ్చును. గృహారామక్షేత్ర బంధుపుత్ర మిత్రకళత్రాదులు సంసారవృక్షమున ముండ్లవంటివారు. ఈ శరీరమునకు పుట్టుక ఎప్పుడు కలిగినదో మరణముకూడ దాని వెంటనే కలుగుచున్నది. ఈ సంసారము నానావిధ తృష్ణాకర

కాకోదర సమాకులంబు, ఘోరవ్యాఘ్రభయంకర సమన్వితం బైన మహారణ్యమువంటిది. బహువిధ దుఃఖభాజనంబు. అట్టి సంసారమునబడి నరుడు విశ్రాంతిగానక బహువిధ దుఃఖము లకు లోనగుచున్నాడు. మానవుడు దారాపుత్ర ధనధాన్య పశుక్షేత్రాదులయందు కాంక్షను వదలి, శయ్యాభోగముల యందు మనసును బోనీయక, ధనసంపాదన సాధనంబులగు కృషి, వాణిజ్య, సేవాది లోకవ్యవహారంబులువదిలి, శాశ్వతా నంద సంధాయకంబగు జ్ఞానకర్మల ఫలకాంక్ష చే జేయక, తన ఆత్మను పరమాత్మయందు సంధానము చేయుటకు ప్రయ త్నించినప్పుడు ఆత్మబ్రహ్మైక సాక్షాత్కార విచారాధికారి యగు"నని తెల్ప విని గోవిందాచార్యుడు సంతసించి "తండ్రీ! మీ కెరుంగని దేమున్నది? అజ్ఞుండనగు నామాటలయందలి పొరబాటులను క్షమించి, మీయిచ్చవచ్చి నటుల జేయు"డ నెను. అంత సిద్ధయ్యస్వాముల వారితో "తండ్రీ! హంస స్వరూపంబగు స్వరశాస్త్ర విధానంబు దెలుపు"మని వేడ స్వాములవారు సిద్ధయ్యను, గోవిందాచార్యులను నిట్లని చెప్పదొడంగెను.

## స్వాములవారు హంసస్వరూపంబైన స్వరవిధానమును తెలుపుట

"కుమారా! నాభికమలమున శాంతితమై సచ్చిదా నంద స్వరూపమై వెలయుచుండు పరమాత్మ "హ" అను బడును. ఇంద్రియములు మొదలగువాటితో కూడిన ప్రకృతి శరీరము 'స' కారమనబడుచున్నది. జీవాత్మ పరమాత్మతో కలసినప్పుడు 'హ' కారమునకును 'స' కారమునకును మధ్య

'ం' బిందువు ఏర్పడి 'హంస' రూపం బేర్పడుచున్నది. ఇక స్వరవిషయంబు దెలుపుచున్నాను వినుము. బ్రహ్మనిర్మితంబైన యీ దేహమునందు హంసాకారమను 'జీవహంస' నడయాడు యంత్రమువలె గుదస్థానమున ఘంటసర్పమను పేరుతో తోగవలెనుండి వీపునందలి వెన్నెముకలోని సూక్ష్మరంధ్రముల ద్వారా తంతువులలో నడయాడుచు సహస్రారమను వేయిపత్రములుగల కమలమున వేయిఫణంబుల నేర్పరచుకొని, పద్మకర్ణికకు హరాంతిమున కుండలి వ్యాపింప జేయుచు యజపమున ఎనిమిది అంగుళముల ప్రమాణమున లోనికి పూరించుకొని, పిమ్మట పదిరెండంగుళములు బయటకు రేచనము గావించుచుండును. అట్టి ఒక పూరకమును, రేచకమును కలసి ప్రాణమనబడు చున్నది. ఒక రాత్రి ఒక పగలు చేరి దినమగుచున్నది. మానవుడు అట్టిదినములో 2 16000 ప్రాణములు చేయుచుండును. అట్టిప్రాణములను ఆధారము లగాయితు సహస్రారమువరకు గల అధిదేవతల కర్పణము గావించుచు, ఊర్ధ్వకుండలియందు వ్యాపింప జేసి అధోముఖంబు గన, జంపున రేయింబవలు మరచినది మరువక, ఎరుక మరుపుల కతీతంబై జపమునాచరించును. గాయత్రిఅను నామంబుతో కుడిముక్కు రంధ్రమునుండి ప్రసరించినది సూర్యనాడి యనియు, ముక్కుయొక్క ఎడమరంధ్రమునుండి ప్రసరించునది చంద్రనాడియనియు, ఈ రెండును కలియుచోట త్రికూటంబనియు చెప్పబడుచుండును. మరియు చంద్రనాడికి 'ఇడ' నాడియనియు, సూర్యనాడికి 'పింగళి' నాడియనియు, త్రికూటకమునకు కుంభకమనియు కూడ పిలువబడుచుండును. మరియు ఇడనాడి గంగయనియు, పింగళముయమునగను, కుంభకము

సరస్వతిగను నిరూపించి యున్నారు. మరియు ఇడానాడి కైలాసగిరిగను, పింగళ మందరగిరికను, కుంభకము మహా మేరువుగను యెరుంగవలయును. రేచకము యెరుపువర్ణము గను, పూరకము తెలుపుగను, కుంభకము నలుపువర్ణము గను నుండును. ఈరీతిగ అధిష్టాన స్వరూపంబగు పరమ హంస శరీరంబంతయు వ్యాపించి యొకముఖంబున యజపము ద్వారా బయలువెడలుచు మరల లోనికిం బ్రవేశించు చుండును" అని తెలుప గోవిందయాచార్యుండు సంతసించి మరల తండ్రితో నిట్లనియె. "జనకా! స్వరోదయ సంవత్సర, మాస, వారఫలములను స్వరజ్ఞానము ననుసరించి తెలుసు కొనువిధానం బెరింగింపవే" యని కోరెను. అంత స్వాముల వారు తనకుమారునికి ఆ విషయంబుల గురించి దెలుపనారం భించిరి.

## బ్రహ్మంగారు స్వరోదయ సంవత్సర, మాస వార ఫల ములను స్వరజ్ఞానమునుబట్టి తెలుసుకొను విధానం బెరింగించుట

"కుమారా! సోమ, బుధ, శుక్రవారములు చంద్ర నాడి వారములు, ఆది, మంగళ, గురు, శనివారములు సూర్యనాడి వారము లనబడును. మరియు శుక్లపక్షమున పక్షాంతమున వచ్చు గురువారము చంద్రనాడిగను, కృష్ణ పక్ష పక్షాంతమున వచ్చు గురువారము సూర్యనాడిగను నెరుంగవలయును. సూర్యుని వారములలో ఉదయమున సూర్యనాడి ఆడుచుండిన యెడల ధనలాభమును, శుభ మును, జయమును కలుగును. అట్టినాడి విపరీతంబుగ

నాడుచుండిన యెడల, ఫలితముకూడ విపరీతముగనే యుండును. చంద్రుని వారములయందు ప్రాతఃకాలమునందు సూర్యనాడి ఆడుచుండిన అశుభఫలితములు కలుగును. చంద్రనాడియే యున్న యెడల శుభము కలుగును. సూర్యుని వారములందు ఉదయమున చంద్రనాడి నడచిన అశుభము కలుగునని గ్రహించవలయును. సూర్యనాడియుండిన శుభము కలుగును. చంద్రసూర్యనాడుల పూర్వమందు ప్రారంభించిన కార్యములు జయమగును. చంద్రనాడి బాగుగ నడుచుచున్న సమయమున శుభకార్యములు ప్రారంభించుట శుభకరము. సూర్యనాడి నడచునప్పుడు క్రూరకార్యము లాచరించిన నెరవేరును. అదియునుగాక శుక్లపక్షమున చంద్రుని వారములలో చంద్రనాడి నడుచునప్పుడు ఆరంభించిన శుభకార్యములు విశేష శుభఫలముల నిచ్చును. కృష్ణపక్షమున సూర్యుని వారములలో సూర్యనాడి నడచుచున్న క్రూరకార్యములు ఆరంభించిన తప్పక విశేషఫలము నిచ్చును. చంద్రు డయిదుఘడియలును, పిమ్మట సూర్యు డయిదుఘడియలును సంచరించుచుందురు. ఆవిధంబుగ ఒకదినమున సూర్యుడారు పర్యాయములును, చంద్రు డారుపర్యాయములును దిరుగుచుందురు. వాటిమధ్య పంచతత్వములును, ఉదయాదిగా మొదట నాకాశతత్వంబును, తరువాత వాయుతత్వంబును, పిదప అగ్నితత్వంబును, పిమ్మట జలతత్వంబును, అనంతరమున భూతతత్వంబును, యీరీతిగ సూర్యచంద్రనాడుల మధ్య సంచరించుచుండును. ఆ అయిదుఘడియలలో పృథ్వీతత్వము ఘడియన్నరయు, ఉదకతత్వము ఘడియంబాతికయు, అగ్నితత్వము ఘడియయు. వాయుతత్వము ముప్పాతిక

ఘడియయు, ఆకాశతత్వము అరఘడియయు నీ రీతిగ రాత్రియు, పగలును నడచుచుండును. ఇట్టి విధానము యోగి జనులకును, నియమగరిష్టా సంపన్నులకునే యుండును. అన్యు లకు నీ శాస్త్రము సరిపడదు.

"బిడ్డా! ఇక సంవత్సరఫలము తెలుసుకొను విధానం బెరింగింతును వినుము. సంవత్సరాది అమావాస్య రాత్రి సూర్యనాడి సంచరింపవలయును. చైత్రశుద్ధ పాడ్యమినాడు ఉదయమున చంద్రనాడియు, సాయంకాలము సూర్య నాడియు సంచరించవలయును. విదియనాడు ఉదయమున చంద్రనాడియు, సాయంకాలము సూర్యనాడియు సంచరించ వలయును. తదియనాడును అదేరీతిగ ఉదయము చంద్ర నాడియు, సాయంకాలము చంద్రనాడియు సంచరించవల యును. ఆ విధముగ చంద్రసూర్య నాడులు సంచరించిన యెడల ఆ సంవత్సరం బంతయు యోగదాయకముగ నుండును. పాడ్యమిదినమున ఉదయము చంద్రనాడి లేనిచో ఆ సంవత్సరమున ధననష్టము కలుగునని గ్రహించవలయును. తదియదినమున చంద్రనాడి లేనిచో అనారోగ్యమును, ప్రాణ భయమును కలుగును. చవితిదినమున ఆవారస్వరము లేనిచో కలహములను, ఆప్తబంధు వియోగమును కలుగును పంచమిదినమున ఆవారస్వరము నడవనియెడల రాజమూల ముున భయము, షష్టి దినమున ఆవారస్వరము లేనిచో రోగ భయమును, స్థానచలనమును కలుగును. సప్తమి దినమున ఆవారస్వరము నడవనిచో సంతాననష్టము కలుగును. అష్టమినాడు వారస్వరము ప్రసరించినచో ప్రాణహాని. సూర్యుని వారమందు ఉదయమున చంద్రనాడి ఆడుచుండిన

యెడల, తూర్పు దిక్కుగాగాని, దక్షిణపుదిక్కుగాగాని ఎడమ కాలుపెట్టి ముందునకు మూడడుగులు నడచిన ఆదోషము పరిహారమగును. చంద్రుని వారములయందు ఉదయము సూర్యనాడి ఉండిన పడమరగాగాని, ఉత్తరముగ గాని కుడి కాలుపెట్టి ముందునకు మూడడుగులు నడచిన ఆదోషము నశించి శుభముకలుగును. ఇక సంవత్సరఫలము నెఱుంగు విధానమును తెలుపుచున్నాను వినుము. సంవత్సరాది రోజున ఉదయమున తేజోతత్వంబున్న యెడల ఆ సంవత్సరమున వర్షములు తక్కువగ యుండును, వాయుతత్వమున్న యెడల రోగభయమును, ఆకాశతత్వమున్న యెడల కరువును. పృథ్వీ తత్వమున్నచో పంటలు బాగుగ పండుటయు, జలతత్వ మున్న సౌఖ్యమును కలుగును.

బిడ్డా! ఇక నెలఫలము తెలుసుకొనుపద్ధతి నెఱిగించు చున్నాను వినుము. అమావాస్య, పాడ్యమి, విదియ, తదియలలో చంద్రుడున్న ఆ మాసఫలము జయకరంబుగ నుండును. సూర్యుడున్న అపజయము కలుగును. అప్పుడు తూర్పునకు మూడడుగులు ముందునకు నడచిన ఆ దోషము పోవును. అంతసిద్ధయ్య "గురువర్యా! మీరు గోవిందయాచార్యులకు తెల్పినవిషయంబు లన్నియు గ్రహించితిని. మరణ కాలమును తెలుసుకొను విధాన మేదైనయున్న తెలిపి, నా అజ్ఞానమును బాపరే" అని ప్రార్థించెను

## స్వాములవారు సిద్దయ్యకు మరణకాలమును తెలుసుకొనువిధానం బెరింగింపుట

"బిడ్డా! సిద్దా! సంవత్సర, మాస, పక్షములలో పాడ్యమి నాడు ఉదయంబున శ్వాసను పరీక్షించి మరణకాలమును

తెలుసుకొనవలయును. ఆదినమున ఉదయమున వారస్వర మున్నచో జయమును, ధనలాభమును కలుగును. అందుకు విపరీతముగ నుండిన ఫలితముకూడ విపరీతముగనే యుండును.

సంవత్సరాది దినమున వారస్వరంబు ఆడకున్న మూడు సంవత్సరములలో మరణము కలుగును. ఆరీతిగ వారస్వరము రెండుదినములు వరుసగ లేకున్న రెండు సంవత్సరములకును, మూడుదినములు లేకున్న నొక వత్సరంబునకును మరణం బొందును. ఏదినమునందైనను ఒక పగలును, ఒక రాత్రియు నడువకుండిన మూడు సంవత్సరములలో మరణంబనియు, వరుసగ పదునైదు దినములు సూర్యనాడి నడువకున్న యిక రెండుసంవత్సరములు మాత్రమే జీవించుననియు, మూడు రాత్రులు వరుసగ ప్రాణవాయువు లేకుండిన ఒకసంవత్సరము మాత్రమే జీవించుననియు, చంద్రుడు రాత్రి చాలకాలముండి నను, సూర్యుడు పగలు బహుకాలమున్నను ఆరుమాసము లలో మరణము తప్పదనియు నెరుంగవలయును'' అని తెల్పెను.

అనంతర మొకపుణ్యదినంబున బ్రహ్మంగారు గోవింద యాచార్యునకు ఛాయాపురుష లక్షణంబులు దెలుప నారంభించిరి.

## ఛాయాపురుష లక్షణములు

''వత్సా! మనుష్యుడు తన నాసికాగ్రమున దృష్టి నిలిపి, శిరస్సుపైకెత్తి, నిర్మలముగనుండు ఆకాశమును చూచినయెడల ఛాయాపురుషుడు గానవచ్చును. ఛాయాపురు షుడు కృశించిన శరీరముగలవాడై యగుపడిన ధననష్టమును,

బఱసియుండిన ధనలాభమును, పీతవర్ణంబుగనున్న జయ మును, నలుపురంగుగనున్న మృత్యువును కలుగును. ఎరుపురంగుగా గాన్పించిన రాజ్యలాభమును, శిరము లేనట్లు యగుపడిన యారుమాసములలో మృత్యువును, శరీరమున తూట్లుపడినట్లు గాన్పించిన క్షామంబును, తేజస్సుగనుండిన సుభిక్షంబును, చేతులు లేనట్లు గాన్పించిన సంతాన నష్టమును, అంగ విహీనముగనున్న కళత్రనష్టమును కలుగునని యెరుంగ వలయును.

పైన చెప్పబడిన రీతిగ ప్రతిదినమును అభ్యాసము చేయుచు చూచుచుండిన యెడల భూతభవిష్య ద్వర్తమానం బులు కరతలామలకంబులగును.

బిడ్డా! స్థిరచిత్తం బలనడుటకు ముఖ్యవిషయంబు గొరిం గించుచున్నాను వినుము. సంకల్పసిద్ధిచే కామంబు నశించును. కామవర్జితంబుచే క్రోధంబడుగంటును. అర్థముమీద ఆశను విడచుటవలన లోభము నశించును. భగవద్భక్తిచే భయం బుడుగును ఆత్మానాత్మ వివేకజ్ఞానంబుచే శోక మోహంబులు వదలును. సాత్వికాహార భక్షణాబుచే శాంతంబలవడును. శాంతంబుచే డంబంబు హరియించును, పరోపకారబుద్ధివలన దుఃఖములు తొలగును. భౌతిక శరీరమందాశ వదలుటచే ముక్తికలుగును, సమాధివలన దైవసాన్నిధ్యము లభించును. ప్రాణాయామంబుచే మన్మధచింత తొలగును, శీలంబుచే సమ స్తంబును వశీకరణంబగును. ఇట్టిలక్షణము లన్నియు కలిగి నప్పుడే స్థిరచిత్తం బేర్పడు"నని తెలుపగావిని గోవింద యాచార్యులు సంతోషించినవాడై, అదిలగాయితు తండ్రి

యందు తొల్లింటికంటె అధికభక్తి శ్రద్ధలతో మెలగ నారం భించెను.

## బ్రహ్మంగారు తానదివరలో అవతరించిన తొమ్మిది అవతార విశేషంబులను సిద్దయ్యకు తెలుపుట

ఒకదినమున సిద్దయ్య బ్రహ్మంగారిని కోరగా, ఆయన సిద్దయ్యతో తానదివరలో యవతరించిన నవావతార విశేషంబులను నిట్లని చెప్ప దొడంగెను. "సిద్దా! శిష్యులందరిలో నీవు నాకు ముఖ్యుడవు. దానంజేసి నారహస్యంబులు నీకెరింగించుటకు ఎట్టిఅభ్యంతరమును లేదు. తెలుసుకొననలయునని అభిలాషతో అడిగితివి గాన చెప్పుచుంటిని వినుము. నేను తొలుదొలుత భైరవుండను నామంబుచే బ్రహ్మలోకమును అనేక బ్రహ్మకల్పములుపాలన చేసియుంటిని. అనంతరము రజతాద్రికింబోయి అక్కడ ఏబదిమూడు కల్పములు రాజ్యపాలనము గావించితిని. పిమ్మట కైలాసమును రెండువందల నలుబదిమూడు బ్రహ్మకల్పములు పాలించి, తరువాత వైకుంఠంబునకుంబోయి త్రియోజన ప్రమాణంబున కూర్మసింహాసనం బొందు కల్పించి ముప్పదిమూడు బ్రహ్మకల్పములు రాజ్యపాలనంబుచేసి, పిదప రెండువందల తొంబది బ్రహ్మకల్పములు మాధవస్వామిని గూర్చి తపంబాచరించి, ఆమహాత్ముని కృపబడసి ముక్తిపొంద గలిగితిని. మాధవస్వామి దగ్గర పది దివ్యవర్షములుండి పదిహేనువందల యేబదిపర్యాయములు భూప్రదక్షిణంబు గావించి, సకలవిద్యా కోవిదులైన ఆనందాశ్రితుల ఆశ్రమమునకు బోయి సకలశాస్త్రముల నభ్యసించి, సకలయోగ శాస్త్రంబులను చదివి, 15000 గ్రంథములను

పరిశీలించి, సకలశాస్త్ర రహస్యంబులను నెరింగినవాడనై, మృత్యువును జయించి, యోగబలంబుచే దివ్యశరీరముపొంది మూడువేల మూడువందల ముప్పదిమూడు బ్రహ్మకల్పములుం టిని. మొదటియవతారంబున ఆనందాశ్రితులకు శిష్యుం డనై 99263 బ్రహ్మకల్పములును, రెండవ యవతారం బునకూడ మరల ఆనందాశ్రితులకు శిష్యుడనై 79 బ్రహ్మ కల్పములును, మూడవయవతారమున మరల ఆనందా శ్రితులకు శిష్యుడనై 1,90,00,000 బ్రహ్మకల్పములును నాల్గవ యవతారమున మరల ఆనందా శ్రితులకు శిష్యుడనై 1,000,01,317 బ్రహ్మకల్పములును, అయిదవయవతారంబున 4,14,55,000 బ్రహ్మకల్పములును, ఆరవ యవతారంబున ఆనందాశ్రితులకు శిష్యుండనై 1,38,11,600 బ్రహ్మకల్పము లును, ఏడవ యవతారంబున 27,62,03,400 బ్రహ్మకల్పము లును, ఎనిమిదవ యవతారంబున ఆనందాశ్రితులకు శిష్యుడనై 22,60,000 బ్రహ్మకల్పములును, తొమ్మిదవ యవతారం బున యజ్ఞేంద్రునకు పుత్రుడనై జన్మించి, ఆనందాశ్రితులకు శిష్యుండనై 79,39,36,600 బ్రహ్మకల్పములును, పదవ అవతారంబున కలిగిరి నివాసుండనై ఆనందాశ్రితులకు శిష్యు డనై 70,00,365 బ్రహ్మకల్పములును, పదునొకటవ యవతారమున బనగానపల్లి యందు వీరప్పయాచార్యుడనై 125 సంవత్సరంబు లుండి తపంబాచరించి, కలియుగము 3800 సంవత్సరముల మీదట, సరియగు వికారినామ సంవ త్సర ఆషాడ శుద్ధ త్రయోదశి లగాయితు యిరువదియొక్క వికారినామ సంవత్సరములలోపున వీరభోగ వసంతరాయులను నామంబున నందికొండయందు నవతరింతును.'' అని చెప్పగా

తిలకించినవాడై సిద్ధయ్య ఆనందముచే నుప్పొంగి స్వాములవారికి నమస్కరించి బహువిధంబుల బ్రస్తుతించెను.

అనంతరము స్వాములవారు సిద్ధయ్యతో మరల నిట్లని చెప్పదొడంగెను. "సిద్దా! ధర్మబుద్ధితో ఎవడు సర్వకోరికలను వదలి, జీవాత్మను పరమాత్మయందు చేర్చి ఆనందించుచున్నాడో అట్టివాడే ఆత్మస్థిత ప్రజ్ఞుడగుచున్నాడు. కూర్మము తన అవయవములను వలయునప్పుడు లోపలికి ముడుచుకొను చందమున, నింద్రియములను నింద్రియార్థంబుచే లోబరచుకొనువాడే 'ఆత్మస్థితప్రజ్ఞుం' డనం జెల్లును. ప్రపంచ భోగములయం దాశవదలి కష్టసుఖములయందు సమబుద్ధికలవాడై, యింద్రియంబులను జయించిన యట్టి మనుజుడు 'ఆత్మస్థితప్రజ్ఞు' డగుచున్నాడు. కనుక నీవట్టిస్థిత ప్రజ్ఞుండవై జన్మరాహిత్యంబును బొందు"మని తెల్పెను.

## గోవిందమ్మగారు పోలేరమ్మకు పొంగలిచేయుట

శ్రీ పరంజ్యోతి స్వరూపిణియగు గోవిందమ్మగారు గ్రామంబున స్ఫోటకములుండుటచే, ఆగ్రామదేవతయైన పోలేరమ్మకు పొంగలి చేసిపెట్టిన మంచిదని ఆలోచించెను. ఆగ్రామమునందలి వారదంఱును పొంగలివండి నైవేద్యములు పెట్టుచుండిరి. గోవిందమ్మగారు పోలేరమ్మకు 'చల్ది' నైవేద్యమునిన చాలయిష్టమని తెలచి, పసిబిడ్డలున్న యింటియందు చల్దినైవేద్యము పెట్టుటయే చల్లదనమని, ఒక ఆది వారమున నిల్లంతయు అలికి ముగ్గులుపెట్టి, స్నానముచేసి రాత్రి వండియుంచిన చల్ది అన్నమును పెరుగు పోసి కలిపి, దానిని ఒక విస్తరియందుంచి, మూడు చిన్నరాళ్ళను తీసుకొని వచ్చి,

వాటిని కడిగి పసుపుబూసి కుంకుమ బొట్లుపెట్టి, చల్లగుంజ దగ్గర ఆ రాళ్ళనుంచి, వాటికెదురుగ చల్ది వడ్డించిన విస్తరిని బెట్టి, సాంబ్రాణి పొగవేయునంతలో, బ్రహ్మంగారు యింటికివచ్చిరి. స్వాములవారు వచ్చుసమయమునకు ముందే యీ కార్యంబు నంతయు పూర్తిచేయదలచెను. కాని ఆ దినమున స్వాములవారు ప్రతిదినము యింటికివచ్చు సమయము కంటె కొంచెము ముందుగనేవచ్చిరి. స్వాములవారు లోనికి వచ్చుచుండుట చూచి గోవిందమ్మగారు, ఆరాళ్ళపైనను, చల్దిపైనను ఒకచేటను తీసుకొనివచ్చి బోర్లించెను. అంత స్వాములవారు లోనికివచ్చి గోవిందమ్మగారితో "కాంతా! నేడేదియో నొకకార్య నిమగ్నురాలవై యున్నట్లు కనబడు న్నావే," అని కొంచెము ముందునకుబోయి చల్లగుంజ దగ్గర చేట బోర్లించబడి యుండుటగాంచి, "దానిక్రింద ఏమి కలదో" చూతమని చెప్పుచు, ఆచేటను పైకెత్తుసరికి, దాని క్రిందగలరాళ్ళను, చల్దియు స్వాములవారి కంటబడెను. "స్వాములవారికి చెప్పకనే, యీ నైవేద్యము పెట్టినందుల కేమి ఆగ్రహింతురో యని గోవిందమ్మగారు భయపడసాగిరి. అంత స్వాములవారు "దేవి! ఆచల్దిరాళ్ళకు నైవేద్యము పెట్టితి వెందులకు? ఆ రాళ్ళు అన్నమును భక్షించునా? అని అడుగ గోవిందమ్మగారు "స్వామీ! గ్రామములో స్ఫోటకము లున్నవిగదాయని, అమ్మవారికి చల్దినైవేద్య మనిన ప్రీతికదాయని, మీకు తెలిసిన అంగీకరింపరని, మీకెరింగింపకనే యిట్లు చేసినందులకు క్షమింపుడు." అనెను. బ్రహ్మంగారు ఆ మాటలువిని చిరునవ్వు నవ్వుకొనుచు "దేవి! నీవు

చెప్పకున్న నాకు తెలియదను కొంటివా? సత్యము బయల్ప డక మానునా? నీకట్టి యభిలాషయే యున్నచో నాకెరింగించిన, నేను ఆ పోలేరమ్మనే మనయింటికి భోజనమునకు స్వయముగ రప్పించువాడనుకదా, పోనిమ్ము, ఇప్పుడైనను మించినది లేదు, నీ అభిలాష తీర్చుటయే నాకు సంతోషము. నీవు పోలేరమ్మకు ఏమేమివండి పెట్టదలచుకొంటివో, అవి యన్నియు త్వరితముగ వంటచేయుము. పోలేరమ్మను మన యింటికి భోజనమునకు రప్పింతు"ననెను. అదివిని గోవిందమ్మ గారు ఆనందించుచు "నాథా! ఆమెదర్శన మేర్పడెనచో. మహాభాగ్యముకదా" అని త్వరితముగ స్నానమాచరించి వివిధరకముల పిండివంటలు తయారుచేసి, యిరుగు పొరుగు వారితో యీదినము మాయింటికి పోలేలమ్మ స్వయముగ వచ్చి భోజనముచేసి పోవుననిచెప్పెను. ఆవార్త తృటిలో గ్రామమంతయు వ్యాపించినది. గ్రామమునందలి వారందరును అదివిని ఆశ్చర్యపడుచు, తమతమ పనులు మానుకొని, ఆ విచిత్రము చూడవలయునని గ్రామమునందలి ఆబాలగోపాలము బ్రహ్మంగారి యింటి ముందుకువచ్చి నిలువబడి యుండిరి. ఆ దినముననే కర్నూలు నవాబుకూడా, ఆమార్గమున బోవుచు స్వాములవారి దర్శనము చేసుకొని పోవుదమను తలంపుతో, స్వాములవారి యింటికి వచ్చియుండెను. నవాబు పోలేరమ్మ స్వయముగ బ్రహ్మంగారి యింటికిభోజనముకై వచ్చునని విని "భళీ! నేనును మంచిసమయముననే వచ్చి తిని. ఈ విచిత్రమేమిటో చూచియే పోవచ్చునని, ఆ దినమున బ్రహ్మంగారి యింటివద్దనే యుండిపోయెను. భోజన

సమయమైనది. గోవిందమ్మగారు భక్ష్యభోజ్య చోష్య లేహ్యాది పదార్థంబులు గావించి భర్తకెరిగించెను. స్వాముల వారు తనయింటిముందు నిలువబడియున్న గ్రామస్థులను లోనికిఁబిలిచి, కూర్చుండుడని వారితో నిట్లనియె. "అయ్యా! మీారందరును పోలేరమ్మకు చల్దులు పెట్టితిరికదా? ఆమె ఆ చల్దులను భుజించెనా?" యని అడుగ వారందరును, ఏమి జవాబు చెప్పవలయునో తోచక నవ్వుకొనుచు,ఒకరిముఖము నొకరు చూచుకొన నారంభించిరి.

పిదప స్వాములవారు స్నానంబాచరించి సంధ్యాది అనుష్ఠానముల దీర్చుకొని గోవిందమ్మగారితో "దేవీ! నాకును, కర్నూలు నవాబుగారికిని, శిష్యులకును అందరికిని వడ్డించి పోలేరమ్మకు కూడ ఒక విస్తరివేసి నీవువండిన పదార్థము లన్నియు వడ్డించు"మని చెప్పెను. అంత గోవిందమ్మగారు పతి ఆజ్ఞానుసారము మొదట పోలేరమ్మకు విస్తరివేసి వడ్డించి, తరువాత స్వాములవారికిని గోవిందయ్య, పోతులూరయ్య, ఓంకారయ్య, గిరిరాజయ్య, వీరనారాయణమ్మ, సిద్ధయ్య, నవాబు మొదలగు వారందరకును వడ్డించెను. అప్పటికి స్వాములవారి యింటిచుట్టును జనులు తండోపతండములుగ వచ్చి నిలువబడి యుండిరి. అప్పుడు అందరిని నిశ్శబ్దముగ నుండుడని చెప్పి, స్వాములవారు పోలేరమ్మను తన మనస్సున తలచుకొనగ, పోలేరమ్మ ఒక వృద్ధస్త్రీవలెవచ్చి స్వాములవారిదగ్గర నిలువంబడియె. పోలేరమ్మను చూచి స్వాములవారు "తల్లి! మీాయమ్మ గోవింద నీకొరకు ఏదియో చేసినదట, భుజింపరాదా" అనెను. అప్పుడు పోలేరమ్మవార

లందరితో కలసి భోజనముచేసి, స్వాములవారివద్ద నిలువబడి "తండ్రీ! నాకిక అనుజ్ఞయిచ్చినచో వెడలెద ననెను. స్వాములవారు 'తల్లీ! నేనిక కొలది దినములలో సమాధి నుండెదను. నాద్వితీయపుత్రుడు పోతులూరి యాచార్యులకు నీవలన ఒక యుపకారము కావలసియున్నది, కనుక మా గోవిందమాంబ తన నావస్సున నిన్నుతలంచి నప్పుడు వచ్చి, ఆమెచెప్పునది చేయవలయు"నని కోరెను. పోలేరమ్మయు అందులకు సమ్మతించి, స్వాములవారియొద్ద అనుజ్ఞ తీసుకొని అదృశ్యంబయ్యెను. పిదప కర్నూలు నవాబులేచి నిలువం బడి నమస్కరించుచు, స్వాములవారితో "యోగిపుంగవా! తమ పరిచయ భాగ్యంబుచే నా జన్మపావనంబయ్యె. మీరలు సామాన్యులు గారని తోచుచున్నది. కేవలము భగవంతుని వలె గన్పట్టుచున్నారు. అన్యులకెట్టి సామర్థ్యంబుండునా? తలచినంతనే పోలేరమ్మ స్వయముగవచ్చి, చెప్పిన కార్యమెల్ల జేయుట అన్యులకు సాధ్యమైన విషయమా" అని అనేక విధముల బ్రస్తుతించి, స్వాములవారివద్ద సెలవు తీసుకొని తనదారినిబట్టి పోయెను. స్వాములవారు కేవలము దైవాంశ సంభూతుడేకాని వేరుకాదని గ్రహించి, అట్టి మహాత్ముడు తమ గ్రామమునందుండుట తమ పూర్వజన్మ పుణ్యఫలంబేనని ఆనందించుచు, స్వాముల చేరంజేరి "తండ్రీ! పాపిష్ఠులమైన మా జన్మలు తరింప తరణోపాయం బెద్దియైన యానతీ యరే"యని సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి వినయ విధేయులతో నడుగుచున్న నాపురజనులకు స్వాములవా రిట్లని చెప్పదొడగిరి.

## శ్రీ వీరపరబ్రహ్మ కవచము

### శ్రీ వీర గురువేనమః

శ్లో॥ గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురువే నమః,
అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరమ్
తత్పదం దర్శనం యోగః తస్మై శ్రీ గురువే నమః,

### శ్రీ వీర బ్రహ్మస్తోత్ర మహామంత్రము

అస్య శ్రీ - వీరబ్రహ్మస్తోత్ర మహామంత్రస్య - సిద్ధయోగీశ్వరో ఋషిః ♦ పంక్తిశ్ఛందః - పరంజ్యోతి స్వరూపిణి దేవతా - ఓం బీజం - హ్రీం శక్తిః - హ్రూంకీలకం - మను ధర్మార్థ కామమోక్ష చతుర్విధఫల పురుషార్థ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః,

ఓం అంగుష్ఠాభ్యాంనమః - హ్రీం తర్జనీభ్యాం నమః. క్లీం మధ్యమాభ్యాంనమః - శివాయ అనామికాభ్యాం నమః వీరబ్రహ్మణే కనిష్టికాభ్యాం నమః - ఏవం హృదయాయ నమః - ఓం సర్వశక్తి దామోదర హృదయాయ నమః - హ్రీం - నిత్యంతృప్తి దామోదర నేత్రత్రయాయై వౌషట్- ఓం - హ్రీం - క్లీం - వీర బ్రహ్మణేనమః - అనంత శక్తిసహితే - అస్త్రాయఫట్ - భూర్భువస్సువః - ఓం ఇతి దిగ్బంధః.

### ధ్యానమ్

వీరబ్రహ్మలలితం వీరప్రభాసం సురముని సహితం - సూర్యఖండాంశుధారిం - రిపుగణహారం సద్భక్తరతాం - త్రినేత్రం-పరశివగురులోపం - భద్రకాళీ భస్మం జ్యోతిస్వరూపేణ వీరబ్రహ్మస్వరూపమ్. షడ్వింశతి తత్వరూపం తస్మై శ్రీగురువే నమః

ఓం - హ్రీం - క్లీం - శివాయ - వీర బ్రహ్మణే నమః.

అం పృథ్వీ తత్వాత్మనే గంధం సమర్పయామి-అక్షతాన్ సమర్పయామి.

| | |
|---|---|
| ఓం వీరాయ నమః | ఓం సృష్టిస్థితిలయ హేతుభూతాత్మకాయ నమః |
| ,, వీరాసనాయ నమః | ,, శివాయ నమః |
| ,, వీరాధి వీరాయ నమః | ,, మహేశ్వరాయ నమః |
| ,, వీరేంద్రాయ నమః | ,, సర్వవ్యాపినే నమః |
| ,, వీరభయంకరాయ నమః | ,, శంభవే నమః |
| ,, వేదాంత వేద్యాయ నమః | ,, శశిరేఖాయ నమః |
| ,, వేదవేద్యాయ నమః | ,, సర్వతీర్థగోచరాయనమః |
| ,, వేద గోచరాయ నమః | ,, చతుర్విధ మోక్షఫల ప్రదాయ నమః |
| ,, వీరాగ్రగణ్యాయ నమః | ,, పీతాంబరాయ నమః |
| ,, ఆదిమధ్యాంత రహితాయ నమః | ,, వాసుదేవాయ నమః |
| ,, సూర్య మండల మధ్య వర్తినే నమః | ,, విరూపాక్షాయ నమః |
| ,, సూర్య నారాయణాయ నమః | ,, అభేద్యాయ నమః |
| ,, కపర్దినే నమః | ,, మహాలక్ష్మీప్రదాయ నమః |
| ,, అనంతాయ నమః | ,, నీల లోహితాయ నమః |
| ,, ఆశ్రిత పారిజాతాయ నమః | ,, వీరాచార్యాయ నమః |
| ,, శ్రీ లక్ష్మీవల్లభాయ నమః | ,, శ్రీ గురవే నమః |

అం. ఆకాశతత్త్వాత్మనే పుష్పాణిపూజయామి.
యం. వాయుతత్త్వాత్మనే ధూప మాఘ్రాపయామి.
రం. తేజోతత్త్వాత్మనే దీపం దర్శయామి.
వం. వరుణతత్త్వాత్మనే అమృతం సమర్పయామి.
సం. సర్వాత్మనేషోడశోపచారపూజాం సమర్పయామి.
ఇమం మంత్రమ్ ద్వాదశసహస్రం జపేత్.

## శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారు శిష్యులకు బోధించిన మూలమంత్రము

ఈ పైనచెప్పంబడిన మంత్రములయందు నా మంత్ర పరిమాణముల యందును శ్రద్ధాభక్తులు కలిగి నన్ను స్మరించెడి స్త్రీ పురుషులకు దర్శన మొసంగుదును. ఇదియునుగాక భక్తవరేణ్యులారా! మరియొక రహస్యంబును తెలియజేయుదును. అంతరంగభక్తి గలిగి సావధానంబుగ వినుడు. మాడిమైలయను భేదములేక రేయింబవళ్లు యీద్వాదశాక్షర మహామంత్రమును నేకాగ్రచిత్తంబుగ మనంబున నిల్పి యితర ధ్యానములులేక, యితరులను నమ్మక, కోరికలు చంపి, బుద్ధిస్థిరము జేసుకొని, అంతఃకరణమును అడవిపాలుగావించి, చిత్తమును నుగ్గునుగ్గుగా దంచి, వైరాగ్యంబును మంటలో కాల్చి, అటుపిమ్మట మొరకను మరువక, అంకుశంబున నన్నే డస్సుడు పొడుచుచు నహోరాత్రములు జిహ్వాగ్రమునందు మానక పఠించినవారలకు దర్శనంబిత్తును. యోగినీ శక్తులు మహాప్రళయాంతకములో వారిని నంటజాలవు, కనుక మీరును శ్రద్ధాభక్తులం గలిగి మనస్సును నిలిపి నన్ను స్మరింపుచు నుంటిరేని, సకలమైనపీడలు తొలంగి యఖండైశ్వర్యవంతులైతె

యుండి వీరధర్మమును చూడగలరు." అని ఆశీర్వాదంబుచేసి, మరియు వారినింగని, "భక్తశిఖామణులారా! మరికొన్ని విషయంబులు గలవు. తరువాత తెలియజేసెద" నని చెప్పెను.

క॥ కంది మల్లయ్యః పల్లెను
విందుండై పెంచుచున్న వీరబ్రహ్మం
పొందుగ జెప్పిన వాక్యము
లందరు వినవయ్యు మిగుల నానందమునన్.

శా॥ శ్రీరమ్యంబగు పోతులూరి హరిపై జిత్తంబు గీలించి సం
సారంబీడగ భక్తినిల్పి ఘన సంసారంబునన్మించి పం
ఛారామూండమునిర్వికల్పత నిరుణ్ ధ్యానించి ప్రతింజెదన్
భూరి శ్రీవచ్చోక్తి లిమ్ము కరుణన్ భూనాథ వీరేశ్వరా.

"కలియుగము ౫౦౦౦ సంవత్సరములు అగునప్పటికి దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబు గావించుటకు వత్తును. దుష్టనిగ్రహముకై ప్రళయంబును గల్పింతును. గాని, లోకులారా! యింతటనైనను తెలివితెచ్చుకొని యజ్ఞాన సంబంధమైన బ్రాహ్మణబోధల వినక, దేవబ్రాహ్మణాచార్యులవారి పాదపద్మముల సన్నిధిచేరి వారిమనంబు గరుగ సేవలుజేసి వారి వలన జ్ఞానోపదేశంబు గావించుకొని యోగజ్ఞానములందు నన్నుచూచువారు భక్తితో నుండువారిని తప్పక రక్షింప గలను. దుష్టనిగ్రహము చేయుట తప్పదు. అజ్ఞానమును వదలి కంటికి చీకటిలేనుండు మాయగడపుటకు జ్ఞానమనుజ్యోతిని వెలిగించుకొని యంధకారంబును నాశనంబుచేసి నన్నును, కరుణను పరుపక వెలుగుచు బ్రహ్మాత్ముడై యుండవలయును. అట్టివారి తప్పక రక్షింతును.

## శ్రీ వీరబ్రహ్మంగారు గోవింద యాచార్యులకు పట్టాభిషేకము చేయుట

ఆరీతిగ కొంతకాలము గడచినపిదప వీరబ్రహ్మంగారు సమాధి నిష్ఠయందుండదలచి, తన జ్యేష్ఠకుమారుడైన గోవిందా యాచార్యులను, మఠమునకు అధిపతిగ బట్టాభిషేకము చేయ స్థిరపరచుకొని, ఆవిషయమును భక్తాదు లందరకును దెలుపుటకై తాటియాకులపై శుభలేఖలు వ్రాయించి పంపించెను.

"శ్రీమత్పరమశివ విశ్వబ్రహ్మ పంచాననోద్భవులును, సానగ సనాతన అహభూన ప్రత్నస సుపర్ణగోత్రోద్భవ మనుమయత్వష్ట శిల్పి విశ్వజ్ఞపర వంశోద్భవులును ద్వాదశ దళ మధ్య వేదాంతజ్వాల బింబాయమాన నాదబిందుకళా సందర్శనోత్తర శాంభవీ అమనస్క యోగ విద్యాగరిష్ఠులును శ్రీ విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారు గురు పుత్రులైన లోకాంచల నవఖండ అంగవంగ కళింగ కాశ్మీర కాంభోజ సౌరాష్ట్ర, సింధు, సౌవీర, విదర్భ, విదేహ, బర్బర కేకయ, మహారాష్ట్ర సాళ్వచేద్యాదిచప్పన్న దేశ ములయందుండు దారుతామ్ర శిలాస్వర్ణ కృత్యాద్య అయిదు దాయిల పంచాననము వారికిని, భక్తాది సమస్త జనులకును తెలుపు శ్రీముఖం యేమన-ఈ వైశాఖ శుద్ధసప్తమీ గురువారము న నా జ్యేష్ఠకుమారుడైన గోవిందయాచార్యులను నంది మల్లయ్యపల్లె మఠమునకు అధిపతిగ పట్టాభిషేకము జేసి, నాకుగల ముప్పదిరెండు బిరుదముల నొసంగి, నే వైశాఖ శుద్ధదశమీ భానువారమున నీ లోకంబును విడచి సమాధి

విష్టాగరిష్ట తత్వంబున నుండ నిశ్చయించు కొంటిని, కాన భక్తావళులందరును నరుదెంచి, పట్టాభిషేక మహోత్సవ మును నేత్రానంద సంధాయకముగ నెరవేర్చి, చూచి, నన్నా నందింపజేసి, మదర్పిత చందన తాంబూలాదుల గైకొని నన్ను బరితృప్తునిగ గావింప గోరుచున్నాను.''

ఆ శ్రీముఖంబుగాంచిన వెంటనే దేశదేశములనుండి భక్తులు తండోపతండములుగ నరుదెంచిరి. కందిమల్లయ్య పల్లెయేగాక పరిసర గ్రామములన్నియు పట్టాభిషేక మహో త్సవమును జూడ నరుదెంచిన భక్తాదులతో నిండియుండెను. ఇక చీమకైన చోటులేదను రీతిగ నున్నది. మహమ్మదీయ చక్రవర్తులుగూడ యరుదెంచి, యూరిబయట గుడారములు వైచుకొని యుండిరి. వైశాఖ శుద్ధపంచమి నుండియు కంది మల్లయ్యపల్లె పచ్చని తోరణములతో నలంకరింపబడియెను. ఎందువినినను మంగళవాద్యంబులె. చూచుటకు రెండవ కైలాసమువలె చెన్నొందుచుండెను. వైశాఖ శుద్ధ సప్తమి వచ్చినది. స్వాములవారు వేదవేదాంగ సర్వశాస్త్ర కోవిదు లైన పండితులచే శ్రీ గోవిందయాచార్యునకు బ్రహ్మానంద ముగ శాస్త్రయుక్తముగ పట్టాభిషేకము గావించిరి. ఆ రేయి ఏనుగుపై యంబారీవేయించి, మంగళ వాద్యంబులు మిన్నుముట్ట, తనకుగల ముప్పదిరెండు బిరుద నామావళిని ఒక్కొక్క శిష్యుడు, ఒక్కొక్క బిరుదును జెండాలపై వ్రాయించి, ఆజెండాల చేతధరించి ముందునడువ, నూరే గించి మఠమునకు అధ్యక్షునిగ జేసె.

మరుచటిదినమున స్వాములవారు గోవిందమాంబను బిలిచి "నేనీ వైశాఖ శుద్ధదశమి ఆదివారమున సమాధి

బొంద దలచితినికదా! కనుక నీవు నవమినాడు రాత్రి సిద్ధయ్యను బనగానపల్లెకు బంపి పూజకై పుష్పంబుల దెప్పింపుమని" చెప్పెను. గోవిందమాంబ ఆవిషయంబు సిద్ధయ్య కెరింగింప సిద్ధయ్య మహాప్రసాదంబని, అమ్మగారిదగ్గర సెలవు గైకొని, బనగానపల్లెకు పోవుచు, కొంతదూరముపోయి, స్వాములవారి దగ్గర సెలవుతీసికొనకనే పోవుట న్యాయంబుగాదని తలంచి, మరల వెనుకకువచ్చి, చూచుసరికి స్వాములవారు నిద్రించుచుండిరి. నిద్రాభంగము గావించుటుచితంబుగాదని, నిద్రనుండి మేల్కాంచువరకు వేచియున్న కాలాతీతంబగునని తలపోసి, గురుదేవుని పాదముల నేత్రముల కద్దుకొని నమస్కారంబుజేసి, గురునామోచ్చారణ గావించుకొనుచు, పుష్పార్థమై సిద్ధయ్య బనగానపల్లెకు పయనంబై పోయెను. సిద్ధయ్య భావంబెరింగియు, తాను సమాధిస్థు బొందు సమయంబున లేకుండునట్లుచేసి, సిద్ధయ్య భక్తివిశ్వాసంబులు జగద్విదితంబు గావింపనెంచియే స్వాములవారావిధముగ సిద్ధయ్యను, పుష్పములు తెమ్మని బనగానపల్లెకు బంపిరి.

## బ్రహ్మంగారు సమాధినుండుట

బ్రహ్మంగారు సమాధియందుండ వలయునని చాల కాలముక్రిందటనే నిశ్చయించుకొనిరి. అందువలననే అంతకు మునుపే సమాధిని తయారు చేయించుకొని, అందు ప్రతిదినము యోగనిద్రను జెందుచుండెడివారు. గోవిందయాచార్యులకు పట్టాభిషేకము చేసినది లగాయితు, బ్రహ్మంగారు సమాధిని పొందవలయునని తహతహలాడు చుండిరి. అంత వైశాఖశుద్ధ దశమి ఆదివారము వచ్చినది. ఆదినమున ఉద

యనే గోవింద యాచార్యులకు దగ్గరను బిలచి "నాయనా! నేనీ కందిమల్లయ పల్లెజేరి, మఠమును నొకదానిని కల్పించి అజ్ఞానమునబడి యీదులాడుచున్న మానవులకు జ్ఞానోపదేశం బులు గావించుచు, సుజ్ఞానులుగ జేయుచు, నీరీతిగ నాజీవితము నూటడెబ్బది యైదు (175) సంవత్సరములు గడపితిని. ఇక నీభారము నీపై బెట్టుచున్నవాడ. పామరులకు జ్ఞానోపదేశంబు గావింపుచు ప్రపంచమున ధర్మము నుద్ధరింపు" మనవుడు గోవింద యాచార్యుండు "తండ్రీ! జ్ఞానశూన్యుండనైన నాశిరంబుపై నిట్టి భారంబుంచితిరి. నాకెప్పుడును వేదాంత రహస్యముల మీరు తెలుపక పోయితిరి. సిద్ధయ్య యందుగల ప్రేమాతిశయంబులు, పుత్రులమైన మాపై లేక పోయినది" అని పలుకుచున్న తనయునిజూచి స్వాములవారు "నాయనా! సిద్ధుడన యెవరను కొంటివి? సార్థకనాముడు సుమీ! మనసిద్ధుడు జ్ఞానసిద్ధుడని యెరుంగుము. కేవల ఈశ్వరాంశసంభూతుడు. పూర్వజన్మంబున నొక క్షత్రియునింట జన్మించి గోహత్య నాచరించుటం జేసి, యీపాప పరిహారంబునకై తురుష్కుండై జన్మించె. అయినను బ్రహ్మజ్ఞానియగుటం జేసి నాకు శిష్యుండుగా గలిగె. గురుసేవాధురంధరుండు. ఆతని భక్తి విశ్వాసములు అనంతములు. అద్వైత జ్ఞానసిద్ధుండు. దానంజేసియే అతనికి సిద్ధుండని నామంబు కలిగెను." అనిచెప్పి తానిక సమాధిని ప్రవేశింప బోవుచున్నానని భక్తాదు లందరకును దెల్పెను. స్వాములవారు సమాధిని నుండబోవు చున్నారట. చూడవలయునని జనసమూహంబులు సముద్ర తరంగంబులవలె కందిమల్లయపల్లె చేరుకొనెను. ఆవేడుక చూడవచ్చిన జనము ఇసుకవేసినను

క్రింద రాలకున్నట్లుండెరి. అంత భక్తులందరును చేరి "తండ్రీ! వీర బ్రహ్మేంద్రావతారా! దయామయా! కరుణాసముద్రా! గురుదేవా! వేదాంత వేద్యా! మములనువీడి సమాధినుండ దలచితిరా? యికమమ్ము రక్షించువారెవ్వరు? ఇక నీప్రపంచ మున ధర్మము నుద్ధరించువా రెవ్వరు? తండ్రిలేనిబిడ్డల మగు చున్నాముగదా. అనాచారవర్తనులమైన మాకు జ్ఞానమార్గ మును జూపి, లోకమున ధర్మమును కాపాడిన నీవే లేనప్పుడు మాకీజీవితము లేల" యని అనేకవిధముల విలపించ సాగిరి. బ్రహ్మంగారు ఆరీతిగ విచారించుచున్న భక్తులను గాంచి యిట్లు చెప్పదొడంగిరి.

## బ్రహ్మంగారు సమాధియందు ప్రవేశించుటకు ముందు భక్తులకు కాలజ్ఞానమును వినిపించుట

"బిడ్డలారా! ఇక నేను సమాధియందుండక తప్పదు. కలియుగము 5000 సంవత్సరములపైన దుష్టనిగ్రహ శిష్ట పాలనమునకై వీరభోగవసంతరాయులను నామముతో మరల అవతరింతును. ప్రస్తుతములో నందికొండదగ్గర తపస్సు చేయుచున్న యనమదల వీరభోజ యాచార్యులు నేటినుంచి పదమూడు ఆనందలు గడచిన తరువాత కార్తీక శుద్ధ పాడ్యమీ దినమున సమాధినివదలి వింధ్యపర్వతముల నుండి బయలుదేరి, దివ్యమంగళ విగ్రహముగ ప్రకాశింపుచు, అక్కడనుండు మహాత్ములను వెంటబెట్టుకొని మరల నంది కొండకు వత్తురు. నాతోడ నావామాంబగారి శక్తి కనక దుర్గాంబయై పుట్టును. కలియుగమున 5000 ఏండ్లకుపైన సరియగు నందన సంవత్సరములో కరువొకటి వచ్చును. భూమి గడ

గడ వణకును. నక్షత్రములు రాలును. భూమియందు ప్రజ
లందరును కేలాకు పత్రికను తీసుకొని రామనామమును రాజ్య
ములో దండు తిరుగుదురు. భక్తులారా! కృష్ణదగ్గర ఒక
బ్రాహ్మణునింట హత్యసంబంధమైన కష్టకార్యమొకటి జరు
గును. ఆవు సాక్షిపలుకును.

నేను వచ్చుటకు ముందు కలుగబోవు సూచనలను
ఇంకను మరికొన్నింటిని తెలుపుచున్నాను వినుము. ఏడు
గ్రామము లొక గ్రామంబగును. విరోధి నామ సంవత్సర
ములో లింగాలపాటిలో ఒక శక్తిని బుట్టింతును. ఆ శక్తి
అంకమ్మ అను పేరుతో లోకమంతయు ప్రకాశించుచు
చికాకుపరచి దక్షిణదేశమంతయు దగ్ధపరచి నందికొండకు
చేరుకొనును. ప్రమాదీచనామ సంవత్సరమునకు సరిగ ఎని
మిది సంవత్సరముల వయస్సుగల వాడనై వీరభోజయాచా
ర్యుండనై వెలయుదును. పింగళనామసంవత్సరమున ప్రపంచ
మున కలహములు ప్రారంభమగును. కాళయుక్తినామ సంవ
త్సరమున ధూమకేతువు పుట్టి నందికొండ సమీపమునకు
వచ్చి మాయమగును. పంచాననమువారికి వృత్తులు నశిం
చును సిద్ధార్థి నామసంవత్సరములో ఉద్దంకి సమీపమున
భూమిగడగడవణకును. రౌద్రినామ సంవత్సర ఆషాఢమాస
ములో మహాధ్వనియొకటి పుట్టి నక్షత్రములు రాలును.
పర్వతములు కూలిపోవును. బంగాళాదేశమున కాళిప్రసన్నమై
శక్తిరూపము ధరించి ప్రజలరక్తమును గుటగుట త్రాగును.
పడమర దేశమున మాతంగియను శక్తిపుట్టి ప్రజల కంఠము
లను నులిమి వీరావేశముతో కేకలువేయుచు చెలరేగును.
బెజవాడ గోలుకొండంత పట్నమగును. తూర్పున మూలరం

గమ్మ అనేక క్రిములుపుట్టి అరచుచు తిరుగును. చంద్రగుప్త మహా రాజునకు కలికావతారమూర్తి పాదముసోకి శాపవిముక్తు డగును. ఆకాశమున విషగాలులుపుట్టి ఆగాలివలన రోగ ములుగలిగి కొందరు నశింతురు. తిరుపతి వేంకటేశ్వరునిగుడి యందు మొసళ్లు ప్రవేశించి, మూడుదినములు పూజలులేక మూసియుంచుదురు. తిరువళ్లూరులో వీరరాఘవస్వామికి చెమ టలు పుట్టును. పంచాననమువారందరు మరల పంచాంగ పౌరోహిత్యాదులకు కర్తలగుదురు. మేమువచ్చు కాలము నకు భూమియందీరీతిగ ఎన్నియో అద్భుతములు పుట్టును. నాభక్తులైనవారిని రక్షింతును. నన్ను స్మరించుచుండువారికి సకల ఆపదలు తొలగిపోవును. సకలైశ్వర్యవంతులగుదురు.'' అని భక్తులకందరకును దెలిపిన వారందరును సంతోషించిరి.

పిదప స్వాములవారు భార్యయైన గోవిందమ్మగారిని జూచి ''దేవీ! నేను సమాధియందు ప్రవేశించుటకు కాల మతిక్రమించుచున్నది. నేను సమాధిని ప్రవేశించిన తరువాత నీవు పసుపు కుంకుమమెట్టెలు గాజులు పూసలు తీయకుము. భర్తలోకమునందు లేకపోయినను పసుపుకుంకుమ మానరాదని యెవ్వరైన నిను తూలనాడినయెడల వారు పలుకష్టముల పాలగుచుందురు. ఇది నావాక్యము. దీనిని నీవు ఉల్లంఘించ రాదు. నామఠమున సూర్యచంద్రు లుండునందాక పూజలు జరుగుచుండును. మనవంశము అంత్యమగును. మన వీర నారాయణమ్మ గర్భమున జనియించువారు మాత్రమే, యీ పీఠాధిపత్యము వహింతురు. వారును బ్రహ్మాంశ సంభూతులై ప్రజలచే పూజింపబడుచుందురు. బిడ్డలారా! యిక మీకు నేను తెల్పునదేమియు లేదు. సమాధిని ప్రవేశింపవలసిన

శుభముహూర్తము దగ్గరయగుచున్నది. ఇక విరాకందరకును కావలసిన జ్ఞానోపదేశంబులు గావించుటకు గోవిందయాచార్యుల గర్భమున పంచమహా వీరమాత లుద్భవింతురు. వారు ఈశ్వరమ్మ పార్వతమ్మ శంకరమ్మ, గోవిందమ్మ, గిరిరాజమ్మ యను నామములతో విలసిల్లుదురు. అందు ఈశ్వరమ్మ కేవలము పరమేశ్వరీ యవతారమునియె గ్రహింపుడు. ఆమెనోట నుండి వెలువడు వాక్యములన్నియు అప్పటికప్పుడే దృష్టాంతముగ కనబడుచుండును. నావలెనే ప్రజలకు ఆమె తన మహిమలు చూపును. ఆమె పుట్టుకతోడనే బ్రహ్మజ్ఞాని. భూతభవిష్య ద్వర్తమానంబులు ఆమెకు కరతలామలకముగ నుండును. ఆమె వీరమాతయగును. నావలెనే తుదకు ఆమెయు సమాధిని ప్రవేశించును, నేనేవిధముగ నుంటినో, ఆమెయు ఆరీతిగనే వేరొకమఠమును నిర్మించుకొని యుండును. నాకేరీతిగ పూజలు జరుగుచున్నవో. ఆమెకును అదే రీతిగ పూజలుజరుగును ఆమె మహిమలు వర్ణనాతీతంబులుగ నుండును'' అని వారలకు చెప్పి, సిద్ధయ్యనుగురించి మనస్సున తలచుకొని, నేను సమాధిని ప్రవేశించు సమయమున నీవు లేకుండ జేసుకొంటిని. గురుసేవాదీక్ష పరతత్రుడవైన నీకీర్తి ఆ చంద్రార్కముగ నుండునుగాక! సిద్ధయ్యవంటి శిష్యుడు యీ ప్రపంచమున వేరొకడు జన్మింపడను ప్రకీర్తిని బొందెదవుగాక?'' యని ఆశీర్వదించు నంతలో, గోవిందయాచార్యులు స్వాములవారితో ''తండ్రీ! మీచేతనుండు బెత్తమును, శిఖాముద్రికయు, పాదుకలును, యోగదండమును, కమండలమును, దయతో నాకు ప్రసాదింపు''డని కోరెను,

అంత స్వాములవారు "బిడ్డలారా! అవి మీవికావు, పదిరెండు సంవత్సరములనుండి రేయింబవళ్లు నాకు శుశ్రూష యొనరించి, నన్ను కాచుకొని యుండిన సిద్ధునివి." అని చెప్పి, వాటిని తనకుమారున కిచ్చుటకు నిరాకరించి, బనగానపల్లి నుంచి తిరిగివచ్చిన తరువాత, వాటిని సిద్ధయ్యకొసంగుమని తెల్పెను. అనంతరము తన్ను చూడవచ్చిన జనులందరిని ఆశీర్వదించి, పిమ్మట మౌనముదాల్చి, వారల నందరిని కడ సారిగ ఒక పర్యాయము చూచి, సమాధియందొక గొప్ప యఖండము నిండుగ నేతినిబోసి, అందొక పెద్దవత్తియుంచి వెలిగించుకొని తనప్రక్కనే పెట్టుకొని కలియుగము 4695 సంవత్సరమున అనగా క్రీస్తుశకము సరియైన 1594 సంవత్సరమున సమాధియందు నిష్ఠాగరిష్ఠ తత్వమున సుఖాసీనుం డాయెను. ఆసమయమున భేరీమృదంగాది వాద్యంబులు మిన్నుముట్టినవి. భక్తులు ఆనందగీతలు పాడుచు జై! జై ధ్వనులు గావింపజొచ్చిరి, బ్రాహ్మణోత్తములు వేదపారాయణ గావింపసాగిరి. ఎక్కడచూచినను భజనలు విన వచ్చెను. ఆదినమున నోరులేని జంతువులుకూడ కసువుల దినుట మాని సమాధిచుట్టును దిరుగ నారంభించినవి. అంత సమాధిశిలువులు నియమితకాలమున బిగింపబడెను. "ఆహా! ఆతత్వవేత్త, నిరుపమాన వేదాంతవేద్యుడు, ఆ తండ్రి, దయామయుడు, కరుణాసముద్రుడు, మనకిక కానరాడు గదా" యని ప్రజలు విచారింపసాగిరి. అనంతరము ప్రజలు ఆపరమ పావనుని నామమును తలచుకొనుచు ఎవరిగృహం బులకు వారేగిరి.

## తానులేనప్పుడు బ్రహ్మంగారు సమాధిని ప్రవేశించిరని విని సిద్ధయ్య అరణ్యములో ఘోరముగ విచారించుట

సిద్ధయ్య గోవిందమ్మగారి ఆజ్ఞప్రకారము పుష్పములు తెచ్చుటకై నవమిదినము రాత్రియే బనగానపల్లెకు బయలు దేరెను. కందిమల్లయపల్లెనుండి బనగానపల్లెకు పోవుమార్గము ఒకమహారణ్యము. ఆ మహారణ్యమున పగలు ప్రయాణము చేయుటే కష్టము. త్రోవతెన్నుగానరాని చీకటిలో ఆ మహారణ్య మధ్యమునబడి, గురునామమును స్మరించుకొనుచు సిద్ధయ్య స్వాములవారి సమాధికి పుష్పములు తేవలయునను నుత్సాహముతో పోవుచుండెను. ఆ అర్ధరాత్రి సమయంబున మహావ్యాఘ్ర ఘీంకారములును, సింహశార్దూల వరాహాది యరుపులతో ధ్వని మిన్నుముట్టుచున్నను క్రూరమృగంబుల వాతబడుదు నేమోయను సంశయం బిసుమంతయైనను లేక, కంటకశిలావృతమైన మార్గమునబట్టి పోవుచుండెను. ఇట్లనేక కష్టములబడి సూర్యోదయంబగుసరికి రెండు ఆమడల దూరము మాత్రమే నడువగలిగెను. అరుణోదయమైన వెంటనే కాలకృత్యములు దీర్చుకొని, మార్గమధ్యమున నొక జలాశయమున స్నానంబాచరించి. శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారిని తనమనంబున తలచుకొని మరలనడచుట ప్రారంభించెను.

అంత నా మార్గమధ్యములో శరీరంబంతయు విభూతి యలదుకొని, కంఠమున రుద్రాక్షమాలలు ధరించి, చేతనొక రుద్రాక్షమాలను బట్టి త్రిప్పుచు నొకవృక్ష చ్ఛాయను కూర్చుండి. సిద్ధయ్యకు గాన్పించెను. మౌనము వహించి

తపస్సు జేసుకొనుచున్న నా మునిపుంగవుని పలుకరించిన ఎట్టి అపరాధమో యని. పలుకరింపక సిద్దయ్య తనదారిబట్టి పోవుచుండెను. అంత నా యోగివర్యుండు సిద్దయ్యనుగాంచి "ఓయీ! నీ వెవ్వండవు? ఈ అరణ్యమార్గమున బడిపోవ కారణంబేమి? నీ కేదైన కష్టము సంభవించునచో తెలుపుము. నిన్నా యాపదనుండి విముక్తి గావించెదనని" దయార్దసంబుట్టి పడపల్కుచున్న ఋషిచంద్రునితో సిద్దయ్య యిట్లని చెప్పదొడంగె. "సాధుపుంగవా! నమస్కారములు! మాగురు నానతిప్రకారము పుష్పములు గొని తెచ్చుటకు కందిమల్లయ పల్లెనుండి బనగానపల్లెకు బోవుచున్నాను, నేను జగద్విఖ్యాతి గాంచిన శ్రీ విరాట్పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వాములవారి శిష్యుండను. నా వృత్తాంతమిదియె. ఇంతకు మించిన దేమియులే"దని పల్కెను. అంత నా తపస్వి "ఓయీ! బనగానపల్లి యిచ్చటకు సుమారు పదియామడలకు పైగా నున్నదికదా? నీ వెంత త్వరితముగ నడచినను సూర్యాస్తమయ మగు సరికైనను బనగానపల్లెకు చేరుకొనుట దుర్లభము మీ గురువు. ఈ దినమే సమాధిని ప్రవేశించునంటివే? ఆ సమయమునకు పుష్పములు పట్టుకొని పోగలవా? మిత్రవాడా! పాపము నీవు చూడగా అమాయకుడవువలె గాన్పించుచుంటివి. నీ కొక యుపాయుంబు దెల్పెద వినుము. నీ గురువు అఖండ మహామహిమాన్వితు డంటివే. అట్లయిన నీ వింతదూరము రానేల? పోనిమ్ము. తెలిసియో తెలియకయో వచ్చితివి. ఇక ముందునకుబోక యీప్రదేశంబునగల వృక్షములలో ముండ్లులేని వృక్షమును జూచి, దాని యాకులను నాలుగు గుప్పెడులు కోసుకొని తీసుకొని

హామ్ము. నీ గురుకటాక్షముచే నా పత్రములే మాగురు స్వాములకు కావలసిన పుష్పములగును" అని బోధించెను. సిద్దయ్య ఆమాటల పాటింపక, ఊరక సంభాషణ జేయుచు గాలయాపన మొనర్చు టెందులకని, ఆ మునీశ్వరుని కడ సెలవు తీసుకొని తనదారిబట్టి బోవ నారంభించెను. ఆ రీతిగ ముందునకు నాలుగు అడుగులు మాత్రమే నడచి సిద్దయ్య మరల వెనుకకు జూడగ, ఆ ముని గానంబడడయ్యె. సిద్దయ్య ఆ మునివర్యుని కొరకై నలువంకల బాగుగ పరిశీలించి ఎందును గానక విచారించి. 'ఇంతలో ఏమయ్యెనా? యిది అంతయు ఆశ్చర్యముగా నున్నదే. అని తనమనంబున తలపోసి అదృశ్యుండై యుండనోపునని భావించి, యిదియంతయు గురువరేణ్యులైన శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి మహిమయే గాని వేరుగాదని తలంచి, యుత్తరీయంబును దీసి జోలిగా యమర్చి, ముండ్లులేని ఆకులను వెతికి జోలితో నాలుగు గుప్పెళ్లు వైచుకొని, ఆ మునీంద్రుడు చెప్పిన చొప్పున వెనుకకు మరలిబోవ నారంభించెను. అప్పటికి ఒక జాము ప్రొద్దెక్కినది. మార్గాయాసంబుచే దాహమగుట వలన, సమీపమున నొక జలాశయము గాన్పింప, నెత్తిపై యున్న ఆకుజోలిన గట్టునబెట్టి నీరు త్రాగుటకై జలము కడపంజని, కడుపార నీరంబుద్రావి, మగుడనాజోలయొద్దకు రాగా, సువాసనల గ్రమ్ముచు నాజోలి పలువిధపుష్పంబులతో నిండియుండెను. సిద్దయ్య అదిగాంచి, ఆశ్చర్యముజెంది సంతోషించి "ఇది అంతయు మాగురు సార్వభౌముల కరుణాకటాక్షమేగాని వేరుగాదని స్థిరపరచుకొని, ఆనందించుచు ఆజోలి తలపైనిడుకొని, గురునామమును స్మరించు

కొనుచు, రెట్టించిన వేగంబుతో కందిమల్లయపల్లెకు నడువ నారంభించెను.

సిద్దయ్య ఆవిధంబుగ కొంతదూరము పోవునరికి ఒక వృద్ధబ్రాహ్మణుడు తనకెదురుగ వచ్చుచుండుట గాంచెను. సిద్దయ్య ఆబ్రాహ్మణుని గాంచి, 'ఓ విప్రోత్తమా! మీరెం దుండి వచ్చుచున్నారు?'' అని అడిగెను. అంత నా బ్రాహ్మణుడు ''అయ్యా! నేను బద్వేలు మొదలగు గ్రామాదులలో యాచన చేసుకొనుటకై బోయి, ఆపరిసర గ్రామములలో యాచన చేసుకొని నేను శ్రీ వీరబ్రహ్మంగారు సమాధి నిష్టలో ప్రవేశింప బోవుచున్నారని వినినవాడనై నేడావేడుక కన్నులార చూచి వచ్చుచుంటిని, ఆహా! నాకింతవయస్సు వచ్చినది గాని అట్టివైభవమును నేనెన్నడును చూచియెరుం గను. వైభవమున కేమిగాని, జీవసమాధి పొందుట గొప్ప విశేషముకాదా? జీవసమాధిలో ప్రవేశించు సమయమున భక్తాదులకు, ఆమహనీయుడు గావించిన వేదాంత ఉపన్యాస ములు, భగవంతుడే లేడని వాదించువారల హృదయములను కూడ తారుమారు జేసినవి' అని వర్ణించుచుండ, సిద్దయ్య ''సద్గురూ నేనులేనితరి సమాధి నిష్టయందు గూర్చుంటివా? ఈబ్రాహ్మణుని వచనంబు లసత్యంబేమోగదా! ''ఓయీ! విప్రుడా! నీవు కపటివివలె గావ్పించుచుంటివి. నేను లేని తరి నాగురుండు సమాధిని జెందునా? నీమాటలు సత్యములైనవి గావు, నేను నమ్మువాడనుగాను, పొమ్మ''నెను.

అంత నాబ్రాహ్మణుడు ''ఓయీ! నీవెవ్వరివో నేనె రుంగను. నీవు నమ్మిన నేమి, నమ్మకున్న నాకేమి. ఎందుండి వచ్చుచున్నావని అడిగితివి గావున తెల్పితిని. ఇంతవయస్సు

వచ్చి, బ్రాహ్మణుడనై, నీతో అసత్యము తెలుపవలసినంత అవసరము నాకేల వచ్చినది? పోసమ్మా, నామాటలు విశ్వ సింపకున్న బ్రహ్మంగారు నాకొసంగిన పట్టుశాలువ యిదిగో అక్కడ నాకు దొరకిన సంభావనలివిగో, నాగాయత్రి సాక్షిగ ఆయన సమాధియందు ప్రవేశించెను, ఆయన సమాధిలో ప్రవేశించిన తరువాత, సమాధితలుపులు బిగింపబడిన పిమ్మ టనే, ఆవేడుక పూర్తిగ కన్నులార చూచి, అక్కడనుండి కదలితిని" అని చెప్పెను. అప్పుడు సిద్ధయ్య ఆమాటలువిని, విశ్వసించి నిశ్చేష్టితుడై స్పృహతప్పి, మొదలు నరికిన వృక్షమువోలె నేలపైబడి, ఏడ్చుచు "హాతండ్రీ! తల్లిదండ్రు లను కూడ వదలి నీవే సమస్తంబునని తలపోసి, పండ్రెండు వత్సరములు నిన్నే నమ్ముకొని రేయింబవళ్ళు సేవచేసితినిగదా. కడకు నేనులేనిసమయమున నీవు సమాధిని బొందితివా? ఇక రక్షించువా రెవ్వరు? నీవులేకున్న నాకీ జీవితమెందులకు? ఇంకను చివర ఏదో నాకు తెల్పెదనని ఆశతోనుంటినే, బ్రహ్మ నాలలాటమున వ్రాసిన దింతియే కాబోలును. కన్నబిడ్డల కన్న మిన్నగ గారాబమున జూచెడివాడవే? అయ్యో! నీ ప్రేమఅంతయు ఏమయ్యెనోగదా. నీతో నేనుకూడ సమాధిని పొందవలయునని యనుకొనుచుండెడి వాడను. ఈ అభాగ్యు నకు అట్టి విషయంబెట్లు లభియించును? ఆవేడుకయైన కన్ను లారజూడనిచ్చితివి కాదుగదా. పుష్పములకై నెపంబుజెట్టి బన గాన పల్లెకుబంపి సమాధిపొందుతరి నన్ను లేకుండ జేసితివా? సమాధి పొందునప్పుడు నేనున్న నేనును నీతో సమాధినే యుందునని పట్టుపట్టుదునని గ్రహించితివి కాబోలు? పావన చరిత్రా! ఇక నాజీవితశేషంబు నెట్లుగడుప గలుగుదునో

కదా. ఎవరికెప్పుడు ఎట్టికష్టములు సంభవించునో తెలిసికొనుట దుర్లభముగదా. తుదకు నాబ్రతుకిట్లయ్యెనా 'నీగురువేడీయని అడుగువారలకు ఏమని చెప్పువాడ''నని బహుభంగుల విచారింప దొడంగెను. ఆబ్రాహ్మణుడు సిద్ధయ్య పడుచున్న దుఃఖమునుచూచి జాలిపడి, పోవకాళ్ళాడక అట్లె నిలువంబడి చూచుచుండెను. సిద్ధయ్యదుఃఖమునకు మేరలేదు. నేలపైబడి పొరలిపొరలి కన్నీరు మున్నీరుగా నేడ్చుచున్న సిద్ధయ్యనుగాంచి, ఆభూసురోత్తముడు ''ఓయీ! చూడగా, నీకు మతిబోయినట్లున్నదే. నీవీరీతి విచారించుచున్న ప్రయోజనంబేమి? చేయవలసిన పనికై ఆలోచించుట వివేకము కాదా? ఇదియేనా నీవేదాంతము? వేదాంతులు సుఖదుఃఖములయందు సమత్వముగ నుందురుగదా? నీగురుడు నీకు బోధించిన వేదాంత రహస్యంబులన్నియు నేమయ్యెను? దుఃఖమును ఆపుకొని కర్తవ్య మాలోచించుకొనుము. నీవీరీతిగ నేలంబడి పొర్లిపొర్లి యేడ్చుచున్ననిన్ను నోదార్చువారెవ్వరు.'' అని చెప్పుచు సిద్ధయ్య చూచుచుండగనే యదృశ్యుండయ్యెను.

ఏకాదశ ప్రకరణము సమాప్తము.

---

# ద్వాదశ ప్రకరణము

## సిద్ధయ్య కందిమల్లయపల్లెకు చేరుట

అనంతరము సిద్ధయ్య చెదరిన హృదయమును కొంతవరకు దిట్టపరచుకొని, నేలపైనుండిలేచి, సముద్రపుతరంగంబుల

మాడ్కి పొంగిపొరలి వచ్చుచున్న దుఃఖమును ఆపుకొనుచు, కాలువగ పారుచున్న కన్నీటిని తుడుచుకొనుచు, పుష్పముల మూటను నెత్తినిబెట్టుకొని సద్గురు నామోచ్చారణ గావించు కొనుచు మెల్లగ నడచుచు, ఎట్లో కందిమల్లయపల్లెను చేరు కొనియె.

ఆరీతిగ కందిమల్లయపల్లె చేరుకొని, మఠంబునకుబోవ, సింహద్వార కవాటంబులు బంధింపబడి యుండెను. అంత సిద్దయ్య కవాటంబుల తెరువుడని పెద్దపెట్టున యేడ్చుచు బిలువ నారంభించెను. ఆ కేకలువిని లోపలినుండి ఒక సేవకుం డరుదెంచి "సిద్దయ్యా! గురువుగారు సమాధిని ప్రవేశించిరి. ఇక నీవిచట నుండు నవసరమేమియు లేదు. నీగృహంబునకు యేగుమని శ్రీ గోవిందమాంబగారు నీకు చెప్పమనిరి" అని కవాటములు తెరువకనే జవాబు చెప్పిపోయెను. గోరుచుట్టుపై రోకటిపోటువలె ఆ వాక్యములు సిద్దయ్య హృదయంబును మరింత వేధింపజొచ్చెను. ఆమాటలువిని సిద్దయ్య ఏమియు దోచక కొయ్యవలె నిలువంబడి "జగద్గురూ! తుదకు నాకే నేడిట్టి దురవస్థ సంభవించెనుగదా! ఆ గురుధ్యానమును గావింకొనుచు "మఠములో నుండుమన్నను. దానికైనను నోచుకొన పోయితినిగదా. గోవిందమాంబకైనను నాపై కరుణలేక పోయినదిగదా. ఇక నేను బ్రతికిన ప్రయోజనం బేమి? ఇక నన్ను కాపాడువా రెవ్వరు? ఇక బలవంతముగ నైనను ప్రాణములబాయుటే మంచిది" అని తలపోసి మరల తనలో "ఆత్మహత్య గావించుకొనుట పాతకంబని మున్నొక తరి గురువరేణ్యుండు తెల్పియుండెనే! అయినను బలవంత ముగ ప్రాణములు తీసుకొనుటకంటె స్థిరచిత్తుండనై పంచ

ప్రాణములను బంధించి మనస్సును మారుతంబును నేకంబు
గావించి, షడ్డాధారముల భేదించి సహస్రారమునసిల్పి, అం
తర కుంభకముగావించి పరబ్రహ్మస్వరూపంబు నంద్వైక్యం
బుగావించెదనని సంకల్పించుకొని, యిక నొక యడుగైనను
ముందునకు కదల్పక, సింహద్వారంబువద్దనే, శిరంబును
క్రిందకును, పాదంబులపైకిని బెట్టి, తదేకదీక్షవహించి, తన
మనంబును గురుపాదారవింద ధ్యానమునందే నిలిపి, నిశ్చల
చిత్తముతో ఘోరంబుగ తపంబాచరింపసాగెను. సిద్దయ్య
సింహద్వారము దగ్గర తలక్రిందకును, కాళ్లుపైకిని బెట్టి
తపస్సుచేయుట మొదలుపెట్టెనని సేవకులవలన విని, గోవింద
మాంబయంబున సిద్దయ్యవద్దకువచ్చి చూచి, ఆశ్చర్యపడి,
వీరబ్రహ్మేంద్రస్వాములవారియం దాతనికి గల దృఢవిశ్వాస
మునకు ఆనందించి, "సిద్దా? సిద్దా! ఇంత కఠినముగ తపస్సు
చేయుచుంటివేమి? జరిగినదానికై విచారించిన ప్రయోజనం
బేమి! నీగురువుల సమాధికడకుబోయి, చూచి, తెచ్చిన
పుష్పములతో పూజించి, తీర్థప్రసాదములను పుచ్చుకొని
వెళ్లుమని" చెప్పెను. దీక్షయందుండుటచే మొదట ఆమె
ఎంత పిలచినను పలుకక "వీరబ్రహ్మం" అను గురునామము
తన చెవుల సోకినంతనే, సిద్దయ్యకు స్పృహగలిగి యెదురుగ
చూచునంతలో గోవిందమాంబ కనులకు గానంబడియె.
అంత సిద్దయ్య యథాప్రకారముగ నిలువబడి గోవిందమాం
బకు సాష్టాంగ దండప్రమాణంబు లాచరించి, నిలువంబడి,
దీనవదనుండై "తల్లీ! ఈదీనునిపై నీకైనను కరుణ కలుగ
లేదా? నాగురువర్యుం డెందున్నాడు చూపుము, లేకున్న
బలవంతముగ ప్రాణములు తీసుకొందునని" పల్కుచున్న

సిద్ధయ్యను గాంచి గోవిందమ్మగారు "నాయనా! నేనేమి చేయుగలను? గురువుగారికి నీపై పరిపూర్ణ ప్రేమయేయుండె డిది, కాని పూవులను తీసుకొని నీవు త్వరలో రాలేకపోవుట వలన, తానుసమాధిని ప్రవేశించుటకు ఏర్పాటు గావించు కొనిన శుభలగ్నము దాటిపోవుచుండుటవలన నిన్ను అనేక పర్యాయములు తలచుకొనుచు, యిక జాగుచేసిన లాభము లేదని సమాధిని ప్రవేశించిరి. కనుక నీవా సమాధికడకుం బోయి. దర్శనంబుచేసి, నమస్కరించి, నీవు తెచ్చిన పుష్ప ములతో నాసమాధిని బూజించి, సుఖంబుగ గృహంబున కేగుము. ఆరీతిగ గోవిందమాంబ చెప్పిన వచనములను విని ఆమె పలుకులను గురువాక్యముగ భావించి, తాను తెచ్చిన పూలమూటను శిరంబుపై యుంచుకొని, సింహ ద్వారమును దాటి లోనికింజని, సమాధియొద్దకు బోవుసరికి సిద్దయ్య హృదయమాగక బోరుమని యేడ్చుచు నేలంబడి స్పృహతప్పి పోయెను.

## సిద్దయ్య సమాధిని చూచి దుఃఖించుట

సిద్దయ్య ఆవిధంబుగ సమాధి ముందరపడి, కొంత వడికి సేదదేరి, కన్నులందెరచి చూచి. వలవల యేడ్చుచు నోరును నెత్తియు బాదుకొనుచు, నమస్కరింపుచు "తండ్రీ! దీనమందారా! నన్నుంగడతేర్త వనుకొంటిని. అనంత కోటి బ్రహ్మాండనాయకుండవైన నీకు నన్ను రక్షింప భారమా యెనా? నేనెట్టి దుష్కార్యముల నాచరించి యుడుంగనే. నేయింబవళ్లు నీపాదసేవయేగాని వేరొండేమియు నెఱుంగను కదా! ఇక నీవు నాకన్నులకు కనబడవు కాబోలునే! నన్ను

రక్షించువారెవ్వరు? నేనెవ్వరినాశ్రయింతును? నేను మోహాధ్మాండను గానని నన్ను విడచిపోయితివా? నీ సౌఖ్యమే నీవు చూచుకొంటివి గాబోలు? నా ఆశలన్నియు నిరాశ జేసి ఏఁగితివా?" అని సమాధిచుట్టును తిరుగుచు, ఆడినమాటలే యాడుచు, మరల మరల దుఃఖించుచు "తండ్రీ! నీమహిమలు నేనెరుంగనివాడనా, నీశక్తి సామర్థ్యంబులు నాకుం దెలియ వనుకొనుచుంటివా, నేనీరీతిగ దుఃఖించుచుండుట నీకు తెలియ సిదా? కల్ల. నేను నమ్మను, నన్ను నీదరి జేర్చకున్న నేను జీవించియున్నను ప్రయోజనంబులేదు. ఓ వీరబ్రహ్మేంద్రావతారా! మారుపలుకకున్నావేమి," అని పెదయుంపొద్దు దీనాలాపంబులాడి, విడిగివేసారి, ఆసమీపముననే యొక త్రాడు పడియుండుటగాంచి, దానిని ఒక దూలమునకు కట్టి పిమ్మట తన కంఠమునకు గట్టిగ కట్టుకొని ఉరిబోసుకొని వ్రేలాడజొచ్చెను. అంత ఆత్రాడు తెగి సిద్దయ్య నేలం బడియె గాని, ప్రాణాపాయము మాత్రము కలుగలేదు, పిమ్మట సిద్దయ్య "ఆహా! ఏమిది! యిట్టి వైపరీత్యం బెదును గానమే. ఉరిబోసుకొందుమన్న త్రాడు తెగిపోయెగదా. నేనింకను యీ పాడు ప్రపంచమున కష్టములు అనుభవింప నున్నది కాబోలును. ఈ ప్రక్కనున్న బండరాతిపై తల పగుల గొట్టుకొని ప్రాణముల బాయువాడ" నని మరల తనలోతా నిట్లాలోచించుకొన మొదలిడెను." చచ్చి సాధించునదేమి? యూరక బలవన్మరణమునకు బాల్పడనేల, బ్రతికియుండినను ప్రయోజనంబుగాన్పింపదే? ఎంత ప్రార్థించినను గురువర్యునకు అనుగ్రహము కలుగలేదే? నాయందే దేని లోపమున్నదేమోయన్న, నేనెన్నడును పాపకార్య

ములు చేసి యెరుంగనుగదా? అయినను మరియొకసారి ప్రయత్నించి చూచెదను" అని నిశ్చయించుకొనెను.

పిదప సిద్దయ్య సమాధి కెదురుగ పద్మాసనము వేసుకొని కూర్చొని, తనదృష్టిని నాసికాగ్రమున నిల్పి, తదేక దృష్టితో జూచుచు, చిత్తం బన్యధాయత్తంబు గానీయక "తండ్రీ! సచ్చిదానంద స్వరూపా! సకలలోకారాధ్యా! నిర్వికారా! నిర్వికల్ప! నిర్మలాకారా! నీకివేనానమస్కారంబులు. తెలియక నేనాచరించిన తప్పులు క్షమింపవేడుచున్నాను. అజ్ఞానినైన నన్ను కటాక్షించి నీదరిజేర్పుము. నాకీ ప్రపంచవిషయంబులం దాశలేశంబైనను లేదు. నీవే నాతండ్రివి, నాగురుడవు. నాసఖుడవు, నీవే రక్షింపకున్న, నన్నిక యుద్ధరించువారెవ్వరు? అనుగ్రహించి సాక్షాత్కరించి, నాకు తరణోపాయం బెరిగింపుము, లేకున్న నాప్రాణములు నీకర్పించువాడ!"నని వేడుచు తాను తెచ్చిన పుష్పముల నాసమాధిపై యుంచి, పూజలొనరించి, సమాధిచుట్టును ప్రదక్షిణగావించి, మరల సమాధికి ఎదురుగ కూర్చుండి "తండ్రీ! నేను నిక్కంబుగ శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామికి నిజశిష్యుండనే నైతినేని, నాయందెట్టి లోపంబులు లేనివాడనైతినేని, నిజభక్తుండనేనైన, నీదర్శనభాగ్యంబు నాకు తప్పక కలుగును. లేకున్న పంచప్రాణంబులు బంధించి సహస్రారంబును భేదించి,నాప్రాణంబులనీదరిజేర్చుచున్నా"నని దృఢచిత్తుడై కూర్చుని సహస్రారమును భేదింప నారంభించెను. అంత సమాధినుండి "సిద్దా! అంతటి సాహసం బొనర్పకుము. ఆగుమాగు" మని శబ్దంబు వినంబడియె. సిద్దయ్య ఆశబ్దమును వి[illegible]ంచి, తన ప్రయత్నమును

మరల విరమించి, ఆధ్వని తన గురువర్యుని కంఠధ్వనివలె యున్నదనుకొని, సమాధి తలుపులు దగ్గర చెవిబెట్టి విను నంతలో "సిద్దా! సమాధిపై యుంచిన బండరాతిని తప్పింపు" మని మరల వినంబడియె.

## బ్రహ్మంగారు సమాధినుండి బయటకువచ్చుట

రెండవసారి వినంబడిన శబ్దము స్పష్టముగ తనగురు పుంగవుని కంఠస్వరమే యని గ్రహించి, ఆనందకందళిత హృదయాంతరంగుడై, పేదకు పెన్నిధి అబ్బిన చందమున నుబ్బుచు, అపరిమితో త్సాహముతో సమాధిపై యున్న బండరాతిని, త్రుటిలో తప్పించెను. వెంటనే ఆశ్రిత భక్తవత్స లుండును, శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండను, ఆదిమధ్యాంత రహితుండును నైన శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములు బాలార్కకోటి ప్రకాశ తేజోవిరాజ మానుండై, సమాధినుండి బయటకువచ్చి "సిద్దయ్యా! నీకీ సాహసం బేందులకు? నీ భక్తివిశ్వాసంబులు నే నెరుంగనివాడనా" అని పలుకుచున్న గురుదేవుని పాదంబులపై సాష్టాంగముగా పడి నేత్రద్వయంబునుండి ఆనంద బాష్పములు కాల్వలై పార "దేవా! దివ్యప్రభావా! నిర్మలాకారా! నా చిత్తంబు అన్యథాయుత్తంబు గానీయకుండ భక్తిగలుగంగ జేసి రక్షింపవే! నాయట్టి దీనుల నెందరి బ్రోవలేదు. నీ కృపారసంబు నాపై బరపి నన్ను జన్మజరామరణ ప్రవాహమునుండి రక్షింపుము. దేహేంద్రియాదుల జిక్కి పుత్రమిత్ర కళత్రాది సమ న్వితంబైన యీమాయా సంసారమే నిత్యమని భావించి, నీ మాయకు జిక్కి అనేక జన్మ... చున్నుచు సుఖంబు గాన

లేకున్నారు. నన్నట్టి మాయాయందు దగులనీయక రక్షించి ముక్తి యొసంగుము.'' అని ప్రార్థింపజొచ్చెను.

## బ్రహ్మంగారు సిద్దయ్యకు జ్ఞానోపదేశంబు గానించుట

పిదప బ్రహ్మంగారు సిద్దయ్యతో "సిద్దా! నేను చెప్పబోవు విషయంబులను నిర్మలచిత్తుండవై యాకర్ణింపుము. నీవు వివాహము చేసుకొని, యింకను కొన్ని కష్టసుఖములు అనుభవింప వలసిన యోగమున్నది. కర్మపూర్తియైన నేగాని ముక్తికలుగ నేరదు. హరిహరాదులైనను కర్మానుబద్ధులై యుండకమానరు. నీ విక గృహంబున కేగి తల్లిదండ్రుల ఆజ్ఞానుసారము మెలంగుచు ఒక కన్యను చూచి పరిణయంబాడి రాజయోగివై వర్ధిల్లుము. రాజయోగము శ్రేష్ఠమైనది. జనకాదులు రాజయోగంబు నందుండియే తరింపలేదా! నేనును రాజయోగంబుననే నుండెడి వాడను గదా? నావంశంబు నిర్వాంశంబగును. నీవంశము సుపాత్రము అభివృద్ధిజెందు యోగముకలదు. పుత్రపౌత్రాభి వృద్ధిగల వాడవై రాజయోగంబుననుండి వర్ధిల్ల వలసినదిగ నిన్ను ఆశీర్వదించుచున్నాను. అదియునుగాక నీకు శివోపాస్తాగరిష్ఠుండును, ఆ చంద్రార్క పూజనీయుండును నగు వీరపీరను సుపుత్రుండు కలుగును. అనంతరమున నీవు తప్పక నా సాన్నిధ్యంబును బొందగలుగుదువు," అని తెలుప సిద్దయ్య చింతించుచు "తండ్రి! తమ కరుణాకటాక్షముచే యీ మాంసపిండము మంత్రపిండముగ మారినది. మరల నన్ను వివాహము చేసుకొని యీ మాయా సంసార కూపంబునంబడి మగ్గమనుట న్యాయమా? నా చిత్తం బంగీకరింపదు. నేసి

ప్రపంచకష్టములను భరియింపలేను. వివాహము చేసుకొని సంసార కూపంబునంబడి మ్రగ్గుటకు అంగీకరింపకయే, తల్లి తండ్రులనుకూడ వదలి మీ పాదము లాశ్రయించితిని. ఇంత కాలము మీ పాదసేవచేయుట మరల సంసార కూపంబున బడుమనుటకా? నేను సంసారమును వదలి యిప్పటికెన్ని యో వత్సరములు గడచినవి. మరల అట్టి సంసార మాయలలో బడుటకు యీ సిద్ధుడంగీకరించునని తలంచితిరా? లేక నా నిశ్చలభక్తి పరీక్షింప అట్లనుచుంటిరా? అనుగ్రహించి నాకు మోక్ష మొసంగు''మని పలువిధముల ప్రార్థింపజొచ్చెను.

ఎంత చెప్పినను వినకుండుటంజేసి బ్రహ్మముగారు సిద్ధయ్యతో మరల నిట్లని చెప్పదొడంగెను.

## బ్రహ్మంగారు సిద్దయ్యకు దివ్యదృష్టినిచ్చి విశ్వరూప సందర్శనముగావించుట. సిద్దయ్యబ్రహ్మంగారిని స్తుతించుట

''వత్సా! సిద్ధా! ఈ ప్రపంచమంతయు మాయచేనిండి యున్నది. అట్టిమాయను గ్రహించుటకు బ్రహ్మాదులకైనను తరంబుగాదు. నీవు అంతగా వేడుచుంటివి గావున నీకు దివ్య దృష్టిని ప్రసాదించుచున్నాను. ఇక మాయచే గప్పంబడిన యీ ప్రపంచ మెట్టిదో, పరాపరంబగు పరబయ లెట్టిదో వీక్షింపుము. అట్టి పరబయలునుగ్రహించుటకే యోగీంద్రులు మేకాగ్రచిత్తులై అనేక వేల సంవత్సరములు నన్ను గూర్చి తపం బాచరించుచుందురు.'' అని చెప్పగా సిద్దయ్య పులకి తాంతరంగుడై తన్మయముజెంది తనశరీరమును మరచి,

బ్రహ్మానందమున మునింగి పరవశుండై యుండెను. పిదప స్వాములవారు సిద్దయ్యకొసంగిన దివ్యదృష్టిని మరల గ్రహించిన, సిద్దయ్య మరల లోకజ్ఞానమును పొంది, ఎప్పటి యట్ల నిలువబడి "లోకరక్షకా! ఆశ్రితజనకల్పమందారా! సకలపాపహారణంబై, అనంతకోటి భానుప్రభా తేజోవిరాజ మానంబై, సమస్త జగదధిక గంభీరమై మహామేరు పర్వ తోన్నత సమానంబై, సూర్యచంద్ర సకల గ్రహనక్షత్ర సమస్తాకాశ పరివ్యాప్తంబై, మునీంద్రులకుగూడ నగోచరం బగు నీ దివ్యమంగళ విగ్రహంబును నేను సందర్శింపగలిగితిని. దేవాదిదేవా! నాజన్మతరించెను, ధన్యుడనైతిని నీ నిజ రూపం బిట్టిదని యెన్నడును గ్రహించ నేరనైతిని. దేవతల కును బ్రహ్మేంద్రాదులకునుకూడ చూడ నసాధ్యంబైన నీ విశ్వరూప సందర్శనము, నీ కృపాకటాక్షముచే పొందగలిగి తిని. నేటితో జన్మజన్మాంతరములో నేజేసిన పాపంబులు సకలంబును పటాపంచలైనవి. నామనోరథం బీడేరినది. ఇక నాజీవిత శేషంబు నీపాదసేవ జేసుకొనుచుచుండెద. అనుగ్ర హింపవే" యని అనేకవిధంబుల స్తోత్రంబు జేయ మొదలిడిన, బ్రహ్మంగారు తనవిశ్వరూపమును చాలించి యెప్పటియట్ల సామాన్యరూపము ధరించి సిద్దయ్యకు యిట్లని చెప్ప నారం భించెను.

## బ్రహ్మంగారు సిద్దయ్యకు "ఏఱుక-పరిపూర్ణము"లను గురించి బోధించుట

"బిడ్డా! సిద్దా! శ్రీ కృష్ణభగవానుడు ఉద్ధవునకు తెల్పిన 'పరిపూర్ణ'మును గురించి నీకు బోధించెదను. సావ



జ్ఞాన చిత్తుండవై యూరకుండుము. ఇది బహుళ భావా తీతంబైనది,

శ్లో॥ ఇంద్రజాల మిదం సర్వం యథా మరుమరీచికా.
అఖండితమనా వారం వర్తతే కేవలం శివం॥

కంటికి కనబడు యీ ప్రపంచ మంతయు ఇంద్రజాలమను మాయచే గప్పబడియున్నది. ఎండమావులవంటిది. ఈ చరాచర సృష్టియంతయు మాయయని తెలుసుకొనుము. మాయయే భ్రమకు కారణభూతమగు చున్నది. చతుర్దశ భువనంబులును మాయచేనిండియున్నవి. ఈ ప్రకృతిఅంతయు మాయ. సుఖదుఃఖములు మాయ. అనుభవమందురే గాని యదియును మాయయే. అట్టి యీ మాయకు మూలమనునది లేదు. మాయయే కష్టసుఖములకు కారణమగుచున్నది. భావాభావా తీతతే యచల పరిపూర్ణమని గ్రహింపుము. ఎందును సందు లేక సర్వత్ర నిండి నిబిడీకృతంబైన యీ అచలపరిపూర్ణ మిట్టిదనియు, అదితప్ప యీ ప్రపంచము మరేమియు లేదనియు తెలుసుకొని అగాధజ్ఞానివై యుండుటే పరిపూర్ణమును పొందుట యనబడును, అదియే నిర్మలత్వము. అగాధ విశ్రాంతికిదియె మార్గము. జ్ఞానులు యీ మాయా ప్రపంచ విషయములయందు చిక్కుకొనక, విసర్జింతురని సిద్ధయ్యకు మాయాసంబంధమగు 'మెరుగ' యొక్క ప్రభావంబు నెరింగించెను. మరియు సకలపురాణ పారంగతుడును. వేదాంత శాస్త్రధురంధరుడును, సకల విద్యాకోవిదుండును నగు బ్రహ్మముగారు సిద్ధయ్యతో నీవిధంబుగ దెలుప నారంభించెను. "వత్సా! సిద్ధా! భావాభావంబుల కతీతమైనదే అచలబ్రహ్మ మనబడును. అదియే అచల పరిపూర్ణమని

కూడ పిలువంబడు చుండును. ఈ అచల పరిపూర్ణమే సర్వ సర్వత్రా నిండియున్నది. షడ్వికార రహితంబైనది. మరియు నామరూపక్రియా రహితంబైనది. ఆది అంత్యములు లేనిది. స్త్రీయునుగాక, పురుషుడునుగాక, నపుంసకమునుగాక విలసిల్లుచుండును. ప్రకృతి ప్రపంచముతో సంబంధము లేనిదిగ యుండును. మహాసముద్రమువలె పరిపూర్ణత్వంబు చెంది యుండు పరిపూర్ణాచల సముద్రమును చూడుమని సిద్ధయ్యకు చూపించెను. అంతసిద్ధయ్య ద్వాదశాక్షర మహామంత్రమును జపముచేయుచు స్వాములవారు చూపించిన పరిపూర్ణమును దర్శించి చేష్టారహితుండై చూచుచుండ, స్వాములవారు "బిడ్డా! నిజస్వరూపమును చూచితివికదా? అదియే పరమ పదము. అదియే బట్టబయలు. అందేమియు గాన్పించదు. ప్రకృతి పురుషులు, యీరెండును మాయ. మాయయనగ భ్రాంతి. భ్రాంతివలననే యీచరాచర ప్రపంచంబంతయు తోచుటవలన ప్రకృతియు పురుషుడును లేనివిగనున్నవి. ఈ లేనిమాయాస్వరూపంబగు ప్రకృతిపురుషులు రెండును, భావాభావంబులును, వీనికి అతీతంబులుగు చున్నవి. ఆ రెంటిని గుర్తించుటయే 'ఎరుక' అనబడును. ఎరుకకు మూలము మాయయే. ఇది కంటికి మెరుపువలె గనబడి మాయమగు చుండును. ఎరుకయొక్క సంకల్పమువలననే మోహాది పదవులు, లోకభ్రాంతులు మొదలగునవి కలుగుచుండును. ఇవి అన్నియు అసత్యములు, ప్రకృతిద్వయంబగు మెరుక స్వప్నము వంటిది. స్వప్నమునందు ఏరీతిగ సమస్తవిషయంబులు గానంబడి, జాగ్రదావస్థ కలిగినవెంటనే యేరీతిగ మాయమగునో, అట్లులనే నానారూపంబులుగల యీ సర్వంబును మాయ

మగుచుండును, అసత్యంబగు యీ 'మెరుక'ను విశ్వసింప కుము. ఇది అంతయు ఒక యింద్రజాలము, శరీరమునకు మూలములేదు. అనిత్యంబగు శరీరంబుపై యాశవదలుము. లేనిమెరుకే సత్తు. అదియేచిత్తు. ఆనందస్వరూపముగల సచ్చి దానందము. ఆమెరుకయే నాదబిందుకళలు. అదియే 'అపా జ్యోతి, ఆలేనిమెరుకయే వివిధరూపములుగ భ్రమలు కల్పించు చుండును. ద్వాదశాక్షరి మహామంత్రమే శాశ్వతమైనదియు, సత్యమైనదియు నని మెరుంగుము. ఇంతకుమించిన రహస్యం బేమియులేదు" అని 'ఎరుక పరిపూర్ణ' విషయములను వివ రించెను.

## బ్రహ్మంగారు తనపాదుకలు, యోగదండము, చేతి బెత్తము, శిఖాముద్రికయు సిద్దయ్య కొసంగుట

అనంతరము సిద్దయ్య స్వాములవారిని జూచి "తండ్రీ! భవదీయానుగ్రహంబుచే నాసంశయము లన్నియు తీరినవి. బ్రహ్మజ్ఞానము కలిగి తమ ఆనతి చొప్పున గృహంబునకుం బోయి వివాహముచేసుకొని, సంతానమును బడసి రాజ యోగంబున నుండెద. కాని నామనస్సునందు ఒక్కకోరిక కలదు"అనెను.అదివిని స్వాములవారు "సిద్దా! నీకోరికను నే నెరుంగుదును నీవడుగకముందే వాటినినీకే యీవలయునని జాగ్రత్తచేసితిని"అనిచెప్పితనపాదుకలు, చేతిబెత్తము, యోగ దండము, శిఖాముద్రికయు సిద్దయ్య కొసంగెను. మరియు స్వాములవారు సిద్దయ్యతో యీరీతిగ చెప్పదొడంగిరి.

గీ. ఒకటిఁగొని రెండు నిశ్చలభక్తిఁజేర్చి
మూటినాల్గింటఁ గడు వశ్యములుగ జేసి
యైదిటిని గెల్చి నాఱింటి నణచి
యేడు విడచి వర్తించువాఁడు వివేకధనుఁడు॥

"సిద్ధా! యీ మాయా ప్రపంచమున జాగ్రత్తగ మెలంగవలయును సుమా! గుణహీనులైనను గురువులమను వారును, మేనువిభూతి దట్టముగనలది డాంబికముగ సంచరించువారును, జుట్టును గడ్డమును పెంచుకొని యోగులమని చెప్పుకొను వారును, సాధువులమని ప్రజలను మోసగించు వారును, నాలుకతో మాత్రమె రామకృష్ణయను వారును, గురువులను దూషించువారును, ఉదరపోషణకై ఘనపాటీల మనియు, ఆచార్యులమనియు చెప్పుకొనువారును, పరనింద ఆత్మస్తుతి గావించుకొనువారును, పూర్వాచారముల వదలి సంచరించువారును, తాజెడినకోతి వనమెల్ల జెరచునట్లు తెలియని వేదాంతమును చెప్పి మోసగించుచు, యితరులను శిష్యులుగ చేసుకొనువారును, ఇంద్రియనిగ్రహము లేనివారును, సన్యాసులమని కాషాయవస్త్రములను ధరించి కాంతా కనకంబులపై ఆశ వదలలేని వారును, దారాపుత్రాదులను పోషింపలేక భిక్షాటనమున జీవించుచు దేశదేశముల తిరుగు వారును, ఈ శరీరం బనిత్యంబైనదని వాగుచు తమ శరీరములపై భ్రాంతివీడలేనివారును, యీరీతిగ అనేక విధంబుల మాయవేషంబుబూని తాము చెడుటయేగాక ప్రపంచమును కూడ బాడుచేయుచు చెలరేగుచున్నారు. నీవట్టి అవినీతులను దరికి రానీయక జాగరూకుండవై మెలంగుచు, రాజయోగివై నేనిచ్చిన పాదుకలకు నిత్యము పూజలొనరించుచు, కొంత

కాలమీ ప్రపంచంబు నందుండి సిద్ధుడవని ప్రసిద్ధిగాంచి, అనంతరము నావలె ఒవసమాధిని పొందు''మని చెప్పి తాను యథా ప్రకారముగ సమాధిలో ప్రవేశించి, "వాటముల బంధింపు మని సిద్దయ్యకు తెలిపెను.

అనంతరము సిద్దయ్య బ్రహ్మంగారి ఆజ్ఞ శిరసావహించి సమాధి కవాటముల నెప్పటివలె బంధించి, గురువుగారిచ్చిన పాదుకలు, బెత్తము, యోగదండము, శిఖాముద్రికల తీసుకొని, నేత్రముల కద్దుకొని, సమాధికి ఎదురుగ నిలువబడి నమస్కరించి, అచ్చటనుండి బయలుదేరి, యిక తన స్వగ్రామమైన ముడుమాలకు బోవలయునను సంకల్పముతో శ్రీ గోవిందమాంబ, గోవిందయాచార్య, పోతులూరాచార్యులవద్ద సెలవు తీసుకొనవలయునను తలంపుతో, వారల దగ్గర కేగి నమస్కారముగావించి, తాను స్వగ్రామంబునకు బోవుచుంటినని వారలకుం దెలిపి సెలవు తీసికొని, గురునామంబును స్మరించుచు, ముడుమాలకుబోవు మార్గమును బట్టి నడచిపోవ నారంభించెను.

గోవిందయాచార్య, పోతులూరాచార్యులిద్దరును సిద్దయ్యకు తమతండ్రి యిచ్చిన నాలుగువస్తువులను చూచి, సహించలేక సిద్దయ్యనుండి మరల నావస్తువుల నెట్లయినను తీసుకొనవలయునని దురాలోచనాపరులై ఆగ్రామంబున గల చినబుచ్చిరెడ్డి, పెద బుచ్చిరెడ్డి అను చోరులయొద్ద కేగి సిద్దయ్య మాతండ్రిగారి పాదుకలు, బెత్తము యోగదండము శిఖాముద్రిక మొదలగునవి పట్టుకొని, తన స్వగ్రామమైన ముడుమాలకు బోవుచుండెను. మార్గమధ్యమున సిద్దయ్యను అడ్డగించి ఆ వస్తువులను మాకు తెచ్చి యిచ్చిన,

మీయిరువురకును మంచి బహుమాన మిత్తు''మని పల్కిరి. అంత ఆదొంగలు సరే యిదెంతపని! సిద్దయ్యనా? అని వెంటనే బయలుదేరి, ముడుమాలకు బోవు మార్గమున బోవ కొంత దవ్వుడుగు సరికి సిద్దయ్య గురు నామోచ్చారణగా వించుచు బోవుచుండుట జూచిరి. అప్పు డాదొంగలు సిద్దయ్య వెనుకకుబోయి, తల బ్రద్దలు కొట్టవలయునని, తమ చేతులయందలి దండంబుల బైకెత్తుసరికి, స్వాములవారు వ్యాఘ్రరూపము ధరించి వారి ఎదుట గాన్పించెను. ఆవ్యాఘ్రమును చూచి ఆదొంగలు భయంబుచెంది, వెనుకకు మరలి భయంబున గ్రామంబులో బ్రవేశించి, ఆయుదంతంబు గోవిందయాచార్య, పోతులూరాచార్యుల కెఱిగించిరి. సిద్దయ్య వెనుకకు తిరిగి చూచు సరికి, మరల ఆదొంగలు గాని, వ్యాఘ్రంబుగాని గాన్పింపదయ్యె. అది అంతయు స్వాముల అనుగ్రహమేగాని వేరుగాదని గ్రహించి, సిద్దయ్య గురునామమును స్మరించుకొనుచు కొంతపడికి ముడుమాల జేరుకొనెను. సిద్దయ్య తల్లిదండ్రులు దైవానుగ్రహముచే తమ కుమారుడు మరల స్వగృహంబునకు తిరిగి వచ్చుట గాంచి, అపరిమితానందమును బొందిన వారలైరి. సిద్దయ్య తల్లిదండ్రులకు నమస్కరించి నిలువంబడిన, తల్లిదండ్రు లిరువురును తమ తనయుని కౌగలించుకొని ఆనందబాష్పములు విడువసాగిరి. అనంతరము వారు ఒక కన్యను చూచి సిద్దయ్యకు వివాహము గావించిరి. కాలక్రమంబున సిద్దయ్యకు సంతానము కలిగెను. ఆకీలగ గురువుల ఆజ్ఞ ననుసరించి సిద్దయ్య రాజయోగము నందుండి, గురువుగారొసంగిన పాదుకలు, బెత్తము, యోగదండము, శిఖాముద్రిక అను

ప్రత్యేకముగ నొక గదియందుంచి, వాటికి నిత్యము నైవేద్యము, దీపారాధన గావింపుచు పూజలుజేయుచు శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాముల నామమును సదా స్మరించుచు సుఖముగ నుండెను.

ద్వాదశ ప్రకరణము సమాప్తము

# త్రయోదశ ప్రకరణము

## గోవిందమ్మగారు వనిపెంట, మునిమడుగు విశ్వబ్రాహ్మణులను శపించుట

బ్రహ్మంగారు సమాధి ప్రవేశించి పదిమాసములైనది. శిష్యులను ఒకపర్యాయము చూడవలయునని, పోతులూరయ్య సంచారమునకు బయలుదేరి వనిపెంట యనుగ్రామమును చేరుకొని, తమరాక నెరింగింపుచు, ఆగ్రామమందలి విశ్వబ్రాహ్మణుల కడకు శిష్యులను బంపెను. ధనమదాంధతచే యుక్తాయుక్తజ్ఞానము లేనివారై, ఆయూరియందలి విశ్వబ్రాహ్మణులందరును నొకచోజేరి "బ్రహ్మంగారు సమాధిప్రవేశించి నేటికి పదిమాసము లైనదిగదా, ఆయన యింకను జీవించియేయుండునా? గోవిందమ్మగారు మన కులాచారము ననుసరించి పసుపు కుంకుమ గాజులు పూసలు మెట్టియలు వదలకపోవుటకు కారణమేమి? ఆమె యింకను ముత్తైదువగనే యుండుట విరుద్ధముకాదా! ఆమె వాటిని తీసివేయువరకు వారిచ్చు తీర్థప్రసాదములను స్వీకరింప

రాదని," తీర్మానించుకొని, పోతులూరి యాచార్యస్వాముల వారి శిష్యులతో తమ తీర్మానమును తెలుపుచు వర్తమాన మునంపిరి. అంత శిష్యులు పరుగున పోతులూరియాచార్యుల కడకుంబోయి, ఆగ్రామమందలి విశ్వబ్రాహ్మణులు పంపిన వర్తమానము నెరిగింప, ఆయన పాదతాడిత భుజంగంబు వోలె మండిపడుచు, ఆగ్రామమును వదలి వెంటనే, ఆ సమీపముననే యున్న 'మునిమడుగు' గ్రామమునకు బయలుదేరి వెళ్ళెను.

మునిమడుగు విశ్వబ్రాహ్మణులుకూడ ధనమదాంధులై, భక్తిజ్ఞాన వైరాగ్యములు లేనివారై సంచరించుచు, అందరు నొకచోగూడి గోవిందమ్మగారు పసుపు కుంకుమ గాజులు పూసలు మెట్టియలు ఉపయోగించుట వదలిననేగాని వారిచ్చు తీర్థ ప్రసాదములను గైకొనరాదని వనిపెంట గ్రామమునందలి విశ్వబ్రాహ్మణులు తీర్మానించుకొనిన రీతిగనే తీర్మానించుకొనిరి. పోతులూరి యాచార్యులవారే స్వయముగ బయలుదేరి వారి గృహముల కేగినను, ఆయనను పలుకరించి మాట్లాడువారే గాన్పింపరైరి. ఆచార్యులవారు శాంతిని వహించి 'నాయనలారా! గురువులమైన మమ్ము మీరందరు యీరీతిగ నిరాదరణగ జూచుటకు కారణమేమి'' అని అడుగ, వారందరు తాము తీర్మానించుకొనిన విషయమును ఆయన కెరిగించిరి. అది విని పోతులూరి ఆచార్యస్వామి వెంటనే మునిమడుగు నుండి బయలుదేరి, మట్ట మధ్యాహ్న మగుసరికి కందిమల్లయ్యపల్లెకు చేరుకొని, గృహంబునకుంబోయి, తల్లినిగాంచి "అమ్మా! నేనొక విషయంబు నిన్నడుగ దలంచితిని. మాతండ్రిగారు సమాధి ప్రవే





శించి నేటికి పది మాసంబులైనది గదా, యింకను ఆయన జీవించియే యున్నారని తలంచుచుంటివా? నీవు వైధవ్యమును పాటింపక, గాజులు, పూసలు, పసుపు, కుంకుమ, మెట్టెయలు యింకను ధరించుచుండుటవలన, వనిపెంట విశ్వబ్రాహ్మణు లును, మునిమడుగు విశ్వబ్రాహ్మణులును మన మొసంగు తీర్థప్రసాదములను స్వీకరింపరాదని తీర్మానించుకొనిరి. ఇందులకు యిప్పుడు మనమేమి చేయవలయునో చెప్పుము'' అని గద్దించి అడిగెను. ఆమాటలు వినినదై గోవిందమాంబ కన్నుల వెంట నీరుగార్చుచు, కోపంబున కన్నెఱ్ఱజేసి "ఓరీ! పోతులూరి యాచార్యా! కన్నులుగానక 'వనిపెంట' 'మునిమడుగు' విశ్వబ్రాహ్మణులు పల్కిన పల్కులు వింటిని. 'వనిపెంటవాండ్లు వల్లకాడగుదురు' 'మునిమడుగువాండ్లు ముదనష్టమగుదురు''రని శపించెను. అప్పుడామె వారినావిధముగా శపించి పోతులూర యాచార్యులను చూచి "నాయనా! నీకు చిన్నతనము. మీతండ్రిగారు శక్తిసామర్థ్యంబుల గ్రహింప లేవు. ఆయన యింకను జీవించియే యుందురు. జననమరణము లాదునవంటవేరవు సమాధిని ప్రవేశించుటకు ముందు మీనాయన నాతో "నేను సమాధిని ప్రవేశించితినని పసుపు, కుంకుమ, గాజులు, పూసలు, మెట్టెయలు వదలి వైధవ్యము నవలంబింపవలదని ఆనతిచ్చిరి. ఆయాజ్ఞను తిరస్కరించుట అధర్మమని నేను వాటిని ధరించుచున్నాను. కన్నులుగానక వనిపెంట, మునిమడుగుల విశ్వబ్రాహ్మణులు పలికిన విషయంబులు వారి వినాశకాలమునకేయని యెరుంగుము లేకున్న వారికట్టి విపరీతపుబుద్ధి పుట్టునా!'' అని చెప్పెను. అది విని పోతులూరి ఆచార్యులు "తల్లి! నీకట్టి అభిప్రాయము దృఢ

ముగ నున్నచో సమాధి తలుపులు బ్రద్దలుకొట్టి నాయన గారు జీవించియుండిరో లేదో పరీక్షింతును. లేకున్న నీ మాటలు విశ్వసించువాడనుగాను నేను.

## పోతులూరి ఆచార్యులు సమాధిని పగులగొట్టి చూచుట సమాధిని పగులగొట్టినందులకు బ్రహ్మంగారు కుమారుని శపించుట.

గోవిందమాంబ పోతులూరి ఆచార్యులతో "బిడ్డా! నీవు సమాధిని పగులగొట్టవలదు. మీతండ్రిగారి అనుజ్ఞ లేనిదే సమాధిని పగులగొట్టిన ప్రమాదము సంభవించును. నీతండ్రి శక్తిసామర్థ్యంబులు నీవు గ్రహింపలేకున్నావు. నా మాటలు విశ్వసింపకున్న, సిద్దయ్యవద్దకేగి, నీ అభిప్రాయ మాతని కెరింగించి, అతడు చెప్పినచొప్పున చేయుము. సిద్దయ్య నీకంటె పెద్దవాడు. మీదుమిక్కిలి నీతండ్రికి ప్రాణ సమానుడు" అని చెప్పెను. పోతులూరి ఆచార్యులు వెంటనే బయలుదేరి కందిమల్లయ్యపల్లెకు సుమారు పదిమైళ్ళ దూర ములోనున్న ముడుమాలకేగి సిద్దయ్యతో "సమాధిని తెరచి మానాయనగారినిచూడవలయునని కోరికగానున్న" దని తన అభిప్రాయ మెరింగించెను. సిద్దయ్య అందుకు కంగీకరింపక "అయ్యా! మీనాయనగారి మహిమలు నీ వెరుగవు. తొందరపడి సమాధిని తెరచితివా నీకు శాపంబిచ్చును. నామాట వినుమ"ని చెప్పెను. పోతులూరి ఆచార్యులు మరల గృహంబునకు తిరిగివచ్చి సిద్దయ్య మాటలనుకూడ లెక్కచేయక, ఒకనాటిరాత్రి అందరును నిద్రించుచున్న సమయమున అర్ధరాత్రియందు గడ్డపారను తీసుకొని సమాధి

పైనున్న బండను బలవంతముగ పెకలించి, సమాధిలో ప్రవేశించి తండ్రిని 'నాయనా! నాయనా! అని పలుకరించి చూచెను. నిర్వికల్ప సమాధియందున్న ఆ బ్రహ్మేంద్రుడు, పోతులూరి యాచార్యుడు ఎన్నివిధముల ప్రయత్నించిచూచి నను పలుకలేదు. కొంతవడికి బ్రహ్మంగారు స్పృహగలిగి "ఓరీ! నా అనుజ్ఞలేనిదే సమాధిని పగులగొట్ట సాహసించిన దెవరు" అని వెనుకకు చూడగా పోతులూరి యాచార్యులు గానంబడిరి. అంత ఆచార్యుడు గడగడ వణకుచు "తండ్రీ! నిన్ను చూడవలయునని భ్రాంతితో యీ అపచారమును జేసి నందులకు క్షమింపు"మని వేడెను. బ్రహ్మముగారు కుమారుని జూచి "ఓరీ! పోతులూరా! నీవేనా యింతపని చేసినది? కుమారుడవుగాన క్షమించుచున్నాను, అయినను నాఅనుజ్ఞ లేనిదే సమాధిని పగులగొట్టిన పాపపరిహారమునకై, నీవు నీ భార్యసహితముగ బయలుదేరి మలమీద పల్లెదగ్గరయున్న ఒక పర్వతంబుపై, పూతయు కాయములేని చింతచెట్టుక్రింద చెరువుగట్టున కూర్చొని పంద్రెండు సంవత్సరములు తపంబాచ రింపుము. కొంతకాలమునకు ఆచింతచెట్టునకు ఒక్కకాయ కాచి పండును; ఆపండు నీచేతియందు దేపడును. అప్పుడు నీవు తపస్సుచేయవలసినకాలము పూర్తియైనదని గ్రహించి, ఆపం డును భక్షించి పిమ్మట గృహంబును చేరుకొని నావలెనే జీవ సమాధిని పొందుము" అని చెప్పి మరల యెప్పటివలెనే నిష్ఠ యందు కూర్చుండి, కుమారునితో "బండనుమూసి" వెడలు మని చెప్పెను. పిదప పోతులూరి ఆచార్యులు సమాధినుండి బయటకువచ్చి బండనుమూసి గృహంబునకుబోయి, నిదు రించుచున్న తల్లినిలేపి జరిగినవిషయం బంతయు తెలిపెను.

గోవిందమాంబ తన కుమారుని అవివేకమునకు విచారించి "నాయనా! నామాట వినకపోయితివి. సిద్దయ్య చెప్పినను లక్ష్యము చేసితివి కాదుగదా. నేడిట్టి శాపము అనుభవింప వలసి వచ్చినది. బ్రతికియుండియు నేనేమిచేయగలను? నీ తండ్రి సామాన్యుడుకాడు. శాపము అనుభవింపక తప్ప"దని తన మనంబున పోలేరమ్మను తలచుకొనెను. అంత పోలే రమ్మ బాలికవలె ప్రత్యక్షమై "తల్లీ! నన్ను తలచుకొనిన కారణమేమి"యని యడుగ గోవిందమాంబ "తల్లీ! మా పోతులూరయ్య తండ్రి శాపమువలన తపంబాచరింప బోవు చున్నాడు. నీవాయరణ్యమున నాబిడ్డను కాపాడుచుండవల యును. ఆభారమంతయు నీపైనుంచుచున్నాను. కంటికి రెప్ప చందమున యీపండ్రెండు సంవత్సరములు నా తన యుని సంరక్షింపవలయును. తిరిగి నాబిడ్డను యిల్లు చేరువరకు వానిని రక్షించు భారము నీదే"యని తెలుప, పోలేరమ్మ "తల్లీ! అదెంతపని, తప్పక అవిధముగనే కాపాడుదు"నని చెప్పి యదృశ్యురాలయ్యెను.

## పోతులూరి యాచార్యులు తపంబాచరింపబోవుట

అనంతరము పోతులూరి యాచార్యులు తల్లిగారొద్దను, అన్నయైన గోవిందయాచార్యుల వద్దను సెలవుతీసుకొని, భార్యాసహితంబుగ బయలుదేరి, తపస్సుచేసుకొనుటకై మల మీదపల్లె దగ్గరయున్న పర్వతసమీపమున, నొక కొలను గట్టున చింతచెట్టు క్రిందకు చేరెను. నిత్యము ఆకొల నులో స్నానంబాచరించుచు ఆచింతచెట్టు క్రింద కూర్చొని తపస్సు చేయుచుండెను, పోలేరమ్మగొల్లపడుచువలె తయారై

ఉదయము నాటసంకాలము నిత్యము వచ్చి పోతులూరి యాచార్యులకు కావలసిన పాలుపోసి పోవుచుండెడిది. తపస్సు పూర్తి అయినది. ఒకదినమున పోతులూరయ్య పాలుపోయు టకువచ్చిన మారువేషంబుననున్న పోలేరమ్మను చూచి "అమ్మా! మాకు యీపండ్రెండు సంవత్సరములును విడువక నిత్యము పాలుపోసి కాపాడితివి; నీఋణము తీర్చుకొనలేము. నీవు యింతకాలము పోసిన పాలకు ఎంతసొమ్ము యీయ వలెనో తెల్పు"మనెను. పోలేరమ్మ "అయ్యా! నేను పోలేరమ్మను. నన్ను మీతండ్రిగారి మఠంబున స్థాపించు"మని కోరెను. పోతులూరయ్య అదివిని "తల్లీ! నీవు మాతండ్రిగారి మఠమున నుండుటకు వీలులేదు. నీకు జాతరలు జరుగవలసి యుండునుకదా" యని చెప్పి పోలేరమ్మనుకూడ వెంటబెట్టు కొని, కందిమల్లయ్యపల్లెకు సమీపమునగల నొక వేపచెట్టు వద్దకువచ్చి "తల్లీ! నీవీ వేపచెట్టుపైనుండుము. ప్రతి సంవత్స రమును వైశాఖశుద్ధ దశమిదినమున నాయనగారికి ఆరాధ నలు జరుగును. ఆమరుచటిదినమున ఏకాదశినాడు నీకు పొంగళ్ళువండి పెట్టి జాతరలు చేయుచుండు"రని చెప్పెను. అప్పటినుండియు పోలేరమ్మ మాలమీద పోలేరమ్మ యనియు, కనుమపోలేరమ్మ యనియు పిలుపబడుచుండెను. ఆవిధముగనే పోలేరమ్మకు వైశాఖశుద్ధ ఏకాదశినాడు పొంగళ్ళు వండి, నైవేద్యముపెట్టి, జాతరలు చేయుచున్నారు. శ్రీగోవిందమ్మ గారు శపించిన విధంబుగ మునిమడుగు వనిపెంట గ్రామము లలో విశ్వబ్రాహ్మణులు నామరూపములు లేకుండబోయిరి. వారివంశములు నిర్మూలనంబులైనవి. ఆ రెండు గ్రామములం దును యిప్పటికిని విశ్వబ్రాహ్మణులు నివసించుటకు భయపడు

చుండురు. ఎవరైనను సాహసించి నివసించినయెడల, వారి కనేకరీతుల కష్టములు సంభవించి, చివరకు వంశక్షయము కూడకలుగుచున్నది. అది లగాయతు ఆ గ్రామములలో నేటివరకు మహమ్మదీయులును, మరాఠీలును కంచరపనులు చేసుకొని బ్రతుకుచున్నారు. వనిపెంట, మునిమడుగు గ్రామములనుండి నేటివరకు ప్రతిసంవత్సరము శ్రీ బ్రహ్మంగారి ఆరాధనకు కంచరపని చేయువారందరు నేతిబుంగలు, నూనె బుంగలు మఠమునకు తెచ్చుచుందురు. శివరాత్రికి కూడ ఆ గ్రామమునుండి మఠమునకు అనేక కానుకలు వచ్చుచుండును.

## సిద్దయ్యగారి మహిమచే సర్పదష్టుడై మరణించిన తిమ్మారెడ్డి బ్రతుకుట

సిద్దయ్య ముడుమాలయందు సదా గురుధ్యాన తత్పరుడై కాలము గడుపుచుండెను. సిద్దయ్యయొక్క భక్తివిశేషంబులను ఆ గ్రామమందలివారు గ్రహింపలేక పోయిరి.

ఒకదినమున ముడుమాలకు రెండుమైళ్ళ దూరమున గల నొకపల్లెనుండి తిమ్మారెడ్డియను నొకడు, సర్పంబు కాటువేయుటచే నోట నురుగలుగ్రక్కుచు వచ్చుచుండెను. ఎన్నిమందులు వేసినను, ఎన్నిమంత్రములు వేయించినను అతనికి బాధ తగ్గలేదు. కొన్నిఘడియల అనంతరము నురుగ అధికమై మరణించెను. తిమ్మారెడ్డితల్లిదండ్రులును, ఆలుబిడ్డలును దుఃఖింపసాగిరి. అంతవారి బంధువులువచ్చి "చనిపోయినవానికై ఎంత విచారించినను ఫలమేమున్నది? మరల బ్రతుకునా? లేలెండని" దుఃఖోపశమన వాక్యంబుల బలికి, దహన సంస్కారమునకై తిమ్మారెడ్డి శవమును కాటికి తీసు

కొని పోవలయునని ప్రయత్నము చేయుచుండిరి. అంతలో సిద్ధయ్యగారు ఆమార్గమున బోవుచు, తనకుకొంచెము పరిచితుడైన తిమ్మారెడ్డి శవమును అతనిబంధువులు వీధిలో బెట్టుకొని యేడ్చుచుండుట చూచి, దహన సంస్కారమునకు ప్రయత్నించుచుండుటగ్రహించి, వారికడకుంబోయి "అయ్యా! తిమ్మారెడ్డి నాకుపరిచితుడు. మరణించుటకు కారణంబే"మని యడిగెను. అంత రెడ్డితండ్రి సిద్ధయ్యతో, "అయ్యా రాత్రి పాముకరచినది. రాత్రిఅంతయు నోట నురగలు గ్రక్కుచునే యుండెను. ఎన్ని మంత్రములు వేయించినను, ఎన్ని మందులు వేసినను తగ్గలేదు. సూర్యోదయమైన వెంటనే మరణించె" నని చెప్పెను. సిద్ధయ్య శ్రీవీర బ్రహ్మేంద్ర స్వాములవారి వలన 'సూర్యోపాసన' మహామంత్రమును గ్రహించియున్న వాడు గావున, జలంబుల దెప్పించి పాదప్రక్షాళనముగావించు కొని ఆమంత్రమును జపింప నారంభించెను. కొంతవడికి ఆరెడ్డి కొంచెముకదలి, నేత్రపుటంబుల కొంచెముపైకెత్తి చూడ నారంభించెను. సిద్ధయ్యగారు ఆరీతిగ మరికొంత సమయము జపముచేయుసరికి రెడ్డి లేచి కూర్చుండెను. అంత నా గ్రామవాసులందరు సిద్ధయ్యగారికి నమస్కరించి 'అయ్యా! నేటివరకు మీశక్తిసామర్థ్యంబులు గ్రహించలేక పోయితిమి, మీ అనుగ్రహముచే తిమ్మారెడ్డి బ్రతికెను" అని అనేకవిధంబుల బ్రస్తుతించిరి. అదిలగాయితు ముడుమాల గ్రామవాసులే గాక, ఆపరిసరగ్రామములం దుండెడివారందరును సిద్ధయ్యగారిని భగవంతునిగ భావించి గౌరవించు చుండెడివారు.

## సిద్దయ్యగారు గోవిందశాస్త్రికి బ్రహ్మోపదేశంబు గావించుట

సిద్దయ్యగారు నివసించుచున్న ముడుమాలకు స్వల్ప దూరములో పలుగురాళ్ళపల్లెఅను గ్రామముకలదు. ఆగ్రామమున గోవిందశాస్త్రియను బ్రాహ్మణుడు నివసించుచుండెను. ఆగోవిందశాస్త్రి, సర్పదష్టుండై మరణించిన తిమ్మారెడ్డి సిద్దయ్యగారి అనుగ్రహముచే మరల బ్రతికినాడని కర్ణాకర్ణిగ విని, వెంటనే ముడుమాలకుబోయి సిద్దయ్యగారిని చూచి చేతులు జోడించుకొని యెదుట నిలువంబడి "స్వామీ! మీరు కేవలము ఈశ్వరాంశ సంభూతులేగాని వేరుకాదు' సత్వగుణసంపన్నులు, మీ చరితంబు వినిననాటినుండియు నా మనంబేలకో, మీకుసేవ జేయవలయునని తహతహ లాడుచున్నది. ఈమూఢునకు జ్ఞానోపదేశంబు గావించి రక్షింపరే" యని దీనాలాపంబుల ప్రార్థింపజొచ్చె. సిద్దయ్య గోవిందశాస్త్రిని చూచి "అయ్యా! నీవుచూడగా బ్రాహ్మణునివలె గాన్పించుచుంటివి. నేను మహమ్మదీయుడను. నీవు నన్నాశ్రయించిన యీ ప్రపంచము నిన్నును నన్నును బాధించును. అయినను నీ హృదయంబునంగల భక్తివిశేషంబులు గ్రహింపక పోలే"దనెను. గోవిందశాస్త్రి సిద్దయ్యతో "అయ్యా! తమరెరుంగని ధర్మమున్నదా? గుణమే ప్రధానముగాని కులము ప్రధానముకాదుగదా! మీరెన్ని చెప్పినను, మిమ్ములనే గురువులుగ భావించుకొంటి"ననెను. సిద్దయ్య గోవిందశాస్త్రి యొక్క భక్తివిశేషంబుల గ్రహించి "నాయనా! ఏదో మాటవరుస కట్లంటినిగాని నీ సదభిప్రాయములను నేను

గ్రహించలేకపోలేదు. ముందు నీవొక మహాత్ముడవు కావలసిన యోగముకలదు" అని చెప్పి "ఓం, హ్రీం. క్లీం, శ్రీం, నమశ్శివాయ శ్రీ వీరనారాయణాయ" అను బీజసంపుటి సహితంబైన పంచాక్షరి, అష్టాక్షరీ మంత్రముల నుపదేశంబుగావించి, సాంఖ్య. తారక, అమనస్కంబుల బోధించి విశేష జ్ఞానసంపన్నునిగ నొనరించె. సిద్ధయ్యగారి భక్తివిశేషమును క్రమముగ వృద్ధిజెంది, ఆచంద్రార్కమైన యశస్సును బొందెను.

## సిద్ధయ్యగారి మహిమలు.

ఆరీతిగ సిద్ధయ్యగారి యశశ్చంద్రికలు నలుమూలల వ్యాపింప జొచ్చెను. ముడుమాల గ్రామకరణము అదిచూచి సహించలేక, "దూదేకులవాడు భక్తుడా? వీనికింత పూజయా?" అని సిద్ధయ్య నెట్లైనను యవమానింప దలయునని సమయమునకై నిరీక్షించుచుండెను. ఒకదినమున సిద్ధయ్యగారు ఆకరణముగారి యింటిముందు నుండియే. అన్య గ్రామంబునకు బోవుచుండగా, ఆకరణము సిద్ధయ్యగారిని పిలచి "సిద్ధయ్యా! ఇటురమ్ము. ఎప్పుడును మాయింటికే రావుగదా. ఆకంసాలి గురువుదగ్గర చాలకాలము శుశ్రూష యొనరించితివికదా. ఆయన నీకేమైన చెప్పెనా? కంసాలియే గాని నీకెవ్వరును దొరకలేదా? సమాధిని ప్రవేశించునప్పుడు నీకేమైన నిచ్చెనా?" యనెను. అంత సిద్ధయ్య "అయ్యా! మాగురువుగారు నాకు తనపాదుకలు, బెత్తము, యోగదండము, శిఖాముద్రికయు నిచ్చి"రని చెప్పెను. ఆకరణ మది విని పరిహాసముచేయుచు "సిద్ధయ్యా! అంతకాలము నీవు

ఆయనకు సేవచేసినందులకు తన పాతపాదరక్షలు మాత్ర మిచ్చెనా?" అనిన సిద్ధయ్యవిని మారుపలుకక, తూర్పుగ ముఖమునుంచి పశువుల నదలించినట్లు 'ధళా' అని గట్టిగా అని యూరకొనెను, చూచినవారందరు సిద్ధయ్య కరణమునకు తగినట్లుగనే జవాబిచ్చెనని సంతోషించిరి. కరణము అతి శీఘ్ర కోపముజెంది, సిద్ధా! నీవింత అమర్యాదగా ప్రవర్తింతువనుకొనలేదు. భక్తుడవనుకొంటిని. పశువులతో మాట్లాడినట్లు నాతో మాట్లాడ నారంభించితివి. నీవు గురువువద్ద నేర్చుకొనిన విద్య యిదియేనా' అనెను. సిద్ధయ్య ఆమాటలువిని కరణముతో "అయ్యా! మిమ్ములను అగౌరవపరచు నుద్దేశ్యముతో నేనారీతిగ అరచియుండలేదు. ఇచ్చటికి సమీపముననొకకొండపై మేయుచున్న గోవును, ఒక పెద్దపులి పట్టి చంపుటకు సిద్ధముగానున్నది. ఆ పెద్దపులి బారినుండి ఆ గోవును రక్షింపబోవు నుద్దేశ్యంబుతో 'ధళా' అని అదలించితినేగాని, వేరుగాదనెను. అందులకా కరణము ఆశ్చర్యపడుచు "సిద్ధయ్యా! ఇదినిజమేనా?" యిదెంతవరకు సత్యమో తెలిసుకొన వలయునని, తలారులను రావించి 'ఓరీ! మీరు వెంటనే మనగ్రామమునకు సమీపమునగలకొండపైకేగి అచ్చట గోవులను కాయుచున్నవారి నడిగి, ఆకొండమీది కేదైన పెద్దపులివచ్చి, గోవులను పట్టబోయెనా? అని అడిగి తెలుసుకొని రండని పంపెను. వెంటనే ఆ తలారులు సమీపమునగల కొండపైకేగి, సాయంకాల మగుచుండుటచే తిరిగి యింటికి గోవులను, తమగృహంబులకు మరలించుకొని వచ్చుచున్న గోపాలకులను గాంచి "అయ్యా! ఇంతకుముందు యీకొండపైకేదేనియొక పెద్దపులి వచ్చినజాడ మీరుచూచితిరా!" అని



అడిగిరి. అంత వారు "ఏదో ఒక పెద్దపులివచ్చి, మాగోవును పట్టపోయినది. అందువలననే మేము భయపడి యింకను ప్రొద్దుండగనే గోవులను యింటికి మరలించుకొని వచ్చుచు న్నాము. దేవుడే మమ్ములను రక్షించెను. గోవుమీద పడి మరల తానంతనే వెనుకకుమరలి పారిపోయినది, మాకే విచి త్రమైనది. అది ఆవిధముగ పోకున్న యీపాటికి మాగతియే మగునో" అని బదులుచెప్పిరి. తలారులదివిని వెనుకకు మరలి వచ్చి ఆసమాచారమంతయు కరణమున కెరింగించిరి. కరణము ఆ విషయమును విని తనలో "సిద్దయ్య గొప్ప భక్తుడు. భక్తుడే గాక గొప్పమహిమ గలవాడు, తెలుసుకొనలేక పరిహాసము జేయ మొదలు పెట్టితిని. అందులకు నాకెట్టి ఆపద సంభవిం చునోగదా" అని తలంచుచు సిద్దయ్యనుజూచి సిద్దయ్యా! నీవు సామాన్యుడ వనుకొని మాటలాడి నందులకు క్షమింపుము. నీవు యోగ్యుడవు. నీయట్టి వారలుండుటం జేసియే యీప్ర పంచమున నింకను ధర్మము నడచుచున్నది అవివేకముతో నేను గావించిన అపచారము క్షమింపు"మని ప్రార్థించెను. సిద్దయ్య అదివిని "అయ్యా మీరు నాకొనరించిన యపచా రం బేదియును లేదు. మీకును జ్ఞానదృష్టి లభించు యోగ ముండుటం జేసియే నన్ను పిలచి పరిహాసముచేయ నారంభించి తిరి. సందేహ రాహిత్యము పొందు సమయ మాసన్న మగు టంజేసియే మీకు నాతో సంభాషింపవలయును ననెడి కోర్కె కలిగినది. పశ్చాత్తాపమువలన సర్వపాపములును తొలగును" అని చెప్పుచు కరణముగారికి జ్ఞానోపదేశమును గావించెను. అది లగాయితు ఆకరణముగారు సిద్దయ్యగారికి శిష్యులై మెలగజొచ్చెను. నాటంగోలె సిద్దయ్యను శ్రీ సిద్దేంద్రస్వాముల

వారని పిలుచుచు పూజింప నారంభించిరి. సిద్దయ్య కీర్తి ఆ చంద్రార్కమైనది.

అనంతరము శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు చెప్పిన చందముగ శ్రీ సిద్దేంద్రస్వామికి, మహాభక్తుడై వెలసిన పెదవీరను నొక సుపుత్రుండు జన్మించెను. పిమ్మట సిద్దయ్యగారు ముడుమాలకు ఈశాన్యభాగమున మఠమునొక దానిని నిర్మించుకొని, అక్కడ తానును, తనపుత్రుండైన పెదవీరను జీవసమాధిని పొందిరి. శ్రీ స్వాములవారి పాదుకలు, బెత్తము యోగదండము, శిఖాముద్రికయు నిప్పటికిని ఒకగదియందు భద్రముచేయబడి యున్నవి. వాటికి అప్పటి నుండి నేటివరకును నిత్యము నైవేద్యములు, దీపారాధనలు జరుగుచునే యున్నవి.

గురు శిష్యులకీర్తి ఆంధ్రదేశమంతయు నలుమూలల వ్యాపించినది. వారినెరుంగనివారును, తలుపనివారును, పూజింపనివారును, కొనియాడనివారును లేరు.

బ్రహ్మంగారివంటి గురువును, సిద్దయ్యవంటి శిష్యుడును నుండబోరని ప్రసిద్ధిగాంచిరి.

త్రయోదశ ప్రకరణము సమాప్తము



# చతుర్ధశ ప్రకరణము
# హఠయోగము

ఒక దినమున సిద్దయ్య బ్రహ్మంగారిని జూచి యీ రీతిగ ప్రార్థింప దొడంగెను.

సిద్దయ్య:- "తండ్రీ! ఈ ప్రపంచ విషయముల దగుల కుండునట్లు మనోనిగ్రహము కలుగు మార్గముం దెలిపి నన్ను కాపాడవే."

బ్రహ్మం - వత్సా! నీ బుద్ధికి ఎంతయు ఆనందించితిని. మనోనిగ్రహము సామాన్యులకు శక్యముకాదు. మనోనిగ్ర హముసంపాదించువిద్యబహుగోప్యమైనది. ఉపన్యాసాదులలో దీనిని వెదజల్లరాదు. ఆ రీతిగ చేసిన, నిది ఫలింపదు. అయి నను నీవు అడుగుచుంటివి గాన తెలుపుచున్నాను"

"మనోనిగ్రహము ఒక్క యోగాభ్యాసము వలననే సమకూడును. మనోనిగ్రహము లేక ఎట్టివేదాంతము వలన నైనను ప్రయోజన మావంతయు నుండదు. మాటలు చెప్పు టకు ఉపయోగపడునే గాని, తరింపను పకరింప బడవను విష యము నెరుంగుము. కనుక గృహంబునకు పునాదివలె, వైరాగ్యమునకు యోగము ప్రధానమైనదని యెరుంగుము. ప్రపంచవిషయ వాంఛలనుండి దప్పించుకొనుటకు ప్రధానమైన మనోనిగ్రహమునకు యోగము ప్రధానమైనది. అది లేక ఎంతటివారి కేనియు మనోనిగ్రహము శక్యము కాదు. అభ్యాస వైరాగ్యములచే నంతఃకరణము స్వాధీనము చేసుకొనలేని వానికి యోగము సాధ్యము కాదనియు, మనోనిగ్రహము యోగాభ్యాసంబులేక సాధింపనలవి కాదనియు నెరుంగుము,

కర్మములు అనేక రీతులుగ నుండును. కావున యోగములు సర్వజనులకును ఒకేరీతిగ నుండవలను పడదు. కర్మానుసారము ప్రతివారును యోగము నభ్యసించ వలయును. యోగాభ్యాసము నిరంతరము జేయుచునే యుండవలయును. మధ్యమధ్య మానుటకు వలనుపడదు. దానఫలంబు శూన్యంబగు. విడువక నిరంతరము యోగాభ్యాసము చేయువారలకు మనోనిశ్చలమును, మనోనిగ్రహమును కలుగును. దానంజేసి సకల కామితార్థములు నెరవేరును. ఈ విషయముల నన్నిటిని బట్టిచూడ ప్రతిమానవునకును స్త్రీ పురుషాదు లెల్లరకు యోగము ప్రధానమని తెలియనగు చున్నది.

యోగాభ్యాసమునకు ప్రాణాయామము మొదటిమెట్టు. ప్రాణాయామము నభ్యసించుటకు విహితంబని సకల శాస్త్రములు తెలుపుచున్నవి. మఱియు చంచలచిత్తముగల వారలకు నీ ప్రాణాయామ యోగముచాలదు; హఠయోగమును అభ్యసింపవలసి యుండును. యోగాభ్యాస మభ్యసించువారు పెక్కు నియమములను పాటించుచుండ వలయును. లేకున్న యోగాభ్యాసము ఫలించదు. కలియుగంబున మనశ్చాంచల్యము అధికముగ నుండును. అందుచే విశేషించి యీ యుగంబున హఠయోగాభ్యాసము ప్రతివారును ముఖ్యముగ చేయదగును.

శ్రీ ఆదినాథుడు అనగా శివుడు ఒకానొకప్పుడు ఒక ద్వీపమందు వసించుండై, నిర్జన ప్రదేశమున పార్వతీ దేవికి యోగవిద్యను ఉపదేశించెను. యోగాభ్యాసమునకు విఘ్నములు కలుగజేయు విషయములు :- ఆహారము అతిగ భుజించుట, ప్రయాసను కలుగ జేయు పనులు, అధికముగ మాటలాడుట,

నియమగ్రహణము, నీచులతో సాంగత్యము, చపలత్వము నను నీయాఱును యోగాభ్యాసము చేయువారలకు తగనివి.

యోగసిద్ధి గలుగజేయు విషయములు:-ఉత్సాహము, సాహసము, ధైర్యము, తత్వజ్ఞానము, స్థిరబుద్ధి, జనసమూహములలో సదాకూర్చొని యుండుట, అను నీయాఱింటివలనను యోగము సిద్ధించునని మహర్షులు తెలిపి యున్నారు.

అహింస, సత్యము, దొంగలింపకుండుట, బ్రహ్మచర్యము, క్షమ, (యితరులవలన బాధకలుగునప్పుడు ఓర్పు కలిగియుండుట) ధృతి (ధైర్యము, స్థిరస్వభావము) దయ, ఆర్జవము (నావారు పరవారు అను భేదబుద్ధి లేకుండుట), మితాహారము, శౌచము అను నివి పదియును యమములనియు, తపస్సు, సంతోషము, ఆస్తిక్యము, దానము, దైవభక్తి, మహాత్ములచే చెప్పబడిన మాటలు వినుట, ధర్మవిరుద్ధమగు వ్యవహారములలో ప్రవేశింపకుండుట, సత్కర్మలను వైదికకర్మలను ఆచరించుట, జపము, వ్రతము అను నీ పదియును నియమము లనబడును. యోగాభ్యాసనాపరులకు యమ, నియమములవలన ప్రయోజనము :- ఆసనము, ప్రాణాయామము, ముద్రాకరణము, నాదానుసంధానము అనునవి నాలుగు అంగములు. ఆసనము స్థైర్యమును గలుగ జేయును. ఆసనమువలన రజోగుణము నశించును, రజోగుణము నశించుటవలన మనస్సును, శరీరమును చలించక యుండును. అందువలన స్థిరత్వము కలుగును. వ్యాధులు, అనర్హత, సంశ

యము, అజాగ్రత్త, ఆలస్యము, అసంతృప్తి, భ్రాంతి, జ్ఞానము కుదురుకపోవుట, మనస్సు స్థిరముగ నుండకుండుట అను చిత్తవికారములు సకలమును యోగాభ్యాసమువలన నశించును. తమోగుణములు నశించును. మఱియు ఆసనమువలన ఆరోగ్యము, శరీరబలమును, ఆకలియు గలుగును. యోగాభ్యాసము సిద్ధించిన తదుపరి ఆకలినికూడ గలుగనీయకుండును.

యోగశాస్త్రము నకు కర్తలగు వశిష్టాదిమహర్షుల చేతను, మత్స్యేంద్రాది యోగులచేతను చెప్పబడిన 84 ఆసనములలో శ్రేష్ఠములైన కొన్ని ఆసనములను తెలుపుచున్నాను. మహర్షులకును, యోగులకునుకూడ మననమును, హఠాభ్యాసమును ప్రధానములని చెప్పబడి యుండెను. మహర్షులకు మననమును, యోగులకు హఠాభ్యాసమును ప్రధానములు.

ఆసనము లన్నింటియందును పద్మాసనము, సిద్ధాసనము, స్వస్తికాసనము, సుఖాసనము అనునవి నాలుగును జప, తపములకును, మనోనిగ్రహమునకును ముఖ్యములైనవిగ చెప్పబడియున్నవి.

పైన చెప్పబడిన నాలుగు ఆసనములలో నేదోయొక ఆసనమును, శరీరమును అణుమాత్రమైనను కదల్పక సుమారు ఏడున్నర ఘడియలు (3 గంటలు) కాలము నిశ్చలముగ కూర్చుండవలయును. అప్పుడే 'ఆసన జయము'ను పొంది, ఉత్తీర్ణుడవగుదువు. ఈరీతిగ ఆసనసిద్ధి లభించిన పిమ్మట ప్రాణాయామమును సాధించుటకు ప్రయత్నించవలయును. ధ్యానమునుకూడ 'ఆసనసిద్ధి' పిమ్మటనే ప్రయత్నించవలయును.

ఆసనము బాగుగ అభ్యసించినగాని మనస్సును నిలువబెట్టి ఏదేకధ్యానమున నుంచుటకు వీలుపడదు. ఆదరు కనీసము మూడు ఘడియల (1 గంట) కాలమైనను, ఆసనమును అభ్యాసము చేసినగాని బుద్ధి స్థిరత్వము కలుగదు. ఆ రీతిగ బుద్ధిని నిలువబెట్టుట సాధించిన పిదప హృదయమున నిర్మలత్వమును శాంతియు, అనంతమైన ఆనందమును సిద్ధించును.

ఆసనమున కూర్చునియున్నప్పుడు "నేను పర్వతము వలె స్థిరముగనున్నాను. అచలుడను, నన్నును, నామనస్సును ఏదియు కదల్చలేదు" అని మనస్సులో సదా మననము చేయుచుండుము. ప్రారంభములో దినమున కొకఘడియ కాలము ఈ రీతిగ అభ్యసించుచు, క్రమముగ ఎనిమిది ఘడియల వరకు అభ్యాసనా కాలమును హెచ్చింప వలయును. ఒక సంవత్సరము ఈరీతిగ ఆచరించిన 'ఆసనము' సిద్ధించును. ఈ ఆసన అభ్యాసమును ఉదయమును సాయంత్రమునుకూడ ఆచరించవచ్చును. ప్రారంభములో మోకాళ్ళలో నొప్పికలుగును. అట్టిసమయములలో కాళ్ళను బాగుగ చాచి, పదిగడియల కాలము (4 నిమిషములు) మోకాళ్ళపై చేతులతో నొక్కి-రాచి, మరల అభ్యాసమునకు మొదలు పెట్టవలయును. అభ్యాసమును పట్టుదలతో ఆచరించుచుండిన, మోకాళ్ళయందు కలుగు నట్టినొప్పి క్రమముగ తగ్గిపోవును.

ఆసనములో కూర్చొని యున్నప్పుడు నేత్రములను మూసుకొని త్రికూటమున (రెండు కనుబొమల మధ్యను) దృష్టిని కేంద్రీకరించవలయును. లేదా హృదయమున అనాహతచక్రమునందు మనస్సును నిలుపవలయును. ఈ రీతిగ

అభ్యాసమును చేయుచుండిన యెడల సులభముగ మనస్సును స్వాధీనము చేసుకొనవచ్చును. అప్పుడు ఏకాగ్రతయును, మనో నిశ్చలత్వమును సులభముగ పొందనగును.

నేత్రములను తెఱచి, నాసికాగ్రమునందు దృష్టిని నిలుపు విధానమువలన లభించు ప్రయోజనముకూడ యిదియే నని చెప్పబడి యున్నది. కాని యీవిధానము చాల కష్ట మైనది. చాలకాలము అభ్యసించినగాని, యీవిధానము వలన మనోనిశ్చలత్వము సిద్ధించదు. నాసికాగ్రభాగమునందు దృష్టిని నిలిపి అభ్యసింపలేనివారు హృదయము, శిరస్సు, కంఠము మొదలగు స్థానములలో నెక్కడైనను మనస్సును నిలిపి ఆసనమున కూర్చుండవచ్చునని చెప్పబడి యున్నది. జ్ఞాననేత్ర ప్రదేశమగు త్రికూటమున మనస్సును లేక దృష్టిని నిలుపు విధానము భ్రూమధ్య దృష్టియనబడును. ఈవిధానము లన్నిటియందును - నేత్రములను మూసుకొని మనస్సును ఆ నందచంద్ర మనబడు హృదయమున నిలిపిచేయు అభ్యాసము మిక్కిలి సులభసాధ్యమని శాస్త్రకారులు తెలిపియున్నారు.

ఆసనమందు కూర్చొనియున్నప్పుడు శిరస్సును, కంఠ మును క్రిందకు వంచక నిట్టనిలువుగ నుంచవలయును. వక్ష మును కూడ ముందుకు వంచక నిలువుగనుంచి, శరీరమును పొడిగించి కొంచెము పైకిచూచుచు ఠీవిగ కూర్చుండవల యును.

ప్రారంభములో పైన చెప్పబడిన సిద్ధ, పద్మ, స్వస్తిక, సుఖాసనములను నాలుగింటియందును, నొకదానిని మాత్రమే అభ్యసింపవలయును. ఆసనములను మార్చుచుండరాదు. ...

ఒక్క ఆసనమును మాత్రమే పట్టుకొని, దానిని వదలక, అభ్యసించుచుండ వలయును.

## 1. పద్మాసనము

శ్లో॥ ఊర్ధ్వోపరి సు సంస్థాప్య శుభే పాదతలే ఉభే
ఋజుకాయః సమాసీన ఇతి పద్మాసనం భవేత్॥

ఈ ఆసనమున కూర్చొనియున్న సమయమున, శరీరము పద్మమువలె కనబడుచుండును. అందువలననే దీనికి పద్మాసనమని పేరువచ్చినది. పద్మము అనగా కమలము. అందుచేనిది కమలాసనమని కూడ పిలువబడు చుండును. ఆసనములన్నిటియందును పద్మాసనము శ్రేష్ఠమైనదని యోగి పుంగవుల వచ



పద్మాసనము

నము. శాండిల్యాది మహామునులు ఈ యోగమును గురించి విశేషముగ తెలిపి యున్నారు, గృహస్థాశ్రమము నందున్న

వారికి ఈ ఆసనము శ్రేష్టమైనది. స్త్రీలకు, బాల్యవయస్సు నందున్న వారికిని, సన్నముగనున్న వారికిని నీ ఆసనము చాల అనుకూలమైనది.

పద్మాసనము (శరీరము కమలాకారమున నుండును) మొదట నేలమీద కాళ్ళనుచాచి కూర్చుండ వలయును. పిమ్మట పైన పటములో చూపబడినరీతిగ కుడిపాదమును ఎడమతొడమీదను, ఎడమపాదమును కుడితొడమీదను పెట్టి, రెండుచేతులనుమోకాళ్ళపైయుంచి, శరీరమునుచక్కగ నిలువరించి కూర్చుండవలయును.

పద్మాసనమువలన ప్రయోజనము :— ఈ ఆసనము వలన శ్వాసగతి మందమగును. దానివలన కుంభకము సిద్ధి కలుగును. దేహమున రక్తము బాగుగ ప్రసరించును. అందు వలన సమస్తరోగములు నివారణయగును. 'వ్యాధి వినాశ కారి యమినాం పద్మాసనం ప్రోచ్యతే' అని చెప్పబడి యున్నది.

## 2. సిద్ధాసనము

పద్మాసనము తరువాత సిద్ధాసనమే శ్రేష్ఠమైనదని యోగీశ్వరులు తెల్పియున్నారు. పద్మాసనముకంటె ధ్యానమునకు (మనస్సును భక్తియందు నిమగ్నము చేయుటకు) సిద్ధాసనమే సౌఖ్యకరమైనదని కొందరు చెప్పుచున్నారు. ఈ ఆసనమును చాలకాలము అభ్యసించి ఉత్తీర్ణులైనచో, నీకు తప్పక విశేషశక్తులు లభించును. అనేకమంది సిద్ధులు ఈ ఆసనమును అభ్యసించి మోక్షమును పొందుటవలన దీనికి సిద్ధాసనమను పేరు వచ్చినది. తొలుత విశేషము [illegible]

నున్నవారు సహితము, ఈ యోగమును అభ్యసింప వచ్చును. స్త్రీలకు నీ ఆసనము అనుసరణీయము కాదు. కవ్యాలుమాత్రము దీనిని అభ్యసింప వచ్చును. ఎనుబది నాలుగు ఆసనములందును సిద్ధాసనమే శ్రేష్ఠమైనది. ఇది డెబ్బదిరెండు వేల నాడులయొక్క మలమును శుద్ధి చేయు శక్తికలదైయున్నది.




సిద్ధాసనము

కొందరు దీనిని వజ్రాసనమనియు, కొందరు ముక్తాసనమనియు కొందరు గుప్తాసనమనియు చెప్పుచున్నారు. ఇది యోగిజన పూజితమైనది. పండ్రెండు సంవత్సరములు నిరంతరము సిద్ధాసనమును అభ్యసించు యోగి యోగసిద్ధి బొందును. ఈ ఆసనమునందు బాగుగ ఉత్తీర్ణులైనవారికి అనేకములగు నితర ఆసనములవలన ప్రయోజనమేమియు లేదు.

ఆసనము వేయు విధానము:- నేలపై కూర్చుండి ఒక పాదముయొక్క మడమను గుదస్థానమునకు చేర్చి కాలును మడవవలయును. రెండవ పాదముయొక్క మడమను లింగ (పురుషాంగము) ప్రదేశమునకు చేర్చి, ఆ కాలును మడవవలయును. మడమ బంధములు రెండును ఒకదానిపై నొకటి వచ్చునట్లు కాళ్ళను చక్కగ మడవవలయును. చేతులను పద్మాసనములో నుంచినరీతిగ నుంచవలయును.

సిద్ధాసనము, పద్మాసనము, ముక్తాసనము, గుప్తాసనము అని యీ ఆసనము నాలుగురీతులుగ నున్నదని తెలుపబడెనుగదా; పైనసిద్ధాసన విధానము తెలుపబడెను. ఇక తక్కిన మూడు ఆసన విధానములను ఎరిగించుచున్నాము.

కుడికాలి మడమను లింగస్థానమునను, దానికిపై భాగమున ఎడమకాలిమడమను ఉంచి వేయునది పద్మాసన మనబడును.

కాళ్ళమడమలను రెండింటిని ఒకదానిపై నొకటి క్రిందుమీదుగ నుంచునది ముక్తాసన మనబడును.

ఎడమకాలి మడమను లింగప్రదేశమునందుంచి, కుడికాలి మడమను ఎడమకాలి మడమ క్రిందనుంచునది కూడ ముక్తాసనమే యనబడును.

లింగస్థానమునందు కాలిమడమల రెండింటిని చేర్చి క్రిందుమీదుగ నుంచునది గుప్తాసన మనబడును.

## ౩. స్వస్తికాసనము

స్వస్తికాసన లక్షణములు:-

శ్లో॥ జానూర్వోరంతరే సమ్యక్కృత్వా పాదతలే ఉభే।
ఋజుకాయః సమాసీనః స్వస్తికం తత్ప్రచక్షతే॥



నేలపై కూర్చొని శరీరమును నిలవరించి సుఖముగ వేయబడినది స్వస్తికాసన మనబడును. నేలపైకూర్చొని కాళ్ళను ముందునకు చాచవలయును. తరువాత ఎడమకాలిని లోపలకు మడచి, ఎడమకాలిపాదము కుడికాలితొడను అనుకొనునట్లు ఉంచవలయును. పిమ్మట అదేరీతిగ కుడికాలిని లోపలకు మడచి, ఎడమకాలి మడతలోనికి బోనిచ్చుచు, కుడి

కాలిపాదము ఎదమతొడకుచేర్చి యుంచవలయును. చేతు లను పద్మాసనమునందుంచు విధముగనే యుంచవలయును.

స్వస్తికాసనము సుఖప్రదమును, ఆరోగ్యమును, సులభ సాధ్యమునయి యున్నది. దీనివలనజపసిద్ధికలుగును. ఇయ్యది ప్రత్యాహారమునకు ఆవశ్యకమని యోగులు చెప్పుచున్నారు.

## 4. సుఖాసనము

జపమునకును, ధ్యానమునకును-సౌఖ్యముగను, సులభ సాధ్యముగను నుండు ఏ ఆసనమైనను సుఖాసనమనబడును.




సుఖాసనము

ఆసనములందు శిరము, కంఠము, వక్షము, ఈ మూడును నిక్కబొడుచుకొని కూర్చుండవలయును. 30 లేక 40 సంవత్స రముల వయస్సు [illegible] జపము, ధ్యానము చేయుదల

చిన వారు సాధారణముగ పద్మాసనము, సిద్ధాసనము, స్వస్తికాసనము మొదలగునవి వేసుకొని, వాటిని ఆచరింపలేని వారుగ నుందురు.

అట్టివారికి సుఖాసనము సులభసాధ్యముగ నుండును. వయస్సు చెల్లినవారు సుఖాసనమున గూర్చుండి, జపమును, ధ్యానమును చేసుకొనుటకు సుఖాసనము మిక్కిలి సౌఖ్యదాయకముగ నుండును. విశేషించి యీ ఆసనము వృద్ధులకు మాత్రమే ఏర్పడినది. అట్లని పిన్నవయస్సు గలవారు దీనిని ఆచరింపరాదను నియమము లేదు. పిన్నవయస్సుగల వారుకూడ దీనిని అభ్యసింపవచ్చును.

ఆసనము వేయువిధానము:- సుమారు ౫ అడుగుల పొడవుగల గుడ్డనొకదానిని తీసుకొనుము. ౬ అంగుళముల వెడల్పులో పొడవునకు మడతపెట్టి యుంచుకొనుము. పాదములు తొడలక్రింద యుండునట్లు మోకాళ్ళను వంచి పైన పటములో చూపబడిన విధముగ కూర్చొనుము. మోకాళ్ళను వక్షముతో సరిగ యుండునట్లు పైకినిలువబెట్టి కూర్చొనుము. రెండు మోకాళ్ళకు మధ్య సుమారు 10 అంగుళములు వెడల్పు ఉండునట్లు ఉంచవలయును. అప్పుడు మడతపెట్టిన గుడ్డను తీసుకొని, ఒకకొన ఎడమ మోకాలిదగ్గర నుంచి, ఆ గుడ్డను వెనకవైపునుండి వీపు భాగమును చుట్టుచు, కుడి మోకాలు వరకు త్రిప్పుచు, ఆ గుడ్డయొక్క రెండు కొనలను చేర్చి ముడి వేయవలెను. తరువాత రెండు అరచేతులను విప్పి ఒకదాని కొకటి ఎదురుగనుంచి, వ్రేళ్ళను లోపలికి ముడిచి, గుప్పెడి పట్టువలె పట్టుకొని, రెండు మోకాళ్ళకు మధ్య గుడ్డమీద ముడిచి యుంచుకొనిన హస్తములను,

ఉంచవలయును. ఈ ఆసనమునందు హస్తములు, శాళ్ళు, వెన్నెముక గుడ్డమీద ఆధారపడి యుండును. అందుచే నీ ఆసనమునందు ఎంతసేపు కూర్చున్నను శ్రమకలుగదు ఇతర ఆసనములను వేసుకొని కూర్చొనలేనప్పుడు, ఈ ఆసనము నైనను వేసుకొని జపమును ధ్యానమును, ప్రతి దినమును ఆచరించుచుండ వలయునని యోగి పుంగవులు తెలిపి యున్నారు. కూర్చొనుటకు సుఖముగ యుండును గనుక, యీ ఆసనమునకు సుఖాసనమని పేరు వచ్చినది.

## పద్మ, సిద్ధ, స్వస్తికాసనములవలని ప్రయోజనము

హఠ యోగశాస్త్ర గ్రంథములలో పైన చెప్పబడిన ఆసనములవలన విశేష ప్రయోజనము కలదని తెలుపబడి యున్నది. ప్రతి దినమును చివరకు 15 నిమిషములైనను, పైన చెప్పబడిన ఆసనములలో నొక దానియందు కూర్చుండి, నేత్రములను మూసుకొని, మనస్సును హృదయకమలమున నేకదృష్టితో నిలిపి, భగవంతుని ధ్యానము చేయుచుండిన యెడల సకల పాపములు నశించి, తప్పక మోక్షము లభించు నని ఆత్మబల సంపన్నులైన యోగీశ్వరులు తెలిపియున్నారు. ఈ ఆసనములు జఠరాగ్నిని వృద్ధిచేసి, జీర్ణశక్తిని వృద్ధిపరచి, బాగుగా ఆకలిని కలిగించును. దానివలన ఆరోగ్యమును, సౌఖ్యమును, మోక్షమును సంపాదించుటకు తగిన శక్తిని కలుగజేయును. ధ్యానులకు దరికి చేరనీయుచుండు పాపములు చుండును, నాడీమండలమును శోధించి, శాళ్ళ యందును తొడల యందును బలమును కలుగజేయును బ్రహ్మచర్య నిష్ఠయం దుండుటకు తగిన బలమును కలుగ జేయుచుం డును.

## 5. సింహాసనము

శ్లో॥ గుదంనిరుధ్య పాదాభ్యాం హస్తౌ జాన్వోస్తుధారయేత్,
ముఖం విదార్య నాసాగ్రం నిరీక్షేత్సు సమాహితః
ఏతత్సింహాసనం ప్రోక్తం యోగశాస్త్ర విశారదైః॥

అండకోశమునకు క్రింది భాగమున సీవనీయను నాడి యుండును. ఆ సీవనీనాడికి రెండు ప్రక్కలను రెండు మడమలను అనగా కుడివైపున ఎడమ మడమను, ఎడమ వైపున కుడి మడమను ఉంచి, కుడి ఎడమ చేతుల వ్రేళ్ళను విడివిడిగా వికశనము చేసి యుంచి, కుడి మోకాలుమీద కుడి హస్తమును, ఎడమ మోకాలు మీదను ఎడమ హస్తమును యుంచి, శరీరమును నిక్కించి, తిన్నగ కూర్చుండి నోరు బాగుగా తెఱచి, బల వంతముగ శక్తికొలది నాలు కను వెలుపలకు త్రోయుచు నాసికాగ్రమును తదేక దృష్టితో చూచుచుండవల యును. ఈ ఆసనము, ఆస



సింహాసనము

నములలోకెల్ల యుత్తమమైనదిగను, బంధత్రయమును గొట్టు

వదిగను నున్నది. ఈ ఆసనము సకల విధములైన రోగములను పోగొట్టును.

## 6. భద్రాసనము

శ్లో॥ సీవన్యా దక్షిణే భాగే దక్షగుల్ఫంతు ధారయేత్,
వామభాగే వామగుల్ఫమితి భద్రాసనంభవేత్.



భద్రాసనము

మామూలుగ నేలపై కూర్చుండుము. శరీరమును నిక్కించి, శిరస్సును తిన్నగనుంచి, శిరస్సు, కంఠము, శరీరము సమముగ నుంచుము. రెండు పాదముల మడమలను గుద స్థానమునకు చేర్చి నొక్కి కూర్చుండుము. దృష్టిని నాసికాగ్రమునందు నిలిపి ఎదురుగ చూచుచుండవలెను. ఈ ఆసనము సకల రోగములను పోగొట్టును. శక్తి [illegible]

సర్వ విషపదార్థములను, మలినములను బోగొట్టి, ఉత్సాహమును, నూతన తేజస్సును కలుగజేయును.

## పశ్చిమతానాసనము

శ్లో॥ ప్రసార్యపాదౌ భువి దండరూపౌ
దోర్భ్యాం పదాగ్ర ద్వితయం గృహీత్వా
జానూపరి న్యస్త లలాట దేశో
వసేదిదం పశ్చిమతాన మాహుః॥




పశ్చిమతానాసనము

రెండు కాళ్ళను ముందుకు బాగుగ చాచి కూర్చుండి, శరీరమును ముందునకు వంచి చేతుల బొటన, చూపుడు వ్రేళ్ళతో, కాలిబొటన వ్రేళ్ళను పట్టుకొనవలయును. శరీరము లావుగ నుండు వారలకు ఈ ఆసనము కష్టముగ నుండును. నాశికారంధ్రములనుండి గాలిని బయటకు బాగుగ వదలి, శిరస్సు మోకాటిచిప్పలపైకి వచ్చునట్లు శరీరమును ముందునకు వంచవలయును. శిరస్సును రెండు మోకాళ్ళ మధ్యను నుంచుట చాలమంచిది. ఆవిధముగ శరీరమును వంచునప్పుడు శిరస్సు రెండుచేతులమధ్య వచ్చునట్లు నుంచి

వారితో సమానముగు ఎత్తులో నుంచవలయును. ఇరువది సంవత్సరముల లోపువారికి, వెన్నెముక బాగుగా సాగును గనుక, అట్టివారికి నీ ఆసనము సులభసాధ్యముగ నుండును. వెన్నెముక సాగుట కష్టముగ నుండువారికి, ఈ ఆసనము వేయుటకు సుమారు ఒక నెల కూడ పట్టవచ్చును. శరీరమును ముందుకు వంచినది మొదలు ఊపిరిని బంధించి, మరల యథాప్రకారముగ పైకిఎత్తిన పిదప గాలిని పీల్చవలయును. ప్రారంభములో 5 సెకన్డులపాటు అభ్యసించి, క్రమముగ అభ్యాసనా కాలమును పదినిమిషముల వరకు హెచ్చించవలయును.

ఈ ఆసనమును వేయుటకు కష్టముగ నుండువారు మొదట ఒక కాలు, ఒక చేతితో ప్రారంభించి, తరువాత రెండు కాళ్లు, రెండు చేతులతో చేయవచ్చును. ఆసనములను అభ్యసించునప్పుడు లోకజ్ఞానమును ఉపయోగించుకొనుచుండవలయును.

### ప్రయోజనము

ఇది ఒక గొప్ప ఆసనమని యో ... స్త్రియు
న్నారు. ఈ ఆసనము ప్రాణవాయును
మ్నామార్గముగ పోవునట్లు చేయు
అభివృద్ధిపరచును. పురుషులకు ఉదరము
ములకు మంచి ఆరోగ్యమును గలుగ
బలమిచ్చును. విశేషించి మలబద్ధ
మూలవ్యాధిని, మూత్రదోషము
అనేకరోగములను నిర్మూలము

## 8. గోముఖాసనము

శ్లో॥ సవ్యే దక్షిణ గుల్ఫంతు పృష్ఠపార్శ్వే నియోజయేత్
దక్షిణేపి తథా సవ్యం గోముఖం గోముఖాకృతిః ॥



గోముఖాసనము

గా ఆవుయొక్క ముఖమని అర్థము. ఈ
ు శరీరము 'గోముఖ'మువలె గాన్పించు
ోముఖాసనమని పేరు పెట్టిరి.

యొక్క మడమ గుదస్థానమునకు
ప్రక్రింద నుంచవలయును. ఎడమ

కాలియొక్క మోకాలుమీదకు వచ్చునట్లు, కుడికాలి మోకాలును అమర్చి, కుడికాలియొక్క మోకాలి పిక్కకు క్రిందనుండు కాలు ఎడమకాలి తొడభాగము పాదముదగ్గరగ నుండునట్లు నొక్కియుంచుము. అభ్యాస క్రమమున కుడి పాదముయొక్క మడమ ఎడమ పిరుదను తాకునట్లు చేయు వలయును. తరువాత పైపటములో చూపబడిన విధముగ కుడిచేతిని శిరస్సునకు వెనుకనుంచి వంచి ఎడమచేతిని మోచేతిదగ్గర పైకిఎత్తి, కుడిచేతి చూపుడు వ్రేలును మధ్య వ్రేలును, ఎడమచేతి చూపుడు వ్రేలును మధ్యవ్రేలును కలుపుచు గట్టిగలాగి పట్టవలయును. పిదప ప్రాణవాయువును మెల్లగ పూరించవలయును. అరికెగ వ్రేళ్ళను ముడిచేయునప్పుడు శరీరమును ముందునకుగాని, ప్రక్కలకుగాని వంచక తిన్నగ యుంచవలయును. మధ్యమధ్య కాళ్ళను, చేతులను మార్చుచు, ఆసనము వేరొకప్రక్కగ వేయవచ్చును. లావుగ నుండువారికి యీ ఆసనము వేయుట శ్రమగనుండును. అభ్యాసక్రమమున సులభసాధ్యమగును.

## ప్రయోజనము

బ్రహ్మచర్యముగ నుండుటకును, శరీరమును ఆరోగ్యముగ నుంచుకొనుటకును, యీ ఆసనము చాల ప్రయోజనమైనది. ఈ ఆసనమువలన మూలబంధము సిద్ధించును. ...మువలన యీ ఆసనము ప్రాణాయామమును అభ్యసించు ...నుకూలమైనదిగ యున్నది. చేతులను కట్టుకొనకుండ, యీ ఆసనమునందు కూర్చుండవచ్చును. సన్నముగ ... యీ ఆసనమును సులభముగ అభ్యసింపగలుగు ...ఆసనమువలన భగంధరము నశించును. ప్రాణ-

లనుకత్తెరవలె ఒకదానిమీద యొకటి గడ్డమునకయుంచి శిరస్సుక్రింద పెట్టవలెను. మొదట గోడ ఆసరాతో ప్రతి దినము 2 నిమిషముల పాటు అభ్యసించుచు, క్రమముగ 10 నిమిషములవరకు అభ్యాసకాలమును పెంచవలయును. అభ్యాసము పూర్తియయిన పిమ్మట శిరస్సును క్రమముగ పైకెత్తి, చేతులను విడదీసి మెల్లగ పైకిలేచి, అనంతరము కాళ్ళయొక్క బంధమును విప్పవలయును. ఈ ఆసనము ఊపిరి తిత్తులకు బలమును కలుగజేసి, వాటికి సంబంధించిన సర్వ రోగములను, అనగా ఉబ్బసము, క్షయ మొదలగు దీర్ఘ వ్యాధులను రూపుమాపును. శరీరమునందలి గ్రంథులన్నియు చురుకుగ పనిచేయగలుగును.

మత్స్యాసనము అనేక రోగములను బోగొట్టునని హఠయోగ శాస్త్రమునందు చెప్పబడియున్నది. విశేషించి మలబద్ధమును తొలగించును. జీర్ణకోశమును శుద్ధపరచును. వక్షమునకు బలమును కలుగజేయును.

## 10. మయూరాసనము

నెమలిని సంస్కృతమున మయూరమందురు. ఈ ఆసనము నందున్నప్పుడు శరీరము పింఛము విప్పిన నెమలివలె గనబడుచుండుటవలన దీనికి మయూరాసనమని పేరువచ్చినది. ఈ ఆసనము అభ్యసించుట కొంచెము కష్టమనియే చెప్పవలసి యున్నది.

శ్లో॥ హస్తౌ ధరాం విన్యస్య నాభిపార్శ్వే తు కూర్పరౌ ;
దండవత్సమాసీనో మయూరం [illegible]




మయూరాసనము

భూమిమీద రెండుఅరచేతులను వుంచి, పిమ్మట మోచేతులమీద ఉదరమును మోపి, శిరమును పైకెత్తి, దేహమును దండాకారముగ, తిన్నగ చాచి యుంచవలయును. ఇది మయూరాసనమని చెప్పబడుచున్నది.

ప్రయోజనము

మయూరాసనము విశేషించి జఠరాగ్నిని వృద్ధిచేసి, విషమునైనను జీర్ణింపచేయును. మయూరాసనము గుల్మము జలోదరము, వాతపిత్తకఫములు నివారణచేయును. జీర్ణశక్తిని కలుగజేయుటలో, యీ ఆసనము విశేషముగ తోడ్పడునని మహర్షులు తెలిపియున్నారు. ఆకలిని గలిగించును. స్వల్పకాలములో శరీరమునకు బలముకలిగించు ఆసనము. దీనికిమించినది వేరొకటిలేదని …గశాస్త్రములు తెలుపుచున్నవి. కాలకూటమువ… …ర్థములనైనను జీర్ణింపజేయగలుగును.

అధికముగ భుజించిన కుక్షిత్రాన్నమును కూడ తృటిలో జీర్ణింపజేసి, శరీరమునకు తేజస్సును బలమును కలుగజేయుచుండును.

## 11. వీరాసనము

శ్లో॥ ఏకపాదం తథైకస్మిన్ విన్యసే దూరుణి స్థితమ్.
ఇతరస్మిన్ స్తథాచోరుం వీరాసనమి తీరితమ్॥

వీరాసనము

భూమిపై పిరుదల నానుకొని కూర్చుండి, ఎడమపాదమును కుడితొడమీదను, కుడికాలిపాదమును ఎడమతొడ మీద కును చేర్చి కూర్చుండి శరీరమునువంకర లేకుండ నిలువరించి యుంచునది వీరాసనమనబడును.



వీరాసనము

ప్రయోజనము :-

గౌరాంగుడు సదా యీ ఆసనముననే కూర్చుండి జపముచేసెడివాడట. ఈ ఆసనమున నున్నప్పుడు శరీరము వీరునివలె గాన్పించుట వలన దీనికి వీరాసనమని పేరు వచ్చినది. దీనికి అర్ధాసనమను నామము కూడకలదు. వీరాసనము హృదయ రోగములు



బాలగోష్ఠ్లు, కీళవాతము మొదలైన వ్యాధులను, తొలగించి ...
సూక్ష్మజ్ఞానమును కలుగజేయును.

## 12, ధనురాసనము

శ్లో॥ పాదాంగుష్ఠౌ తు పాణిభ్యాం గృహీత్వా శ్రవణావధి
ధనురాకర్షణం కుర్యాత్ ధనురాసనముచ్యతే.



ధనురాసనము

ఈ ఆసనమును వేసినప్పుడు శరీరము ధనుస్సువలె గాన్పించును. అందువలన దీనికి ధనురాసనమని పేరువచ్చినది. వక్షము నేలపై యానునట్లు బోర్ల పరుండుము. శరీరము నందలి కండరములనన్నిటిని బాగుగాజాచుము. చేతులను ప్రక్కలను పెట్టుము. కాళ్ళను వెల్లకి వెనుకకు వంచుము. కాలిమడమను క్రిందభాగమును చేతితో పట్టుకొనుము. శిరస్సును, వక్షమును సాధ్యమైనంతవరకు పైకెత్తుము. శత



కుక్కుటాసనము

మొదట పద్మాసనమున గూర్చుండి, పిక్కలకును తొడలకును మధ్యనుండి చేతులనుదూర్చి నేలపై మోపి ఆ చేతులమీద శరీరమునంతయు మోపి పైకి ఎగిసి కూర్చుండునది కుక్కుటాసనమనబడును. ఈ ఆసనము కుక్కుటము (కోడి) వలె నుండును గావున, దీనికి కుక్కుటాసనమని పేరు వచ్చినది.

ప్రయోజనము

సూర్యకిరణములకు అంధకారము పారిపోవు రీతిగ కుక్కుటాసనమున గూర్చుండి పవనాభ్యాసము చేయుటవలన సకల వ్యాధులును నివారణయగును. పద్మాసనమువలన కలుగు ప్రయోజనములన్నియు, యీ ఆసనమునకు చెప్పవలయును. శరీరబద్ధకము పూర్తిగ తొలగి చురుకుదనము కలుగును, నాడులయందలి మలము శుభ్రపడి, నాడులకు బలము చేకూరును. హస్తములందలి వణుకు మొదలగు దోషములన్నియు తొలగును. భుజములకు బలము కలుగును, వక్షము విశాలమగును. చేతులు పొడవగును.

## 14. శీర్షాసనము

శీర్షాసనము, కపాలాసనమనియు, వృక్షాసనమనియు, పరీతకారణి యనియు కూడ చెప్పబడుచుండును. శిరస్సును

[illegible] యుంచి, పాదములను పైకి [illegible] [illegible] [illegible] శరీరము [illegible] [illegible] [illegible] కూడ పిలువబడు చుండును. ఇది 'ఆసనరాజ'మని పిలువబడు చున్నది.

ఆసన లక్షణము :-భూమిమీద నాలుగుమడతలుగా వేసిన దుప్పటినిపరచి దానిపై మోకాళ్ళమీద కూర్చుండుము రెండు చేతులవ్రేళ్ళను కలిపిముడిచివేయుము. మోచేతులు మోకాళ్ళ దగ్గరగ నేలపైనయుంచి, చేతులను ముందునకుజాచి నేలపై నానుకొను గుము. రెండు చేతులమధ్యను శిరస్సునుంచి, కాళ్ళను మెల్లగ పైకెత్తవలయును. కాళ్ళను తిన్నగ పైకెత్తి పూర్తిగ శిరస్సుమీద ఆధారపడియుండుము. ప్రారంభములో యీరీతిగ 5 సెకనుల కాలము మాత్రమే అభ్యసించి, క్రమముగ అభ్యాసకాలమును క్రమముగ యిరువదినిమిషములు వరకుగాని ముప్పది నిమిషములు వరకుగాని హెచ్చింపవలయును. తరువాత మెల్లగ కాళ్ళను క్రిందకు దింపవలయును. రెండు లేక మూడు మాసములు యీరీతిగ అభ్యాసము చేసినచో శరీరబలము గలవారు ముప్పది నిమిషముల కాలము ఆసనము సాధింపగలుగుదురు. ఈ అభ్యాసమును మెల్లగ చేయవలయును. తొందరగ చేయరాదు. త్వరలో ఆసనమును నేర్చుకొనవలయునని ఆతురతయు, తొందరయు చెందరాదు. సహనముతో నుండవలయును. ఓర్పు గలిగియుండవలయును. ఈ విషయములను సదా మనస్సునందుంచుకొనినచో తప్పక జయము లభించును. దానంజేసి మోక్షము సులభసాధ్యమగును. క్రమము తప్పి ఆసనములను వేగు

రాదు. ఉదరమున గాలి నింపియు నుంచినప్పుడే గాలి వదల నూ అభ్యసించవలెను. ఈ అభ్యాసనమును ఉదయమును సాయంత్రమును కూడ చేయవచ్చును. శిరస్సుపై నిలువబడి నప్పుడు నాసికా రంధ్రములనుండి గాలిని మెల్లగ లోనికి పీల్చుచు మెల్లగ వదలుచుండవలయును. గాలి నిస్సారముగ నోటివెంబడి పీల్చుటగాని వదలుటగాని చేయరాదు. లావుగ నున్నవారు యీ ఆసనమును సులభముగ అభ్యసింపగలుగుదురు. ప్రారంభములో యీ ఆసనమును ఒక గోడకు ఆనుకొని వేసిన యెడల సులభసాధ్యముగ యుండును. ఇంకను, అసాధ్యముగనున్న వారు కాళ్ళను గోడకు చేర్చి నిలువబెట్టుటకు, వేరొకని సహాయము పొందవచ్చును.

ప్రారంభమున తలనొప్పులు, శరీరము తిరుగుచున్నట్లుండుట మొదలగు అవలక్షణములు గాన్పించినను, క్రమముగ అవి యన్నియు తగ్గి, హృదయమున ఆనందమును, శరీరమున సౌఖ్యమును కలుగును. వేసవికాలములో యీ ఆసనమును అభ్యసింపరాదు. శీతకాలము, వర్షకాలములలో బాగుగ, అభ్యసింపవచ్చును. వేసవియందు స్వల్పముగ అభ్యసింపవచ్చునని అనుభవజ్ఞులు తెలుపుచున్నారు. అభ్యాస అనంతరము సుమారు పదిహేను నిముసముల కాలము విశ్రాంతి తీసుకొని, తరువాత కొంచెము పాలను త్రాగవలయును. ఈ ఆసనము నందు సుమారు అరఘడియల వరకు నుండగలవారు కూడ యున్నారు. ఈ ఆసనమునందు సమాధి చెందిన యోగిశ్రేష్ఠులు కూడ కలరు. ప్రతిదినమును విడువక యీ ఆసనమును రెండు ఘడియల కాలమునైనను చేయుటవలన విశేష ప్రయోజనము కలదు.




శీర్షాసనము-(తృతీయస్థితి)




శీర్షాసనము (చతురపితి)

## ప్రయోజనములు

బ్రహ్మచర్య వ్రతమును అనుష్ఠించుటకు యీ ఆసనము విశేష సహాయకారిగ యుండును. దీనివలన రేతస్సు ఊర్ధ్వ ముఖముగ వ్యాపించగలుగును. ఊర్ధ్వరేతస్సు లభించినవారికి మనోనిగ్రహము కలుగును. శీర్షాసనము వలన కలుగు ప్రయోజనములు వర్ణింపనలవి కావని యోగి పుంగవులు తెలిపియున్నారు. ఈవిధమైన ఆసనమువలననే మేధస్సునకు బలము చేకూరును. ఈ ఆసనమువలన భూమియొక్క ఆకర్షణ శక్తికి విరుద్ధముగ నడచుచు, హృదయ కోశమునుండి రక్తము మేధస్సునకును శరీరమునందలి వివిధభాగములకును సులభముగ ప్రసరించగలుగును. జ్ఞాపకశక్తి వృద్ధి యగును. న్యాయవాదులు, శాస్త్రవేత్తలు, విద్యావంతులు మొదలగు వారికి యీ ఆసనము విశేష ప్రయోజనకరముగ నుండును. స్వతసిద్ధముగ దీనివలన సమాధియు, ప్రాణాయామమును లభించుశక్తికలదు. ఈ ఆసనమును ప్రతిదినమును అభ్యసించువారలకు హృదయమున ఒకవిధమైన ఆనందమును, ముఖమున తేజస్సును ప్రారంభమగును. అభ్యాసానంతరము ధ్యానమునకు కూర్చుండినచో, విశేషప్రయోజనము కలదు. మనస్సు నిశ్చలముగ యుండును. ఒకవిధమైన నాదము కర్ణములయందు జనించి, హృదయము ఆనందమును, ధైర్యోత్సాహములను కలుగజేయుచుండును. ఈ ఆసనమువలన కలుగు ప్రయోజనములు అనంతములైనవని యోగశాస్త్రము లన్నియు తెలుపుచున్నవి. మధ్య వయస్సునందు యీ ఆసనమును తప్పక అభ్యసించవలయు ననియు, యౌవనకాలమున యీ ఆసనమువలన ప్రయోజనము

సులభముగ కలుగుచున్నదనియు, యోగశాస్త్రవేత్తల అభి ప్రాయము. అభ్యాసనా కాలమున తరచుగ స్త్రీసంపర్కము చేయరాదను నియమమును జ్ఞాపక ముంచుకొనవలయును.

శరీర వ్యాధులను రూపుమాపుటకు యీ ఆసనమునకు మించిన ఆసనము వేరొకటిలేదని శాస్త్రమునందు చెప్పబడి యున్నది. ఇది కుండలినీ శక్తిని లేపి, దివ్యజ్ఞానమును కలుగ జేయును, జీర్ణకోశమును శుభ్రపరచి, ఆలోచనాశక్తిని అభి వృద్ధి చేయును. రక్తమును శుభ్రపరచుటలో, యీ ఆసన మునకు మించిన విధానము వేరొకటియు లేదని ముని వర్యులు తెలిపియున్నారు. నేత్రరోగములు, నాసికారోగ ములు, శిరోవ్యాధులు, హృదయరోగములు, అజీర్ణ వ్యాధులు, మర్మాంగములకు సంబంధించిన సకలవిధములైన దోషములు, పైత్యకోశమునకు సంబంధించిన రోగములు, శ్వాసకోశమునకు సంబంధించిన రోగములు, ఉపదంశ; గనే రియా, అతిమూత్రము, మూలవ్యాధులు, ఉబ్బసము, క్షయ, సవాయి మొదలగు సమస్తరోగములు, సూర్యకిరణములకు అంధకారము నశించు విధమున నశించునని యోగీశ్వరులు తెలిపియున్నారు, జఠరాగ్నిని వృద్ధిపరచును. శరీరమునందు ముడతలు పడుట, వెంట్రుకలు తెల్లబడుట, బద్ధకము, నీరసము మొదలగునవి అదృశ్యమగును. సుమారు ఎనిమిది ఘడియల కాలము యీ అభ్యాసమును చేయగలిగినవాడు యోగియని పిలువబడును. పురుషులకు సకలవిధములైన శుక్లదోషములు హరించును, స్త్రీలకు గర్భాశయదోషములు హరించి సంతా నము కలుగును. ఈ ఆసనమును సకలయోగశాస్త్రములును విశేషముగ కీర్తించుచున్నవి.




ఉత్తాన కూర్మాసనము

## 15. ఉత్తాన కూర్మాసనము

శ్లో॥ కుక్కుటాసనబంధస్థో దోర్భ్యాం సంబధ్యకంధరామ్,
భవేత్కూర్మవదుత్తాన ఏతదుత్తాన కూర్మకమ్॥

లక్షణము:—మొదట కుక్కుటాసనము నందు చెప్పబడిన విధముగ కూర్చుండి, కంఠభాగమును రెండుచేతులతో పట్టుకొని భుజములను కంఠమునకు రెండువైపులందును చేర్చి కూర్మమువలె వెల్లికిల పడియుండునది ఉత్తాన కూర్మాసన మనబడును.

విశే. ఉత్తాన కూర్మాసనమునందుండి, కంఠమును రెండుచేతులలో పట్టుకొని శరీరమును నిక్కించి యుంచిన గర్భాసన మనబడును.

సుఖదాయకముగ నుండును. యోగాభ్యాసమువలన శరీరము నకు శ్రమకలిగినప్పుడు మాత్రమే యీ ఆసనమును అభ్యసింప వలయును. ఇతర ఆసనములు అభ్యసించి, అట్టి అభ్యాసమువలన శరీరము శ్రమజెందినప్పుడుమాత్రమే యీ ఆసనమును అభ్యసింప వలయును. ఇతర సమయములయందు ఆచరింపరాదు.

## 18. యోగముద్ర.

మొదట నేలపై పద్మాసనమున గూర్చుండుము. అర లను కాలిమడమలపై నుంచి, శరీరమును చేతులపై ము. వాయువును నాశికారంధ్రముల నుంచి విడువుము. ముందునకు వంగి, లలాటముచే భూమిని తాకుము. స్థయందు చాలకాలము కూర్చున్నచో, మెల్లమెల్లా ని పీల్చుచు వదలుచుండ వచ్చును.




యోగముద్ర.

ను కాలిమడమలమీద ఆనించుటకు వారికి చేర్చి, గట్టిగ ఆనించిపట్టుకొన లేదా వీపు వెనుకకు చేర్చి ఎక బింప

మణను కుడిచేతితో పట్టుకొనవలయును. ఇది ఉదరమునకు సంబంధించిన సకల దోషములను హరింపజేయును.

## 19. ఉద్యానబంధము.

ఈ బంధమును అభ్యసించినచో మృత్యువును జయించుటయే గాక సదా యౌవనవంతులుగ నుండగలుగుదురు.

ఈ బంధము మానవులకు విశేష శ్రేయోదాయకమైనది, ఇది ఆరోగ్యమును, బలమును, శక్తిని, ఉత్సాహమును, తేజస్సును కలుగజేయును. బ్రహ్మచర్య వ్రతమును కాపాడుకొనుటకు నిది మిక్కిలి సహాయకారిగ యుండునని యోగ శాస్త్రములు తెలుపుచున్నవి. బంధములన్నియు కుండలినీ శక్తిని ఉదయింప జేయునని చెప్పుచున్నవి.



ఉద్యానబంధ

క్రమము.

ఊపిరిబిగబట్టి ఉదరమునంటలి కండరమ

పట్టి వెను పుభాగమును చేరునట్లు చేయ

వత్తు గును. ఊపిరి బిగబట్టుటవలన

కాళీనై ఉదరమునందలి కండరములు హృదయకోశము వైపు గూడ పోయి, వక్షమును పెద్దదిగ చేయును. తరువాత గాలిని మెల్లగ వదలుచు, ఉదరమును యథాస్థితికి తేవలయును. ఈ బంధనమును ఆచరించునప్పుడు శరిరమును కొంచెము ముందునకు వంచవలయును. దీనిని కూర్చుండిగాని, నిలువబడిగాని, అభ్యసింప వచ్చును. నిలువబడి అభ్యసించునప్పుడు అఱచేతులను మోకాళ్ళమీద గాని, తొడలప్రక్కగాని, ఆనించ వలయును. పాదములు ఒకదానికొకటి దూరముగ నుంచవలయును.

...లిన పదార్థములను తొల... ...ందు కొవ్వును హరింప

మావద్ద దొరుకు ఔషధరాజములు

# కామ కల్ప తరువు

ఈ రసాయనమును, పుచ్చుకొనిన జీవనరసములలో చేరి వచ్చిన మేహదుర్నీరు నశించును. స్త్రీ సంభోగముచే నేర్పడిన తెలుపు, కాక, గ్రంధి, మేహవ్యాధి, మేహదురద పిత్త పాండు, క్షయ, కాసలు పోగొట్టును. దీనితో సాటి వేరొకటి లేదు. దురభ్యాసమువలన హస్తప్రయోగాదులచే గుహ్యావయవము దుర్బలమై చిక్కిపోవును, వేడిబలహీనము, ధాతు నష్టము స్వప్నస్ఖలితము, నరముల బలహీనత, ఆయాసము. దేహంభీతి ఆకలి లేకుండుట, మలబద్ధకం, గుల్మము, అజీర్ణం, నిద్రలేకుండుట, మేహకాక రక్తముచెడుటచేగల్గు వ్యాధులు మూలకాక, గుండెదడ, వెన్నునొప్పి, దగ్గు, ఇంద్రియమునీరై మూత్రములోపోవుట స్త్రీలతో చేరిన వెంటనే స్ఖలితమై పోవుట. సంభోగ చింత గలుగుటచే తనకు తెలియకనే ఇంద్రియముపోవుట, కాలు చేతులు బలహీనత, జ్ఞాపక శూన్యము, దృష్టిమాంద్యము మొదలైన లెక్కలేని వ్యాధు లను పోగొట్టి వీర్యవృద్ధి, ధాతుపుష్టి, రక్తవృద్ధి భోగశక్తి, ఆకలిని గల్గించును. శక్తిహీనమై దేహావయవములకు బలము నిచ్చి వృద్ధిచేసి రక్తకండరములను పెంపొందించు సాటిలేని సంభోగానందమును గల్గించును. స్త్రీలకు గలుగు ఋతు దోషము, రక్తము అధికముగ స్రవించుట, సంతానాధిక్యము వలన దేహము కృశించుట, సర్వావయవము కృశించుట, బలహీనము మర్మస్థానమున దురద, మంట, నొప్పి వేడిచే తెలుపుకారుట, మర్మసంబంధమైన మేహవ్యాధులనుఖండించి దేహమునకు కాంతిని గలిగించును. డబ్బి 1-కి 3-00

ఎన్. వి. గోపాల్ అండు కో.,

నెం. 63, కృష్ణప్ప నాయకన్ గుంటవీధి, మదరాసు-1.

# రతి మన్మథ బంగారు గుళికలు

ఈ మాత్రలు ప్రతిరోజు శయనించునపుడు ఒక్క మాత్ర చొప్పున ఆవు పాలతోటి పుచ్చుకొనినయెడల క్రింద కనపరచిన గుణము లగుపడును.

యౌవనమునందు కేవలము స్త్రీలోలురై దేహపటుత్వము గోల్పోయి, సంభోగ వాంఛ బొత్తిగా లేనివారై త్వరిత స్ఖలితమున్ను శుక్ల నష్టమున్ను గల వారు మరల అతి యౌవన పురుషులవలె అర్ధగంటలోగా వీర్యమును గట్టిపరచును

ఈ మాత్రలు సేవించుటవలన క్రిందివ్యాధులు పటాపంచలై పోవును,

రక్తమును శుద్ధిపరచును, రక్తము వృద్ధియగును. ధాతుపుష్టి కలుగును ఆకలి అధికమగును. దేహమందలి నరములు ఎముకలకు రక్తము ప్రసరించి బలమునిచ్చును.

ఇంకను యిందువలన క్షయరోగము, మేహవ్యాధులు, దినములు గడచిన కొరుకు, తెలుపు, మెహకారకము మొదలగు సమస్తమైన మేహజాడ్యములను ఖండించును. దీనిని స్త్రీ పురుషులు ఇరువర్గులవిడువక సేవించిన పుత్రసంతానము బడయుదురు. ఇంకను ఈ మాత్రవలన అజీర్ణము, బలహీనము తీరును, జాడ్యములను స్వస్థపరచును. కడుపునొప్పి, కడుపులో కలుగు సర్వవిధ వ్రణములు పోగొట్టును. 100 మాత్రలు రూ. **7-00**

# మేహాంతక రసాయనము
(మేహరోగ నిర్మూలిని)

ఇది శాస్త్రసంబంధమైన నూటయిరునది పచ్చి మూలికలతోడను ఉప్పువగైరా ఆకు పసరులతో తయారు చేయబడిన దివ్యౌషధము అనేక వ్యాధులను నిర్మూలించును. ఎటువంటి దుష్టసుఖవ్యాధులైనను వివిధ రకములైన మేహ రోగములను ధ్వంసముచేయును. మేహసంబంధమైన వ్యాధులకు రామబాణమువలె పనిచేయును మరియు.

యీ నూనెను సేవించుటవలన కంఠమాల సమస్త సుఖవ్యాధులు అన్ని రకములైన శెగవ్యాధులు, ఆసన సంబంధమైన మూల వ్యాధులు నల్లమచ్చలు గ్రంధి మేహ తామర మచ్చలు దురద పార్శ్వ వాయువు సూతక జన్ని కాళ్ళు చేతులు పట్టుపట్టుట, ముఖము వుబ్బుట పచ్చకామిర్లు ఏనుగు కాళ్ళువలెవుబ్బుట మున్నగు అనేక వ్యాధులను సర్వ మేహములను ధ్వంసంచేయును. 5 పూటలకు నూనె 3-00

# పుత్రసంతాన సంజీవి నూనె

గమనింపుడు ! స్త్రీలపాలిటి వరప్రసాదిని !! పరీక్షించుడు !!!

స్త్రీలయొక్క గర్భమున పురుగులుజేరి ఇంద్రియమును నాశపరచుటచే తను పదేపదే భోగేచ్ఛచేయుటవలన గర్భగోళమునందు కండ పెరిగి గడ్డ యున్నను, వాయువుపైత్యము చేరినను స్త్రీలకుగర్భము నిలువదు అట్టి వారు యీ నూనెను ఉదయం సాయంకాలములయందు 1-టి లేక 3 దమ్మిడీలు తూవిత చొప్పున 15 రోజులు సేవించినచో గర్భగోళమునుండు ఆరువిధములగు రోగములను నివర్తించి ఆ మరునెలలోనే గర్భము నిలుచును. కొందరికి 2-3 నెలల వరకు నిలిచి పిమ్మట పోవుట గలదు. అట్టివారికికూడా ఈ ఔషధము పరమ శ్రేష్ఠమైనది ఆర్యబృంద సహోదరులారా ! ఈ పుత్రసంతాన నూనెను కొని ఒకపర్యాయము మీ యింటిలో స్త్రీలకు యిచ్చిచూడుడు. ఈ పుత్రసంతాన నూనె పరమ శ్రేష్ఠమైనది. స్త్రీలపాలిటి వరప్రసాది, పుత్రులు లేనివారికి పుత్ర సంతానము కలుగజేసి ఆనందింపజేయు మహత్తైననూనె ఇదొకటియే యనదగును.

సీసా 1-కి రూ. **2-00**

# హనుమంత సంజీవి లేహ్యము

సింహమువంటి పరాక్రమమును, ఏనుగవంటి బలము కలిగించు దివ్యౌషధము. దీనిని సేవించిన దేహపటుత్వమును, పుష్టిని ధాతువృద్ధిని పుష్టి రక్తవృద్ధిని జీర్ణ శక్తిని నరములకు దేహావయములకు బలమును ముఖమునకు చక్కని తేజస్సును, ఉత్సాహమును ఆయుర్వృద్ధిని కలిగించును. నిస్సత్తువను తొలగించును. మరియు ఉష్ణవాయువు పార్శ్వవాయువు. పిత్తమయికం నోరూరుట పసరుపడుట తల తిరుగుట రొమ్మునొప్పి కాళ్లుచేతులు పోట్లు మేహ కాశ నపుంసకత్వము ధాతునష్టములను పోగొట్టి సర్వభోగములను సంతృప్తికరముగా అనుభవించగల శక్తిని ఉత్సాహమును ప్రసాదించును ఖరీదైన వస్తువులతో తయారు చేయబడినది. ముసలితనమును సైతము మరిపించునట్టి బలపరాక్రమముల నిచ్చు సాటిలేని ఔషధము. 40 రోజులకు రూ. 4-00

# సకల మేహ సిద్ధాంత సూనె

వాత సంబంధమైన సర్వవ్యాధులను నిర్మూలముచేయు ఆగ్నేయాస్త్రము. యీనూనెను సేవించుచున్న కడుపునందు చిరకాలమునుండి పేరుకొనియున్న వాతములను నిర్మూలించును. మలబద్ధమును పోగొట్టి దినమునకు రెండు మూడు సార్లు ప్రవర్తిని కలిగించి వ్యాధులన్నిటిని తొలగించును.

దీనిని సేవించిన సుఖజాడ్యములు బట్టంటు గుండె బల హీనత కండ్లు నొప్పులు రణములు గుల్మములు పక్షవాతము జోదకాలు సంబంధమైన వాపులు వడిసెగడ్డలు బుడ్డ మున్నగు వ్యాధులను హరించును.

స్త్రీలకు సంబంధించిన సూతికావాతము కుసుమవ్యాధి మొదలైన అనేక వ్యాధులకు అమోఘమైనమందు. వందలాది ప్రజలు ప్రశంసించి యున్నారు. సీసా 1-కి 6-00

# తలనొప్పి తైలము

అన్ని నొప్పులకు అమోఘముగా పనిచేయు అద్భుత తైలము. ఈ తైలమును రుద్దిన తలనొప్పి, పార్శ్వవాయువు, తొడలనొప్పులు, కడుపు నొప్పి, బీజరోగము, గొంతునొప్పి మున్నగు బాధలు 5 నిమిషములలో పటాపంచలై పోవును.

2 సీసాలు 1-50

# సుఖవిరేచన మాత్రలు

పిల్లలు పెద్దలు వాడదగిననవి. మిక్కిలి శ్రేష్టమైనవి. ఈ మాత్రలు సేవించిన సుఖవిరేచనము లగును, క్రిములు నశించును అజీర్ణము వాయువు జలుబు జ్వరము మున్నగునవి తొలగును ప్రతిగృహమునందును ఒక సీసా వుండదగినది.

సీసా 2-కి 2-00

# గోపాల్సు యుటెరోక్యూర్

ఏ కారణముల వల్లనైననూ ఏరోగ దోషముల వల్లనైననూ స్త్రీలు గర్భవతులు కాకున్ననూ అట్టివారు పుత్ర సంతాన దాత యనదగు గోపాల్సు యుటెరోక్యూర్ సేవించు చున్న యెడల గర్భగోళమున నుండెడి సమస్త దోషములను రోగములను నివర్తించి గర్భస్రావము మున్నగువాటి వలన స్త్రీలకు కలుగు బలహీనతను పోగొట్టి సుఖజీవనమునుసంతాన ప్రాప్తిని కలిగించును. సీసా 1-కి 2-00

# మల విసర్జన లేహ్యాము

5 ఏండ్ల పిల్లలు మొదలు వృద్ధులవరకు స్త్రీ పురుషు లెల్లరు సేవించ ధగినది. రుచికరమైనది దీనిని సేవించిన మల బద్ధమును నిర్మూలించును. మరియు కాళ్ళు చేతులు పోట్లు, గర్భవాయువు మూలవాయువు అపానవాయువు గుల్మవాయువు మున్నగు ఉదరవ్యాధుల నివారించి కడుపును శుభ్రపరచును నిత్యము సకాలమందు ప్రవర్తియై సుఖము కల్గుచు.

డబ్బి 2-కి 3-00

## గోపాల్సు ఎలిక్సో - వైట్

దీనిని సేవించిన రక్తమును, బలమును, ధాతుపుష్టిని వృద్ధిచేయును స్త్రీ పురుషులెల్లరు స్వేచ్ఛగా ఆనందముగా సేవించదగినది. ఇదిశరీరమందు కండ, ఎముకలు, నరములు మొదలగు వాటికి శుద్ధరక్తమును ప్రవహింపు మంచి శక్తి నిచ్చుటలో అమృతతుల్యముగా పని చేయగల ఔషధము.

మరియు బహుకాలముగానుండు తెలుపు మేహ వెట్ట, దుర్నీరు, మూలనరముల సడలింపు, గజ్జి, తీట, మలబద్ధము, అజీర్ణము, కాళ్ళు చేతులు తీపు, నడుమునొప్పి, తలత్రిప్పుట, మూత్రవ్యాధులు మొదలగు రోగములను నశింపజేసి సర్వభోగములను అనుభవించుటకు తనశక్తి సామర్థ్యములుగల యవ్వనత్వమును ప్రసాదించును. స్త్రీలు పురుషులు, వృద్ధులు, సేవించదగినది. ఒకసారి వాడి చూచిన దీనియందుగల అపూర్వ గుణములు తెలియ గలవు. సీసా 1-కి 2—25

# ఇస్ప్రసారము

క్షయ మున్నగు గుండెజబ్బులకు అమృతతుల్యమైన ఔషధరాజము. దీనిని సేవించిన సకల విధములైన క్షయ రోగములను నశింపజేయును. హృదయ వ్యాధులను, అగ్ని మాంద్యము, ముఖరోగములు, శ్వాసకాసలు, కాళ్ళు నొప్పులు, కఫము, గొంతు కమ్ముకపోవుట, గొంతురణము, ఊపిరితిత్తులందు యేర్పడు అరవి రణాలు. గుండెదడ. దగ్గులు, సోమరితనము మున్నగు వ్యాధులను నిర్మూలించి గుండెకు బలములు, రక్తపుష్టిని యిచ్చును. బిడ్డలకు తొమ్ముకొట్టుకొనుట, ఆయాసముగా నుండుట, ఆకలి లేకుండుట, జీర్ణ శక్తి లోపించుట మున్నగు వ్యాధులను పొలగించి శరీరమును దృఢపరచును. హృద్రోగము, బలహీనము, దగ్గు గలవా రెల్లరును తప్పక సేవించదగినది.

వెల రూ. **6-00**

## రక్తశుద్ధి అయఃకాంత ద్రావకం

తెల్లని వెంట్రుకలు నల్లనగుట, పురుగులు కత్తిరించుట, అధిక ఉష్ణమువల్ల రాలిన వెంట్రుకలను మరల పెరుగనిచ్చును కండ్లు చేతులు కాళ్ళమంటలను పోగొట్టును. ముఖమునకు తేజస్సు కలుగజేయును. దేహమునందుండు ఉష్ణమును పోగొట్టి చేతులు కాళ్ళు నడుములలో కలుగు అశక్తత నొప్పులను పోగొట్టి బలమునిచ్చును. పయిత్యపువాయువులను ఒక మండలములో ఎన్నటికిని రానివ్వక బహు ఆకలియున్న జీర్ణశక్తియున్ను కలిగించును. సడలిన నరములను బలపరచి దృఢమును కలుగజేయుటలో దీనికి మించిన ఔషధము యింకొకటిలేదు. గోళ్ళలోను, కండ్లలోను, నెత్తురులేక తెల్లబారియున్నవారు ఈ ద్రావకమును ఒక మండలము (40 రోజులు) సేవించినయెడల దేహమాద్యంతము క్రొత్త రక్తము వ్యాపించును. శైత్యము పరిమితిని పాండు, గుల్మము, చేతులు కాళ్ళ వాపు గుండెనొప్పి మొదలగు వాటిని స్వస్థపరచును.

40 రోజులకు రూ. **2-00**

## నరసిన వెంట్రుకలను నలుపుజేయు తైలము

దీనికంటె యెక్కువయగు తైలము భూమండలమున లేదు. నల్లని వెంట్రుకలవలెనే చేయును. మిగుల కాంతియునిచ్చును. దీనిని వాడిన తర్వాత ముఖలక్షణమున్ను వశీకరణమున్ను కలుగుటవలన వయోధిక్యము గలవారున్ను బాలురవలె కనబడుదురు. ఇది నిజము దీనిని వుపయోగించు విధము మందుతో కూడ పంపెదము.

2 సీసాలు రూ. **3-00**

# కామధేను

ఇది పలురసములతోను, మలయాళ పద్ధతిలో తయారు చేయబడియున్నది. పత్యములేదు. సర్వకాలమునందు ఎల్లరును భుజింపదగినది.

ఈ రసాయనమును, పుచ్చుకొనిన జీవనరములలోచేరి వచ్చిన మేహ సుర్ల్నిరు నశించును. స్త్రీసంభోగముచే నేర్పడిన తెలుపు కాక. గ్రంధి, మేహావ్యాధి, మేహధుగద, పిత్తపాండు క్షయ, కాసలు పోగొట్టును. దీనితో సాటి వేరొకటి లేదు. దురభ్యాసములవలన [హస్తప్రయోగాదులచే] గుహ్యావయము దుర్బలమై చిక్కిపోవుట వేడి బలహీనము, ధాతు నష్టము, స్వప్నస్ఖలనము, దేహము బలహీనత, ఆయాసము, దేహభీతి. ఆకలి లేకుండుట, మలబద్ధకం, గుల్మము, అజీర్ణం, నిద్రలేకుండుట. మేహకాక, రక్తము చెడుటచే గల్గువ్యాధులు మూలకాక, వెన్నునొప్పి, దగ్గు, స్త్రీలతో చేరిన వెంటనే స్ఖలితమైపోవుట, సంభోగచింత గలుగక తెలియకనే యింద్రియం పోవుట, కాలుచేతులు బలహీనత, జ్ఞాపకశూన్యము, దృష్టిమాంద్యము మొదలైన లెక్కలేని వ్యాధులను పోగొట్టి కన్యవృద్ధి భోగశక్తి ఆహారము కల్గించును. సాటిలేని సంభోగమును కల్గించును. స్త్రీలకు కలుగు బుతుదోషము, రక్తము అధికముగా స్రవించుట, సంతానాధిక్యమువలన దేహము కృశించుట, బలహీనము, మర్మస్థానమున దురద, మంట, నొప్పి పడిచే తెలుపు కారుట మర్మసంబంధమయిన మేహావ్యాధులు మొదలయిన అనేక వ్యాధులను ఖండించి దేహమునకు పుష్టి, బలము కాంతిని గలిగించును. డబ్బి 1-కి రూ. 3—00

## సంగీతానంద సభావల్లభుడు

దీనిలో కొంచెము ఎత్తి నోటియందు నుంచుకొని రసము మ్రింగు చూవచ్చినయెడల పాట ధ్వనియిచ్చును. ఇందుకు పత్యములేదు.

2 సీసాలు 2-00

# గోపాల్సు టానిక్

## ఆకలిని కలుగజేసి బలమును యిచ్చునట్టి ఔషధరాజము

1. గోపాల్సుటానిక్ అను నీ ఔషధము ఆయమతోడను, పలు విధములగు వనరాతికలచేతను తయారు చేయబడినది. జనులకు మిక్కిలి ఉపయోగకారియగు తన ఔషధము.

2. గోపాల్సుటానిక్ అను నీ ఔషధమును సేవించిన బలహీనము దేహశ్రమ, తలత్రిప్పుట, నపుంసకత్వము తొలగించి దేహమునకు బలము కలిగించును. ధాతుపుష్టియు, దేహదారుఢ్యమును కలుగజేయు గొప్ప ఔషధము.

3. గోపాల్సు టానిక్ అను నీ ఔషధము జీర్ణశక్తి లోపించిన వారు సేవించిన జీర్ణశక్తి కలిగించి ఆకలి పుట్టించును. ఎటువంటి పదార్థము భుజించినను త్వరలో జీర్ణము చేసుకొనగల శక్తిని గలుగజేయును.

4. గోపాల్సు టానిక్ సేవించుచున్న రక్తమును వృద్ధిపరచి దేహ పటుత్వమును కలిగించును. నరములకు బలమును కలుగజేసి వృద్ధులను వయోవంతులుగా చేయును. దీనితో సమానమగు టానిక్ మరొకటిలేదు.

సీసా 1-కి **2-00**

# కాంగ్రీన్ అను వ్రణసంజీవి

సకల విధమైన మేహ వ్రణములను, నివారణకాని పుండ్లను, గడ్డలను, పుండ్లను, రాచగడ్డలను, స్వస్థపరచును. మొదటిలో వ్రణము లలోనుండి అధికముగా చీము వచ్చును. అందువల్ల భయపడ వలసినది లేదు. రాచగడ్డ ఎటువంటి స్థితిలో నుండినప్పటికిన్ని భయములేక కాంగ్రీన్ అను వ్రణసంజీవిని వుపయోగించ వచ్చును. ఆపరేషన్ చేయకనె అన్నివిధ గడ్డలను సుఖపరచును, గడ్డలు పగులుటకు ముందును పగిలిన వెనుకను ఈ మందునే వుపయోగించ వలయును.

ఈ ఔషధమును ఒక ఆకులోగాని, తమలపాకులోగాని చరిమి వ్రణము యుండుచోటు వరకు వేయవలయును.

మందు గట్టిగా నుండినచో మంచినూనె కలిపి వుంచుకొనవలయును కట్టు కట్టవలసినచోట దూదిని పైకినుంచి కట్టవచ్చును. కాళ్ళయందు గలుగు ఎటువంటి దురదపుండ్లు, మేహ మొటిమలకున్ను, ఈ ఔషధము పరమశ్రేష్టమైనది. సీసా 1-కి 1—50

## ఊరుపిచ్చుకల సత్తువ లేహ్యము

సుఖజీవితమును కోరు ప్రతివ్యక్తియు సేవించదగిన బలప్రదకమగు ఔషధరాజము, బలము, చురుకుదనము, దేహపుష్టి. ధాతుపుష్టి లేని జీవితము నిష్ప్రయోజనమనియే చెప్పవచ్చును. ఇట్టి లోపములుగల వ్యక్తులెల్లరు మిక్కిలి వ్యయ ప్రయాసలతో తయారుచేయబడిన ఊరుపిచ్చుకల సత్తువలేహ్యము సేవించిన శరీరమునకు మంచి రక్తము, తేజస్సు, దేహమునకు బలము, ధాతుపుష్టి కలుగజేయును. నరములకు మంచి శక్తినిచ్చును, చురుకుదనము నిచ్చును. అలసటను, నిరుత్సాహమును పోగొట్టును. ఒకసారి వాడి చూచిన దీనివలన కలుగు లాభములు తమంతట తామే తెల్సుకొని సర్వదా సేవించుటకు నిశ్చయించుకొనగలరు. 40 రోజులకు వెల రూ. **4-00**

## శకుంతలా వెంట్రుకలు పెరుగు తైలము

సోదర సోదరీ మణులారా!

భూలోకమునందు స్త్రీ పురుషుల కిర్వురకు ఆనందము అలంకారమగునది. సాక్షాద్భగవంతుని కృపాకటాక్షముగాయున్నది. అట్టి యంశమున కనుకూలమయినవి వెంట్రుకలు గనుక ఈ మహోపకారియగు తైలమును వెంట్రుకలకు చరిమి దువ్వుచూ వచ్చినచో ముఖోల్లాసముగా వెంట్రుకలు పెరిగి నలుపు వర్ణముగా యుండునటుల జేసి నేత్రములకు చల్లని దృష్టినిచ్చి యందుండు రోగములను శుభ్రముగా నివారించి కంటియందు నీరుకారడం, తలలోనుండు కురుపులు, వెంట్రుకలు పగులుట, మయికం, తలత్రిప్పుట, దేహమునందు తీట గజ్జి, దురద, చెమటగబ్బు, మనోవ్యాకుల, జ్ఞాపకమరుపు ఈ మొదలగు సర్వవ్యాధులను పోగొట్టి దేహమునకు ప్రకాశమున్ను, సువాసనయున్ను కలుగజేయును. ముఖమునకు తేజస్సు నిచ్చును. ఉష్ణదేహముగలవారు యీ తైలములో కొబ్బరి చమురు చేర్చి ఉపయోగించ కలయును.

యీ వాసన తైలమును తలకుచరిమి దువ్వుకొనినయెడల దాని యొక్క సువాసన గుబాళించుచుండు ఘుమఘుమాయించుచును. ఇది నిజమో అబద్ధమో సందేహము గలవారు ఒక డబ్బీమాత్రముకొని ఉపయోగించిన మీకే తెలియును. డబ్బి 2-కి రూ. **3-00**

## లీ లా తి శ య ము

నరములకు, పురుషచిహ్నమునకు ఉత్తేజమును కలిగించి అధికమైన సంభోగశక్తిని కలిగించు పైపూత మందు. సీసా 1-కి 2—50

# గోపాల్సు లేహ్యము

స్త్రీ పురుషులకు గలుగు అన్నివ్యాధులకు దివ్యౌషధము, ఇది మలయాళ పద్ధతిలో పలురసములతో తయారు చేయబడినది. బలవర్ధకమైనది. సర్వకాలములయందును సేవించదగినది. మిక్కిలి ప్రసిద్ధిని పొందినది.

గోపాల్సు లేహ్యము:—సేవించిన అధికమైన ఉష్ణమువల్లనూ, దురభ్యాసముల వల్లనూ, చెడు సహవాసమువలనను కలుగు వ్యాధులను, దోషములను, బాధలను నిర్మూలించి ముసలివాని సైతము శక్తివంతులగు యౌవనులవలె చేయును.

గోపాల్సు లేహ్యము:—సేవించిన మేహవ్యాధులను, పిత్తపాండు క్షయ, అతివేడి, ధాతునష్టము, నరముల బలహీనత, ఆయాసము, ఆకలి లేకుండుట, మలబద్ధము, గుల్మము, అజీర్ణము, నిద్రపట్టకుండుట, గుండె దడ, వెన్నునొప్పి, దగ్గు, మూలశాక, కాలుచేతులు బలహీనత, నడుము బలహీనమగుట, జ్ఞాపకశక్తి, తగ్గుట, దృష్టిమాంద్యము మున్నగు వ్యాధులను నశింపజేసి రక్తవృద్ధి, ఆహారము, ధాతుపుష్టి కలిగించును.

గోపాల్సు లేహ్యము:—స్త్రీలకు గలుగు ఋతుదోషములు, కుసుమ వ్యాధులు హరించును. శక్తిహీనమై కృశించిన దేహావయవములకు బలము, కండపుష్టి చేకూర్చును, శరీరకాంతిని, పుష్టిని కలిగించును.

డబ్బి 1-కి రూ. 3-00

# తేలుకాటుకు మందు

ఇది అన్నిరకములైన తేలుబాధలను 5 నిమిషములలో తగించగల ఆరోగ్యమైన మందు, అంతవరకు తేలు కాటువలన బాధపడుచు, దుఃఖపడుచున్నవారు దీనిని ఉపయోగించిన వెంటనే బాధతగ్గి నవ్వుచు ఆనందముగా నుందురు. ఘోరమైన మంటలను చల్లార్చి సుఖము కలిగించును.

3 సీసాలు రూ. 1—50

# కత్తి నరుకు గాయములకు తైలము

కత్తివలన గాయమైన భాగమున యీ తైలమును రుద్దిన వెంటనే బాధనుపోగొట్టి రెండు మూడు రోజులలో గాయమును మాన్పును. గాయమునకు చీము పట్టనివ్వదు. ప్రతియింటియందును తప్పక వుండవలసినది. సీసా 2-కి 1-50

# దృఢధాతుకరణి

ఇవి అనేక కారణములచేత శుక్లదోషమేర్పడి దేహపటుత్వముచెడి జీర్ణ శక్తియు సంభోగవాంఛయులేక కష్టముతో కాలము గడుపువారిని రక్షించు సంజీవికరణి ఈ లేహ్యము నీళ్లైన శుక్లమును మణివలె గట్టిపరచి రతియందు శీఘ్ర వీర్యస్ఖలనము పోగొట్టును. సకల మేహములు, మూల మేహములు, మూలరోగములు, అగ్నిమాంద్యము ముఖరోగము, సోమరి తనము, నడుము కాళ్ళ నొప్పులు మొదలగు బలహీనముచేత గలుగుసకల దుర్గుణములను విశేషముగ ఖండించును. స్త్రీలకు కలుగు తెలుపు ఎఱుపు మొదలగు సకల వ్యాధులను పోగొట్టును. శరీరబలమును హెచ్చించును. బాలతనమున నరసిన వెంట్రుకలను, నలుపుజేయును ఇంద్రియ నష్టముచేత పలుచన యగుటవలన బలహీనతచే కృషించిన వారు ఈ దివ్యౌషధమును 40 దినములు సేవించిన నత్యాశ్చర్యముగు శుక్లవృద్ధిబొంది యౌవనవంతులై సర్వసుఖము లనుభవింప శక్తులగుదురు. బాలురు, గర్భిణీస్త్రీలు వృద్ధులు, సదా సేవించి సంపూర్ణ ధాతు వృద్ధిని బొందవచ్చును. ఇవి భుజించుటకు మిగుల రుచిగానుండును. ఈ దృఢధాతు కరణి ఒక్కమారు వాడినచో యదార్థము గ్రహింపగలరు. 40 రోజులకు రూ. **4-00**

## సకలవిధ పొడ సంహారి

చర్మవ్యాధులను నశింపజేయుటలో సాటిలేనిమందు

శరీరమున మడతలుగల భాగములందు అనగా చంకలు, తొడలు, కంఠము, వస్త్రములు ధరించు నడుము చుట్టుగల భాగము, పొత్తికడుపునందును చిన్నచిన్న బొబ్బలై దినదినమునకు వృద్ధియై తీరని తీటగల్గి సుఖముగా నిద్రించ నివ్వకుండ చేయునట్టి తామర. మేహతామర. మేహకారక తామర దట్టపు తామర, మొలగజ్జి మున్నగు చర్మవ్యాధులను, దక్షిణదేశపు పురుగుకాటు వలన కలిగే బాధలు రెండుదినములలో వున్నచోటు తెలియని విధముగా మాన్పి సుఖపఱచును. 2 సీసాలు రూ. **1-50**

# చెవినొప్పి తైలము

చెవిపోటు చెవులనుండి చీము కారుట చెవులుదిమ్ముగా వుండుట హోరుమున్నగు చెవిబాధలను యీ తైలము వాడిన తక్షణం నశింపజేయును చెవిపోట్లు మున్నగు బాధలకు గొప్ప మందు.

347 2 సీసాలు రూ 1-50

# మదన మనోహర లేహ్యము

దీనిని సేవించిన ఏనుగువంటి బలమును, ధాతుపుష్టియు కలుగును. యీ లేహ్యము అమూల్యమైన అనేక మూలికలచే తయారు చేయబడినది. దీనిని పిల్లలు పెద్దలు వాడవగియున్నది. దీనిని సేవించిన బలము, రక్త వృద్ధి, కండపుష్టి కలుగును. బలహీనము, ఆయాసము, ధాతునష్టము, కాళ్లు పీకుట, గుండెదడ మున్నగు రోగములను నిర్మూలించి వృద్ధులు సైతము యౌవ్వనులవలె సకల భోగము లనుభవించునట్లు చేయగలదు. దీనిని ఒక సారివాడి చూచిన తీనివలన యేయే లాభములను పొందగలరో తమంతట తామే గ్రహించుకొనగలరు. 40 రోజులకు రూ. **4-00**

## పురుషులు ఉపయోగించు రబ్బరు గొట్టము

ఇదియొక అద్భుతమైన గొట్టము. పురుషులు సంతోష కాలమందు ఉపయోగించుటకై ప్రత్యేకముగా తయారు చేయబడినది. స్త్రీలనుండి అంటువ్యాధులను పొందకుండ అడ్డగించుటకు యీ సాధనముకంటె వేరేది యుపాయము లేదు. దీనిని అందరు నుపయోగింపవచ్చును. దీనిచే చెడు పేమియు కలుగదు. ధర రూ. 1-50

స్త్రీలు ఉపయోగింపదగిన సాధనము ,, ,, 2-50

# కస్తూరి మాత్రలు

ఈ మాత్రలు జలదోషము జలుబు వీట్లకు తాంబూల ముతో చేర్చి పుచ్చుకొనవచ్చును. గర్భిణీలు తాంబూలముతో భుజించినయెడల సుఖముగ ప్రసవింతురు. 2-సీసాలు 1-50

## ధాతు వృద్ధి మాత్రలు

ఈ మాత్రలను ప్రతిదినము ఉదయం పాలలోగాని నీళ్లలోగాని 2 మాత్రలు చొప్పున సేవించుచూ వచ్చినయెడల ధాతువును బలపరచి నరములకు బలమునిచ్చి రతికేళి సుఖమునందు ఆనంద భరితునిగాచేయును. కృశించిన దేహమునకు బలమునిచ్చి ముఖమునకు తేజస్సు కలుగజేయును. మూలవ్యాధికి హేతువైన వుష్ణమును తీసివేయును. దేహము చల్లబడి రక్తవృద్ధి కలుగును. 2-కి వెల 2—00

348

# అమృత సంజీవి లేహ్యాం

ఈ లేహ్యంవలన కడుపునొప్పి, పక్కశూల, గుల్మవ్యాధి, పాండురోగం, పిత్తరోగం, కామాల, రొమ్ముశూల, ఎక్కిళ్ళు, పైత్యవాయువు వలనయందు నీరూరుట, వాంతి, కండ్లుమంటలు, కట్లు, పైత్యాధిక్యముచే స్వప్నముకలుగుట, నిద్రరాకుండుట మొదలగు సకలరోగములు దినములు సేవించుటచే తీరి దేహమునకు రక్తముకలిగి ధాతుపుష్టి కలిగించి, నిరోగులుగాచేసి ఆయుర్వృద్ధిని కలిగించునని చెప్పగలను. పూట 1-కి అరతులము పాలు, నెయ్యి కావలసినంత చేర్చుకొనవచ్చును పత్యములేదు. 40 రోజులకు **4-00**

# గోపాల్స్ స్టమక్ పౌడర్

(ఆపరేషన్ లేనిది)

సకలవిధముల కడుపునొప్పులున్ను, అపెండిసైటిస్ అను కడుపునందు ఏర్పడువ్యాధిన్ని కడుపునందు కలుగు వ్రణములు, గడ్డలు మొదలగువాటిని కడుపును ఆపరేషన్ చేయకనే ఈ ఔషధము ఉత్తరవాదముతో గుణపరచును. ఈఔషధము మళయాళ అష్టాంగ విధాయకమున మిక్కిలి ప్రయాసపడి తయారు చేయబడినది. ఔషధము అల్సర్, మలబంధము, పుల్లతేపులు, పేగులద్వారా కలుగు అనేకవిధ వ్యాధులు, గుల్మం, భోజనమునకు మునుపో లేక తరువాతనో గలుగు కడుపునొప్పి మొదలగు అనేకవిధ సంకటములను ఖండితముగా గుణపరచును. దీని విషయమై విశేషముగా చెప్పనేల? ఒకతూరి తెప్పించి భుజించిన యడారము తెలుసును. వెల 2-50

# స్నానామృత తైలము

ఈ తైలమును వారమునకు ఒకతూరి తలస్నానము చేసినయెడల శిరస్సునకు కన్నులకు ఏ వ్యాధియురాక కాపాడును. శిరో రోగములను కన్నుమంటను ఉష్ణమును పోగొట్టును. రక్తవేడి మొదలగు వేడి వ్యాధులను నశింపజేయును. చదువరులు చేతువనులుచేయు మానవుల మెదడునకు సహాయకారియగు ఇది యొక మహత్తైన తైలము

మీరు గర్భమునకు ఔషధము భుజించు సమయములయందు ఈ తైలముతో స్నానము చేయుట నిండా శ్రేయస్కరము.

మీ దేహమునకు ఆరోగ్యము కావలయునంటే ఈ స్నానామృత తైలమే సుఖాదార మనదగును. ఒకతూరి తీసి వాడిచూచిన దీనిగుణముమీకే తెలియును.

డబ్బి 1-కి రూ. **2-00**

# మూలరోగ సంజీవి లేహ్యము

ఇది చీముతోకూడిన మూలము రక్తముపడు మూలము లో…
మూలము బైటమూలము దెట్టమూలము అను వివిధ మూలవ్యాధు…
సకల విధముల మేహ వృష్ణములను నిర్మూలించును. మూలవ్యాధితో …
కాలమునుండి బాధపడుచున్న వారికైనను స్వస్థత కలిగించు గొప్పమందు.

40 రోజులకు **4-00**

# బాలసుధ

నేటి బాలపాపలే రేపటి పౌరులు    బాలపాపలే దేశానికి స…

వారి ఆరోగ్యమే దేశానికి ఐశ్వర్యం

అట్టి బాలపాపల బలారోగ్యాన్ని పెంపొందించే మిఠాయివం… తియ్యనిపండు ఇదిమళయాళ మూలికలచే తయారు చేయబడినది దుర్బ… లులైనవారు మేహ కాకచే బక్క జిక్కినవారు తీటగజ్జి అజీర్తి వాయు పుతో పాడిదగ్గుతో మలబద్ధకంతో విరేచనాలతో నీటి చురుకుతో బాధ పడు బాలబాలికలకు ఈ మందు సేవింపజేయడంవలన ఆ వ్యాధులన్నీ నయమైనవారు పుష్టి తుష్టి పొంది బాగుగా యెదుగుదురు. ఎట్టి రుగ్మత లేని వారుకూడా దీనిని నిరభ్యంతరముగా వాడవచ్చును. దీనిసేవనవలన వారికి రక్తపుష్టి హెచ్చి జ్ఞాపకశక్తి పెంపొందును. చదువుకొను బాలబాలికల మెదడునకు రసాయనంగా వుంటుంది. 3 ఏండ్ల బిడ్డనుండి వాడవచ్చును.

టిన్ను 1-కి **3-00**

# రోమ సంహారి సబ్బు

దేహమునందు యే భాగమందైన నుండు వెంట్రుకలను పోగొట్ట… బడుటకు ఈ సబ్బు నుపయోగించుచు వచ్చిన యేయొక్క అపాయమును లేక శుభ్రముగా వెంట్రుకలు వీడిపోవును.

3 బిళ్ళలు గల పెట్టె 1-కి రూ. 1—50

రోమ సంహారి పౌడరు 2-సీసాలు 1—50

# కాలి ఆణీమందు

కాలిపాదములందేర్పడు ఆణి (ఆణికాయల)కు గ్యారంటిమం… కాలి పాదములలో యెంతకాలమునుండి ఆణీవున్నను, ఎంత నడు… స్థితిలో వున్ననూ, యీమందు రుద్దుచున్న ఆణియొక్క మొలకను … టికి తీసివైచి స్వస్థపరచును. తిరిగి అణీ పుట్టకుండునట్లు చేయును. ఇది ఆణిని శాశ్వతముగా తొలగించి మామూలు ప్రకారము చక్కగా నడువ గలుగునట్లు చేయును.

2 ఔన్సుల సీసా 1-కి రూ. **3-00**

350



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B150 |
| పుస్తకం పేరు | పోతులూరి వీరబ్రహ్మంగారి జీవిత చరిత్ర |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 343 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | IV |
| లేని పేజీలు | 127 to 130,169,170,321,322,327 to 336 |
| తయారు చేసినది | P. Jagamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Sumitha |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | No |
| పరిస్థితి | Good |